

చెన్నపట్టణము, అక్టోబరు ౧౯౩౦
1930

సంపుటము ౭ ప్రమోదూత సంవత్సరము ఆశ్వయుజమాసము సంఖ్య ౧౦

# హంపీక్షేత్రము

కొడాలి వెంకటసుబ్బారావు, బి. ఏ., కామరాజుగడ్డ శివయోగానందరావుగార్లు

## విద్యారణ్యులు

[కాకతిరాజ్యము నశించింది. దేశక్షోభ చూచి, వెంటనే తపస్సు మాని రాజకీయములలో ప్రవేశించి హంపీలో తెలుగురాజ్యము పునఃప్రతిష్ఠ చేసి మంత్రియై, సంస్కర్తయై, మతోద్ధారకుడై, మళ్లీ తపస్సుతో ముక్తిపొందినవారు విద్యారణ్యులు. ఈయనవిగ్రహము విరూపాక్షుని గుడివెనుక వున్నది. రోజూ పూజాపునస్కారములు జరుగుతూవుంటవి. ఏటేటా ఉత్సవము జరుగుతుందట. ఇతనికి విరూపాక్షస్వామితో సమంగా సత్కారం జరుగుతోంది. ఆవిగ్రహాన్ని చూచినప్పుడు కలిగిన ఆవేశంలో స్ఫురించిన భావాలు యీ పద్యములకు ఆధారము.]

క్రమము నడంచి యుత్తమపదంబును పొందిన మౌనులందు స్వా
ర్థమొకట్టు గుత్తగొన్నది. పరస్పర సంశ్రయభావ బంధన

క్షేమమయి పొల్చు వ్యక్తియును సంఘము దాని నతిక్రమించి నీ
యమునకు లోకముం బదలినట్టి ఘనుల్ నిను మెచ్చుకొందురే.
"లోకము భద్రమై సుఖవిలోకనమై పొలుపొందునాడు స్వ
ర్లోకమొ మోక్షమో గని వెలుంగుట ధర్మముగాని; లోకమే
చీకటియై విపత్తులకు చిక్కిననాడు తపంబు మోక్షముం
చేకొని ముక్కుమూసుకొని చెట్టుల గుట్టల బట్ట ధర్మమే."
అని తలపోసి తెల్గుభువన ప్రళయంబున కడ్డుకట్టవే
సిన మహనీయమూర్తివని చెప్పిరి నిన్నొక విగ్రహంబు చే
సి నిలిపి నిత్యముం ప్రజ భజించుచు నుండుట గాంచి ధన్యజీ
వనపథవర్తులైతి మనువారలు నీగుడి చూడవచ్చుచోన్.

దేశక్షోభ, మరాజకంబును, మదాంధీభూత శత్రుక్షమా
ధీశోజ్జృంభణ మూ, ర్ధ్వపౌరజనవృత్తిచ్ఛేదనోద్రేక మ,
త్యాశాపూరిత రాష్ట్రపాలక దురంతాఖ్యానమున్, కాకతి
శ్రీశుం డోడిననాడు తెల్గుధర ముంచెన్ నీయశస్స్రష్టికై.

అలనందాన్వయ మగ్గిలో పొగిలి నీరైపోవ, నందుండి మౌ
ర్యుల సామ్రాజ్యము బైటబడ్డయది విఘ్నుండొక్కడా నాశ స్ర
ష్టులకున్ హేతువు నీవొ, కేవలము తేజోమూర్తివై సాత్వికో
జ్జ్వలసృష్టి ప్రతిపాదకుండవయినావా? తెల్గు సంఘాతమున్.

చెరచిన దాని బాగుపడచేయుట దుర్లభ మట్టి తెల్గురా
జ్యరమను, ఓరుగల్లు నిలయంబున కోటలు పడ్డ రాళ్ల పెం
బరువుల క్రుంగుదాన, సులభంబుగ పైకి తెరల్చి దివ్య సుం
దర రుచిమూర్తి చేసితివి తల్లిఋణంబును తీర్చినావు పో.

ఒకచేత, పాడైన ఓరుగల్ సిరులను విద్యానగర రాజ వీథికెత్తి,
ఒకచేత, క్షీణతనొందు హిందూమత వైశాల్యభావ సంపదల నెత్తి,
ఒకచేత, రాజకీయోన్నతిలో మంత్రశక్తియుక్తుల "పరజాల" నెత్తి,
ఒకచేత, యోగసాయుజ్యాంత రానందతత్వసాక్షాత్కారసాధనము లెత్తి
ఇహపరంబుల మత రాజకీయములను-ఒకటికొకటి పొసగని వికటవస్తు
జాలముల నైక్యపరచి-నిస్సంగమందు సంగివై సంగమందు నిస్సంగివైతె.

అపుడు పురాణకాలమునయందు వసిష్ఠుడు; రాజ్యవేత్తలన్
నిపుణుడు సాధుపుంగవుడు నేడు మహాత్ముడు గాంధి: తెల్గుభూ
మి పతిచరిత్ర వేళనుసుమీ యుగమధ్యమునందు నీవు; మా
తృపద నితాంతపూజకు విధించిన బ్రహ్మము మూడుమూర్తులా?

ఒకకాలంబున నొక్కదివ్యఋషిచేయున్ రాజ్యనిర్మాణ సా
ధకవర్గంబది శక్తిమంతమయి స్వాతంత్ర్యంబు స్థాపించు న,
ట్లికదా నీదు పవిత్రజీవితము వర్తించున్, యశఃకాయ కా
ముకులౌ వారలెటుల్ తలంచిన సదా మోదంబు గాకుండునే.

అది జలాంతర్గత మఖిలలోకలయంబు వటపత్రమున మోచువాడొకండు
అది కాలకాకోల మగ్నిదగ్ధలయంబు గళమునందున నిల్పగల డొకండు
అది ప్రభంజనవేగ మాకంపనలయంబు వరముతో గెడపెడివా డొకండు
అద మహాభూభార మణగద్రొక్కు లయంబు కోడెలపై నిల్పువా డొకండు
కట్టుకథ లివి పౌరాణికములు తెల్గు-రాజ్యవిలయాంతరమున నరణ్యములను
కందమూలాలబ్రతుకును గడపు వెర్రి-బ్రాహ్మణుడు రక్షకుండగువాడె? వింత?

నీకన్నన్ కడుగొప్పవారలు తపోనిష్ఠాత్మకుల్ పుట్టరే
లోకంబందున? వారి దేవతలగా రూపించి యేటేట పూ
జాకళ్యాణము సల్పినారె? ప్రజ లుత్సాహంబు రెట్టింప నీ
కే కావించు టదేలనోయి? పరమాంగీకార సూచివ్రతుల్.

"ఆత్మవత్సర్వభూతాని" యని తలంచి-నిన్ను నీదేశమాతతో నున్నతమగు
పదవిపొందించి ఆటలో పండినావు-ముక్తినీకు దేశానికి భుక్తిభక్తి.

నీపేరు శాశ్వతంబయి-నీపేరున నిల్చినట్టి నిలయము నుసిమై
నీపూజ వీరపూజో-ద్దీపనమయి నిల్చెనోయి తెల్గు ధరిత్రిన్.

ఆకన్నుమూతలో నంతర్విలీన పంచానిల స్తంభనాత్మార్చి వెలుగు
ఆబొమ్మమోడ్పులో ననమాత్మ సెగకన్ను మంటరేగినసుళ్లు మాటు మణుగు
ఆకన్నువిప్పులో నిఖిలరాజన్య శిఖోదక్షమైన వర్చస్సు మెరయు
ఆచిరునవ్వులో నాంధ్రసామ్రాజ్య సుశ్రీనవ్యజీవనశీల మిముడు
ఈశిలావిగ్రహామునందె యింతగొప్ప-కుదురుకొనియుండ ఊహలు గుములుకొనిన
ఎంతవాడవొ నిను స్తుతియింప గలమె-విజయనగ రాంధ్రదేవుడవే నిజంబు.

---

# సోమప్రభ పెండ్లి

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారు

(యుక్తిపాట) [పామరజనవాఙ్మయము: శకలము ౨]

ఇప్పటివారివలె వ్రాయను చదువను నేర్వకున్నను, ప్రాచీనాంధ్రస్త్రీల జీవితము విజ్ఞానప్రపూర్ణమై వెలయుచుండెడి దని యూహించుటకు, మన కిప్పటికిని శేషించి కొనయూపిరితో నటనటఁ గానఁబడుచున్న ప్రాచీన స్త్రీల వాఙ్మయములోని కొన్ని కొన్ని శకలములే చాలి యున్నవని నావిశ్వాసము. మన మిప్పుడు అత్యంత ముత్కృష్టతమ మని యెంచెడి సాహిత్యము, సంగీతము, ఛందస్సు, ప్రకృతిశాస్త్రరహస్యములు, వేదాంతశాస్త్రతత్త్వములు, ఆయుర్వేదము, జ్యోతిషము, గణితశాస్త్రము మున్నగు సమస్తశాస్త్రముల లోని సారభూతము లగు విషయము లన్నియును, అప్రయత్నముగనో సప్రయత్నముగనో, వారి వాఙ్మయరాశిలోఁ బ్రవేశించి, నివురుగప్పిన నిప్పుమిణుఁగురులవలె నప్పుడప్పుడు తళుకులీనుచుండును. నేను కవినిగాని, గాయకుఁడనుగాని, విద్వాంసుఁడనుగాని విమర్శకుఁడనుగాని కాకున్నను, ఏప్రాక్తనసంస్కారమో తెలియదుకాని, నాకు ఆ ప్రాచీనస్త్రీలవాఙ్మయములోని అయ్యైభాగములను వినునప్పుడు అత్యంతము నానందము గల్గుచుండెను. కావున నప్పుడప్పుడు కొన్నిపాటలను పూర్వస్త్రీలు పాడుచుండఁగా వ్రాసికొనఁ గల్గితిని.

అందుండి యథావకాశముగా కొన్ని పాటలను ప్రకటింపఁ దలంపు కొని, గడచినసంవత్సరము సమదర్శిని ఉగాదిసంచికలో గౌరీగర్వభంగము—అనుపాటలోఁగల విషయములను నాయెఱిఁగినట్టులు వెల్లడించియుంటిని. ఇప్పు డిప్పాట అవ దగు జ్ఞానివిజ్ఞాని శూరుల పాటను గుఱించి యొక కొన్ని వివరణవాక్యములను చదువరుల యుపయోగార్థమై ఇచ్చుచున్నాను.*

కథాంశము:—పాటయందు వచ్చెడి కథాంశమును మున్ముందు సంగ్రహపఙ్క్తికతోఁ జెప్పి, ఆ పిమ్మట కథాంశములం గుఱించిన విమర్శనమును పమూలముగా క్రింద వ్రాయుచుందును. ఈపాటలోని కథాంశ మిది:—సుప్రసిద్ధ మగు నొకపట్టణములో వేదవేదాంగవేత్త యగు నొక బ్రాహ్మణుఁడు భార్యతోఁ గాఁపురముండును. ఆదంపతులకు గుణవంతులు, రూపవంతులు నగు కొడుకును, కూఁతును నుందురు. క్రమముగా నాకన్యక యౌవనవతి కాఁగా, నామెకు అనురూపుఁ డగు భర్తను జూచుటకై తండ్రి యత్నింప సాగును. ఈ విషయమును కన్పెట్టి ఆపిల్లతల్లి ద్వారా తండ్రికిని, సోదరునకును, తాను జ్ఞాని, విజ్ఞాని, శూరుఁడు—అను ముగ్గురిలో నెవరైనను నొకరిని పెండ్లియాడవలెనే కాని, ఇతరులను బెండ్లియాడను—అని తననిశ్చయమును తెలియఁజేయును. అంత వారు సరియైన అట్టివరుని నన్వేషించుచుందురు. ఇట్లుండఁగా, కొండొక రాజకార్యవశమున నాబ్రాహ్మణుఁడు దేశాంతరముపోవును. అప్పట నాయున

---

* ఏలూరు మంజువాణీ ముద్రాక్షరశాలవారు స్త్రీలపాటలను పేరితో ప్రాచీన స్త్రీల వాఙ్మయమును మూఁడుభాగములుగా ప్రచురించినారు. వారు చిరకాలముక్రిందనే యింత మహోన్నతకార్యము సాధించినందులకు ఆంధ్రులందఱపక్షమునను కృతజ్ఞతాభివందనములు. అం దీపాటకూడ కలదు. దీనికి వారు యుక్తిపాట అని శీర్షిక నుంచిరి. (చూడు: ౨వ భా. ౮౧ పాట, ౬౭, ౬౯ పేజీలు.) కాని నా పాఠములకును వారి పాఠములకును నెంతయో మార్పుగలదు. ఈపాటకు మూలము నిచ్చుచున్నాను. కనుక, సరియైనపాఠములను చదువరులు పోల్చికొని దీని నింకను విమర్శించి గుణదోషముల వెల్లడింపఁగోరుచున్నాను. విజ్ఞానప్రియులగు పండితసోదరులు ఈకార్యమునకు పూనుకొందురుగాక. [పం. ఆ.]

నొక బ్రాహ్మణయువకుఁడు సందర్శించి భార్యార్థ మతని పుత్రికం గోరును. జ్ఞానివిజ్ఞాని శూరులలో నెవ్వండైన నొక్కని నేగాని తదితరుని తనకూఁతురు పెండ్లియాడ దని చెప్పును. బ్రాహ్మణపిల్లవాఁడు తాను విజ్ఞాని నని చెప్పి, ఆ విజ్ఞానమును బ్రదర్శింపు మనఁగా, వెన్వెంటనే ఒకవిమానమును సృష్టించి అందులో నాబ్రాహ్మణుని గూర్చుండఁబెట్టికొని ముల్లోకములను ద్రిప్పి మరల యథాస్థానముఁ దెచ్చి దింపఁగా, నతనిని మెచ్చి ఆ బ్రాహ్మణుఁడు నేఁటి కేడవ నాఁడు వచ్చినఁ బిల్ల నిచ్చెద నని చెప్పి స్వస్థలమునకుఁ బోవును.

ఇంతలో ఆకన్యకయొక్క యన్నగారు చెల్లెలికై వరాన్వేషణ జేయుచు నొక్కచోట నొక్క శూరునిం గని యాతని శస్త్రాస్త్రవిద్యలఁ బరీక్షించి మెచ్చి, యతనికిఁ దనచెల్లెలి నిత్తు ననియు, నాఁటి కేడవనాఁడే వివాహముహూర్త మగుట నానాఁటికి తమయింటికి రమ్మని యా మాటిచ్చి సరిగా తండ్రి యింటికి వచ్చిననాఁడే తాను నింటికివచ్చి చేరును.

తండ్రికొడుకు లింటికి వచ్చునప్పటికి ఆకన్యకతల్లి యాయూర నున్న ఒక బ్రాహ్మణబాలకునిచేఁ బ్రార్థితురాలయి, అతనిన డిగి జ్ఞాని యని యెఱింగి, అందులకు నిదర్శనముఁ జూపుమని కోరి, అతండు భూతభవిష్యద్వర్తమానముల నెల్ల చెప్పఁగా విని సంతుష్టయై, తనకూఁతును తప్పక యిత్తునని నాఁటి కేడవనాఁడు ముహూర్తము గనుక రమ్మని చెప్పి తనయింటికి వచ్చి తా నిచ్చినవాగ్దానము ఆతండ్రికొడుకులకుఁ దెల్పఁగా, వారును తాము చేసినవాగ్దానములను ఆమెకు చెప్పెదరు. అంత వా రందఱును పరస్పరము ఆశ్చర్యసంభ్రమవిషాదములతో మునిఁగిరిగాని, అది యంతయు దైవచిత్త మని యనుకొని, ఎవ్వరి యిష్టమువచ్చినట్లు వారు తమతమ వాగ్దానములనే చెల్లించికొనుటకై పెండ్లిప్రయత్నములను చేయుచుందురు.

అనుకొనినట్టులనే పెండ్లి ముహూర్తమును సమీపించును. జ్ఞాని, విజ్ఞాని, శూరుఁడు మహోత్సాహముతో ఆనాఁటికి వచ్చి సిద్ధపడుదురు. ఇంతలోఁ బులిమీఁది పుట్రవలె, ఆపెండ్లికూఁతురు అంతర్ధానమై పోవును. పెండ్లికూఁతురు తల్లి, దండ్రి, అన్నయును, పెండ్లికై వచ్చి చుట్టాలును పక్కాలును అందఱు గోలుమందుర పెండ్లికొడుకులు ముగ్గురును యేమియుఁ దోఁచ వివశులై పోయెదరు. అప్పుడు ఆకన్యకచుట్టాలచే ప్రా తులై, జ్ఞాని ఆమె నొక రాక్షసుఁడు హరించి దాఁచినా డని చెప్పును; విజ్ఞాని ఆచోటికిం బోవందగిన విమానమును సిద్ధము చేసి వారి నందఱ నచటికిఁ దోడ్కొ పోవును; శూరుఁడా రక్షస్సుతో పోరి వానిం జంపున ఆపిమ్మట మరల నందఱును పెండ్లియింటికి వచ్చి చేరుదురు. కాని ఆముగ్గురు పెండ్లికొడుకులలో ఎవ్వని ఆపిల్ల నిచ్చి పెండ్లి సేయఁ దగునో యని వారందఱ త్రొక్కటంబడెదరు. జ్ఞాని తాను తెలిసికొనకున్న ఆపిల్లజాడ తెలియకయే పోవును. కనుక, పిల్ల దొరకుటకు తాను కారణ మని తనకు పెండ్లి సేయవలె న వాదించుచుండును. విజ్ఞాని తనవిమానము లేనిచో పి జాడ తెలిసియు వృథయే కదా! కాఁబట్టి తనకే యిచ్చి పెండ్లి సేయు మనును. శూరుఁడు జ్ఞాని జాడ తెలిసికొన గల్గినను, విజ్ఞాని విమానము సృజింపఁగల్గినను, ఆరాక్షసు తోఁ బోరినశూరుఁడు తాను లేకున్నచో అంతయు నిరర్థకమే గనుక, తనకే ఆకన్యనిచ్చి పెండ్లిచేయవలయు నని వాదించును. ఈ ముగ్గురలో ఆకన్యను ఎవ్వరి కిచ్చి పెండ్లి చేయవలయును? ఈప్రశ్నతోఁ బాటు పాటలో కథాంశమంతయును (పాటకూడ) ముగియును. ఇ ఇందలి కథాంశము.

ఈకథకు మూలాధారము:—సంస్కృత వాఙ్మయమున మహాకవి సోమదేవభట్టసూరి రచించిన కథాసరిత్సా రమునందు శశాంకవతీలంబక మనెడి ౧౨ వలంబకమున ౧౩ న తరంగము ఈకథకు మూలాధారము. అప్పు త్రివిక్రమసేనుఁ డను రాజు (ఇతఁడే శర్వాణి విక్రమాదిత్యు డనును) ఒకయోగిపనుపున బేతాళుం డనెడి పిశా రాజును పట్టుకొని వచ్చుటకై నిశీథకాలములోఁ బోయి, అతనిం బట్టుకొనివచ్చునప్పుడు, ఆ భేతాళుఁడు ఒక్కొక్క కథఁ జెప్పునం జెప్పి, కథాంతమునందు బహుసందేహము లకు నెడమిచ్చు ప్రశ్న వైచి యుత్తరము చెప్పు మని కోరును. ఆప్రశ్నకు సరియగు నుత్తరము తెలిసియుఁ జెప్పఁడేని

రాజుతల వేయివ్రక్కలగునట్లు బేతాళుఁడు ముందుగానే శాప మిచ్చియుండును. నిజము చెప్పఁగానే బేతాళుఁడు అదృశ్యుఁడై మఱలిపోయి ఎప్పటియట్లుండును. రాజు మఱల వానిని కొని తెచ్చుచుండును. బేతాళుఁడు మఱల ఇట్టి చిక్కుప్రశ్నల కథల చెప్పి అలయించి చివరకు ప్రసన్నుఁడై సిద్ధి నిచ్చును. ఈరీతిగా ఆరాజునకు బేతాళుఁడు ఇరువదియైదు (సంస్కృతభాషలో పంచవింశతి యని పేరు) కథలు చెప్పును. కావున నీకథలు ఇరువదియైదుగల గ్రంథమునకు భేతాళపంచవింశతికథ యని పేరు. ఆంధ్రములోఁ గూడ ఈకథలు గద్యపద్యములలో నున్నవి. అందు అయిదవకథకు పాటలలో ఈపాట అనుకరణమై యున్నది. కాని గద్యపద్యపంచవింశతికథ కూర్పుకంటె ప్రాఁతయు చదువు నెఱుంగని స్త్రీలకూర్పైనను, ఈపాటలో చక్క నిరచనమును, అలంకారసంపదయు, తదనుసారమగు రసభావసిద్ధియు గోచరించుచున్నది. చదువరులు ఇఁక పాటను చిత్తగింప వేఁడెదను.

౧. ఆట లాడి అలసినావు
పాట పాడి బడలినావు
యుక్తిపాటలోని ప్ర
త్యుక్తి సెప్పవే—ఆటలాడి.

ఇది యీ పాటకు పల్లవి. స్త్రీలు వేడుకగా దీనిని పాడుకొను నలవాటు. శరీరబలము ఒక బలము గాదు. శ్రావ్యముగా సంగీతమునుపాడ నేర్చి, పాడి, రంజింపఁజేయుటయు నంత ప్రజ్ఞలోనిది కాదు. సందేహాస్పదములగు చిక్కువిషయములఁ జెప్పి యీ చిక్కును విడదీయుమని కోరినప్పుడు బుద్ధిబలమున వానియందుఁగలచిక్కులను విడఁదీసి వినువారికి ఔరా యనిపింపంగల ప్రజ్ఞాబలమేదియో యదియే బలము. స్త్రీలకుఁగాని, పురుషులకుఁగాని అట్టిప్రజ్ఞాబలమున్న నే బలముగలయట్లు గణనము. లేకున్నచో నది దుర్బలమే యగును—అని తోఁపింపఁజేయుచు, నొకప్రజ్ఞాశాలిని తనప్రజ్ఞను జగ్గుమనిపించుచు స్త్రీబృందమును తనవంకకు ఆకర్షించుచున్నట్లులుగా మనకు ఈపల్లవి తోఁపింపఁ జేయుచున్నది. కేవలము ఇట్లు తోఁపింపఁ జేయుటయేగాక, ఏమి టాయుక్తి? ఏమి టాయుక్తి?—యని ఆవలంగులను, వానితోఁబాటు చదువరులను జిజ్ఞాసకులఁ బాత్రములుగాఁ జేయుచున్నది. కావున పైచరణములను చదువుదము.

౨. ధర్మపురములోన చాలధార్మికుండైనయట్టి
వేదవిప్రుఁ డొకఁడు ఖ్యాతి వెలుఁగుచుండెనూ.

అయినది కథారంభము! అందులో మహాధర్మాత్ముఁడైన బ్రాహ్మణోత్తముఁ డొకఁడున్నాఁడు. బ్రాహ్మణుఁడన్న సాధారణుఁడు కాఁడు. వేదవిప్రుఁడు=వేదబ్రాహ్మణుఁడు. సమస్తవేదములను, వేదాంగములను అభ్యసించినవాఁడు. ఈవిశేషణముచేతనే ఆవిప్రుని స్వధర్మ పరాయణత్వమును, జ్ఞానవిజ్ఞానాసక్తియును వెల్లడియగుచున్నవి కదా! మూఁడుఁడు, మఱొక్క విశేషణము: చాల ధార్మికుండఁట! అనఁగా నేమి? ధర్మమే గతియని పూర్ణమగు విశ్వాసము కలవాఁడు. ఆధర్మమునుకూడ వేదచోదితమే యని తర్వాతి విశేషణము బోధించుచున్నది. తనకు ఐహికము గాని ఆముష్మికము గాని కూర్పందగినది తన ధర్మమే యన్న విశ్వాసము ఆతనికి గట్టిగాఁ గలదు. ఏలయందురా? అనుశాసనము ఆరీతిగా నున్నది—శ్లో. ధర్మఏవ హతో హంతి, ధర్మో రక్షతి రక్షితః. ఇఁక మూలమగు కథాసరిత్సాగరములో నే మున్నదో చిత్తగింపుఁడు.

శ్లో. ఉజ్జయిన్యా మభూ ద్విప్రః పుణ్యసేనస్య భూపతేః,
అనుజీవీ ప్రియో ఽమాత్యో హరిస్వామీ తి సద్గుణః.

దీనికిఁ దెలుఁగు వచనము — మున్ను ఉజ్జయినిలో పుణ్యసేనమహారాజుదగ్గఱ ప్రియమంత్రిహరిస్వామి యను బ్రాహ్మణుఁడు సద్గుణుఁ డుండెను.

కాని మనపాటలో ఉజ్జయినికి బదులు ధర్మపురమని యున్నది. క. సా. లో హరిస్వామి యని పేరుండఁగాఁ బాటలో ఏలాఁటి పేరు నా బ్రాహ్మణునకీయలేదు. క. సా. లో ఉన్న అనుజీవి, ప్రియామాత్యుఁడు అనువానికిఁగూడ పాటలో మారుపదములు లేవు. అయినను కథాసరిత్సాగరమునందుకంటె పాటలో పదప్రయోగమునందు ఎక్కుడుశ్రద్ధయు, నౌచిత్యమును మాపింపఁబడి

నవని నాయూహ. ఏమనఁగా, నిట్టి చిక్కులు తటస్థించి నప్పుడు కాదా ధార్మికుని ధర్మరక్షణ తత్పరత్వము, వేద వేత్తృత్వముచే నబ్బిన వైచక్షణ్యమును వెల్లడికాఁలసి యుండును! కనుకనే ఆదినుండియు తూఁచి పద ప్రయోగము చేయంబడినదఁదును. మఱల పాటను చదువుదము

ఇవి ఆతర్వాతి చరణములు—

3. లేక లేక లేక లేక పంకజాసనాదివరుల
ఏకనిష్ఠ నెన్నినాళ్లొ కేఁడ వేఁడఁగా,—
పాకశాసనాది దేవవరులు ప్రస్తుతింపఁగాను,
లోకనాయకుండు వరమిఁకేమి కోర్కెఁ,
బ్రాహ్మణుండు భక్తితోడ బాహువిక్రమాఢ్యుఁడైన
కొడుకు, గుణవతైనట్టి కూతుఁ గోరఁగా,—
మెచ్చి నలువ యిచ్చితి నీకిచ్చవచ్చువరము లనఁగ
హెచ్చి ముఱుముఁ బొఁల నింటికొచ్చి చేరెను.
అట్టివరముచేత గర్భ్గై నతని కింపు సొంపు బెంప
కొడుకు గుణవతైనట్టి కూఁతు రప్పుడు,
తల్లిదండ్రు లెల్లవార లుల్లసములు పల్లవింప
పూర్ణచంద్రకళలువోలె పురి వెలింగెఁ గా.

—ఆబలాంకి అలసినావు.

మూలసంస్కృతము—

*శ్లో. తస్యాత్మనోఽనురూపాయాం
భార్యాయాం గృహమేధినః,
గుణవాన్సదృశః పుత్రో
దేవస్వామీ త్యజాయత.

తద్వ చ్చానన్య సామాన్య
రూపలావణ్య విశ్రుతా,
కన్యా సోమప్రభానామ
తస్యాన్వర్థోపపద్యత.

దీనికి తెలుఁగువచనము—ఆయనకు తగిన భార్యయందు గుణవంతుఁడు దేవస్వామి యని పుత్త్రుఁడు పుట్టెను; అట్లే సాటి లేని లావణ్యము గలది సోమప్రభ యని యన్వర్థనామ కూఁతు రొకతె పుట్టెను.

ఇప్పుట మూలసంస్కృతములో నున్న కొమరుని పేరుగాని, కూఁతురి పేరుగాని ఈపాటలో పేర్కొనలేదు. అయినను, ముందు చరణములలో ఈపిల్ల 'కలకల నమృతంబు జింద కాంత నేర్పఁగా'—అని యున్నది. దానినిబట్టి సోమప్రభ యనో, లేక చంద్రకళ అనియో ఈమెకు పాటలో పేరుండెడిదనియు, ఆచరణములు ఎట్లో జారిపోయి నవనియు నూహింపవచ్చును. కానిచో కలకల నమృతంబు చింద—అనుమాట నిరర్థకము కావలసివచ్చునుకదా!

మఱొక్క చిత్రము: మూలసంస్కృతములో లేని బ్రహ్మనుగూర్చి తపస్సు జేయుట, ఆయనయింద్రాదులతో వచ్చి ప్రత్యక్షమై వరముకోరుకొమ్మనుటయు, ఆపిమ్మట నతని వరప్రసాదంబున కొడుకును, కూఁతును గల్గినట్లుగ కూర్పుపాటలో నున్నది. ఇది ఆంధ్రజాతి దైవభక్తిని చేయునది యని, దేవతాపూజ లేక కార్య మెట్టిదియు లేదని చాటుచు, వారి ఆర్యత్వము వేనోళ్ల వెల్లడించు చున్నది. సంతానార్థులగువారు మున్ముందు సృష్టికర్త యగు బ్రహ్మను పూజింతురనుట ఆర్య సంప్రదాయము. కావుననే కాళిదాసు రఘువంశములో దిలీపుఁడు సంతానార్థియై వసిష్ఠాశ్రమమునకుఁ బోవునప్పుడు విధాతను పూజించునట్లుగా—

శ్లో. అథాభ్యర్చ్య విధాతారం
ప్రయయౌ పుత్త్రకామ్యయా—

అను శ్లోకమునఁ బేర్కొన్నాఁడు. దానిని 'సఖిలు పుత్త్రార్థిభి రుపాస్యత ఇతి మాన్త్రికాః'—అని మల్లినాథసూరి సమర్థించియున్నాఁడు. మూలములో లేనివిషయమైనను మనవారి ఆర్యత్వము ఎంతశ్లాఘ్యమైనదో సూచించుట కింత వ్రాయవలసి వచ్చినది.

ఇఁక పాటలో నీచరణములలో 'లేక లేక లేక లేక' అని యిత్యాదులను వాక్యములు విడిగా నున్నప్పు డెట్టి అర్థస్ఫూర్తిని గావింపఁజాలకున్నను, ఇప్పుట ఆదంపతులు ఎన్నియోదినములు, సంతాన మదిగో కలుగు నిదిగో కలుగునని ఎదురుచూచిచూచి విసివిరి—అన్న అర్థమను

* మూలశ్లోకముల కిచ్చిన తెలుఁగు కి. శే. ఆంధ్రకళాప్రపూర్ణులు వేంకటరాయ శాస్త్రులువారిది. ఇట్లే మున్ముందును తెలియవలెయును.

—పం. అ.

హృదయములు తన్మయము లగునట్లు రసస్ఫూర్తిని గావించుచున్నవి. ఇంటికి వచ్చి చేరెనా — అనుటకు ఇంటి కొచ్చి చేరెను — అను నిత్యాదులు పాఠకములోని మిరియపు తళుకులలాంటివి; గనుక అవి అంతగా పాటింప నవసరము లేదనుకొందును. ఇక నీవిషయమును ఇట్లుంచి పాటలోని మఱికొన్ని చరణములు వినిచెదను మనము ఇటువైని కథలో తారామ్మరు గల్గునుటకై, కథాసరిత్సాగరము ననుసరించియే, ఆదంపతులను, ఆపుత్రికా పుత్త్రులను హరిస్వామి, హరిస్వామిభార్య, సోమప్రభ, దేవస్వామి — అను పేర్లతోనే వ్యవహరింతము గాక. ఈ క్రింద రాఁబోవుచవి సోమప్రభ బాల్యదశను వర్ణించు పంక్తులు. వీనికి మూలము అసలు సంస్కృతమునందే లేదు. కనుక ఇవి పాటల రచించినవారి ప్రతిభను చాటు ననుకొందును.

౪. అల్లారుముద్దుగాను అల్లిబిల్లి యాటలాడు
కళ్లగంతలాటలాడు కాంత చక్కఁగా;
కూకటు ల్చెదరగాను గద్దుదు గుంచంబులాడు
ప్రాకటముగ గుంట్లుగుముకు బాల నిక్కుచు;
చెమ్మచెక్క సిరిసిరులూ చిట్టికోలెంకలూను
తెమ్మదేవుడి పల్లె మనెడి కమ్మపాటలూ, —
కమ్మనైన చెట్టపట్ట ఘనామైనా దోడ్డియాట
అమ్మలక్క లౌర యనఁగ నతివ యాడునూ.

చిన్నికిష్టమ్మ గార వెన్నబెట్టే ననెడిపాట
చిన్నదాని నమ్మయనే జిలుగుపాటలూ, —
జిలిబిలిగా నాడ నేర్చె చెలువముగా పాడ నేర్చె
కలుముల జవరాలికన్న ఘనత యొప్పఁగా;
తళతళమని తనువు మెఱయ దందణసొమ్ములను మ్రోయ
కళకళ నమృతంబు చింద కాంత నేర్చుగా.
— ఆటలాడి యలసినావు.

సోమప్రభ ఆడినఆటలును, పాడినపాటలును ఆమె పరువంపు మెఱుఁగులు తళుకులొల్క మనుటలును ఇందు మనోహరముగాఁ గూర్పంబడినవి. ఈపాటలు నాటలును బహుశః ప్రాచీనకాలమునుండి వచ్చుచున్నవై యుండవచ్చును. ఇందులోఁగల అల్లిబిల్లియాట, కళ్లగంతలాట, గుడుగుడుగుంచాలాట, కుంట్లుదుముకు నాట, చెమ్మచెక్క, సిరిసిరులు, చిట్టికోలెంకలు, తెమ్మదేవుడి పల్లెలాటలు (మా దేవుడిగిన్నె మాకూ తే, మా దేవుడి పళ్లెం మాకూ తే — అని యిప్పటికిని నెల్లూరివైపున చిన్నపిల్లలగు బాలికలు పాడుచు, ఆడుచుండంగా చూచితిని. అదియేనా?), దోడ్డి ఆటలు — వీనివివరములను పూర్తిగా తెలిసినవారు వెల్లడించి, ఇవి ఆఁడుపిల్లలాడెడివో, మగపిల్లలాడెడివో సాధారముగా నిర్ణయించినచో మిక్కిలి మేలు. ఇట్లే ఇందులో ఉన్న చిన్నికిష్టమ్మపాట, చిన్నదానినమ్మ అనేపాటలు (అమ్మ నేను చిన్నదాన్ని, అల్లుడొస్తే అంపబోకు — ఇత్యాదిగా నిప్పు డున్నపాటయే యగునా?) కూడా విమర్శించుట యుత్తమము.

ఇఁక మఱల పాట నుఱికొంత వినండి: ఇదియు నసలు మూలములో లేదు —

౫. పెరిఁగి పెరిఁగి పెద్దగుచు కరఁగి పోయుకనకమట్లు
మెఱుఁగు లీను మేనుకాంతి మెఱయుచుండఁగా, —
అమృతంపు తేటనిగ్గు యచ్చరలందంపు జిగ్గు
నిమిరిచేసినట్లు కాంత నెమ్మి గుల్కగా, —
పడుచుప్రాయంబు కొంత, భామవాలకంబు కొంత
బాలభావంబు కొంత పైకొనంగనూ,
రత్నాల చిలుకరారాజు చేతినిమ్మపండు,
రాసివడినయందాల రమణి యంచును
దేశదేశాలవారు దివ్యసంపదలవారు,
కాశిరామేశ్రాలనడుమ గల్గువారలూ, —
అందగాళ్లు, చదువుల మేలందెవేసికొన్న వాళ్లు
పొందఁగోరి కన్యక నింపొంద వచ్చిరీ.
— ఆటలాడి యలసినావు.

అసలుకథలో నున్న పసకొంచెమైనను, ఆయాఘట్టముల ననుసరించి, కొందఱుకొంచతీకాలపు శతావధానులుగాని, సహస్రావధానులు గానికూడ గమనింపని, మంచి అందచందములు పూర్వకాలపు చదువుసాములు రాని ఆడవారికిఁగూడ నుండెడి వని యీరచనలు తెల్పుచున్నవి. చూడుఁడు ఇందులోని పలుకుబళ్లు! కరఁగిపోసినకనకం, అమృతం తేట, భామవాలకము, రత్నాలచిలుక, రారాజుల చేతినిమ్మపండ్లు, రాసిపోసినయందం — ఇత్యాదులు. వీనికి

మూలములేదు. పాట రచించినవారి సొంతకల్పనము అని చెప్పకయే చెప్పుచున్నది. కాని రచనలోఁగల రీతి సహృదయ శ్లాఘ్యము.

ఇప్పుడు ఇఁక కొంచెముపాటను నిలిపి సోమదేవ సూరిరచించిన యసలు సంస్కృతమును, దానికి కళాప్రపూర్ణుల యాంధ్రానువాదమును ఇంతవఱకుఁ గలదాని నొక్కమాఱు చూచుకొందము. దీనివలన పాటలోఁగల రచనయందలి మెఱుఁగులు అవగతము లగును. ఈక్రిందివి సోమదేవసూరి సంస్కృతశ్లోకములు:—

శ్లో. సా ప్రదేయా సతీ కన్యా రూపోత్కర్షాభిమానినీ,
మాతుర్ముఖేన పితరం భ్రాతరం చ జగాద తం,
శూరస్య జ్ఞానినో వాఽహం దేయా విజ్ఞానినోఽపి వా,
అన్యస్మై నాఽస్మి దాతవ్యా కార్యం మజ్జీవితేన చేత్;
తచ్ఛ్రుత్వా తాదృశం తస్యాశ్చిన్వ న్నేకతమం వరం,
తత్పితా స హరిస్వామీ యావచ్చింతాం వహత్యలం;
తావ ద్వ్యసర్జి రాజ్ఞా స పుణ్యసేనేన దూత్యయా,
సంధ్యర్థం విగ్రహాయాతదాక్షిణాత్యనృపాంతికమ్.

ఆంధ్రకథాసరిత్సాగరములోఁ బై శ్లోకముల కీక్రిందిది యాంధ్రానువాదము:—

"ఆకన్య యౌవనవతి యైనంతట సౌందర్యాతిశయాభిమానము గలదియై తన్ను శూరునకుఁగాని, జ్ఞానికిఁగాని, విజ్ఞానికిఁగాని యీవలసినదిగాని అన్యునకీఁగూడదని తల్లితో చెప్పి, తండ్రికిని అన్నకును ఆమెచేఁ జెప్పించెను. అదిమొదలు తండ్రి ఆచెప్పిన మూఁడుతెగలలో నొకని నామెకై వెదకుచుండెను. ఇంతలో నతనిని పుణ్యసేనుఁడు తనరాష్ట్రముపై నెత్తివచ్చిన దక్షిణరాజు కడకు సంధికొఱకు రాయబార మంపెను."

కథా సరిత్సాగరమున సంస్కృతాంధ్రములలో, సోమప్రభ యనురూపయౌవన కాఁగానే, తనంతఁ దాను తల్లిద్వారా తండ్రికిని, సోదరునకును శూరజ్ఞాని విజ్ఞానులలో నేయొక్కనికైనఁ గాని తన్నొసగవలసినదనియు, తన జీవితము ఏపాటిదైన సప్రయోజనము కావలయునను కాంక్ష వారి కున్నచో తన్నితరులకొసఁగవలదనియు చెప్పివట్టు లున్నది. అందుపైని తండ్రియైన హరిస్వామి అట్టి వరు నన్వేషించు యత్నమున నున్నట్టును, అంతలోనే రాజుగారగు పుణ్యసేనుఁడు దాక్షిణాత్య ప్రభువునొద్దకు సంధికై (అనఁగా రాయబారమునకై) హరిస్వామిని పంపుట సంభవించెనని యున్నది. ఇందు గల దాక్షిణాత్య ప్రభువునొద్దకు రాయబారమంపుట యనుమాట ఈ కథ దక్షిణాపథమునకు సంబంధించినదనియు, తత్రాపి కొంచెము కృతజ్ఞగానది యొక్క ఆంధ్రదేశపురాజునుఁగూర్చినదై యుండవచ్చుననియు మన కూహ గల్గించుచున్నది. ఆంధ్రదేశపురాజులలో ఉజ్జయినీపరిపాలకుఁడు సంధిచేసికొనఁ బ్రయత్నింపఁదగినంతటి ప్రాభవము ఆంధ్రభృత్య వంశీయులగు శాతవాహన నామాంతర ప్రసిద్ధులగు శాలివాహనుల పరిపాలనకాలమునఁ గల్గియుండునని యూహింప వీలు గలదు. చరిత్రకారులు దీనిని అంగీకరింతురో ఈకథ శాలివాహనపరిపాలనపు టాద్యభాగమునకు సంబంధించియుండవచ్చుననియు, అందునను ధాన్యకటకసామ్రాజ్యమునకు చెందియుండవచ్చుననియు, మన మొక యభిప్రాయము నేర్పఱచుకొనవచ్చును. ఈ యంశము సత్యమారము కానిచో, ఈకథయొక్క ప్రాచీనత వెల్లడియగునే కాని పాటయొక్క రచనముం గూర్చి ప్రాచీనతను స్థాపించుట కనువు పడదు. కాని మొత్తముమీఁద జూచితిమేని రచనము కూడ కొంతకాకున్నఁ గొంతయైన ప్రాచీనకాలమునకుఁ జెందియుండవచ్చుననుట కెట్టి యభ్యంతరము నుండదు.

శాఖాసంక్రమణము కలిగినది. ఇఁక పాటను మఱి కొంత చదివి పైనిచ్చిన సంస్కృతాంధ్రమూలములతోఁ దోలనము చేయుదము. రంతు; ఇట్లు దేశదేశాలవంటి వరు లాసుందరిని వరింప రాఁగా,—

ఉ. తల్లితండ్రు లన్నలూను-యుల్లము రంజిల్లుచుండ
మెల్లఁగాను కొంతెఁబిల్చి మెల్లఁగ నడుగఁగా,—
తల్లిదండ్రులార మీరు తల్లడిల్ల వలదు, వినుఁడు,
కొల్లలుగా వరులు గలరు కోరివందఱు;
జ్ఞాని విజ్ఞాని శూర ఘనులలో నొకరిఁ గాని
పెండ్లియాడ నవఁగ నా పెద్దలందఱూ—
కొంతసేపు చింతించి కొంతసేపు హాళి నొంద్రి,
కొంతసేపు జాలినొంద్రి వింతవింతగా.

—ఆటలాడి.

కథ యీరీతిగాఁ జరిగినది. మూలములోఁగల కథాభాగమున కీరవసలో నింతటివ్యత్యాసము ఎట్లుగలిగినదో బోధపడుటలేదు. బహుశః రచనచేయువారు స్వతంత్రించి మార్చియైన నుండవచ్చును; లేదా ఆభాగము ఆఁడువారు పాడుకొనుటలో వదలిపోయియైన నుండవచ్చును. ఆ దాక్షిణాత్యప్రభుని రాయబారము, కన్యకాసహజమగు ముగుదతనమునఁ దనకోర్కెని తల్లి ద్వారా తండ్రికి, సోదరునకు తెలియఁజేయు నౌచిత్యము, మనకు పాటలోఁ గానరాదు. కాని యంతమాత్రమున కథయందము కొఱవడలేదు. మఱియొకయందము వచ్చినది. దేశదేశాలనుండి వరులు తమంతఁ దాము సౌందర్యలుబ్ధులై రాసాగుటయు, వారియొత్తిడి హెచ్చుటగుయు, తమకూఁతురు ప్రాప్తయౌవనయైయుండుటచే గృహస్థజనసామాన్యమగు వివాహకార్యచింత దరికొనుటయు, నందుపైని కన్యకయభిప్రాయమును వారెఱుంగఁగోరుటయును, అప్పుడు ఆమె కన్యకాజనసామాన్యమగురీతితో నెవరినో యొకరిని ఎన్నకొని తృప్తినొందక విశిష్టవరుని కోరుటయు, నట్టి కోరిక మన యీకాలమునందు వలెనే ఆకాలమునందుఁ గూడ ప్రజలకు—తలిదండ్రులు మున్నగువారికి—ఆత్యాశ్చర్యమును కలిగించెననియు, నందుపైని వారు, కొంతసేపు చింతించుటయు, మఱికొంతసేపు వాళినొందుటయు, నింకఁ గొంతసేపు ఆకన్యకయొక్క అనాత్మజ్ఞతకుఁ జాలిగొనుటయు చాల నిపుణముగా, జిత్రింపఁబడినవి. దీనివలన చదువుసాములురానివారైనను ఈవిధమగు జనసామాన్యమునకు పనికివచ్చు పాటలు మున్నగువానిని రచించు ఆకాలపు ప్రాకృతకవులు సైతము కవితకు ముఖ్యమగునాయువుపట్టనందగిన యౌచిత్యమును పోషించుట కెంత శ్రద్ధవహించిరో వెల్లడికాకపోదు. వీరి యీశ్రద్ధలో నూరవవంతైనను మన యీకాలపు కవులలో నున్నచో నేఁటి వాఙ్మయస్థితి అన్యాదృశముగా నుండియుండెడిదే కాదా? అస్తు. ప్రకృత మనుసరామః.

ఆకన్యక యిట్లు లోకవిలక్షణమగు కోఁకిని వెల్లడింపఁగనే, ఆతల్లిదండ్రులు మున్నగువారిస్థితిని కొంతగా పైచరణములును సూచించినవి గదా! దానిని పూర్తి చేయుటకు ఈక్రింది చరణములను శేషపూరణములుగా గ్రహించి చిత్తగింపుఁడు. వినుఁడు.

౭. ఏమిషిల్లా? ఏమికోర్కె? ఏర్పరింప ననువుగాదు
ఏది వెఱవు ఏమటంచు నెటులుఁ దోఁచకా,—
ఉమ్మలింపు చిత్తములను నుసురసురై పోవుచుండ
అమ్మ! నీవు బెదరపోకు మట్లె చేసెదా;
దైవయోగ మట్టులన్నఁ దప్పి నడువఁగలమె యనుచు
రవరవ లేకుండఁ దండ్రి రంజనచేసెనూ.—ఆటలాడి.

ఆహరిస్వామి ఈకాలపుతండ్రియైనచో నాఅమ్మయిని ముఖమువాఁచునట్లు చీవాట్లు పెట్టియుండెడివాఁడనుకొందును కాని యట్టి ఆడంగిరేకులాగ కనిపించుచున్నాఁడు. "నీ కేల యీయపరబుద్ధి! 'న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి'— అని ధర్మశాస్త్రాలు చెప్పుచున్నవి. నీకు నోరెత్తవీలులేదు. అంచక్కఁగా ఇతరకన్యకలవలెనే నీవును మేము సెలెక్టుచేసే కూర్మయ్యను పెండ్లాడి, సుఖంగా, కాలుమీఁద కాలు నోఁటిమీఁద చేయి, వైచుకొని కూర్చుండు—అని చెప్పలేకపోవుటయే గాక, "అమ్మా! భయపడకుము. దైవయోగము నీకోర్కె కనుకూలముగా నన్న నేను అడ్డువత్తునా? అట్లే యత్నము చేసెదను" అని ఆమెను సమాధానపెట్టుచున్నాఁడు. ఎంత పిఱికి!! (రంజన అనునది రంజ్నకుబదులుగ నేను వేసినపదము.)

మఱల కొంచెముగా పాట వినుఁడు. ఆపైని సంస్కృతాంధ్రముల మూలముల విన్పించెద. సావధానతతోఁ బరీక్షింపుఁడు—

౮. అంత నాతల్లిదండ్రు లఖిలలోకాలలోన
చింత వీడి వరులకు సాటింపఁ బంచిరి;
'సుందరాంగి నాదుపట్టి సొగసుల కుప్పైన దాని
సొంపుమీరఁ బెండ్లిఁజేయ జూచుచుంటిమీ.

జ్ఞాని విజ్ఞాని శూర ఘనులైనవారిలోన
నెవ్వరేని బాలికఁ దా రెనయ వచ్చునూ'
అనుచు సాటింపఁ బంప నఖిలలోకాలవారు
మనకులంబు వింతరీతి నెనయఁజొచ్చిరీ.

ఎంతవింత? ఎట్టికోర్కె? యిట్టివారి నెందు నెపుడు
ఇంతకే మెఱుఁగమనుచు వింత నొందుచూ,—

పెక్కుమంది పెక్కుగతుల నెక్కసక్కెలు పల్కి
కక్కుర్తి మనకు యీకాంత వలదనీ,–
దిక్కుదిక్కు వధూలెల్ల చక్కఁగాను నిక్కి యిట్లు
ఎక్కడినా రక్కడే వెడలిపోయిరీ —ఆటలాడి.

వివరణము అక్కఱలేకయే మనకు కథ తెలియుచున్నది. కన్యతండ్రి మొగమోటమిని, కూఁతుపై నభిమానమును వదలి ధర్మరక్షణము చేయఁజాలక పోయిననూ, ఆకాలపువారలు మన యీకాలపు వారలవలెనే స్వధర్మనిర్వహణధురంధరులు కాఁబట్టి మర్యాదను నిలువఁబెట్టినారు. భేష్. మంచిపని జరిగినది. హరిస్వామికి తగినశాస్తి యైనది. కాకున్నను ఆ పెంకెతన మేమిటి? ఆసాటిం పేమిటి? ఆమరతు లేమిటి? ఇఁక మనము మఱల మూలమును ఒక్కమాఱు చూతము. అం దేమని యున్నదో?

రాజునాజ్ఞచే హరిస్వామి రాయబారిగా పోయి యున్నాఁడుకదా! ఆపైని అతనికథ సోమదేవసూరి చెప్పుచున్నాఁడు; వినఁడి. ఇది పాటలో లేదు. చూడుఁడు:

శ్లో. కృతకార్యశ్చ తత్రాఽసౌ
ఏకేనాఽభ్యేత్య తాం సుతాం,
యాచితోఽభూ ద్ద్విజాగ్ర్యేణ
శ్రుతత్రూపసంపదా.

విజ్ఞానినో జ్ఞానినో వా
శూరా ద్వా నాఽపరం పతిం,
మత్పుత్రీచ్ఛతి త త్తేషాం
మధ్యా త్కథయ కో భవాన్?

ఇత్యుక్త స్తేన భార్యార్థీ
స హరిస్వామినా ద్విజః,
అహం జానామి విజ్ఞాన
మితి తం ప్రత్యభాషత.

తర్హి త ద్దర్శయ స్వేతి
పున రుక్త శ్చ తేన సః,
విజ్ఞానీ కల్పయామాస
స్వశక్త్యా ద్వ్యోమచరం రథం.

మాయాయంత్రరథే తత్ర
తం హరిస్వామినం క్షణాత్,
ఆరోప్య నీత్వా స్వర్గాదీ
న్లోకాం స్తస్మాయదర్శయత్.

ఆనినాయ చ తుష్టం తం
తత్రైవ కటకం పునః,
దాక్షిణాత్యస్య నృపతే
ర్యత్రాఽఽయాతః స కార్యతః.

తత స్తస్మై హరిస్వామీ
ప్రతిశుశ్రావ తాం సుతాం,
విజ్ఞానినే వివాహం చ
నిశ్చికాయాఽహ్ని సప్తమే.

ఈశ్లోకముల కిది యాంధ్రానువాదము.

"పోయినకార్య మయినతర్వాత ఆయనను సోమప్రభారూపమును విన్న బ్రాహ్మణకుమారుఁ డొకఁడు వచ్చి సోమప్రభను తన కిమ్మని యడిగెను 'నా కూఁతురు శూరజ్ఞానివిజ్ఞానులలో నొక్కనిఁ గాని యన్యుని వరియింపదు. నీ వం దెవ్వండవు?' అని యాతనిని హరిస్వామి యడిగెను. తాను విజ్ఞానియని ఆచిన్నవాఁడు పలికెను. అంత హరిస్వామి యతనిని విజ్ఞానముం బ్రదర్శింపు మనెను. అంత నాకుమారుఁడు తనశక్తిచేత వ్యోమగామి యగు మాయాతేరొకటి నిర్మించి, అందు హరిస్వామి నెక్కించుకొని కొనిపోయి, స్వర్గాదిలోకములను కానుపించి తుదకు ఆదక్కినంపురాజువిడిదిలో విడిచిపెట్టెను. హరిస్వామి సంతోషించి యతనికి సోమప్రభను వాగ్దానముచేసి ఏడవదినము వివాహమునకు నిశ్చయించెను."

ఇఁక దీని నింతటు నుంచి, ఈభాగములను పాటలోఁ గూర్చినరీతిని పరీక్షింతము. ఈక్రిందిపంక్తులు భాగముఁ దెలుపును —

౯. విజ్ఞానఘను డొకండు నేమకలర పెండ్లియాడ,–
వెలదితండ్రివరికి యతఁడు వేగఁబోనఁగా
సుందరాంగి నాదుపట్టి శోభనవిజ్ఞానిఁ గాని
పొందదనుచు నతఁడు దెల్ప బుద్ధిమంతుఁడూ,–

విజ్ఞానమహిమచేత వేవేగ నపుడె మంచి
(వి) జ్ఞానరథము నొకటి వెలయఁజేసెనూ;
చిత్రమైన కీలు గల్గి చెలఁగి మిన్న దరియుచునూ
మించుల తల దన్ని మించు మంచిరథముఁ జూ
గూర్చికొనుచు గొనుచుఁ బోయె గూర్మినాతఁడూ.

—ఆటపాడి.

సంస్కృతములోని ప్రతిపదమును అనుకరింప కున్నను, పాటలో సముదాయతః భావాతిక్రమణము నొనర్చుట లేదు. పైఁగా రథమునకు వాడిన మించులతలఁ దన్ని మించు మంచిరథ మని యనినవిశేషణము రచనోత్కర్ష మును చాటుచున్నది.

పిమ్మట మఱల కథ నుజ్జగించి పాటలోఁగల వర్ణనౌచిత్యమువంకకు దృష్టి మఱల్పఁ బడుచున్నది. చూడుఁడు, ఆనిర్మించినరథము గగనవీథియం దెట్లు పోవుచున్నదో ?

౧౦. ఇండ్లు వాకిండ్లు గండ్లు ఇంతలింత నలుసులుగా
కొండలన్ని చిన్నచిన్న గుట్ట లవఁగనూ,–
పారువాలత్రోవ దాటి పరఁగఁ బైత్రోవఁ జొచ్చి
బోరుకొనుచు హోరున తా సొరుకొనుచునూ,–
జఱ్ఱుజఱ్ఱు మనేగాలి మిఱ్ఱుపల్లాలు దాటి
బుఱ్ఱున నారథము దేవభూమిఁ జేరెనూ.

—ఆటపాడి.

దీనివలన రచయిత ఆకాశమున రథగమనమును నిరూపించుటలో నతిసులువగు మార్గమున నెట్టి నైపుణ్యమును ప్రదర్శించినాఁడో కన్పెట్టినచో, సహృదయులు ఆనంద రసాంబుధి నోలలాడక పోరని నానమ్మకము. ఆంధ్ర కవులలోఁ బ్రబంధయుగమునందు [వర్ణనాధిక్యరంజితయుగమునందు] ఇట్టివర్ణనలు గావించిన కవులు నాయెఱింగినంతవఱకు నల్వురైదుగు రున్నారు. కాని సంస్కృతమునందు కవి కులగురువునకు (కాళిదాసునకు) నిట్టివర్ణనములు చేయుట మిక్కిలియు నిష్టమైనది. ఆయన తన నాటకములందు మిక్కిలి ప్రఖ్యాతములని నేఁ డెన్నికచేయఁనట్టి శాకుంతలవిక్రమోర్వశీయములలో రథగమనమును–అందునను ఆకాశగామి యగు రథగమనమును వర్ణించి యున్నాఁడు. చూడుఁడు: విక్రమోర్వశీయమున

* శ్లో. అగ్రే యాంతి రథస్య రేణువ దమీ
చూర్ణీభవంతో ఘనాః,
చక్రభ్రాంతి రరాంతరేషు జనయం
త్యన్యా మివారావళీం,
చిత్రన్యస్త మివా చలం హయశిర
స్యాయామవ చ్చామరం,
యష్ట్యగ్రే చ సమం స్థితో ధ్వజపటః
ప్రాంతే చ వేగానిలాత్.

ఇది పురూరవుఁడు రాక్షసుని బారినుండి ఊర్వశిని విడిపించి కొనితెచ్చుటకయి ఆకసమునఁ బోవుచు తనరథవేగమును ప్రశంసించుకొను సందర్భములోనిది. కాఁగా దీనియర్థము ఇట్టులు:—చక్రముల సంఘట్టనముచే పిండిపిండిగా అయిపోవుచున్న మేఘములు రథవేగముచేఁ గల్గినగాలిచే మున్ముందుకుఁ గొట్టికొనిపోవుచు, (అతి వేగముగా పరుగిడుచున్న బండియొక్క ముందురేఁగిన) రేణువుల వలె–అనఁగా దుమ్మువోలె వ్యాపించుచున్నవి (ఎంతవేగమును, ఎంతబలమును కలిగియున్నచో నిట్లు వినువీథిని దుమ్ములు రేఁగుట కల్గునో గదా!) ఆవేగమునందైనను, గాలిచేతనే రథచక్రపు ఆకులనడుమ కలుగుచున్న చక్రభ్రమణము వేఱొక అరావళిని ప్రోదిసేయునట్టు లున్నది. అనఁగా మితిమీఱిన వేగముచే నట్లు విలసిల్లుచున్నదనుట. గుఱ్ఱముల కలంకారముగా తలపైని కట్టియున్న మిక్కిలి పొడవైన చామరము చిత్తరువున నిల్పినట్లు కదలక మెదలక అచంచలముగా నున్నది. ఇదియును రథవేగజనితమే యగును. మఱియు నవ్వేగపుగాలిచేత రథమునకుఁ గూర్చిన జండాగుడ్డయును దండాగ్రమునను, తత్ప్రాంతమునను రెండువైపులను సమరేఖతో విలసిల్లుచునున్నది– అని భావము.

*నాల్గవచరణమునకు 'యన్మధ్యే చ సమం స్థితో ధ్వజపటః ప్రాంతే చల శ్చానిలాత్'–అని, 'సమస్థితి ర్ధ్వజపటప్రాంత శ్చ'—అనియు పాఠభేదము లున్న వని కాళేగారిముద్రణమునఁ గలదు.

ఇంకను ఇట్టులనే పెక్కురు వర్ణించియున్నారు. విస్తరభీతిచే నిచట నీకున్నైతిని. శాకుంతలమునందు నిట్లే 'ముక్తేషు రశ్మిషు నిరాయత పూర్వకాయా' ఇత్యాది శ్లోకమునందును కవికులగురువులు వర్ణించి యున్నారు. కాన దానిని కూడ నిట చిత్తగింపుఁడు.

ఇఁక సంస్కృతమునందలి సందర్భము నింతతో వదలి తెలుఁగుగ్రంథకర్తలలో ఇట్టివర్ణనచేసిన కవులనుండి యొక్కయుదాహరణముఁ జూపఁ గోరెదను. ఈక్రింది పద్యము వసుచరిత్రనుండి యుద్ధరించుచున్నాను. ఇది సాంద్రభవర్ణనమును చేసినను చేయకున్నను, నాకాశ గమనమును వర్ణించుచున్నట్టులు పొడకట్టెడి.

సీ. బహివాయు కిల నగ ప్రకెతితో తేవ్వన
నెగిరిన క్రైతోఁచు మగువలార!
పైపై సమీరణార్భటి నింగి బోరున
నడచిన క్రైతోఁచు వతిపలార!
నిఖిలభూములు జవనిక వాప దారున
నెరిరిన క్రైతోఁచు నింతులార!
చనఁజన వెడఁద యై శశిమేను గ్రక్కునఁ
బెరిఁగిన క్రైతోఁచుఁ దరుణులార!
కొండ లప్పనగం డ్లయి నిండు చెఱువు
లెల్ల నద్దంపుబిల్లలై యేర్లు ముత్తి
యంపుసరులై యరణ్యంపు గుంపు లెల్ల
నారులై తోఁచుఁ బొడవుగ నారులార!

సరి! ఎట్లైన నేమి, యాబ్రాహ్మణపుత్త్రవాఁడు హరి స్వామిని ఆకాశమార్గమునకుఁ గొనిపోయి యంతతో నూరకుండలేదు. మూలములోఁ జెప్పినట్లే యిందును నతనికి దివ్యలోకసందర్శనము చేయించిన విధము నీక్రింది బంతులు చెప్పుచున్నవి:

౧౧. ఇంద్ర చంద్ర లోకములకు, నింపొప్పు నప్సరో
లోకాల సూర్యాది లోకములనునూ,—
స్వర్గలోకవిభవాల భర్గలోక మహిమల నప
వర్గదాయి విష్ణులోక వైభవంబులూ,—
వీర్పరించి చెప్పి చూపి, యెలమి నతనిఁ గొనీ భూమిఁ
జేర్చి ముదము గల్గించి, చెలఁగి యొప్పఁగా,—
తండ్రివాని నేర్పు కలరి, తనయ కతఁడె తగు నటంచు
మహిళఁ బెండ్లిఁ జేతునంచు మాట యిచ్చెనూ.

—ఆటలాడి.

ఈమాటలు కాశీఖండములోని శివశర్మను దివ్యయానమునఁగొనిపోవుచు నతనికిఁ జూపిచెప్పినదివ్యలోకవృత్తాంతములను నాకుఁ జ్ఞప్తికిఁ దెచ్చినవి. రచయిత ఆఘట్టము నెఱింగియున్నచో మన కీపాటలో నింకను చిత్రముల నింతకన్న మిన్నగాఁ బ్రదర్శించియుండును. కాని అట్లు కాలేదు. ఇచ్చట నాకొక్కసందియము కల్గినది. సాధారణముగా నిట్టిపాటలను రచించువారు చాలినంతసంస్కృతవిజ్ఞానము కల్గియుండరు. అయినను నిందు 'స్వర్గలోకవిభవాల, భర్గలోకమహిమల, అపవర్గదాయి విష్ణులోక వైభవంబులూ'—యన్నది ఇటీవలివారి కల్పనయేమో యని సందియము కల్గించుచున్నది. ఇందుకు తోడుగా సహజమును, సరళము నైన ప్రాకృతులరచన ఇచ్చట కుంటుపడి భేదము నకఁకవోలె నక్కఁగా విప్పి చెప్పఁ జాలియున్నది.

మఱియొక సంగతి. మూలములో హరిస్వామి ఏడవదినము ముహూర్తమని చెప్పినట్లున్నది. కాని పాటలో ఆవిషయము నెందువలనో యెత్తనే లేదు. అదికూడ నున్నచో మఱింత యందముగ నుండెడిది. సరి; పైని చదువుదముగాక.

శ్లో. తత్కాల ముజ్జయిన్యా మపరస్యైవ ద్విజన్మనా,
దేవస్వామీ స తత్పుత్రః స్వసారం తా మయాచత;
జ్ఞానివిజ్ఞానిశూరేభ్యో నాఽన్య మిచ్ఛతి సా పతిం,
ఇతి తేనాఽపిసోఽభ్యుక్తశ్శూరమాత్మానమభ్యధాత్;
తతో దర్శితశస్త్రాస్త్రక్రియే తస్మై ద్విజోఽనుజాం,
దేవస్వామీ స శూరాయ దాతుం తాం ప్రత్యపద్యత;
సప్తమేఽహ్ని చ తత్రైవ వివాహం గణకోక్తితః,
తస్యాఽపిసోఽభ్యధాన్మాతుఃపరోక్షంకృతనిశ్చయః.

కళాప్రపూర్ణుల యాంధ్రానువాద మీక్రిందిది:—"ఆకాలముననే ఉజ్జయినిలో ఇంకొక బ్రాహ్మణకుమారుఁడు

దేవస్వామికడకు వచ్చి చెల్లెలి నిమ్మని యడిగెను. 'నా చెల్లెలు జ్ఞానివిజ్ఞానిశూరులలో నొకనిందక్క తక్కొరుని వరియింపదు. అందు నీవెవ్వఁడవు?'—అని దేవస్వామి యడుగఁగా, నితఁడు తాను శూరుఁడనని చెప్పుకొని తన శస్త్రాస్త్రవిద్యాప్రభావముం గనపఱచెను. అంతట దేవస్వామి యతనికి చెల్లెలిని వాగ్దానముచేసి జోస్యుల నడిగి ఏడవదివసము వివాహమునకు నిశ్చయించి ఆవృత్తాంతమును తల్లికిం దెలియఁజేసెను. "

ఇఁక నీవిషయము మన పాటలో కూర్చినరీతి జూతము.

౧౨. సుందరాంగి సోదరుండు చూడ సొంపైనవాఁడు
అందమైనగుణముల సొంపొందువాఁడునూ,
రాజుగారిసభకుఁ బోవ దవ్వులోన శూరుఁడొకఁడు
సుందరాంగి యన్న నంతఁ జూడవచ్చి యీ
చెల్లి నిమ్మటంచు నతనిఁ జెలువ మొప్పఁ బ్రార్థింప
మెల్ల నతఁడు శూరుఁజూచి మెలఁకువొప్పఁగా
సుభగ! నాదుచెల్లి వినుము శూరవిజ్ఞానిఘనుల
పొందునంచు నాతఁడపుడు పొసఁగఁ దెల్పఁగా,
శూరుఁ డట్లయిన లెస్స! చూడు నాదు శౌర్యమంచు
సరసముగా దనదు శూరతనము మెఱయఁగా,
శస్త్రాస్త్రవిద్యలనూ చౌషష్టి నేర్పులనూ
పరగ వ్యాయామములను పటుతరంబుగా
కత్తిసాము కఱ్ఱసాము ఘనామైనసాము లన్ని
హత్తించి లోవెలి మెలఁకువలఁ జూపుచు
గరుడిపట్టు డేగపట్టు ఘనామైన సాల్వపట్టు
పరుటిపట్టు మొదలయిన ప్రజ్ఞ లెల్లనూ
చిత్రవిచిత్రంబుగాను శౌర్యంపువరుసఁ జూపి
ఆత్రముతో చూతెయంచు నతని నడుగఁగా,
సుమతి 'మంచితెలివిగలదు చూడ సొంపైనవాఁడు
చెల్లెలికిని బెండ్లిఁజేయఁ జెందు సుఖములౌ'
శూరుఁ డిట్లు దొరకెనన్న కోరిక యుప్పొంగుచుండ
తారుమారు చెప్పకుండ దరిసి యతనిని
తగినవాఁడవోయి శూర! ధన్యుల మింకేల నీకె
మగువఁ బెండ్లిసేతు నంచు మాట నిచ్చెనూ
—ఆటలాడి.

అసలు మూలశ్లోకములు ఈపాటలో నెట్లు అందముగా పెంపొందుచున్నవో చదువరులు ఈపాటికి గమనించియే యుందురు. మూలములో 'శస్త్రశాస్త్రశ్రీయే'—అని యున్న యొక్క మాట యెంతసరసముగ నర్థవంతముగ జాతీయ సంప్రదాయానుసారముగా రచనలోఁ జొప్పింపఁబడినదో చూడుఁడు. శస్త్రాస్త్రవిద్యల నెంతయందముతో నిందు వివరించిరో కనుఁడు. కాని ఇచ్చట ఒక్కయంశము విచారింపఁ దగును. అది యిది—కన్యకనిచ్చుహక్కు తలిదండ్రులది. సోదరునకు వారు లేనప్పుడు గాని లేక యుపేక్షచేసినప్పుడు గాని మాత్రమే సంక్రమింపవలసి యున్నది. అట్లయ్యును దేవస్వామి తనసోదరిని వాగ్దాన మొనర్ప సాహసించినాఁడు. దీని కాకరమేమో?

దేవస్వామియును మంచిశూరుఁడే యైయుండును. లేకున్నచో, శూరుని శౌర్యమును మెచ్చుకొనఁగల ప్రజ్ఞ దుర్లభము కదా! ఇఁక నిందుగల తెలుఁగు జాతీయసంప్రదాయమునకుఁ జెందినపట్టులు సాములు అందలి విశేషములు ఆవిషయమునఁ బ్రజ్ఞగల పెద్దలు పరీక్షింపఁదగినవే కాని యలంతులు కాఁజాలవుకదా! ఎట్లయిన నేమి? కథ రక్తిగలపట్టునకు వచ్చినది. సాధారణముగా మనవారు—

శ్లో. కన్యా వరయతే రూపం మాతా విత్తం పితా శ్రుతం,
బాంధవాః కుల మిచ్ఛంతి మృష్టాన్న మితరే జనాః.

అని యందురు. కాని ఈపాటలలో అంతయును తారుమారుగనే యున్నది. కేవలము అందమునకు మురియవలసిన కన్యక సోమప్రభ గుణాకాంక్షిణియైనది. కేవలశ్రుతవిషయమును విచారణచేసికొనవలసిన తండ్రి హరస్వామి విజ్ఞానమోహమునఁ బడినాఁడు. మృష్టాన్నమును కోరవలసిన యితరబంధుజనములోఁ జేరిన సోదరుఁడు దేవస్వామి శూరగుణాభిమాని యగుట తటస్థించినది. ఇది చిత్రము కాదా? ఇఁక అల్లుని యైశ్వర్యమునకు పొంగవలసిన ఆయమ్మ—సోమప్రభయొక్క తల్లి, ఏస్థితిలో నున్నదో కొంచెము మనము చూడవలదా? కనుక చిత్తగింపుఁడు.

౧౩. ఇట్టులుండ నొక్కజ్ఞాని యింతిని చూడంగఁ గోరి
చట్టన నాకాంతితల్లి సరవిఁ జూడఁగా

పొచ్చెముగా నామె తనతు మెచ్చులన్ని విచ్చిచెప్పి
చెచ్చెరఁ దనకూఁతుఁ గూర్మి హెచ్చఁ జూపెనూ
జ్ఞాని యపుడు కొంతఁజూచి మానముతోఁగొంతగడిపి
వినయము తొలుకాడ నా వెలఁది కిట్లనెఁ
జ్ఞాని విజ్ఞాని శూర ఘనులను వరియించు నేని
జ్ఞానిని నే, నాదుమహిమఁ గాంచు మంచనీ
ముందువెనుక జన్మల పొందినట్టి సంగతులను
అందచందాల నితర కందువులనునూ
యద్భుతాల వింతగాను అందునిందు విషయాల
పొందికగా నందముగా పొసఁగునట్లుగా
కళ్లముందు గాంచినట్లు, కాంచి మించి యొసఁగునట్లు
పళ్లు విచ్చి పెట్టినట్లు పలుఁకఁ జెప్పఁగా
జ్ఞాని వౌ దనుచు నామె ఘనామాగా నతని మిగుల
పూనికతో మెచ్చికొంచు పొంగి వేగనూ
మానవతికి మంచి సుజ్ఞానిదొరకె మేలయ్యో
మహిళ పెండ్లి చేతుననీ మాట యిచ్చెనూ.

—ఆటలాడి అలసినావు.

చదువరులు పైబంతులను చిత్తగించిరి. కాఁబట్టి యీ క్రింది సంస్కృతాంధ్రములతోఁ బోల్చి యీ భాగముల లోఁగల సారస్యమును రచనాతిశయమును స్వయముగా గ్రహింపఁగల రని విశ్వసించుచున్నాను. సోమదేవసూరి రచించిన యీశ్లోకములను దానిక్రింది ఆంధ్రవివరణ ము పైభాగమును పోల్చుటలో మిగులఁ దోడ్పడును.

శ్లో. తన్మాతాఽపి హరస్వామి
భార్యా తత్కాలమేవ సా,
కేనాఽప్యేత్య స్వతీయేన
సుతాం తాం యాచితా పృథక్.
జ్ఞానీ శూరోఽథ విజ్ఞానీ
భర్తాఽస్మద్దుహితు ర్మతః,
ఇత్యుక్తశ్చ తయా మాత
రహం జ్ఞానీతి సోఽభ్యధాత్.
పృష్ట్వా భూతం భవిష్య చ్చ
తస్మై తాం జ్ఞానినే సుతాం
ప్రతిజజ్ఞే ప్రదాతుం సా
ఽప్యహ్ని తస్మిన్నేవ సప్తమే.

పై శ్లోకముల యాంధ్రానువాద మిట్లున్నది:—
"ఆసమయమందే తల్లిని ఒకవిప్రకుమారుఁడు వచ్చి కొమరిత నడుగ, ఆమె 'నాకూఁతునకు జ్ఞానివిజ్ఞానిశూరులలో నొకఁడుగాని యన్యుఁడు పనికిరాఁడు. నీ వెవ్వఁడవు'—ని యడుగఁగా తాను జ్ఞాని యని చెప్పి యతఁడు వర్తమాన భూతభవిష్యత్తులు చెప్పఁగా, ఆమె యాతనికి కన్యను వాగ్దానము చేసి, ఆయేడవదినమునే వివాహమునకు నేర్పఱచి యుండెను."

ఈరీతిగా తండ్రి, సోదరుఁడు, తల్లి, సోమప్రభను ఎవరికిఁ దోఁచినట్లు వారు వాగ్దానము చేసినారు. (మూలములో చెప్పినరీతిగా నేడవదగు) వివాహదినము ఇక వచ్చుటయే తరవాయి. వీరు మువ్వురు నిట్లు వాగ్దానము నొసర్చినను ఎవ్వరిమట్టుకకు వారు సోమప్రభయభిమతము ననుసరించియే తాము వర్తించినట్లు విశ్వసించియున్నట్లు విదితము. కాని యందఱు నొక్కచోటఁ జేరిననే కదా ఆవింత బయలుపడుట! ఇదిగో ఆఘట్టమును వినిపించుచున్నాను. చిత్తగింపుఁడు.

౧౮. ఇట్లు లొక్క రొకరిమాట నెఱుఁగనేయెఱుఁగకుండ
గట్టిగాను మాటయిచ్చి కదలివచ్చిరీ
వచ్చి యొకరిమాట నొకరు హెచ్చినయాత్రానవినుచు
వచ్చె చిక్కు, దీని పోఁబుక్కు పెట్లనీ
తపఁబడి దరిదోఁచ కాట్టె తమతమ మార్గాలుపట్టి
వేడుకలరఁ బెండ్లిపనులుకూడఁ జేయఁగా
పెండ్లిరోజు దాపయ్యె పెద్దలు చుట్టాలు హితులు
గొండ్లిసేయ ముగురు వరులు కోరి వచ్చిరీ
జ్ఞాని విజ్ఞాని శూర ఘనులు మువ్వు రిల్లునేరి
శిమి నేతు మేమియంచు నెగులం నొందిరీ.

—ఆటలాడి అలసినావు.

పాపము గట్టిచిక్కే తటస్థించినది. ఒకరుచేసిన వాగ్దానము మఱొకరికిఁదెలియదు. అందఱును సోమప్రభ కు శ్రేయమును కూర్చుటయందే తాత్పర్యము. కాని అది యే ఒక్కమాఱుగా నీవిచిత్రసన్నివేశమున చిక్కుఁ దెచ్చి పెట్టినదికదా! కానిండు. మనము ఈ సందర్భమునఁగల సంస్కృతాంధ్రముల నొకపరి చదివి పైకిపోదము. అవిఇవి.

శ్లో. అన్యేద్యు శ్చాగత స్తత్ర
హరిస్వామీ యథాకృతం,
పత్న్యై పుత్రాయ చాచఖ్యౌ
తం కన్యాదాననిశ్చయం,
తౌ చ తం స్వకృతం తస్మై
భిన్నం భిన్న మవోచతాం,
సోఽపి తేనాఽఽకులో జజ్ఞే
పరత్ర మునిమంత్రణాత్,
అథోద్వాహదినే తస్మి
న్హరిస్వామిగృహే వరాః,
ఆయయు ర్జ్ఞానివిజ్ఞాని
శూరా స్తత్ర త్రయోఽపి తే.

ఆంధ్రవివరణము వీని కీ క్రిందిది:—మఱునాఁడు హరిస్వామి వచ్చి భార్యకును కుమారునికిని తాను చేసిన వాగ్దానమును తెలియఁజేసెను. వారు తాము ఒకరి యెఱుక లేక యొకరు చేసిన యాయా కన్యాదాన నిశ్చయముల నాయనతోఁ జెప్పిరి. ఇట్లు ముగ్గురు వరులు దాపరింపఁగా హరిస్వామి చిక్కునంబడి చేయు నది లేక చింతిల్లసాగెను. వివాహదినము రాఁగానే వరులు ముగ్గురును జ్ఞాని విజ్ఞాని శూరులు హరిస్వామి యింటికి వచ్చిరి:—అని.

మూలమునందు ఒక్క హరిస్వామియే దిక్కు తోఁచక విచారమున మునిఁగె నని యుండఁగా, పాటలో నావిచారమున నందఱకు పాలు ఈయఁబడినది. ఇది యెంతయు సరసముగనే యున్నదని తలంతును. ఆంధ్ర వివరణములో ఈపట్టున కళాప్రపూర్ణులు చేసిన 'దాపరింపఁగా'—అన్న యనువాదము ఎంతో యుచి తమై అర్థశ మెలుకువచున్నది. పాటలో ఈపదము పడలేదు. అయినను రసనిష్పత్తి కలుగలేదు. కాని సోమప్రభస్థితి నెవ్వరును తలఁపనేలేదు.

ఈరీతిగా తడఁబడి దరితోఁచక కొట్టుకొనుచున్న ను పెండ్లిపనులు విడనాడక వారు చేయుచునే యున్నా రఁట. అంతలో పెండ్లిరోజు దాపించి పెండ్లికొమరులు ను వచ్చి చేరిరఁట! ఇవి మూలమును మించిన మించులు. ఇఁక విస్మృతివృత్తాంతముఁ జూతము. తర్వాత కథాసరి త్సాగర మిట్లు కథ నడుపుచున్నది చూడుఁడు:—

శ్లో. తత్కాలం చాత్ర సా చిత్రం
కన్యా సోమప్రభా వధూః,
అశంకితం గతా క్వాఽపి
న విచిత్యాఽప్యలభ్యత.
తతోఽబ్రవీ ద్ధరిస్వామీ
జ్ఞానినం తం ససంభ్రమః,
జ్ఞాని న్నిదానీం బ్రూహ్యాశు
దుహితా మే క్వ సా గతా?
తచ్ఛ్రుత్వా సోఽవదత్ జ్ఞానీ
రాక్షసేనాఽపహృత్య సా,
నీతా వింధ్యాటవీం ధూమ—
శిఖేన వసతిం నిజాం.
ఇత్యుక్తో జ్ఞానినా భీతో
హరిస్వామీ జగాద సః,
హా ధిక్కథం సా ప్రాప్యేత
వివాహ శ్చాఽప్యహో కథం.
శ్రుత్వైవ తత్ప్రాహ విజ్ఞానీ
ధీరో భవ నయామి సః,
తత్రాథ నైవ యత్రైషా
విజ్ఞానీ వదతి తాం స్థితాం.
ఇత్యుక్త్వా తత్ క్షణం కృత్వా
రథం సర్వాస్త్రసంయుతం,
తత్రారోప్య హరిస్వామి
జ్ఞానిశూరా స్వవగామిని.
తేన స సంప్రాపయామాస
క్షణా ద్వింధ్యాటవీభువి,
జ్ఞానినా తాం సమాఖ్యాతాం
వసతిం తత్ర రాక్షసః.

ఆంధ్రానువాదము:—ఆసమయమున నొకవింత జరిగెను. ఏమన సోమప్రభ హరిస్వామి కూఁతురు ఎటకు పోయెనో ఏమాయెనో ఎంతవెదకినను అగపడ

దాయె. అంతట హరిస్వామి దిగులొంది జ్ఞానిని—ఓ జ్ఞానీ! నాకొమారిత యిపు డెచ్చట నున్నదో నీవు చెప్పుము? అని యడిగెను. 'ధూమశిఖుఁడను రక్కసుఁడు కొనిపోయి వింధ్యారణ్యములో తనయింట నుంచుకొని యున్నాఁడు' అని జ్ఞాని చెప్పెను. 'అయ్యో నాసుత నాకెట్లు దొరకును? వివాహ మెట్లు జరుగును?' అని హరిస్వామి మొరపెట్టసాగెను. అంతట విజ్ఞాని 'అయ్యా! భయపడవలదు. మీకొమారిత యెట నున్నదని యీజ్ఞాని పలికినాఁడో, అటకు మి మ్మెల్ల నే నిపుడె కొనిపోయి చేర్చెద'—అని యోదార్చి, తత్క్షణమే నానాశస్త్రాస్త్ర సంయుత మైనరథము నొకదానిని నిర్మించి, అందు వారి నెల్ల నెక్కించుకొని కొనిపోయి, వింధ్యారణ్యములో ధూమశిఖుని యొక్కకడ నిలిపెను.

ఈభాగమున క్రిందిబంతులు పాటలోఁగలవు:—

15. అనుచు నుండునంతలోన నతివ యాసుందరాంగి
కానరాక మాయ మయ్యె కాంత యింతఁగా.

తల్లితండ్రి యన్నయాను దగ్గఱ చుట్టాలు జేరి
తలిరుబోడి జాడవెదుకఁ దరలిపోయిరీ.

చెట్లువెదకి చేమ వెదకి గట్లన్ని కలయ వెదకి
పుట్టవెదకి భూమి వెదకి పొలఁతిజాడలూ
అత్రానఁ గానలేక యదురుసురై యలసి రాగ
చిత్రమంచు తత్తరమునఁ జేరియేడ్చుచూ,
యూరకున్న జ్ఞానిఁజూచి యువిదఁజాడ నేర్పరించి
మీరు చెప్పుఁ డనుచు తండ్రి మెల్ల నడుగఁగా.

కొల్లడపా కేల వినుఁడు తన్వి వింధ్యయడవిఁగలదు
మల్లుఁ డొక్కరక్కసి తాఁ గొల్ల గొనియెనూ
—ఆటలాడి.

అని చెప్పినాఁ డట. పాటలో ఆకన్యక మాయమ కాఁగానే తల్లియుఁ దండ్రియు మున్నగువా రెల్లరు నివ్వెఱపోవుటయు చుట్టాలుప్రక్కలుసహా వెదుకఁ బోవుటయు అనుగుసురగుటయు నిందెంత మనోహర రీతిని కూర్పంబడినవో సహృదయులే స్వయముగా గుర్తింపఁగలరు. ఒక్కశ్లోకమున కింత స్వతంత్రముగా రసవత్తరముగా రచనచేయుట కెంత లోకానుభవాదు లుండఁదగునో యూహింపుఁడు.

చివఱకు ఎట్లయిన నేమి? సోమప్రభజాడను జ్ఞాని బయలుపెట్టఁగలిగినాఁడు. ఇఁకను చేయవలసిన దేమన్నచో, చేతనైనచో స్వయముగాపోయి విడిపించుకొని రావలసి యున్నది. వింధ్యకు వెళ్లుట గానీ, అచ్చట బ్రహ్మాండమగు నా కికారణ్య బ్రహ్మారణ్యములో ఆరాక్షసుని గుర్తించుట కానీ, గుర్తించినను ఆతనితో యుద్ధముచేసి కన్యకను కొని రాఁగల్గుట గానీ మిక్కిలియు దుస్సాధ్యములు. మఱి యికఁ గర్తవ్య మేమి? ఊరకోవలసినదేనా? అక్కఱలేదు. తర్వాతి యత్నములను పాటయే నిరూపించుచున్నది:—

16. అనుచు జ్ఞాని చెప్పఁగానె అతిరయాన విజ్ఞాని
చిత్రశకట మొకటిచేసె (వి)చిత్ర మొప్పఁగా
అంద అందఱు గూర్చోని అజయ వింధ్యగిరిని జేరి
పొందుగాను కాంతయున్న పదు గనుగొనా,
—ఆటలాడి.

ఇఁక నేమి? జ్ఞానియున్నందునకును విజ్ఞాని యున్నందునకును తగినఫలము వెంటనే కన్పించినది. కన్యను రాక్షసుఁడు దాఁచఁబెట్టినసందుగొందులను కూడ కనిపెట్టఁగలిగినారు. కాని యింతమాత్రముచే లాభమున్నదా? సోమప్రభ యిప్పుడు ప్రబలుఁడగు రాక్షసుని వశమున నున్నది. ఆరాక్షసుఁడును సామాన్యుఁడు కాఁడు. ఎంతవాఁడును ఎన్నియుక్తులు ఎన్నిశక్తులు కలవాఁడును కాకున్నచో, పాపను 'రేపు పెండ్లి'—అని సిద్ధపఱచుకొనియున్న పెండ్లింటినుండి, అంతమంది బంధువులు చుట్టాలు చూచుచుండగనే, మటుమాయగా నెత్తికొని పోఁగల్గునా? ఇంత యుక్తిగా తీసికొనిపోయినవాఁడు, ఒకవేళ నా అమ్మాయిసంబంధులు వచ్చినచో నేమి చేయవలయునో ఆలోచించికొనక యుండునా? అందులో శూరుఁడు గదా! మఱి అట్లైన నేమిజరిగిన దని చదువరులు ఆత్రపడవచ్చునుగదా! కనుక వినుఁడు.

ఈక్రిందివి సోమదేవసూరియు వివరణకర్తలయు వాక్యములు.

శ్లో. తత్ర తం రాక్షసం క్రుద్ధం జ్ఞాత్వా వృత్తాంతనిర్గతః,
శూరోఽథ యోధయామాస హరిస్వామిపురస్కృతః.
త దాశ్చర్య మభూ ద్యుద్ధంతయోర్మానుషరక్షసోః,
చిత్రాస్త్రయోధినోః శస్త్రైర్యుద్ధం రామరావణయో రివ.
క్షణేన చ స సంగ్రామదుర్మద స్యాఽపి రక్షసః,
అర్ధచంద్రేణ బాణేన శూర స్తస్యాఽచ్ఛిన చ్ఛిరః.
హతే రక్షసి తాం సోమప్రభామాప్తాంతదాస్పదాత్,
ఆదాయ విజ్ఞానిరథేఽనాఽజగ్ము స్తే తతోఽఖిలాః.

ఆంధ్ర వి వ ర ణ ము:—వారిరాక యెఱింగి కోపముతో వెలువడిన ధూమశిఖునితో శూరుఁడు పోరెను. చిత్రాస్త్రశస్త్రములతో వార స్త్రీకై పోరినయాపోరు రామరావణులపోరివలె లోకభయంకరముగా నుండెను. ఇట్లు పోరుచు క్షణములో నాశూరుఁడు పోరి దుండగీఁడైన యారక్కసుని తలను అర్ధచంద్రబాణమునఁ ద్రుంచెను. రక్కసుఁడు మడిసినంతట రక్కసుని యింటి నుండి సోమప్రభం గొనితెచ్చి వార లందఱును ఆవిజ్ఞాని యరదమున హరిస్వామియిల్లు సేరిరి.

ఇఁక నీభాగములు పాటలో నేరీతి పొందింపఁబడినవో పరికింపుఁడు.

౧౭. తనదుజాడ తెలిసెనంచు దద్దరిల్లి యసుర యపుడు
వేనవేలు దండుతోడ వెడలి వేగమూ
కొండరాళ్లు దండిగాను కొట్టి దొర్లించి వారిఁ
బిండి గొట్టె దానని తా గండు మీరుమూ
ఘోరయుద్ధ మపుడు చేయ గొబ్బున నే తేరఁజూచి
శూరుఁ డపుడు కత్తిపట్టి వీరుఁ డగుచునూ
కంగుకంగు మనుచు కత్తి చెంగుచెంగునాను దుముక
రంగుగాను అతనిసేన రాపాడెనూ
క్రూరుఁడైనరాక్షసుండు కోపమూన దూకనతని
ధీరుఁడగుచు నెదిరి వేగ డీకొనుచునూ,
గుచ్చిపట్టి రక్కసూని కొదమసింగంబువలెను
చచ్చునటులఁగొట్టి యా సకియఁ దెచ్చెనూ.
అంత వా రందఱూను వింత లెల్లఁ జెప్పుకొంచు
మంతనంబు లాడికొంచు మఱలి వేగమే
స్వస్తివాచనాల ప్రజలు సంస్తుతింపఁ జక్కఁగాను
సుందరాంగితోడ యిల్లు సొచ్చి రంతటా.

—ఆటలాడి.

మూలములోఁగల రామరావణులఁబోలె చిత్రాస్త్రయోధులగు వారికి జరిగిన యుద్ధము, రాక్షసుని సంగ్రామదుర్మదత్వము మొదలయిన సారస్యములు పాటలోని కెక్కనిమాట నిజమే. అయ్యును, అసుర దద్దరిల్లి యుద్ధమునకు సిద్ధపడుట, కొండరాళ్లు దండిగా కొట్టి దొర్లించుట, గండుమీరుట, కంగుకంగుమని కత్తితో చెంగుచెంగున దుమికి నురుమాడుట—ఇత్యాదులు ఆ లోపమును తీర్చుటయే గాక, రచనలో నెక్కుడు స్వతంత్రతను, రసస్ఫురణను, యుద్ధరంగపుతీవ్రతను ప్రత్యక్షము చేయఁజాలియే యున్న వని నావిశ్వాసము. చివరకు చచ్చునటులఁ గొట్టుటకూడ చాల సరసముగా నున్నది. ఈపదము చచ్చేట్టుగొట్టి—యని యున్నచో నింకను నంద మిచ్చుననుకొందును.

సరి. ఎట్లయిన నేమి? సోమప్రభను మఱలఁ దేఁగల్గినారుకదా. ఇఁక వివాహము జరుగవలయును. ఇది యైనను ఇప్పటికైనను నిర్విఘ్నముగా జరిగినచో మనము నానందింపవచ్చును. కాని అట్లుకాక మఱల నొక గొప్పచిక్కు కలుగుచున్నది. అది ఇదివఱలోవలె జ్ఞాని విజ్ఞాని శూరులవలన నెట్లెట్లో గట్టెక్కునదిగా తోఁచ లేదు. ఇంతకు మున్ను రాక్షసాపహృతయైన సోమప్రభను తిరిగితెచ్చుటలో జ్ఞానబలము కాని, విజ్ఞానబలము గాని, శౌర్యబలము గాని పరస్పరసహకారము నొందినవే కాని పరస్పరము విరోధింపలేదు. ఇప్పుడట్టి సూచనలు ఆరంభమైనవి. చిత్తగింపుఁడు—ఇవియే ఆ సూచనలు:

౧౮. పిల్ల పెండ్లివేళ వచ్చె పెద్దలపుడు వచ్చి వఱల
యుల్లములం దొక్క శంక యుబికె నప్పుడూ:
జ్ఞానివిజ్ఞానిశూర ఘనుల కంతవాదు గల్గె
తాన పెండ్లికొడుకుగాను దనరవలె ననీ!
జ్ఞాని యపుడు ముందుఁ జొచ్చి తాన యర్హుండ నంచు
తనదు ఘనత నిట్టులనీ తడవఁ జొచ్చెనూ:

సుందరాంగి యున్న జాడ పొందుగ నేఁ దెల్పకున్న
అందముగా పెండ్లి యెట్లు యగును నం దనెక్.
నిజము చెప్పె య్యాజ్ఞాని నెలఁత తావు నెఱుఁగకున్న
జాల యెట్లు దొరకునంచు ప్రజలు పల్కిరీ.

—ఆటలాడి.

మంచి రసవత్తరమైనపట్టు. ఇపుడు జ్ఞాని విజ్ఞాని శూరులకు కల్గినది సంఘర్షణ. ఎవ్వరిమట్టుకు వారికి స్వోత్కర్ష సహేతుకముగా విజృంభించుచున్నది. అందు నందఱికన్న ముందుగా స్వాధిక్యమును రూపించుటకు జ్ఞాని దొరకొన్నాఁడు. అతనివాదమును విన్నయప్పటిప్రజలే ఆవాదమును నిజమే నన్నారు. ఇఁక దక్కినవారి ప్రసక్తితోఁ బని యేమి? పాపము జ్ఞానికి కొంతధైర్యము వచ్చియుండవచ్చును. మఱి అట్లయినఁ దక్కిన యిర్వురవిషయ మేమి? వారు మాత్ర మూరక యుందురా? ఊఁహూఁ! ఉండలేదు. విజ్ఞాని లేచినాఁడు. ఎందుకు? తన కెక్కుడు హక్కు గలదని నిరూపించుటకు. అతనివాద మిది:—

౧౮. అంతఁ దనా యాసలన్ని యడియాస లయ్యె నని
చింత హెచ్చ మనసున కిట్టింత యెత్తఁగా,—
విజ్ఞాని లేచి తనదు ప్రజ్ఞ చూపకున్న యెడల
ప్రాజ్ఞులీబాల నెట్లు పడయువారలో?
కాన నాకు గాంత యగుట ఘనా మైన ధర్మ మగును
పూనికతో నరసి మీరు పోల్చి చెపుఁడనెన్
ఇదియు నిజమెయంతికన్న సుదతినితఁడుచూచియున్న
రథము కల్గఁబట్టిగా రమణి దొరకెనూ;
కనుక నితఁడె వరుఁడుగాను కన్యక కేర్పడు
జనులు పల్కి విజ్ఞాని చాలె విజయమూ.

—ఆటలాడి.

ధర్మపురివాలులోఁ బడినది కథ ఈ మధ్యవర్తులు తొలుత జ్ఞానిదే న్యాయ మనినారు. మఱల విజ్ఞాని మాటకు అంతకంటెను సరి యన్నారు. పాపము జ్ఞానికీ పాటికి ఒడలు చల్లఁబడినది. కాని విజ్ఞానికి కొంచెము మొగము పచ్చఁబడినది. ఇఁకమాత్ర మేమి? నిలుచునో లేదో యెవరికిఁ దెలియును? ఏమందురా? తీర్పరులా! ప్రజ్ఞానిధులఁ దలఁదన్నుచున్నారు. వారి విచక్షణత యన్న నో యెత్తువారిబిడ్డ!

మఱి కొంచెము దీని నిచట నిలిపి సంస్కృతాంధ్రముల రచనను జనిమాత్రము.

ఇదిగో సోమదేవసూరి రచనము, పరీక్షింపుఁడు:

శ్లో. హరిస్వామిగృహం ప్రాప్య
తేషాం లగ్నే వ్యవస్థితే,
జ్ఞాని విజ్ఞాని శూరాణాం
వివాద ఉదభూ న్మహాన్;
జ్ఞానీ జగాద నాఽహం చే
జ్జ్ఞానీయాం తదియం కథం,
ప్రాప్యేత? కన్యా గూఢస్థా
దేయా మహ్యా మసావితః.
విజ్ఞానీ త్వవద న్నాహం
కుర్యాం చే ద్వ్యోమగం రథం,
గమాగమా కథం స్యాతాం
దేవానా మివ వః క్షణాత్,
కథం స్యా చ్చారథం యుద్ధం
రథినా రక్షసా సహ,
తస్మా న్మహ్య మియం దేయా
లగ్నో హ్యేష మయార్జితః.

వేంకటరాయశాస్త్రిలువారి తెలుఁగు ఇది పైశ్లోకములకు:—అంత నప్పట లగ్నవేళ కాఁగా, జ్ఞాని విజ్ఞాని శూరులకు ముప్వురకు నిటు జగడము కలిగినది. జ్ఞాని చెప్పెను:—'నే నెఱుంగకుంటినా, ఎటనో దాఁపటికంబున నున్న యీకన్య మీ కెట్లు దొరకును? కాన నీకన్యకను నాకు ఈయవలసినది.' విజ్ఞాని చెప్పెను:—'నేను నింగిఁ జరించు మాయయరదమును చేయనేని, మీకు క్షణములో దేవతలకుఁబోలె రాకపోక లెట్లలవడును? రథము కలవాఁడైన రక్కసునితో రథములేక యుద్ధ మెట్లు జరుగును? కావున నీకన్నియను నా కీయవలసినది. ఈ లగ్నమున నేను గడించితిని'—అని.

ఇఁక శూరుఁడేనా అంత తీసిపోవునది? ఇతఁడ అసలే గుండెలు తీసినబంటు. ఆపైని నిజముగా కూడను

శూరుఁ డన్నమాటను సార్థకము చేసినవాఁడు. రాక్షసుని మూఁడు నిముసాలలో ముక్కచెక్కలు చేసినవాఁడు. ఇతఁ డేమనుచున్నాఁడో విందమా? సరియే.

శ్లో. శూరోఽప్యువాచ హన్యాం చే
న్నాఽహం తం రాక్షసం రణే,
తద్యువాభ్యాం కృతే యత్నేఽప్యేతాం
కన్యాం క ఆనయేత్?

తస్మాన్మ్యే మేషా దాతవ్యే
త్యేవం తేషు వివాదిషు,
హరిస్వామీ క్షణం తూష్ణీ
మాసీ దుద్భ్రాంతమానసః.

పై శ్లోకములకు కళాప్రపూర్ణుల యాంధ్రరచన మిది:—శూరుఁడు పలికెను:—"నేను రక్కసునిఁ బోరఁ బరిమార్పనేని మీ రిరువురు ఏమి యత్నములు చేసినను ఏమి ప్రయోజనము? కన్యను ఇట కెవఁడు తెచ్చును? కావున నీకన్యను నా కీవలసినది—" ఇట్లు వారు జగడములాడుచుండఁగా హరిస్వామి యేమియుఁ దోఁపక యూరకుండెను—అని

ఇఁక నీసందర్భమున మనము పాటను పరికింతము గాక. రండు—

౨౦. ఇంత కష్టపడితినాకు ఇంతి చేజాఱునేమొ
యంత యడ్డువడుదు నంచు చింత గూరఁగా,—
శూరుఁ డపుడు ధైర్యమనను సొంపునింపు గల్గునట్లు
వారిఁ జూచి పలుకసాగె పరుస నిట్లనీ:—
అగును నింతమాత్రాన యతివ యెట్లు లభ్యమగును?
పగఱ యున్నవిధముఁ జెప్పె బాలుఁ డీతఁడూ,
అచటుఁ జేర రథముఁ జేసె యల్లవిజ్ఞానీ నిజము,
అచల మగును నాదు హక్కు అరసి చూచినా:
అసురజాడ జెప్ప నేమి? యరదము సృష్టింప నేమి?
కసిమసంగి యతనిఁ జంప ఘనుఁడు లేనిచో?
మాన మొక్కలెక్కఁగొనక ప్రాణముపై నాసవీడి
నేను పోరి తెచ్చితి నీ నెలఁతి నిజ మిది:

కాన కాంత నాదుసొత్తు కాసంత ధర్మపథము
పూని యోచించి చెపుఁడు బుద్ధిమంతులూ.
—ఆటలాడి అలసినావు.

శూరునివాదము అందఱకు నచ్చినదో లేదో? కాని మూలమునందు వీరివివాదమునకు బదులు చెప్పలేక విభ్రాంతుఁ డైనట్లు లున్నది. తెలుఁగుపాటయం దన్ననో, ఒక్క-హరిస్వామి మాత్రమే గాక యింతవఱకును ధర్మపన్నాలఁ జదివి తీర్పులుసాయించిన మధ్యవర్తులుకూడ, ఊరకున్నారు. గాలివాన వచ్చినది కథ కట్టిం దనునట్లు మనకథమాత్రమే గాక పాటకూడ ఇంతతో కట్టువడుచున్నది. చివర ఎట్లు ముగియుచున్నదో చెప్పుమందురా? ఇదిగో వినుండు:—

కాంత ధర్మపథమునుండి కాసంత దొలఁగకుండ
చింతఁజేసి యెవరి దగునో? చెప్పు వేగమే;
జ్ఞాని విజ్ఞాని శూర ఘనులు మువురిలోన నెవ్వఁ
డాయింతి మగఁ డౌనో యమ్మ చెప్పుమీ?

ఆటలాడి అలసినావు
పాట పాడి బడలినావు
యుక్తిపాటలోని ప్ర
త్యుక్తి సెప్పవే?

సింహావలోకనము:— ఈ పాటకు సంబంధించినంతవఱకుసంస్కృతకథామూలమును, కళాప్రపూర్ణులవారి ఆంధ్రానువాదమును నిచ్చితిని. వీనివలన చదువరులు చదువుసాములురాని పామరుల వాఙ్మయమునందు సైతము ఎట్టి రత్నములు గలవో పోల్చుకొందురుగాక. రత్నములును, జాలును ఆకరోద్భవములే యైనను ప్రయత్నవిశేషమునఁ గాని శోభింపఁజాలవు రత్నములు కనుక విద్వద్విమర్శకులు ఈ వాఙ్మయమునెడ ననాదరము వీడి విమర్శించి ప్రకాశత నొసంగుట వారికి ధర్మము. తక్కినవి వారియిచ్ఛాధీనములు. వివరణమునను, విమర్శనను గల యనౌచిత్యాసంభవములు నావిగనే భావింపఁదగును. రచయితవి ఎంతమాత్రమూ కావు.

# నారాయణ నవరత్నములు

మంగిపూడి వేంకటశర్మగారు

౧

సిరులన్ మించినవాడటంచు బహుదాసీదాసవర్గంబులన్
గరులన్ గల్గినవాడటంచు బహుభోగాఢ్యుండటంచున్ మహా
హరులన్ గల్గినవాడటంచు నధికారారూఢుడంచున్ సదా
నరులన్ నమ్మెదవేల వెఱ్ఱిమనసా! నారాయణున్ నమ్ముమా!

౨

సిరులన్ జేకుర జేతురో విభవముల్ సిద్ధింపగా జేతురో
పరమారోగ్యము సంఘటింతురో జరావ్యాధుల్ నివారింతురో
పరిపూర్ణాయువు గల్గజేయుదురో దంభప్రజ్ఞలే గాని యీ
నరులన్ నమ్మెదవేల వెఱ్ఱిమనసా! నారాయణున్ నమ్ముమా!

౩

సిరిమంతుల్ సిరులిచ్చినన్ నిలుచునే శ్రీమంతు లొక్కప్డు దు
ర్భరదారిద్ర్యదశావశాత్ము లగుచున్ రారాని దుఃఖంబులన్
దురపాయంబుల జిక్కి స్రుక్కులాటలు నెందున్ జూడమే మూఢతన్
నరులన్ నమ్మెదవేల వెఱ్ఱిమనసా! నారాయణున్ నమ్ముమా!

౪

సిరు లేలేశమొ యివ్వనేర్చు నవి రక్షింపంగ దానేర్చునే
సిరులన్ నిల్పగనేర్చుగాక నరుడా శ్రేయంబు లీనేర్చునే
స్మరణీయుండితరుండు లేడు హరియే సర్వార్థసంధాత యీ
నరులన్ నమ్మెదవేల వెఱ్ఱిమనసా! నారాయణున్ నమ్ముమా!

౫

కరుణాసాగరు డార్తబంధుడు జగత్కల్యాణసంధాత సం
స్మరణాంభోనిధి నౌక సాధుజనహృత్పద్మ సంవాసి దు

ర్భర సంసారహారుండు భక్తసుమనోవాంఛాప్రదుండుండఁగా
నరులఁ నమ్మెదవేల వెర్రిమనసా! నారాయణుఁ నమ్ముమా!

౬

దురహంకారులు గర్వచిత్తులు సదా దోషైకదృక్కుల్ మహా
దురితాచారపరాయణుల్ చపలచిత్తుల్ మత్తులుఁ ధూర్తులుఁ
పరమార్థప్రతికూలవర్తనులు లోభగ్రస్తు లాశాపరుల్
నరులఁ నమ్మెదవేల వెర్రిమనసా! నారాయణుఁ నమ్ముమా!

౭

కరుణాదూరులు వంచనాపరులు శుష్కాతిప్రియాలాపకుల్
పరవిద్యాబల విత్తవృద్ధులు సహింపఁ లేని నీచాత్మకుల్
పరదాక్షిణ్యపరోపకారరహితుల్ స్వార్థప్రియుల్ మత్సరుల్
నరులఁ నమ్మెదవేల వెర్రిమనసా! నారాయణుఁ నమ్ముమా!

౮

నరు లెవ్వారును సర్వసంపదలతో నానాధికారాలతో
నరస ప్రజ్ఞలతో మహామహిమతో జనొందిరేనిఁ పరా
త్పరునిఁ గూరిచి వారుచేసిన సుపూజాలబ్ధముల్ సర్వముఁ
నరులఁ నమ్మెదవేల వెర్రిమనసా! నారాయణుఁ నమ్ముమా!

౯

దొరలఁ దిట్టి సమర్థుడుఁ సరసుడుఁ దూరార్థసందర్శియుఁ
పరదాక్షిణ్యుడు స్వాశ్రితావనమహాప్రావీణ్యుడుఁ పుణ్యుడుఁ
దొరకంజాలడు సుమ్ము ముజ్జగములందుఁ నమ్ము నామాట నీ
నరులఁ నమ్మెదవేల వెర్రిమనసా! నారాయణుఁ నమ్ముమా!

---

# *మయూర మహాకవి

ఆకుండి వేంకటశాస్త్రిగారు

మయూరుఁడు గీర్వాణసారస్వతాకాశమున గాళిదాస భవభూత్యాదిమహాకవినక్షత్రగణంబున స్వీయప్రభతో విరాజిల్లుచున్నాఁడు. ఈతని సంస్కృతకవిత్వము మృదుమధురమైనది. భక్తజనాహ్లాదకరమైనది.

ఇతఁడు క్రీస్తు చనిపోయిన తరువాత, యేడవశతాబ్దిపూర్వార్ధముననున్నట్లు చారిత్రపరిశోధకులు నిర్ణయించుచున్నారు. ఈతని జన్మస్థలముఁగూర్చిగాని, బాల్యమునుగూర్చిగాని తెలిసికొనుటకు చారిత్రాధారములు కాన్పింపవు. కాని యితఁడు 'జాంగలికుఁ' డని పేర్కొనబడియున్నాఁడు. జాంగలికుఁ డనగా విషవైద్యుఁడు. ఇతఁడు సర్పదష్టులగువారిని మంత్రములచేతను ఓషధులచేతను, ప్రాణహానిరాకుండ యెట్టి సర్పవిషములనైన నాశమొనర్పఁగల భిషగ్వరుఁడై ప్రసిద్ధివడసెను.

ఇతఁడు, నాగానందము, ప్రియదర్శిక, రత్నావళి యను ప్రసిద్ధము లగు సంస్కృత నాటకములను రచించిన శ్రీహర్షుని యాస్థానమందుండెను. భట్టబాణుఁడును హర్షుని యాస్థానమందే యుండెను.

ఈతని సంస్కృతకవితాప్రాగల్భ్య మొకప్పుడీతఁడు వారణాసీపురమున నొక విద్వత్సభలోఁ దారచించిన శ్లోకములను జదువ సభికుల సమ్మోదమును బడసి మెప్పుఁ గనెను. క్రమముగ నీతని గీర్వాణకవితాధోరణిని గూర్చియు, నిరర్గళపాండిత్యమును గూర్చియు శ్రీహర్ష నృపాలునకు కర్ణాకర్ణిగా తెలియ రాగా, నాతఁడు మయూరునిఁ దన యాస్థానమునకు రావించి, యాతనిని గారవించి తన యాస్థానవిద్వాంసునిగా నిలిపెను. అంతకుఁ బూర్వము హర్షుని యాస్థానమున బాణుఁడు గీర్వాణకవిత్వమున వన్నెయు వాసియుఁ గాంచి యుండెను. కాని మయూరుఁడు సంస్కృతకవిత్వమున బాణుని ప్రతిస్పర్ధి యయ్యెను. శ్రీహర్షుఁ డొసఁగిన సమస్యాశ్లోకముల నొకరిని మించున ట్లొకరు సముచితముగ పూరించి రాజును మెప్పించుచుండిరి. కొంత కాలమైన తరువాత నీకవితల్లజులకు బాంధవ్యమేర్పడెను. మయూరుని సోదరియో, కుమార్తెయో బాణుని కీయబడి వివాహము గావింపఁబడెను. ఇట్టి బాంధవ్య ముండినను కవిత్వరచనమునం దొండొరులు ప్రతిస్పర్థు లగుట మనస్పర్ధలు హెచ్చెను. కవిపోషకుఁడగు శ్రీహర్షుఁడు రసగ్రహణపారీణుఁ డగుట నీ కవిద్వయమున సామరస్యమును గల్గించుచు వచ్చెడివాఁడు.

---

* "Sanskrit Poems of Mayura" by George Payn Quackenbos A. M. Ph. D. Published by Columbia University, New York. (America). Indo - Iranian Series, Volume. 9.

మయూరుని కుటుంబజీవనమును గూర్చి చారిత్రకాధారము లేమియు లభింపకపోయినను శంకుకుఁడను కుమారుఁ డొక డుండినట్లు తెలియుచున్నది.

ఒకానొకప్పుడు కాశీలో జరిగిన విద్వద్విషయక వివాదమునందు మయూరుఁడు తీవ్ర చర్చసలిపి యందు జయముగాంచి యచటి పండితులచే మిగుల బహూకరింపఁబడెను.

బాణుఁడు రచించిన చండీశతకమునందలి కవితాశైలియు, ధారయు, మయూరుఁడు రచించిన సూర్యశతకమునందలి కవితావైభవము నొకదాని కొకటి తీసిపోకయుండును.

మయూరుని తరువాత సంస్కృతకవులు తమకావ్యములందు మయూరుని మహాకవిగాఁ బేర్కొని శ్లాఘించియుండిరి. ఇతని సమకాలికుఁడైన బాణుఁడు తన 'హర్ష చరిత్ర'మున హర్షుని బాల్యస్నేహితులను కొందఱినిఁ బేర్కొనుచు, వారిలో జాంగలికమయూరకు డను నొకడున్నట్లు తెలుపుచున్నాడు.

కల్హణుఁడు తన "సూక్తి ముక్తావళి"లో మయూరునిగూర్చి యిట్లు వ్రాసెను:

శ్లో. దర్పం కవిభుజంగానామ్,
గతశ్రవణ గోచరమ్,
విషవిద్యేవ మాయూరీ,
మాయూరీవా, నిక్రృంతతి.

మయూరుని సూర్యశతకముపై వ్యాఖ్యను రచించిన జయమంగళు డనునతఁడు మయూరుని గుఱించి యిట్లు వ్రాసెను:

శ్లో. భక్తా మయూరవక్త్రాబ్జ
పదవిన్యాసశాలినీ ।
నర్తకీవ పరీనర్తి
సభామధ్యే సరస్వతీ.

హర్షుని రాజ్యకాలమునాటికి బౌద్ధమతము క్షీణింపనారంభించినను, హర్షుని రాజ్యమున నధికముగ వ్యాప్తినొందియే యుండెను.

మయూరుఁడు జైనమతస్థుఁడు కాఁడు. ఇతఁడు సూర్యోపాసకుఁడు, సూర్యభక్తుఁడు. హర్షునికాలమున జను లనేకులు సూర్యునిఁ బ్రత్యక్షదైవముగ నమ్మి సూర్యభగవానుని విగ్రహరూపమును ప్రతిష్ఠించి పూజించుచుండిరి. శ్రీహర్షుని రాజ్యకాలమున చైనాదేశము నుండి వచ్చిన "హ్యుయాన్‌త్సాన్" హర్షుని ప్రధాననగరమునకు వచ్చి యచ్చట తాను చూచిన విషయముల నొక గ్రంథమున వ్రాసెను.

శ్రీహర్షుఁడు ప్రయాగలో నొక మత సంబంధమైన యుత్సవమును జేయించెను. యా యుత్సవకాలమునందు బుద్ధుని ప్రతిమ యొకదినమునను, సూర్యవిగ్రహ మొకదినమునను, శివునివిగ్రహ మొకదినమునను ప్రాధాన్యముగఁ బూజింపఁబడెను. ఇందువలన సూర్యోపాసకు లనువా రొకమతమువారుగ హర్షుని కాలమున నుండిరని తెలియుచున్నది. అట్టి సూర్యోపాసకులలో మయూరుఁ డొక భక్తాగ్రేసరుఁడని చెప్పవలసియున్నది.

మయూరుఁడు ధారానగరమును రాజధానిగాఁ జేసికొని రాజ్యమేలిన భోజుని యాస్థానమం దుండెనని జైనచరిత్రకారులు వ్రాసియున్నారు. ఇది సత్యము గాదు. ఏలయన, భోజుఁడు పదునొకండవశతాబ్దివాఁడు, హర్షుఁడన్ననో యేడవశతాబ్ది పూర్వభాగమందలివాఁడు, మయూరుఁడును ఏడవశతాబ్దిపూర్వభాగమునం దున్నట్లు చరిత్రాధారములు కాన్పించుచున్నవి. జైనచరిత్రకారులు హర్షునికి బదులు భోజుఁడని మార్చి కథలు వ్రాసియున్నారు.

మయూరుఁడు వ్రాసిన గ్రంథములలో సూర్యశతక మొక్కటిదక్క మరొండు గ్రంథమేదియు చారిత్రకపరిశోధకులు లేదనుచున్నారు. శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు తమ "సంస్కృతకవిజీవితముల"ను గ్రంథములో మయూరుఁడు సూర్యశతక మొక్కటియేగాని మరి యేయితర గ్రంథములును రచించియున్నట్లు పేర్కొనియుండలేదు. కొలంబియా యూనివర్సిటీవారు ప్రకటించిన 'మయూరుని సంస్కృత గ్రంథముల'ను గ్రంథమున మయూరునివని నిర్ధరించుటకు తగిన యనేకములగు చాటుశ్లోకములు సేకరింపఁబడి యున్నవి. అట్టివానిలో "మయూరాష్టకము" అనునది యొకటి.

మయూరునికి శ్వేతకుష్ఠరోగము కలుగుటకు కారణముగా నొక గాథ చెప్పబడినది. ఆ రోగనివృత్తికై మయూరుఁడు

శ్లో. హుతాశనా ద్ద్యుతి మిచ్ఛేత్
జ్ఞానమిచ్ఛేత్ మహేశ్వరాత్
ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్
మోక్షమిచ్ఛే జ్జనార్దనాత్.

అనునట్లు తన కారోగ్యము భాస్కరునివలననే కలుగగలదను పూర్ణవిశ్వాసము కలవాఁడగుటచే సూర్యుని నూరుశ్లోకములలో నభివర్ణించెననియు, నానూరుశ్లోకములే సూర్యశతక మనియు ప్రతీతి.

బాణునిభార్య మయూరుని కుమార్తెయో, సోదరియో, యైయున్నది. మయూరుఁడు కొండొకతఱి పరదేశ మేగి కొన్ని సంవత్సరములు గడచినపిమ్మట స్వదేశమునకు వచ్చెను. బాణునిభార్య యాతనికంట బడెను. కాని యాతఁ డామెను తన సోదరిగ (కుమార్తెనుగాగాని) గుర్తింపనేఱక యామె నొక పరవిలాసవతిగాఁ దలచి యామె నొకకాముకునిఁ బోలె వర్ణింప మొదలిడెను.

శ్లో. ఏణీదృశః పాణిపుటే నిరుద్ధ
వేణీ విరేజే శయనోత్థితాయాః,
సరోజకోశాదివ నిస్సరంతీ
శ్రేణీ ఘనీభూయ మధువ్రతానాం.

మయూరుఁడు తనకు తండ్రియయ్యు, లేక సోదరుఁడయ్యు తన్నిట్లు వర్ణించినందులకామె కడు కినిసి మయూరుని "శ్వేతకుష్ఠరోగపీడితుఁడవు కమ్మ"ని శపించెను. తదనుగుణంబుగ నతనిపూర్వజన్మకృతమగు కర్మగూడఁ ననుభవింపదగు కాల మాసన్నమాయెను. శాపవశంబున నతఁడు శ్వేతకుష్ఠరోగపీడితుఁడై కడు బాధపడుచు బాగుగ యోచించి శతవల్లీనిర్మిత

మును, తాళవృక్షశిరము నుండి వ్రేలునట్టియు ఉట్లికయందుపవిష్టుండై సూర్యభగవానుని గూర్చి నూరుశ్లోకములతో స్తుతించెను. ఒక్కొక్క శ్లోకమును చదువుచు నొక్కొక్క తీగను ఛేదించుచుండెను. ఇట్లు నూఱుతీగలను ఛేదించునప్పటి కతనివ్యాధి నిర్మూలమయ్యెను.

మయూరుఁడు రచించిన "మయూరాష్టక" శ్లోకము లొకభూర్జపత్రముపై నాగరలిపిలో వ్రాయబడెను. ఈభూర్జపత్రపు వ్రాతప్రతిని ౧౯౦౮ వ సంవత్సరమున మార్క్ ఆరెల్ స్టీన్ (Marc Aurel Stein) అనుదొర కాశ్మీరదేశములో శ్రీనగరమున, కొన్ని భూర్జపత్రపు వ్రాతప్రతులతో కూడ కొనెను. అందిది గలదు. ఈభూర్జపత్రపు వ్రాతప్రతి సప్తర్షి శకము, లౌకిక సంవత్సరము ౘ౭ జూలియన్ కాలెండరు ప్రకారము ఆగస్టు ౧౩ వ తేది, ౧౬౧౧ సం. నాటిదని తెలియుచున్నది.

ఈభూర్జపత్రము అమెరికాలో టుబిన్జన్ యూనివర్సిటీలైబ్రరీ(Tubingen University Library) లో నున్నది. ఈ భూర్జపత్రములోని శ్లోకములను యింగ్లీషులిపిలో తనగ్రంథమున జార్జిపెయిన్ క్వాకెన్ బాస్ దొరగారు సంస్కృతసారస్వతప్రియులకు సమర్పించిరి.

"మయూరాష్టక" శ్లోకములు

౧. యాసా ప్రస్తుతానాం

ప్రచలితనయనా హంసలీలా వ్రజంతీ
ద్వాభ్యాం హస్తాభ్యాం కుంకుమార్ద్రాం
కనకవిరచితా........
......నేగతాసా
బహుకుసుమయుతా బద్ధవీణా హసంతీ
తాంబూలం వామహస్తే
మదనవశగతా గృహ్యాశాలాం ప్రవిష్టా.

౨. యాసా కాభుక్తముక్తా
ప్రచలితనయనా స్వేద లగ్నాంగవస్త్రా
ప్రత్యూషే యాతి బాలా
మృగఇవచకితా సర్వత శ్శంకయంతీ.
కేనేదం వక్త్రపద్మం
స్ఫురదధరరసం, షట్పదేనైవ పీతం
స్వర్గః కేనాఽద్యభుక్తో
హరనయనహతో మన్మథఃకస్యతుష్టః.

3. యాసా కా స్తనపీనభారకఠినా,
మధ్యే దరిద్రావతీ
విభ్రాంతా హరిణీ విలోలనయనా
సంత్రస్తయూథోద్గతా
అంతఃస్వేదగజేంద్రగండగళితా
సంలీలయా గచ్ఛతీ
దృష్ట్వా రూప మిదం ప్రియాంగగహానం
వృద్ధోఽపి కామాయతే.

౪. వామేనాఽఽవిష్టయంతీ
ప్రవిరళకుసుమం కేశభారం కరేణ
ప్రభ్రష్టం చోత్తరీయం
రతిపతితగుణా మేఖలాం దక్షిణేన
తాంబూలం చోద్వహంతీ
వికసితవదనా ముక్తకేశానురాగా
నిష్క్రాంతా గృహ్యదేశాత్
మదనవశగతా మారుతం ప్రార్థయంతీ.



నేనూ వడుకుతూన్నా

ఛాయాచిత్రకారుడు: శ్రీ యం. కే. రంగస్వామయ్యంగారు, చెన్నపురి.

# ఆకస్మిక ఛాయాచిత్రములు

(SNAP SHOTS)



కాకినాడ కాలువ-పడవల రేవు

ఛాయాచిత్రకారుడు: శ్రీ యం. కే. రంగస్వామయ్యంగారు, చెన్నపురి.

౫. యాసా కా నవయౌవనా శశిముఖీ
　　కాంతాఽఽపతీగచ్ఛతీ
　నిద్రావ్యాకులితా, విఘూర్ణ నయనా
　　సంపక్వబింబాధరా
　కేశై ర్వ్యాకులితా నఖై ర్విదళితా
　　దంతైశ్చ ఖండీకృతా
　కేనేదం రతిర్భాతు సేన రమితా
　　శార్దూలవిక్రీడితా.

౬. యాసా కా పరిపూర్ణచంద్రవదనా
　　గౌరీమృగాక్షోభినీ
　లీలామత్తగజేంద్ర హంసగమనా
　　... ... ... ...
　నిశ్వాసాధరగంధశీతలముఖీ
　　వాచామృదూల్లాసినీ
　సశ్లాఘ్యః పురుషః సజీవతివరో
　　యాస్యాత్ప్రియా హీదృశీ.

౭. యాసా కాజఘనస్థలీ సులలితా
　　ప్రోన్మత్తకామాధికా
　భ్రూభంగం కుటిలం త్వనంగధనుషః
　　ప్రఖ్యం ప్రభాచంద్రవత్
　రాకాచంద్రకపోలపంకజముఖీ
　　క్షామోదరీ సుందరీ
　వీణాదండమిదం విభాతి తులితం
　　వేల్లద్భుజం గచ్ఛతి.

౮. యాసా కా రతిహావభావ విలస
　　చ్చంద్రాననం బిభ్రతీ
　గాత్రం చంపకదామ గౌరసదృశం
　　పీనస్తనా లంబితా
　పద్భ్యాం సంచరతీ ప్రగల్భ హారిణీ
　　సంలీలయా స్వేచ్ఛయా
　కించైషా గగనాంగనా భువితలే
　　సంపాదితా బ్రాహ్మణా.

---

## నా ప్రభూ!

పురిపండా అప్పలస్వామి గారు

నా ప్రభూ! నీపథాన సంధ్యా ప్రసూన
మై పొరలుం నాశిరాన త్వ దంఘ్రి కార
జోలహామూల్య భాగ్యమ్మె సోక దేమొ!
ఇట రజనిగాడ్పులపుడే క్రమించెనోయి!
శ్రీచరణనూపు రారవా శ్లేషమునకు
దాచుకొనిన చివరియూర్పు తలగునేమొ
దాచుకొనిన చిరుదళాల్పు సడలు నేమొ,

ఆపలేనోయి ఈపవనాతిరేక
మీరజనిలోహపద దళనైకభరము.
ధూళినై పొగనై తూలితూలి ఈమ
లీమసపు దారులందె జీర్ణింతు నేను
ఈవు నాస్వామి ఏచిహ్న మేని కనక
కడచిపోదువు వెలుగుమార్గాల నడచి.

---

# సంస్కృతవర్ణ సమామ్నాయము

శ్రీ పరవస్తు వేంకట రామానుజస్వామి గారు, యం. ఏ.

(౨ సంపుటము ౧ సంచిక తరువాయి)

౧౬. హల్లులకు వ్యంజనము లని పేరు. 'వ్యంజయంతి (ప్రకటాన్ కుర్వంతి) అర్థానితి వ్యంజనాని' అని ప్రాతిశాఖ్యలలో జెప్పబడి యున్నది. హల్లులచేతనే మనుజు డుచ్చరించు ధ్వనులు వ్యక్తము లనుపించుకొనుచున్నవి. హల్లులే మనుజుల కసాధారణధ్వనులుగా నున్నవి. హల్లులచేతనే పదము లర్థవత్తు లగుచున్నవి. స్పర్శలనియు, అంతస్థలనియు, ఊష్మలనియు నివి మూడు విధములుగా విభజింపబడి యున్నవి. స్పర్శల యుచ్చారణమున వర్ణోత్పాదకావయవముల కేదో యొక స్థలమున బూర్తియగు స్పర్శయుండును. ఇట్టి స్పర్శ లేక పోవుటచే బ్రతిబంధకము లేక బలముతో నిశ్శ్వాసము పైకి పోవునప్పుడు జన్మించిన వర్ణము లూష్మలని వ్యవహరింపబడుచున్నవి. నిశ్శ్వాసమునకును వర్ణోత్పాదకావయవములకును సంభవించిన సంఘట్టముచే నీవర్ణములు జన్మించుచున్నవి. ఈషత్స్పర్శకలిగి, యందుచే దృఢస్పర్శగల స్పర్శలకును వివృతము లగు నచ్చులకుగాని యూష్మలకుగాని యుచ్చారణమున మధ్యముగ నుండు వర్ణము లంతస్థములని వ్యవహరింపబడుచున్నవి.

మఱల హల్లులను స్పర్శాదుల స్థానభేదములచే కంఠ్యములనియు, తాలవ్యములనియు, మూర్ధన్యములనియు, దంత్యములనియు నోష్ఠ్యములనియు, నైదువిధములుగా విభాగము చేయవచ్చును. స్పర్శలిట్లయిదు వర్గలుగా విభజింపబడియున్నవి. ప్రతివర్గయందును రెండఘోషములును, రెండుఘోషవత్తులును, నొక యనునాసికము (ఘోషవత్తును)ను నుండును. అఘోషముల నుచ్చరించునప్పుడు కంఠము వివృతముగాను, ఘోషవత్తుల నుచ్చరించునప్పుడు సంవృతముగాను నుండునని యిదివరలోనే చెప్పబడినది. వర్గప్రథమతృతీయవర్ణములు లల్పప్రాణములుగాను, ద్వితీయచతుర్థములు మహాప్రాణములుగాను నుచ్చరింపబడుచున్నవి. ప్రాతిశాఖ్యలలో వర్గద్వితీయచతుర్థవర్ణములు సోష్మలని చెప్పబడియున్నది. అనగా నల్పప్రాణముల కవ్యవహితముగా హకారమును జేర్చి యుచ్చరించినచో మహాప్రాణవర్ణము లేర్పడునని తాత్పర్యము కావచ్చును.

(చూ పేరా ౧౩). ఘోషవత్తు లగు నల్పప్రాణములకే హకారము చేర్చి యుచ్చరించుటయు, నఘోషములకు దత్తత్స్థానీయము లగు నూష్మలను జేర్చి యుచ్చరించుటయు సోష్మలను పదమునకు దాత్పర్యమని కొందఱి యభిప్రాయము. అట్లయినచో నఘోషము లగు మహాప్రాణములకును, ఘోషవత్తు లగు మహాప్రాణములకును స్వరూపభేద మేర్పడును మఱియు భకారఠకారథకారములు చ్యకారట్షకారత్సకారములకు సమానము లగును. ఘోషవత్తు లగు మహాప్రాణవర్ణములు ప్రాచీనములైనవనియు, అఘోషము లగు మహాప్రాణములు క్రొత్తగా సంస్కృతమున ప్రారంభమైన వనియు భాషాశాస్త్రజ్ఞుల యభిప్రాయము. అనునాసికములు ముఖనాసికలు రెండింటివల్లను బుట్టుచున్నవి. స్పర్శల నుచ్చరించునప్పుడుండురీతిని ముఖావయవములనుండి నాదయుక్తమగు నిశ్శ్వాసమును నాసామార్గమున వదలినచో తత్తత్స్థానీయము లగు ననునాసికవర్ణము లేర్పడును. కావుననే 'ముఖనాసికావచనోఽనునాసికః' అని మనవారు చెప్పియున్నారు.

౧౭. కవర్గము.—జిహ్వామూలమునకును, మృదుతాలువునకును గలిగిన స్పర్శను శ్వాసము భేదించునప్పుడీవర్ణములు జన్మించుచున్నవి. కావుననే ప్రాతిశాఖ్యలలో నివి జిహ్వామూలీయము లని చెప్పబడియున్నది.

వ్యాకరణమున వీనికి కంఠము స్థానమని చెప్పబడియున్నది. సంస్కృతములోని కంఠ్యములు 'ఇండో-యూరపియన్' మాతృభాషల్లోని కంఠ్యములలో నేకదేశములని చెప్పవచ్చును. మాతృభాషలోని కంఠ్యములు సంస్కృతమున వర్ణాంతరములలోనికిగూడ మారియున్నవి. (చూ. పేరాలు ౧౮, ౧౯, ౨౪).

'ఇం.-యూ.' k: సం. కతరః 'ఎవరు,' గ్రీ. poteros, koteros, గా. hwathar.— సం యకృత్ (*యాకృత్) 'పిత్తాశయము,' గ్రీ ēpar, లా. jecur.— సం. కర్కః, కర్కటః, 'ఎండ్రకాయ,' గ్రీ. karkinos, లా. cancer.

ఖకారమునకు నిశ్చయమైన యుదాహరణములు లేవు. ఈ క్రింది యుదాహరణములలోని ఖకారము ప్రాచీనమువలె గనబడుచున్నది. సం. శఙ్ఖః 'శంఖము,' గ్రీ. kogchos, లా. congius.—సం. స్ఖలామి, 'జారిపడుచున్నాను,' గ్రీ. sphallō. ఈ క్రింది సంస్కృత పదముల 'ఇరేనియన్' భాషారూపములలో గూడ ఖకారమగపడుచున్నది. సం. ఖరః 'గాడిద,' అ. khara.— సం. ఖాః 'నూయి,' అ. khāo.—సం. సఖా 'స్నేహితుడు,' అ. hakha. సంస్కృతకుంభశబ్దపు అవెస్తా భాషారూపము (khumba) న ఖకారముండుటను సంస్కృతమున ఖకారము కకారములోనికి మారినదని యంగీకరింపవలసియున్నది. ఉచ్చారణసౌకర్యార్థ మీ మార్పు కలిగియుండవచ్చును.

'ఇం.-యూ.' g: సం. గౌః 'ఆవు,' గ్రీ. bous, లా. bōs, ప్రా. 'హై. జ.' chuo.—సం. గతః 'వెళ్లిన,' గ్రీ. batos, లా.-ventus.—సం. యుగమ్ 'కాడి, యుగము,' గ్రీ. zugon, లా. jugum, గా. juk.—సం. గురుః 'బరువైన,' గ్రీ. barus, లా. gravis, గా. kaurus.

'ఇం.-యూ.' gh: సం. ఘనః 'దట్టమైన,' గ్రీ. phonos, ప్రా. 'హై. జ.' gundea.—సం. దీర్ఘః 'పొడవైన,' గ్రీ. dolichos.—సం. స్తిఘ్నుతే, 'ఎక్కుచున్నాడు,' గ్రీ. *steichō*, గా. *steiga*.

గృధ్యామి అను సంస్కృతపదమున దీని భాషాంతరీయ రూపములను (గా gredus) బట్టిచూడగా ప్రథమాక్షర ముచ్చారణ సౌకర్యార్థ మల్పప్రాణముగా మారిన ట్లగపడుచున్నది.

'ఇం.-యూ.' ṇ: ఈవర్ణము 'ఇండో-యూరపియన్' మాతృభాషలో సామాన్యముగా గంఠ్యవర్ణమునకు పూర్వమే నిలుచుచుండెను. ఉ. సం. అఙ్కః 'ఒడి,' గ్రీ. ogkos, లా. uncus, గా. hals-agga.— సం. భఙ్గః 'కెరటము,' లి. banga.

౧౮. పై యుదాహరణములందు సంస్కృతపదములలోని కంఠ్యాక్షరస్థానమున భాషాంతరీయపదములలో గొన్నిటిలో గంఠ్యములును, మఱికొన్నిటిలో దంత్యములును, నోష్ఠ్యములును గనబడుచున్నవి. ఈభేదమునకు భాషాశాస్త్రజ్ఞు లీక్రిందివిధముగా నుపపత్తిని జెప్పియున్నారు. 'ఇండో-యూరపియన్' మాతృభాషలో గంఠ్యవర్గమేగాక కంఠోష్ఠ్యవర్గము మఱియొకటి యుండెను. కంఠ్యవర్గ మన్నిభాషలలోను గంఠ్యముగానే నిలిచియున్నది. కంఠోష్ఠ్యవర్గము 'ఆర్యన్', 'అమీనియన్', 'అల్బేనియన్', 'బాల్టో-స్లెవోనిక్' శాఖాభాషలలో శుద్ధము కంఠ్యములలోనికి మారెను. మిగిలినశాఖలలో కొన్నిసందర్భములలో దంత్యములుగాను, మఱికొన్నిసందర్భములలో నోష్ఠ్యములుగాను బరిణమించినది. సంస్కృతమున మాతృభాషలోని కంఠ్యకంఠోష్ఠ్యవర్గములు రెండును కంఠ్యములుగానే యుండుటచే నారెండువర్గములకును భేదమును బైని చూపియుండలేదు. మాతృభాషలోని తాలవ్యవర్గముకూడ కంఠోష్ఠ్యవర్గము మార్పు ననుసరించి ద్వివిధముగా విపరిణామమును బొందినది. మాతృభాషలోని కంఠోష్ఠ్యవర్గము శుద్ధకంఠ్యములలోనికి మార్పునుజెందిన శాఖలలో మాతృభాషలోని తాలవ్యవర్గ మూష్మలలోనికి మారినది. కంఠోష్ఠ్యవర్గము దంత్యములలోనికిని, ఓష్ఠ్యములలోనికిని మార్పును జెందిన శాఖలలో తాలవ్యవర్గము కంఠ్యములలోనికి మారినది, ఉదాహరణములు:

'ఇం.-యూ' k(తాలవ్యము): సం. శతమ్ 'నూరు' గ్రీ. ekaton, లా. centum. గా. hund, లి. szimtas.—సం. శ్వా 'శునకము,' గ్రీ. kuon, గా. hunds. లి. szu.—సం. శ్వశురః 'మామగారు,' గ్రీ. ekuros, లా. socer, గా. swaihra, లి. szeszuras; సం. శ్వశ్రూః (స్త్రీ లిం.), లా. socrus, గ్రీ. ekura ప్రా. స్లై. svekry.—సం. అశ్రు 'కన్నీరు,' గ్రీ. dakru, లా. lacruma, గా. tagr, లి. aszara.

'ఇం-యూ.' g (తాలవ్యము): ఈ వర్ణము 'ఆర్యన్' మూలభాషలో నాదయుక్తమగు శవర్ణము లోనికి మారినది. సంస్కృతమున నీవర్ణము జకారముగా పరిణమించినది. సం. జాను 'మోకాలు' గ్రీ. gonu, లా. genu, అ. zanva.—సం. జ్ఞాతః 'తెలిసిన' గ్రీ. gnotos, లా. notus (లి. zinoti, ప్రా. స్లై. znati).—వై. జః 'కులము', గ్రీ. genos, లా. genus (అ. zan).—సం. మృజామి 'తుడుచు చున్నాను,' గ్రీ. amelgo, లా. mulgeo, ప్రా. హై. జ. milchu, లి. mulzu ప్రా. స్లై. mluza.

'ఇం.-యూ.' gh (తాలవ్యము): ఈ వర్ణము 'ఆర్యన్' మూలభాషలో ఘోషవంతమగునట్టియు, మహాప్రాణమగునట్టియు నూష్మములోనికి మారినది. సంస్కృతమున నీవర్ణము ఘకారద్వారమున హకారముగా పరిణమించినది. ఘకారానస్థ ఉజ్ఝిత (= ఉద్ + ఝిత, చూ. జహామి) శబ్దమున నగపడుచున్నది. ఉజ్ఝామి అను రూపమీశబ్దము ననుసరించియే యేర్పడినది. వై. హేమ 'శీతకాలము,' గ్రీ. cheima, cheimon లి. zema, ప్రా. స్లై. zima.—సం. హంసః 'హంసము,' గ్రీ. chen, లా. anser, ప్రా. హై. జ. gans, లి. zasis.—సం. లేహ్మి 'నాకుచున్నాను'. గ్రీ. leicho, లా. lingo, లి. leziu ప్రా. స్లై. liza.—సం. బాహుః 'బాహువు,' గ్రీ. pechus, ప్రా. హై. జ. buog, అ. bazu.—సం. వహామి 'మోయుచున్నాను,' లా. veho, గా. wiga, లి. vezu, ప్రా. స్లై. veza.

'ఇం.-యూ.' n (తాలవ్యము): ఈ వర్ణము మాతృభాషలో దాలవ్యవర్గాక్షరములకు బూర్వమే నిలుచుచుండెను. మాతృభాషలోని తాలవ్యవర్ణ మూష్మ లోనికి మారినపు డీవర్ణ మనుస్వారములోనికి మారుచుండెడిది లేనిచో నట్లే నిలచియుండెడిది. సం. ఆనశ్మి 'పొందితిని,' అంశః 'భాగము,' గ్రీ. enegkon enenocha లా. nanciscor.—వై. అంహః 'క్లేశము,' లా. angustus, గ్రీ. agcho.

ఇట్టు 'ఇ. డో.-యూరపియన్' కుటుంబములో మాతృభాషలోని తాలవ్యము లూష్మలలోనికి మారిన భాషలకు 'సతెం' భాషలనియు, కంఠ్యములలోనికి మారిన భాషలకు 'కెంటుం' భాషలనియు వ్యవహారము కలదు.

౫. చవర్గము.- జిహ్వామధ్యభాగమునకును గటిన తాలువునకును గలిగిన స్పర్శను శ్వాసము భేదించునపు డీవర్ణము లుత్పన్నమగుచున్నవి. కావున నివి తాలవ్యము లగుచున్నవి. ఇవి ప్రాచీనములైన వర్ణములు కావు. మాతృభాషలోని కంఠ్యములనుండి యివి సంస్కృతమున నూతనముగా జన్మించినవి. 'ఇండో-యూరపియన్' మాతృభాషలో గంఠ్యములకు దాలవ్యాచ్చులు (ఇ, ఈ, ఎ, ఏ. ఐ) కాని యకారముకాని పరముగా నున్నచో, నాకంఠ్యములు సంస్కృతమున దాలవ్యములలోనికి మారుచున్నవి.

'ఇం.-యూ' k (తాలవ్యాచ్చుకాని యకారముకాని పరమందు గలది): సం. చిద్, గ్రీ. ti, లా. quid.—సం. అపచితిః 'బహుమానము' గ్రీ. apo-tis-is.—సం. శుచిః 'శుభ్రమైన', కాని శుక్రః—సం. చ గ్రీ. te, లా. que.—సం. పఞ్చ 'అయిదు,' గ్రీ. pente, లా. quinque, గా. fimf.—సం. రోచతే 'రుచించుచున్నది,' గ్రీ. leukos, లా. lucet.—సం. చత్వారః 'నాలుగు.' గ్రీ. tettares, గా. fidwor లా. quatuor,—సం. చ్యవతే 'కదలుచున్నాడు.'

'ఇం.-యూ.' kh. మాతృభాషలోని ఖకార కకారములు సకారపూర్వకములగునప్పుడే సంస్కృత

మున భకారములోనికి మారుచుండును. మాతృభాషలోని యూఖకారకకారములు కంఠ్యములా లేక తాలవ్యములా యనువిషయమున భాషాశాస్త్రజ్ఞులలో నభిప్రాయభేదము కలదు. సం. ఛిద్మి 'కోయుచున్నాను,' గ్రీ. schizo, లా. scindo,—సం. గచ్ఛామి 'వెళ్లుచున్నాను.' గ్రీ. basko—సం. ఛాయా 'నీడ,' గ్రీ skia, ప్రా. స్లై. * skeni.

'ఇం.-యూ.' g (తాలవ్యాచ్చుకాని యకారముకాని పరమందు గలది): సం. ఓజః 'బలము,' లా. augeo, గా. aukan, కాని ఉగ్రః 'భయంకరమైన.'—వై. జరతే 'ప్రార్థించుచున్నాను, ప్రా. హై. జ. quirit.

సంస్కృతమున జకారము రెండువిధములుగా నుద్భవించినది. మాతృభాషలోని తాలవ్యవర్గతృతీయవర్ణమును, తాలవ్యాచ్చులు కాని, యకారముకాని పరమందుండు మాతృభాషలోని కంఠ్యవర్గతృతీయవర్ణమును సంస్కృతమున జకారరూపమును బొందినవి. ఈరెండు విధములగు జకారములను మనము భాషాంతరముల సహాయమువలన వేరుచేయవచ్చును. సంస్కృతమున పదాంతమునను దంత్యాది ప్రత్యయములకు బూర్వమునను నీరెండు జకారములకును భేదము కనబడును. మాతృభాషాతాలవ్యజన్యమగు జకారమట్టి సందర్భములలో మూర్ధన్యములోనికిని, కంఠ్యజన్యమగు జకారము కంఠ్యములోనికిని మారును. ఉ॥ యజ్; అయాట్, యష్టా, ఇష్ట—యుజ్; అయోక్, యోక్తా, యుక్త, యుగ్వన్ సంస్కృతము నందలి ప్రతిజకారమునకును నిట్టిస్థితులు సంభవింపకపోవచ్చును. కావున భాషాంతరసహాయము లేక సంస్కృత జకారముల నన్నిటిని నిట్లు విభజన చేయజాలము. ఈ క్రింది మొదటి కక్ష్యలో జేరిన ధాతువులలోని జకారము మాతృభాషలోని తాలవ్యజన్యమనియు రెండవకక్ష్యలో జేరిన ధాతువులలోని జకారము కంఠ్యజన్యమనియు నాయాధాతుప్రయుక్తములగు రూపములను బట్టి చెప్పగలము.

౧ వ కక్ష్య.—యజ్, భ్రజ్, వ్రజ్, రాజ్, భ్రాజ్, మృజ్, సృజ్.

౨ వ కక్ష్య.—భజ్, సజ్, త్యజ్, రజ్, స్వజ్, మజ్జ్, నిజ్, తిజ్, విజ్, భుజ్, యుజ్, రుజ్, వృజ్, అఞ్జ్, భఞ్జ్, శిఞ్జ్, ఊర్జ్, స్రజ్, భిషజ్, అసృజ్, ఈ క్రింది ప్రాతిపదికలు కూడ నీకక్ష్యలోనే చేరును. తృష్ణజ్, ధ్వజ్, సనజ్, భిషజ్, ఉశిజ్, వణిజ్, భురిజ్, నిణిజ్, అసృజ్, ఋత్విజ్.

'ఇం.-యూ.' gh: ఈ వర్ణము తాలవ్యాచ్చుకాని యకారముకాని పరముగునప్పు డార్యన్ మూలభాషలో ఝకారములోనికి మారి, యది తిరుగు సంస్కృతమున హకారములోనికి మారినది. సం. హన్మి, 'చంపుచున్నాను' గ్రీ. theino—వై. హరః 'వేడి,' గ్రీ. theros,—వై. ద్రుహః 'హానికలిగించువారు,' ద్రుహ్యామి 'హానిచేయుచున్నాను,' జఘాన యను పదమున మహాప్రాణవర్ణమగు ఘకారము పరముగుటచే పదాది నుండవలసిన ఝకార మల్పప్రాణవర్ణమగు జకారములోనికి మారినది.

'ఇం.-యూ.' n̥ : ఈవర్ణమునకు బరమందుండు కంఠ్యము తాలవ్యములోనికి మారినయెడల నిదికూడ దాలవ్యములోనికి మారిపోవుచుండెను. సం. పఞ్చ 'అయిదు,' గ్రీ. pente, లా. quinque గా. fimf.

ఇట్లు 'ఇండో-యూరపియన్' మాతృభాషలోని కొన్ని కంఠ్యములు సంస్కృతమున దాలవ్యములుగా బరిణమించినవి. మాతృభాషలోని తాలవ్యవర్గము వర్ణాంతరములలోనికి మారినది (చూ. పేరా ౧౭). పైని వర్ణింపబడిన కంఠ్యముల తాలవ్యవిపరిణామమునకు సంబంధించిన నియమ మేకకాలమున ననేకులగు భాషాశాస్త్రజ్ఞులచే గనిపెట్టబడినది. ఎకారము సంస్కృతమున లేకపోయినను మాతృభాషలో నుండినదను విషయము నీనియమము నిరూపించినది. తాలవ్యములగు ఇకార ఈకారములును, యకారమును బరమందుండు మాతృభాషలోని కంఠ్యములు సంస్కృతమున దాలవ్యములుగా నగపడుచున్నవి. తాలవ్యవర్ణములు పరముగా నుండుటచే నిట్టిమార్పు జరుగుట న్యాయముగానేయున్నది. కాని కొన్నిపద

ములలో సంస్కృతమున తాలవ్యవర్ణమునకు అకారము పరముగా నున్నది. పై నియమము ననుసరించి యట్టి పదములలో కంఠ్యము తాలవ్యముగా మారుటకు కారణము లేదు. వీని భాషాంతరీయ రూపములను బరిశీలింపగా నందు కంఠ్యముల దర్వాతమున ఎకారమును కనబడెను. ఎకారము తాలవ్యము గాన సంస్కృతమున నగపడు అకారముకంటె భాషాంతరములలో నగపడు ఎకారము ప్రాచీనమైనచో కంఠ్యము తాలవ్యముగు నవకాశము కలదు. తాలవ్యవ్యంజనము సంస్కృతమున నగపడుటచే దత్పరముగానుండు సంస్కృతములోని అకారము ప్రాచీనము కాదనియు, తత్స్థానీయమగు భాషాంతరములలోని ఎకారమే ప్రాచీనమైనదనియు నిశ్చయింపబడినది. మాతృభాషలో ఎకారము కలదనియు నది సంస్కృతమున అకారములోనికి మారిననియు, అట్లు మారుటకు పూర్వము తత్పూర్వముగ కంఠ్యవర్ణముండినచో నది దానిని తాలవ్యములోనికి మార్చుననియు నిప్పటి భాషాశాస్త్రజ్ఞుల సిద్ధాంతము. మాతృభాషలోని ఎకారము సంస్కృతమున అకారములోనికి మారుసందర్భమున తత్పూర్వమందు కంఠ్యవర్ణముండిన యెడల నది తన తాలవ్యత నా కంఠ్యవర్ణమునకు సంక్రమింపజేయునని చెప్పవచ్చును. ఇట్లు సంస్కృతమున కనపడని ఎకారము మాతృభాషలో నుండినదని యంగీకరింపవలసిరాగా, మాతృభాషలోని యచ్చులు సంస్కృతమున సరిగా నిలిచి యుండలేదనియు, నక్కారణమున సంస్కృతమున కనబడక పోయినను భాషాంతరములలో నెల్ల నగపడుటచే ఒకారము కూడ మాతృభాషలో కలదనియు, ఎకారమువలె నది కూడ సంస్కృతమున అకారములోనికి మారిననియు భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయపడియున్నారు. పైరీతిని మాతృభాషలోని కంఠ్యముల సంస్కృతమున తాలవ్యపరిణామమునకు సంబంధించిన యీ నియమము మాతృభాషలోని యచ్చుల సంఖ్యను నిర్ణయించుటకు గూడ ముఖ్యమగు సాధనమగుచున్నది.

౨౦. టవర్గము. వీని యుచ్చారణమున జిహ్వాగ్రము వెనుకకు తిరిగి కఠినతాలువును స్పృశించును. తాలవ్యముల యుచ్చారణమున జిహ్వామధ్యభాగ మేతాలు భాగమును స్పృశించునో ఆభాగమునే టవర్గ ఉచ్చారణమున జిహ్వాగ్రము స్పృశించును. ఆస్పర్శను నిశ్శ్వాసవాయువు భేదించునప్పు డీవర్ణములు జనించును. వీనికి మూర్ధన్యములని పేరు. మూర్ధన్యములు సంస్కృతభాషయందు మాత్రమే యగపడుచున్నవి. 'ఐరేనియన్' భాషలలో కాని తదితరములగు నే 'ఇండో-యూరపియన్' భాషలలో గాని యివి కనబడుటలేదు. కావున నివి హిందూదేశములో ననాదినుండియు వ్యవహరింపబడుచున్నట్టియు, సహజముగా మూర్ధన్యములను కలిగియున్నట్టియు ద్రావిడభాషలనుండి వాని సంపర్కము వలన సంస్కృతభాషను ప్రవేశించినవని భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయపడియున్నారు. "ద్రావిడభాషల కివి సహజములనుట కీ క్రింది యనేకములగు సంస్కృతజన్యములు కాని దేశ్యపదములలోను, ధాతువులలోను గూడ గనబడుచు నర్థభేదసూచకములై యుండుటయే తార్కాణము.

| | |
|---|---|
| కొట్టు=బాదుట | కొత్తు=త్రవ్వుట |
| ఒడి=బద్దలు చేయుట | ఒది=తన్నుట |
| కడి=కోయుట | కది=దొంగిలించుట |
| కుడి=త్రాగుట | కుది=ఎగురుట |
| ఓడు=పరుగెత్తుట | ఓదు=చదువుట |
| కాడు=అరణ్యము | కాదు=సంభవింపదు |
| పుడై=ఏరుట | పుదై=దాగుట |
| ఎణ్=లెక్కించుట | ఎన్=అనుట |
| మణై=ఒక చిన్న బల్ల | మనై=ఇల్లు |
| కొళ్=కొనుట | కొల్=చంపుట |
| కళ్లు=మద్యము | కల్లు=రాయి" |

(పై యుదాహరణములు శ్రీ విజయనగర మహారాజావారి కళాశాలాపత్రికయందు సుబ్బరాయభట్టు రామకృష్ణయ్యగార్లచే వ్రాయబడిన 'వర్ణోత్పత్తిక్రమ' మను వ్యాసమునుండి గ్రహింపబడినవి. వాని పౌర్వాపర్యము మాత్రము మార్పుచేయబడినది). ద్రావిడభాషలనుండి కొన్ని మూర్ధన్యములు సంస్కృతమున ప్రవేశించినపిమ్మట వాని సాహచర్యమున గొన్ని దంత్యములు మూర్ధన్యములుగా మారినవి. ఈ మార్పునకు దంత్యములకు బూర్వమం

నుండు లకారము కొంతవరకు సహకారి యాయెను. ఇట్లు క్రమముగా సంస్కృతమున మూర్ధన్యములసంఖ్య యధిక మాయెను. ఈక్రింది సందర్భములలో సంస్కృతమున దంత్యములు మూర్ధన్యము లాయెను: ౧. అకారాకార భిన్నమగు నచ్చులుకాని, కకారరేఫలుకాని, పూర్వ మందున్నచో సకారము షకారములోనికి మారును. ౨. షకారమునకు బరమగు దంత్యము మూర్ధన్యమగును. ౩. ఋకారరేఫ షకారములు పూర్వమం దున్నచో నకారము ణకార మగును. ౪. షకార హకారములకు బరమగు దంత్యస్థానమున ఢకారము వచ్చుట కలదు. ఇంకను మాతృభాషలోని తాలవ్యజన్యము లగు శవర్గ జకార హకారములు కొన్ని సందర్భములలో మూర్ధన్య ములలోనికి మారుచుండును. (చూ. పేరాలు ౧౯, ౨౪). పైని వర్ణింపబడిన కారణములులేని స్థలములలో మూర్ధ న్యము సంస్కృతమున కనబడినచో యది ద్రావిడభాషల నుండి వచ్చినదని మనము చెప్పవచ్చును.

‘ఇండో - యూరపియన్’ మాతృభాషలోని దంత్యము లోకనియమము ననుసరించి సంస్కృతమున మూర్ధన్యములలోనికి మారునని ‘ఫార్చునేటక్’ అను పాశ్చాత్యపండితుడు చెప్పియున్నాడు. ఆ నియమ మిట్టి ది:—మాతృభాషలోని రేఫపూర్వక మగు దంత్యము సంస్కృతమున మారకయుండెనుగాని లకారపూర్వక మగు దంత్యము మూర్ధన్య మగుచుండెను; తత్పూర్వ మందుండు లకారము లోపించుచుండెను.

రేఫపూర్వకమగు దంత్యముల కుదాహరణములు:- సం. కర్తామి (అర్థము), కృన్తామి ‘నరకుచున్నాను,’ లి. kertu.—సం. వర్తామి, వర్తే ‘తిరుగుచున్నాను,’ లా. Nerto.—సం. మర్దామి ‘నలుపుచున్నాను,’ మర్ద యామి, లా. mordeo.—సం. పర్దతే ‘అపానవాయు వును వదలుచున్నాడు,’ గ్రీ. perdetai.—సం. అర్ధః ‘సగము,’ లి., ardyti.—సం. గర్ధః ‘కోరిక,’ గా. gredus.—సం. కర్ణః ‘చెవి,’—సం. వర్ణః ‘వర్ణము,’— సం. ధర్షామి, ధృష్ణోమి ‘సాహసించుచున్నాను,’ గ్రీ. tharseo, గా. gadars.—సం. వర్షా ‘వర్షము,’ గ్రీ erse.

లకారపూర్వకమగు దంత్యముల కుదాహరణములు:—సం. పటః ‘వస్త్రము’, గ్రీ. pelte, ఐస్. Feldr.—సం. పటుః ‘వాడియగు’, గ్రీ. platus.—సం. స్ఫటామి ‘విడుచుచున్నాను’, ప్రా. హై. జ. spaltan.—సం. వటః, వటమ్, వటీ ‘వల’, లి. valtis.—సం. హాటకమ్ ‘బంగారము’, ప్రా. స్లే. zlato.—సం. జఠరమ్ ‘కడుపు’, గా. kilthei.—సం. కుఠారః ‘గొడ్డలి’, లా. culter.—సం. కిణః ‘శరీరమునందలి మచ్చ లేక కాయ’, లా. callus, callum.—సం. కుణిః ‘బాహువులేనివాడు’ గ్రీ. kullos.—సం. అణిః, అణిః ‘శీల’, గ్రీ. olene, లా. ulna.—సం. పాణిః ‘చేయి’, గ్రీ. palame, లా. palma—సం. పణః ‘ఒడ్డు’, లి. pelnas.—వై. వాణీ ‘రెల్లు’, గా. walus.—సం. భాషతే ‘మాట లాడుచున్నాడు’, లి. balsas.—సం. లషామి ‘కోరు చున్నాను’, లాలసః ‘కోరికగల’, గ్రీ. lilaiomai.—సం. పాషాణః ‘శిల’, గ్రీ. pellalithos.

‘ఫార్చునేటక్’ పండితుని నియమమునకు విరుద్ధ ముగా మూర్ధన్యములు గల పదములు సంస్కృతభాషను ప్రవేశించిన ప్రాకృతరూపములని యతని యభిప్రా యము. భటః ‘భటుడు’ (సం. భృతః); కటః ‘చాప’ (సం. కర్తనమ్); కటుః ‘వాడియైన’ (లి. kartus); నటః ‘నటుడు’ (సం. నర్తకః, నృత్యామి). ఈ నియ మమునకతివ్యాప్తి దోషము నాపాదించు పై యుదాహ రణములే కాక యవ్యాప్తిదోషమును సంపాదించు మరి కొన్ని యుదాహరణములు కూడ గలవు. సం. గర్దభః ‘గాడిద’, ఇం. colt.—సం. మృదుః ‘మెత్తనైన’ లా. mollis.—సం. పృథుః ‘విశాలమైన’ గ్రీ. platus.—వై. గల్దః, గల్దా ‘వాక్కు’. మొ. మరియు రేఫలకార సంపర్కము లేని స్థలములలో కూడ సంస్కృ తమున మూర్ధన్యముగపడు చున్నది. వై. అతామి, సం. అటామి ‘అటునిటుతిరుగుచున్నాను:—వై. భనామి, సం. భణామి ‘పలుకుచున్నాను’. ఇట్టి స్థలములలో భాషాంతరసంపర్కమును కారణముగా నంగీకరింపక

తప్పదు. కావున ద్రావిడాదిభాషాంతర సంపర్కము వలన సంస్కృతభాషలోని కొన్ని పదములలో మూర్ధన్యములు ప్రథమమున ప్రవేశించి తరువాత నవి పదాంతరములకు గూడ వ్యాపించినవని చెప్పుట సమంజసముగా నున్నట్లు తోచుచున్నది. మూర్ధన్యవ్యాప్తికి లకారము కొంతవరకు సహకారియైనట్లు కనబడుచున్నది. 'ఫార్చునేటక్' నియమము నంగీకరించినప్పుడు కూడ కొన్ని మూర్ధన్యములకు భాషాంతర సంసర్గము కారణముగా నంగీకరింపక తప్పదు

౨౧. తవర్గము.—జిహ్వాగ్రమునకును, దంతములకును కలిగిన స్పర్శను నిశ్వాసము వేరుచేయగా నీ వర్ణము లుత్పన్నము లగుచున్నవి. జిహ్వాగ్రము దంతములను గాని దంతమూలమును గాని స్పృశింపవచ్చును. ఇవి దంత్యము లనబడుచున్నవి. సంస్కృతదంత్యము లన్నియును మాతృభాషలో దాశ్యములుగానే యుండినవి.

'ఇం.-యూ.' t: సం. తనోమి 'లాగుచున్నాను,' గ్రీ. teinō, లా. tendō; సం. తనుః 'సన్ననైన,' గ్రీ. tanu, లా. tenuis—సం. తుదామి 'త్రోయుచున్నాను,' వై. తున్దతే, లా. tundo.—సం. త్రయః 'మూడు,' గ్రీ. treis, లా. tres, గా. threis—సం. పతామి 'పడుచున్నాను,' లా. petō, గ్రీ. petomai.—సం. వర్తతే 'తిరుగుచున్నాడు,' లా. verto, గా. wairtha.—సం. పత్ని 'భార్య,' గ్రీ. potnia

'ఇం.-యూ.' th: సం. వేత్థ 'తెలియును,' గ్రీ. oistha, గా. waist. ఈ వర్ణము మాతృభాషలో గూడ బహువిరళముగా ప్రయోగింపబడుచున్నట్లు కనబడుచున్నది. ఈక్రింది సంస్కృతపదముల 'అవెస్తా' రూపములలో గూడ థకార మగపడుచున్నది. సం. రథః 'రథము,' అ. ratha—సం. పృథుః 'విశాలమైన,' అ. perethu. సంస్కృతమున థకారఘటితము లగు పదములు చాలవర కనుకరణశబ్దములుగా నున్నవి.

'ఇం.-యూ.' d: సం. దదామి (*దిదామి) 'ఇచ్చుచున్నాను,' గ్రీ. didomi, లా. dō.—సం. దశ 'పది,' గ్రీ. deka, లా. decem, గా. taihun.—సం. ద్వౌ 'రెండు,' వై. ద్వా, గ్రీ. duo, లా. duō.—సం. సదః 'ఆసనము,' గ్రీ. edos, లా. sedeo.—సం. ఛిన్దన్తి 'నరకుచున్నారు,' గ్రీ. schindalmos, లా. scindo.

'ఇం.-యూ.' dh: సం. ధూమః 'పొగ,' గ్రీ. thūmos, లా. fūmus.—సం. ధర్ష్ణామి 'సాహసించుచున్నాను,' గ్రీ. thrasus, tharreō, గా. gadars.—సం ధయామి 'త్రాగుచున్నాను,' గా. daddja, గ్రీ thēsthai, thesato; వై. ధారుః 'త్రాగుట,' గ్రీ. thelus.—సం. దధామి (*దిధామి) 'ఉంచుచున్నాను,' గ్రీ. tithemi.—సం. మధు, 'తేనె', గ్రీ. methu, ప్రా. హై. జ. meto.—సం. మధ్యః 'నడుము', గ్రీ. mesos, లా. medius, గా. midjis—సం. బుధ్నః 'అడుగు', గ్రీ. puthmēn, pundax, లా. fundus. దధామి యను సంస్కృతపదమున మహాప్రాణవర్ణమగు ధకారము పరమందుండుటచే బదాదియందలి ధకార మల్పప్రాణమగు దకారములోనికి మారినది.

సంస్కృతమున గొన్నియెడల ధకార ముండవలసిన స్థలములలో హకార మగుపడుచున్నది. వై. ధి, హి, సం. హి, (లోణ్మధ్యమపురుషైకవచనప్రత్యయము), గ్రీ. thi.—సం. మహే, మహి (ఆత్మనేపదమున నుత్తమపురుష బహువచనప్రత్యయము), అ. maide, గ్రీ. metha. ఇవి సంస్కృతమున ప్రవేశించిన ప్రాకృతరూపములు కావచ్చును.

'ఇం.-యూ.' n: సం. నౌః 'ఓడ', గ్రీ. naus, లా. nāvis.—సం. నభః 'ఆకాశము', గ్రీ. nephos, లా. nebula, ప్రా. హై. జ. nebul.—సం. నామ 'పేరు', లా. nomen, గ్రీ. onoma, గా. namō. వై. సనః 'ప్రాచీనమైన', గ్రీ. ēne, లా. senev, గా. sineigs. వై. విద్మనే 'తెలిసికొనుటకు, గ్రీ. idmēmai.—సం. స్వప్నః 'నిద్ర', లా. somnus ఐస్. svefn, గ్రీ. upnos.—సం. బంధనమ్ 'కట్టుట,'

గా. bindan; సం. బంధుః 'చుట్టము', గ్రీ. pentheros, లా. offendix.—సం. తక్షన్ 'వడ్రంగి.' గ్రీ. tekton.

౨౨. పవర్గము.—ఓష్ఠద్వయమునకు గలిగిన స్పర్శను నిశ్శ్వాసము పోగొట్టునప్పు డీవర్ణములు జన్మించుచున్నవి. ఇవి ఓష్ఠ్యములనబడుచున్నవి. ఇవి 'ఇండో-యూరపియన్' ఓష్ఠ్యజన్యములు. బకారము మాతృభాషలో నతివిరళము గా ప్రయోగింపబడుచుండెను.

'ఇం.-యూ.' p: సం. పితా 'తండ్రి,' గ్రీ. patēr, లా. pater, గా. fader.—సం. పురః 'ముందు,' గ్రీ. paros, గా. faura—సం. పరశుః 'గొడ్డలి,' గ్రీ pelekus, గా. filigri.—సం. పృశ్నిః 'చుక్కలుగల,' గ్రీ. perknos.—సం. పరుత్ 'గత వత్సరము,' గ్రీ. perusi, peruti—సం. ప్ర. 'ముందుకు,' గ్రీ pro, లా. prō, గా. fra—సం. ప్లవామి 'తేలుచున్నాను,' గ్రీ. pleō, లా. pluit.—సం. స్వప్నః 'నిద్ర,' లా. somnus, గ్రీ. upnos—సం. సర్పామి 'ప్రాకుచున్నాను,' గ్రీ. erpō, లా. serpō—వై. నపాత్ 'మనుమడు,' లా nepos—వై. స్పట్ (*స్పక్; ప్రాతిపదికస్పశ్), లా.—spex; సం. పశ్యామి (స్పశామి) 'చూచుచున్నాను,' లా. specio, ప్రా. హై. జ. spehon.

'ఇం.-యూ.' ph: ఈవర్ణమునకు ప్రయోగ మతి విరళము—సం. ఫేనః 'నురగ,' ప్రా. స్లే. pena, ప్రా. హై. జ. feim—సం. ఫల్గుః, 'దుర్బలమైన, విలువలేని' గ్రీ. phelgumei.—సం. శఫః, 'డెక్క,' అ. safa.—సం. కఫః 'కఫము,' అ. kafa.—సం. స్ఫూర్జతి, 'కోరుచున్నాడు' గ్రీ. spharageomai.—సం. స్ఫ్యః 'మేక,' గ్రీ. sphen.—సం. ఫలకమ్, 'బల్ల,' గ్రీ. sphelas.

'ఇం.-యూ.' b: సం. బలమ్ 'బలము,' ప్రా. స్లే. bolij, లా. dē-bilis—సం. బర్బరః 'నత్తి,' బల్బలః, గ్రీ. barbaros, లా. balbus.—సం. బుక్కారః 'గర్జన' గ్రీ. buktēs, bukanē, లా. būcina—సం. లంబతే 'వ్రేలాడుచున్నాడు,' లా. lābitur—వై. ఉపబ్దః 'చప్పుడు,' గ్రీ. epibdai.—సం. పిబామి 'త్రాగుచున్నాను,' లా. bibō.

సంస్కృతమున బకారవకారములకు వినిమయము కలుగుచుండును. ఇట్లు బాధ్, వధ్; బృహ్, వహ్ మొదలగు ద్వైరూప్య మేర్పడినది. వంగ (బంగ) దేశమున వకారమునకు బకారమును వాడెదరు.

'ఇం.-యూ.' bh: సం. భరామి 'మోయుచున్నాను,' గ్రీ. phero, లా. fero, గా. baira.—సం. భవామి 'అగుచున్నాను,' గ్రీ. phuō, లా. fui, ప్రా. హై. జ. buam.—సం. భ్రూః 'కనుబొమ్మ,' గ్రీ. ophrūs, ప్రా. హై. జ. brāwa—సం. నభః 'ఆకాశము,' గ్రీ. nephos, లా. nebula. ప్రా. హై. జ. nebul.—సం. జమ్భః 'పన్ను,' గ్రీ. gomphos౬. ప్రా. హై. జ. chamb.

మహాప్రాణవర్ణము పరమైనచో భకార మల్పప్రాణముగా బకారములోనికి మారుచుండును. సం. బోధామి 'తెలిసికొనుచున్నాను,' గ్రీ. punthanomai, peuthomai, గా. biuda—సం. బధ్నామి 'కట్టుచున్నాను,' బంధనమ్ 'కట్టుట,' గా. bindan; సం- బంధుః 'చుట్టము,' గ్రీ. pentheros, లా. offendimentum, offendix.

సంస్కృతమున గొన్నియెడల భకార ముండవలసిన స్థలమున హకార మగపడుచున్నది ఇది ప్రాకృత భాషాసంపర్కమువలన సంభవించిన దని చెప్పవచ్చును. వై. గృభ్ణామి, సం. గృహ్ణామి 'పట్టుకొనుచున్నాను;' సం. భరామి, హరామి. 'మోయుచున్నాను.'

'ఇం.-యూ.' m: సం. మాతా 'తల్లి,' గ్రీ. mētēr, లా. mater, ప్రా. హై. జ. muoter.—సం. మతః 'తలంపు,' గ్రీ. matos, లా. mentus, గా. munds.—సం. మృతిః 'మరణము,' లా. mors.—సం. మ్నాతః 'చెప్పబడిన,' గ్రీ. mimnēskō.—సం. మ్లాయామి 'శుష్కించుచున్నాను,' గ్రీ. blāx.—సం. వమామి, వమిమి 'వమనము చేయుచున్నాను,' గ్రీ.

emeo, లా. vomō.—సం. స్మయతే 'నవ్వుచున్నాడు,' గ్రీ. philommeidēs, meidiaō, లా. mīrus.—సం, ఘర్మః 'వేడి,' లా. formus, గ్రీ. thermos, గా. warms.—వై. ఓజ్మ 'బలము,' లా. augmen, augmentum.—సం. తమ్ 'అతనిని,' గ్రీ. ton, లా. istum.—వై. జమ్భః 'పన్ను,' గ్రీ. gomphos, ప్రా. హై. జ. chamb.

౨౩. అంతస్థములు.—ఉచ్చారణమున నచ్చులకును స్పర్శలకును నడుమ నుండుటచేగాని వర్ణసమామ్నాయమాతృకాపాఠమున స్పర్శలకును నూష్మలకును నడుమనుండుటచేగాని యంతస్థముల కానామము కలిగియుండును. ఇవి యీషత్స్పృష్టములనియు దుఃస్పృష్టములనియు జెప్పబడుచున్నవి. ఉచ్చారణస్థానమును బట్టి యీ యంతస్థములు స్పర్శవర్గలతో సంబంధించియున్నవి. యకారము తాలవ్యము. రేఫ మూర్ధన్యము. లకారము దంత్యము. వకారము దంతోష్ఠ్యము.

యకారము.—దీని యుచ్చారణమున జిహ్వామధ్యభాగము తాలువునకు సమీపముగా నుండును. ఈ రెండింటికి మధ్యనేర్పడిన సన్నని మార్గముద్వారా నాదయుక్తమగు నిశ్వాసము పోవును. అప్పుడు నిశ్వాసమునకును జిహ్వాతాలువులకును గలిగిన సంఘట్టమువలన శబ్దము పుట్టును. అదియే యకారమగుచున్నది. స్థానప్రయత్నములనుబట్టి యకారమునకును ఇకారమునకును సన్నిహితసంబంధము కలదు. కావుననే యీ రెండు వర్ణములకును దరుచుగా వినిమయము సంభవించుచుండును. వేదమున సంస్కృతసంధినియమముల ననుసరించి యేర్పడిన యకారస్థానమున దరచుగా ఇకార ముచ్చరింపవలసియుండును. మరియు గొన్ని వేదశాఖలలో హల్పరమగు యకారమునకు పూర్వ మికారమును చేర్చి యుచ్చరించుట కలదు.

'ఇండో-యూరపియన్' మాతృభాషలో నంతస్థమగు యకార మొకటియును నూష్మయగు యకార మొకటియును నిట్లు రెండువిధము లగు యకారములుండినవని చెప్పుటకు నిదర్శనము కలదు. అనేకభాషలలో నంతస్థయకారము మాత్రమే నిలిచియున్నను 'గ్రీకు' భాషలోమాత్ర మూష్మయకారము గూడ గనబడుచున్నది. ఈభాషలో బదాదియందుమాత్ర మీ రెండువర్ణములకును భేద మగపడుచున్నది. అంతస్థయకారము లోపించును; ఊష్మయకారము z అను వర్ణముగా గనబడును. సంస్కృతమున గొన్నిచోటులందలి యకారమునకు సంప్రసారణము వచ్చుటయు మరికొన్నిచోటులందలి యకారమున కట్లది రాకుండుటయు ననునవి మాతృభాషలోని యకారభేదమునకు సంబంధించిన విషయములే కావచ్చును.

'ఇం.-యూ.' y (అంతస్థయకారము) సం. యః, గ్రీ. os.—సం. యకృత్ [*యాకృత్] 'పిత్తాశయము,' గ్రీ. epar, లా. jecur.—సం. యజ్ఞః, 'యాగము,' గ్రీ. agnos.—సం. యుష్మద్ 'నీవు,' గ్రీ. ummes, లా. jūs.—సం. ఆయమ్ 'వెళ్లితిని,' గ్రీ. ēa.—సం. త్రయః 'మూడు,' గ్రీ. treis, లా. tres, గా. threis.—సం. మధ్యః 'నడుమ,' గ్రీ. messos, లా. medius, గా. midjis.—సం. జ్యా 'నారి,' లి. gija, గ్రీ. bios.

'ఇం.-యూ.' J (ఊష్మయకారము): సం. యుగమ్ 'కాడి,' గ్రీ. zugon, లా. jugum, గా. juk.—సం. యసామి, యస్యామి 'వండుచున్నాను.' గ్రీ. zeō, ప్రా. హై. జ. jesan.—సం. యవః 'ధాన్యవిశేషము,' గ్రీ. zeiai, లి. javai.—సం. యూషః, యూషమ్ 'పులుసు,' గ్రీ. zūmē, లా. jūs, ప్రా. స్లై. jucha.

శేతే 'పడుకొనుచున్నాడు' (ధా. శయ్), త్యజామి 'విడుచుచున్నాను,' త్యక్తః (ధా. త్యజ్) అను పదములలోని యకారముకూడ నూష్మయకారము కావచ్చును. వీనితో సంబంధించిన రూపాంతరములలో నెందును యకారస్థానమునను నేకారస్థానమునను ఇకార మగపడకపోవుటచే నిట్లూహించుట కవకాశము కలుగుచున్నది.

రేఫము.—ఇది మూర్ధన్యమని పాణినీయవ్యాకరణమునజెప్పబడియున్నది. సన్నిహితవర్ణములకు మూర్ధన్య

తాపాదక మగుటచే నిది పూర్వము మూర్ధన్యముగా నుచ్చరింపబడుచుండవచ్చును. ఇప్పు డిది దంతమూలమున నాలుకకొననుంచి యుచ్చరింపబడుచున్నది. ప్రాతిశాఖ్యలలో దీనికి దంతమూలము స్థానమని చెప్పబడియున్నది. తవర్గముకంటె స్వల్పముగా దాలువు వెనుకభాగమున నుచ్చరింపబడుటచే నిది మూర్ధన్యముగా బరిగణింపబడి యుండవచ్చును. రేఫోచ్చారణమున జిహ్వాగ్రము కంపమును బొందునట్లు మనగ్రంథములలో నెందును జెప్పబడి యుండలేదు. దీనికి మాతృభాషలోని రేఫలకారములు రెండును మూలములు.

'ఇం.-యూ.' r: సం. రజ్యామి 'రాగము కలిగినవాడ నగుచున్నాను,' గ్రీ. rezō.—సం. రాః 'ధనము,' లా. res.—సం రాట్ (*రాక్) 'రాజు,' లా. rex.—సం. రోదిమి 'ఏడ్చుచున్నాను,' లా. rūdo.—సం. భరామి 'మోయుచున్నాను,' గ్రీ. pherō, లా. ferō, గా. baira.—సం. పరి 'చుట్టు,' గ్రీ. peri, లా. per.—సం. స్మరామి 'జ్ఞప్తికి తెచ్చుకొనుచున్నాను,' లా. memor.—సం. దదర్శ 'చూచితినట,' గ్రీ. dedorka.—సం. జాగర్మి 'మేలుకొనుచున్నాను,' గ్రీ. egeirō, egrēgora.—సం. గ్రసామి 'తినుచున్నాను,' గ్రీ. graō.—సం. క్రీణామి 'కొనుచున్నాను,' గ్రీ. epriamēn.—సం. మాతా (ర్) 'తల్లి,' గ్రీ. metēr, లా. mater.

'ఇం.-యూ.' l: సం. రక్షామి 'రక్షించుచున్నాను,' గ్రీ. alexō.—సం. రిరేచ 'వదలితినట,' గ్రీ. leloipa, గా. laihw; సం. రించామి, గ్రీ. leipō, గా. leihwa.—సం. రోహామి (వై. రోధామి), 'పెరుగుచున్నాను,' గా. liuda, గ్రీ. eleusomai, eilēloutha.—సం. పిపర్మి 'నింపుచున్నాను,' గ్రీ. pimplēmi, plērēs, లా. impleō, plēnus.

లకారము.—ఇది దంత్యవర్ణమని మనగ్రంథములన్నిటిలోను జెప్పబడియున్నది. దీని యుచ్చారణమున జిహ్వాగ్రము దంతమూలములను స్పృశింపగా నిశ్వాసవాయువు నాలుక కిరుప్రక్కలనుండియు బైకిపోవునట్లు మనగ్రంథములలో నెచ్చటను జెప్పబడియుండలేదు. కాని యది యనుభవసిద్ధము. రేఫలకారములకు తరచుగా వినిమయము సంభవించుచుండును. లకారఘటితధాతువులకు రేఫయుక్తరూపములు తరచుగా నుండును. ఒకగ్రంథమున రేఫయుక్తముగాగాని లకారయుక్తముగా గాని యున్న పదము గ్రంథాంతరమున లకారయుక్తముగా గాని రేఫయుక్తముగాగాని ప్రయోగింపబడియుండును. రానురాను సంస్కృతమున రేఫలకారములకు వినిమయము తగ్గుటయే కాక లకారమునకు ప్రయోగ మెచ్చినది. రేఫలకారములకు మాతృభాషలోనే వినిమయము సంభవించుచుండినదనుట క్రింది యుదాహరణము నిదర్శనము. సం. లుంచామి 'తీసివేయుచున్నాను, ఒలుచుచున్నాను', గ్రీ. orussō, లా. runcare.—సం. లుంపామి 'విరచుచున్నాను', లా. rumpo, ప్రా. ఇం. reofan.

ఋగ్వేదమున నతిస్వల్పసంఖ్యాకములగు పదములలోనే లకార మగపడుచున్నది. పారసీకభాషలో లకారము లేనేలేదు. సంస్కృతమున రేఫలకారములు రెండును సమానముగా వాడబడుచున్నవి. మాగధీప్రాకృతమున రేఫము లేనేలేదు. కావున మనహిందూదేశమున పాశ్చాత్యభాషలలో మాతృభాషలోని లకారము రేఫములోనికి మారినట్లును, ప్రాచ్యభాషలలో మాతృభాషలోని రేఫము లకారములోనికి మారినట్లును తెలియుచున్నది. అట్లయినచో మధ్యదేశపుభాషలో మాతృభాషలోని రేఫలకారవ్యాప్తి సరిగా నిలచియుండవలయును. ఈయూహ కనుగుణముగా మధ్యదేశపుభాషయగు సంస్కృతమున మాతృభాషలోని లకారము స్వల్పసంఖ్యాకములగు పదములలోనే రేఫములోనికి మారియున్నది. అట్టిపదములు పాశ్చాత్యభాషనుండి గ్రహింపబడియుండవచ్చును. ! ఋగ్వేదమునందలి లకారయుక్తపదములు ప్రాచ్యభాషనుండి గ్రహింపబడియుండవచ్చును. పై యంశములనుబట్టి సంస్కృతభాష ఋగ్వేదభాషాజన్యము కాదని భాషాతత్త్వవేత్తలు తలంచుచున్నారు.

ఋగ్వేదభాషలో లకారము బహువిరళముగా బ్రయోగింపబడి యుండుటచేతను పారసీకభాషలలో

లకారము బొత్తుగా లేకపోవుటచేతను భాషాశాస్త్రజ్ఞులు ప్రప్రథమమున లకారము నవీనవర్ణమని తలంచుచుండిరి. 'ఫార్చునేటక్' నియమము కనిపెట్టబడినప్పటి నుండియు వారు లకారముకూడ ప్రాచీనమైన వర్ణమే యని నిశ్చయించిరి. సంస్కృతలకారమునకు మాతృభాషలోని లకారమే మూలము.

'ఇం.-యూ.' l: సం. లమ్బతే 'వ్రేలాడుచున్నది,' వై. రంబతే, లా. lābor.—సం. లేహ్మి 'నాకుచున్నాను,' వై. రేహ్మి, గ్రీ. leichō, లా. lingō, గా. laigōn.—సం. లింపామి 'పూయుచున్నాను,' వై. దా. రిప్. గ్రీ. lipos, లా. lippus, గా. leiban.-సం. లుభ్యామి 'కోరుచున్నాను,' లా. lubet, గా. liufs.—సం. తులా 'త్రాసు,' గ్రీ. talanton, లా. tollo, గా. thulan.—సం. అల్పః 'చిన్న,' లి. alpti, alpmas.

కొన్ని పదములలో మాతృభాషలోని లకారము సంస్కృతమున రేఫములోనికి మారుటకూడ గలదు. సం. రక్షామి 'రక్షించుచున్నాను,' గ్రీ. alexō.—సం. రిరేచ 'విడిచిపెట్టితినట,' గ్రీ. leloipa, గా. laihw.—సం. రోహామి 'పెరుగుచున్నాను,' వై. రోధామి, గా. liuda. గ్రీ. eleusomai.—సం. పిపర్మి 'నింపుచున్నాను,' గ్రీ. pimplēmi, లా. im-pleō, plenus, గా. fulls.—సం. ప్రథతే 'విశాలమగుచున్నది.' గ్రీ. platus. మాతృభాషలోని దంత్యపూర్వమగు లకారము సంస్కృతమున లోపించి యా దంత్యము మూర్ధన్యమగు నను విషయమును గురించి యిదివరలో జర్చింపబడినది. (చూ. పేరా ౨౧).

వేదమున మూర్ధన్యళకార మొకటి కలదు. ఇది యచ్చులమధ్యను డకారస్థానమున గతిచిచ్ఛాఖాపాఠములలో కనబడుచుండును. ఉ. ఈడే లేక ఈళే కాని ఈడ్యః; మీఢుషే లేక మీళ్హుషే కాని మీఢ్వాన్ (చూ. పేరా. ౧౬.)

వకారము.—ఇది దంతోష్ఠ్య మని పాణినీయ వ్యాకరణమునను ప్రాతిశాఖ్యలలోను గూడ జెప్పబడియున్నది. ఇకారయకారములవలె ఉకారవకారములకు తరచుగా వినిమయము కలుగుటచే నిది పూర్వము శుద్ధోష్ఠ్యముగా నుచ్చరింపబడుచుండవచ్చును. ఇప్పుడును దరచుగా నట్లే యుచ్చరింపబడుచున్నది. దంతోష్ఠ్యమగు వకారమును అంతస్థమనుటకంటె నూష్మమనిన మిగుల సమంజసముగా నుండును. కొన్ని వేదశాఖలలో హల్పరమగు వకారమునకు పూర్వ ముకారమును జేర్చి యుచ్చరించుట కలదు.

యకారమువలెనే వకారము కూడ మాతృభాషలో రెండువిధములుగా నుచ్చరింపబడుచుండెనని భాషాశాస్త్రజ్ఞు లూహించియున్నారు. సంస్కృతమున కొన్నియెడల వకారమునకు సంప్రసారణము వచ్చుట చేతను కొన్నియెడల రాకపోవుటచేతను, మాతృభాషలో యంతస్థోష్మభేదమున వకారము రెండువిధములుగా నుండెనని చున్నారు. ఏభాషయందును నీరెండు విధములగు వకారములకును భేదము కనబడుటలేదు.

'ఇం.-యూ.' w (అంతస్థము): సం. వచః 'మాట,' గ్రీ. epos.—సం. వాక్ 'వాక్కు,' లా. vox, గ్రీ. op.—సం. వేద 'తెలిసికొనుచున్నాను,' గ్రీ. oida, గా. wait.—సం. వేశః 'గృహము,' గ్రీ. oikos, లా. vicus, గా. weihs.—సం. నవః 'నూతనమైన,' గ్రీ. neos, లా. novus.—సం. శ్వసిమి 'నిట్టూర్చుచున్నాను,' లా. queror.—సం. స్వాదుః 'తీయని,' గ్రీ. edus, లా. suavis.—సం. సర్వః 'అంతయును,' గ్రీ. olos, oulos.

'ఇం.-యూ.' v (ఊష్మము): సంప్రసారణమును పొందని వకార మూష్మవకారమని నిశ్చయముగా చెప్పవచ్చును. సం. వస్తే 'ధరించుచున్నాడు,' వసనమ్, వస్త్రమ్ 'బట్ట,' గ్రీ. ennumi, eanos, eima, esthes, లా. vestis, vestio, గా. wasjan, wasti.

వకారబకారములకు వినిమయము కలుగుచుండునని యిదివరలో చెప్పబడినది. (చూ. పేరా ౨౨). వకారమకారములకుకూడ వినిమయము సంభవించుచుండును. ఇది మాతృభాషలోనే ప్రారంభమయిన ట్లగపడుచున్నది. వై. అమః 'ఇది,' అ. ava,

ప్రా. స్లై. ovu.—సం. శ్యామః 'నల్లని,' శ్యావః, ప్రా. స్లై. sivu.—వై. దామనే, దావనే, గ్రీ. domenai, dofenai.—సం. ద్రమామి 'పరుగెత్తుచున్నాను,' ద్రవామి, గ్రీ. edramon, dedroma, dromos.

౨౮. ఊష్మములు.—వీని యుచ్చారణమున ముఖము వివృతముగా గాని యీషద్వివృతముగా గాని యుండును. వర్ణోత్పాదకావయవములకును నిశ్వాస వాయువునకును సంభవించు సంఘట్టమువలన నీవర్ణము లేర్పడుచున్నవి. ఇవి యన్నియును శ్వాసవర్ణములు లేక అఘోషములు—పాణినీయవ్యాకరణమున శషసహలుమాత్రమే యూష్మములని వ్యవహరింపబడియున్నవి. కొన్ని గ్రంథములలో నివియును విసర్గ జిహ్వామూలీయోపధ్మానీయములును గూడ నూష్మములని వ్యవహరింపబడియున్నవి. మరికొన్ని గ్రంథములలో ననుస్వారము కూడ నూష్మక్రిందనే పరిగణింపబడియున్నది. శవర్ణము తాలవ్యముగను, షకారము మూర్ధన్యముగను, సకారము దంత్యముగను నున్నవి.

శవర్ణము:—దీని యుచ్చారణమున జిహ్వాద్యవయవములు ఇకారవర్గ లుచ్చరించునప్పు డుండురీతినే యుండును. జిహ్వామధ్యభాగము తాలువునకు సమీపముగా నుండును. కావుననే యిది తాలవ్యమగుచున్నది. ఇది మాతృభాషలోని తాలవ్యవర్గప్రథమాక్షరజన్యము. దీని కుదాహరణము లిదివరలో కొన్ని యీయబడినవి (మా. పేరా. ౧౮). మరికొన్ని యిచ్చట చూపబడినవి. సం. శఙ్కుః 'కొయ్యమేకు', ప్రా. స్లై. sanku, సం. శాఖా 'కొమ్మ', లి. szaka.—సం. శంసామి 'స్తుతించుచున్నాను', లా. censeo.—సం. శూరః 'సాహసముకల', గ్రీ. kūros.—సం. వేశః 'ఇల్లు', గ్రీ. oikos లా. vīcus.—సం. దశామి 'కొరుకుచున్నాను', గ్రీ. dakno.—వై. అశ్మా 'రాయి', గ్రీ. akmōn, లి. aszmens.—సం. దదర్శ 'చూచితినట', గ్రీ. dedorka.

షకారము.—దీని యుచ్చారణమున టవర్గయుచ్చారణమున నుండునట్లే జిహ్వాద్యవయవము లుండును. కావుననే యిది మూర్ధన్యమని మన గ్రంథములలో చెప్పబడియున్నది. ఇది ప్రాచీనమైన వర్ణము కాదు. సకారమునుండి యుత్పన్నమైనది. ఇకారోకారఋకారములకును, రేఫకవర్గలకును బరమగు (మాతృభాషలోని) సకారము సంస్కృతమున షకారములోనికి మారినది.

'ఇం.-యూ.' s: సం. తిష్ఠామి 'నిలచుచున్నాను,' గ్రీ. istēmi, లా. sisto.—సం. ఉష్టః 'తగులబడిన' లా. ustus.—వై. జోష్టా 'ప్రేమించుచున్న,' గ్రీ. geustērion.—సం. ధృష్ణోమి, ధర్షామి 'సాహసించుచున్నాను,' గ్రీ. tharrēo.—సం. శీర్షమ్, శీర్షన్ 'తల,' గ్రీ. korsē, లా. cerebrum.—సం. వర్షా 'వాన,' గ్రీ. ersē.

కొన్ని ప్రదేశములలో షకారము ఖకారమువలె నుచ్చరింపబడుచున్నది. తదనుగుణముగా గ్రంథములలో షకారస్థానమున ఖకారమును, ఖకారస్థానమున షకారమును వ్రాయబడుచుండును.

సంస్కృత షట్ శబ్దప్రారంభమున షకార మెట్లు ప్రాప్తించినదో చెప్పజాలము. 'అవెస్తా' భాషలోని రూపము (ksvas) ననుసరించి సంస్కృతషాదిరూప ప్రారంభమునగూడ పూర్వము కకారముండిన ట్లూహింపవలసియున్నది.

క్షకారము కకారషకారసంయోగమువలన నేర్పడుచున్నది. మాతృభాషలోని కకారసకారసంయుక్త వర్ణమును, ఇ, ఈ, ఉ, ఊ, య, వ అను వర్ణములకు పరమగు ద్విత్వసకారమును సంస్కృతమున నీవర్ణముగా బరిణమించినవి. సం. ధక్ష్యామి 'దహింపగలను,' లి. deksiu.—సం. వక్ష్యామి 'చెప్పగలను,' (వచ్మి), వాక్.—సం. వక్షి' 'ఇష్టపడుచున్నావు,' (వష్టి), గ్రీ. ekōn.—సం. ఉక్షామి 'పెరుగుచున్నాను,' గ్రీ. aexō, లి. auksztas.—సం. అక్షః 'ఇరుసు,' గ్రీ. axōn, లా. axis.—సం. దక్షిణః, గ్రీ. dexios, లా. dexter.—సం. ద్వేక్షి (* dvaissi), 'అసహ్యించుకొనుచున్నావు,' ద్వేష్మి.—సం. శోక్ష్యామి 'కృశింపగలను,' (* saussyami), గ్రీ. ausō.

అకారాకారములకు పరమగు ద్విత్వసకారము సంస్కృతమున తకారపూర్వకసకారములోనికి మారినది. సం. వత్స్యామి 'ధరించెదను, నివసించెదను; విద్వత్సు(విద్వస్-శబ్దమునకు సప్తమీబహువచనరూపము).

సామాన్యముగా సంస్కృత క్షకారఘటితపదముల 'గ్రీకు' భాషారూపములలో క్షకారస్థానమున కకారపూర్వకసకార (x) మగపడుచుండును. కాని యీ క్రింది సంస్కృతపదముల 'గ్రీకు' భాషారూపములలో వర్ణాంతరము లగపడుచున్నవి. వై. క్షయామి 'కలిగియున్నాను,' గ్రీ. ktaomai, ktema.—సం. క్షణోమి 'హింసించుచున్నాను,' గ్రీ. kteino.—సం. ఋక్షః 'ఎలుగు,' గ్రీ. arktos.—సం. తక్షా 'వడ్రంగి,' గ్రీ. tekton.—సం. క్షిణామి, క్షిణోమి, (క్షయామి) 'ధ్వంసము చేయుచున్నాను,' క్షితిః 'నాశము,' గ్రీ. phthino, phthisis.—వై. క్షాః 'నివాసస్థానము' భూమి,' క్షామః (బహువచనము), గ్రీ. chthon.—సం. క్షరామి 'ప్రవహించుచున్నాను, నశించుచున్నాను,' గ్రీ. phtheiro.

సకారము.—దీని యుచ్చారణమున జిహ్వాగ్రము దంతములకు గాని, దంతమూలములకు గాని దగ్గరగానుండును. అప్పుడు నిశ్వాసము పైకిపోగా నీవర్ణము జన్మించును. ఇది స్పష్టమగు దంత్యము. ఇది మాతృభాషలోని సకారజన్యము.

'ఇం.-యూ.'—s: సం. సప్త 'ఏడు', గ్రీ. epta, లా. septem, గా. sibun.—వై. సనః 'ప్రాచీనమైన', గ్రీ. ene, లా. senex.—సం. స్రవామి 'ప్రవహించుచున్నాను', గ్రీ. reo, ప్రా. హై. జ. stroum.—సం. దాస్యామి 'ఇవ్వగలను', గ్రీ. doso.—వై. జనః 'వంశము', గ్రీ. genos, లా. genus.—సం. అశ్వః 'గుఱ్ఱము', గ్రీ. ippos, లా. equus.

'ఇండో-యూరపియన్' మాతృభాషలో ఘోషవర్ణములకు పూర్వమున నుండు సకారము ఘోషవంతమగుచుండెను. ఇది (z) సంస్కృతమున లోపించెను. ఆ సందర్భమున దీని లోపమును సూచించుటకేమో యనునట్లు తత్పూర్వమందుండు నచ్చు గాని, పరమందుండు హల్లు గాని, రెండును గాని యేదోయొక విపరిణామమును బొందుచుండెను. అకారము మాత్రము మారక యుండెను. వై. సేద్యాత్ (sa-sd-yat), అ. hazdyath.—సం. ఏధి (as-dhi), అ. zdi, గ్రీ. isthi.—సం. ఆధ్వే (as-dhve), గ్రీ. estai.—సం. శాధి (sas-dhi).—సం. నీడః (ni-sd-as), లా. nidus, ప్రా. హై. జ. nest.—వై. దూడాశ్ (dus-das) వై. అస్తోఢ్వమ్ (a-stu-s-dhvam).—సం. విద్వద్భిః (vidvas-bhis).—వై. మాద్భిః (mas-bhis).—సం. ద్విడ్భిః (dvis-bhis).—సం. విప్రుడ్భిః (viprus-bhis).—సం. మద్గుః (mas-gus).—సం. మజ్జతి (mas-jati).—వై. అముగ్ధ్వమ్ (a-muc-s-dhvam).

హకారము.—విస్తృతమగు కంఠము ద్వారముగ నిశ్వాసవాయువు తీవ్రముగా పోవుచుండు గంఠమునకును వాయువునకును గలిగిన సంఘట్టముచే నీవర్ణ మేర్పడుచున్నది. కాబట్టి అకారమువలె నీవర్ణమున కేస్థానముతోడను సంబంధ మున్నటులు దోపదు. కావుననే కావలయును తైత్తిరీయప్రాతిశాఖ్యలో హకారమునకు పరమునందుండు నచ్చేస్థానముతో సంబంధించునో యీ వర్ణము కూడ దత్స్థానికమే యగుచుండునని కొందర భిప్రాయపడియున్నట్లు చెప్పబడియున్నది. పాణినీయవ్యాకరణమున అకారముతోపాటీవర్ణముకూడ గంఠ్యమని చెప్పబడి యున్నది. ఇది ఘోషవర్ణమని మనవారి యభిప్రాయము. సంహితలో నిది నాదవర్ణమునకు రాదగిన విపరిణామములనే పొందుచుండును. వర్గచతుర్థవర్ణముల మహాప్రాణత్వము హకారమే యని కొందర భిప్రాయపడియున్నారు. వర్గతృతీయవర్ణమునకు హకారమును జేర్చి యుచ్చరించుటచే జతుర్థవర్ణ మేర్పడునని వీరి యాశయము.

హకారము ప్రాచీనమైన వర్ణము కాదు. తాలవ్యాచ్చులు గాని, యకారము గాని పరమందుండు మాతృభాషలోని కంఠ్యవర్గచతుర్థవర్ణమును, తాలవ్యవర్గ చతుర్థవర్ణమును సంస్కృతమున హకారములోనికి మారినవి. ఉదాహరణము లిదివరకే తెలుపబడినవి. (చూ. పేరా లు

౧౮, ౧౯.) మాతృభాషలోని కంఠ్యవర్ణజన్యమగు హకారము కంఠ్యములోనికి మారుచుండును; తాలవ్యజన్యమగు హకారము తకారమునకు పూర్వమునను, బహాంతమునను మూర్ధన్యములోనికి మారుచుండును. ఉ. దుహ్; దుగ్ధ,—ధుక్.—గుహ్; గూఢ.—వహ్; అవాట్. ఇట్టి సందర్భములకు జెందని హకారములను భాషాంతరరూపముల సహాయముచేతనే విభజింపవలసియుండును. సంస్కృతమున గనబడుచున్న రూపములనుబట్టి హకారాంతధాతువుల నీక్రిందివిధమున రెండుకక్ష్యలుగా విభాగము చేయవచ్చును. మొదటికక్ష్యలో చేరిన ధాతువులలోని హకారము మాతృభాషలోని కంఠ్యజన్యము; రెండవకక్ష్యలో చేరిన ధాతువులలోని హకారము మాతృభాషలోని తాలవ్యజన్యము. అనేకధాతువులలో సంస్కృతమున ప్రయుక్తములగు రూపములనుబట్టి హకారస్వభావమును నిర్ణయించుట కవకాశము లేదు.

౧-వ కక్ష్య:—దహ్, దిహ్, దుహ్, ద్రుహ్, ముహ్, స్నిహ్.

౨-వ కక్ష్య:—వహ్, సహ్, మిహ్, రిహ్, లిహ్, గుహ్, రుహ్, దృంహ్, తృంహ్, బృహ్, బంహ్, స్పృహ్ (?).

ముహ్ధాతువునకు ముగ్ధయను రూపమే కాక మూఢ యను రూపముకూడ వ్యవహారములో కలదు. ఇది గూఢ, రూఢ మొదలగురూపముల బలమున నేర్పడియుండవచ్చును.

మాతృభాషలోని కంఠ్యతాలవ్యచతుర్థవర్ణముల నుండియే గాక దంత్యచతుర్థవర్ణమునుండియు, ఓష్ఠ్యచతుర్థవర్ణమునుండియుగూడ సంస్కృతమున హకారముత్పన్నమైనది. ఉదాహరణములు వెనుక నీయబడినవి. (చూ. పేరాలు ౨౧, ౨౨.) హకారమునకు ధకారభకారముల క్రింద నెచ్చటనైనను వినిమయము కలిగినచో, నట్టి హకార మాయావర్ణములనుండి వచ్చినదని చెప్పవచ్చును. ఉ. నహ్; నద్ధ, [illegible]త్స్యామి.—ధా; హిత.—కకుభ్; కకుహ.—మహ్యం; తుభ్యం.

సామాన్యముగా హకారఘటితసంస్కృతపదముల 'గ్రీకు' రూపములలో హకారస్థానమున వర్గద్వితీయవర్ణమేదో యొకటి యుండును. ఈ క్రింది సంస్కృతపదముల 'గ్రీకు' రూపములలో మాత్రము గకారమగపడుచున్నది. సం. హనుః 'దవుడు', గ్రీ. genus, లా. gena.—సం. హ (అవ్యయము), గ్రీ. ge.—సం. హస్తః 'చేయి', గ్రీ. agostos.—సం. అహమ్ 'నేను', గ్రీ. egon› లా. ego.—సం. దుహితా 'కూతురు', గ్రీ. thugater.—సం. గూహామి 'దాచుచున్నాను', గ్రీ. ogugia, ogugos, guges.—సం. మహాన్ 'పెద్దదైన', గ్రీ. mega. ఇట్టి పదములను బట్టి వర్గద్వితీయచతుర్థములకు మాతృభాషలో వినిమయము కలుగుచుండెనని భాషాతత్త్వవేత్త లూహించియున్నారు.

౨౫. అనుస్వారము.—ఇదియును విసర్గయును నుభయాక్షరము లనబడుచున్నవి. దీనికి నాసికమాత్రము స్థానమని మనగ్రంథములలో జెప్పబడియున్నది. ముఖాద్యవయవములను స్పర్శ లేక వివృతముగా నుంచి నాదయుక్త మగు నిఃశ్వాసమును నాసామార్గమున వదలిన యెడల నీవర్ణము సిద్ధించును. వర్గపంచమముల కాయావర్గల స్థానమున జిహ్వాద్యవయవములకు స్పర్శ యుండగా దీనికి లేకపోవుటయే విశేషము. దీని స్వరూపవర్ణనము మనగ్రంథములలో నేకీభావమగపడదు. అథర్వవేదప్రాతిశాఖ్యలో ననుస్వార మొక స్వతంత్రవర్ణముగా నంగీకరింపబడియుండలేదు. అది లకారభిన్నమగు వర్ణములకు బూర్వమందుండునప్పుడు తత్పూర్వమందుండు నచ్చు ననునాసికముగా నుచ్చరింపవలయు ననునంశమును, లకారమునకు పూర్వమనునాసికలకార ముచ్చరింపవలయు నను విషయమును సూచించునని యీ గ్రంథమున జెప్పబడియున్నది. మిగిలిన ప్రాతిశాఖ్యలలో లకారమునకు పూర్వముఖతె యవలకు పూర్వముకూడ ననునాసికయవ లుచ్చరింపవలయు ననియు, రేఫమునకును నూష్మలకును బూర్వమనునాసికమను నొక స్వతంత్రవర్ణ ముచ్చరింపవలయు ననియు జెప్పబడినది. ఈ స్వతంత్రవర్ణ ముభయాక్షరమనియు, నాసికామాత్రజన్య మనియు, వివృతప్రయ

త్నము కలదనియు, వర్గపంచమవర్ణములలోని నాదస్వరూప మనియు ఋగ్వేదప్రాతిశాఖ్యలో జెప్పబడియున్నది. ఇది నాసికామాత్రజన్యమని వాజసనేయప్రాతిశాఖ్యలోగూడ చెప్పబడియున్నది. తైత్తిరీయప్రాతిశాఖ్యలో వర్గపంచములవలె నిదికూడ ననునాసికవర్ణమనిమాత్రము చెప్పబడి యున్నది. ఈ ప్రాతిశాఖ్యలలోగూడ గొన్నిపదములలో పూర్వాచ్చనునాసికముగా నుచ్చరింపవలసి యుండునని యంగీకరింపబడియున్నది. పాణినీయవ్యాకరణమున ననుస్వార మొక స్వతంత్రవర్ణముగా నంగీకరింపబడియున్నది. ఈ వ్యాకరణమున కనుస్వారమునం దధికపక్షపాత మగపడుచున్నది. ప్రాతిశాఖ్యలలో వర్గపంచమవర్ణమును విధించిన స్థలములగూడ బాణిని యనుస్వారము నంగీకరించియున్నాడు. అంతస్థలకు బూర్వ మనునాసికాంతస్థలును, మరికొన్ని సందర్భములలో ననునాసికాచ్చును గూడ బాణినీయవ్యాకరణమున నంగీకరింపబడి యున్నవి. వైయాకరణులలో నిట్టియభిప్రాయభేద ముచ్చారణభేదమును బురస్కరించుకొని వచ్చియుండవచ్చును. అనుస్వారస్వరూప మెట్టిదైనను నది పూర్వవర్ణమునకు గౌరవాపాదక మగుచున్నది.

విసర్గము.—ప్రాతిశాఖ్యలలో నిది విసర్జనీయమని వ్యవహరింపబడుచున్నది. విడిచిపెట్టవలసిన వర్ణమగుటచే దీని కీనామము వచ్చియుండవచ్చును. ఇది కేవలశ్వాసాత్మకవర్ణము. పూర్వాచ్చుస్థానమున నుచ్చారణావయవములనుంచి ప్రతిబంధకము లేక నిశ్శ్వాసమును వదలుటచే నీవర్ణ మేర్పడునని తైత్తిరీయప్రాతిశాఖ్యలో చెప్పిన విషయ మనుభవసిద్ధముగా నున్నది. కావున దీనికి కంఠము స్థానమని చెప్పుట సరికాదు. అకార హకారములవలె దీని కేస్థానముతోడను సంబంధము లేదు. ఇది మాతృభాషలోని వర్ణము కాదు. సంస్కృతమున పదాంతసకారరేఫల కాదేశముగా వచ్చుచుండును. పదాంతరేఫసకారములు కకారఖకారములకు పూర్వము విసర్గలోనికి కాక జిహ్వామూలీయములోనికిని, పకారఫకారములకు పూర్వ ముపధ్మానీయములోనికిని మారునని కొందరును, మారవచ్చునని కొందరును వైయాకరణులు చెప్పియున్నారు. ఈ భేదము వైయాకరణులు కల్పించినది కాని నిజముగా నాలోచింప విసర్గకును వీనికిని భేదమున్నట్లగపడదు. గ్రంథములలో నివి సాధారణముగా వేరువేరు గుర్తులతో సూచింపబడుట లేదు.

౨౬. సంస్కృతవర్ణములకు మనవారు పరిమాణమును గూడ నిరూపించియున్నారు. అచ్చులు హ్రస్వములు, దీర్ఘములు, ప్లుతములునని మూడువిధములుగా నున్నవి. సంస్కృతమున ఏఓలకు హ్రస్వములును, ఌకారమునకు దీర్ఘమును లేవని మనవైయాకరణులు చెప్పియున్నారు. ఌకారమునకు ప్లుతమమాత్రము కలదట. హ్రస్వ మేకమాత్రికము, దీర్ఘము ద్విమాత్రికము, ప్లుతము త్రిమాత్రికమునని చెప్పబడియున్నది. వ్యంజన మర్ధమాత్రికము. ప్లుతము ప్రశ్నించునపుడును, దూరమునుండి పిలుచునప్పుడును, వికల్పకథనమునను ప్రయోగింపబడును. పదాంతవర్ణము మాత్రమే ప్లుతముగా నుచ్చరింపబడును. అది యుదాత్త మగుచుండును. అనునాసికముగా నుచ్చరింపబడుట కూడ గలదు. సంస్కృతవాఙ్మయమున ప్లుతప్రయోగము క్రమముగా హెచ్చినది. ఋగ్వేదమున మూడుపర్యాయములు మాత్రమే ప్రయోగింపబడియుండగా నథర్వవేదమున పదునైదు పర్యాయము లగపడుచున్నది. ఏచ్చులప్లుతమున వానిలోని అకారమే ప్లుతముగా నుచ్చరింపబడును.

ఛందస్సుకొరకు వర్ణములు గురువులనియు, లఘువులనియు రెండువిధములుగా విభాగము చేయబడినవి. దీర్ఘములును, సంయోగపూర్వములగు హ్రస్వములును, అనుస్వారవిసర్గలతో కూడిన హ్రస్వములును గురువులనబడును. మిగిలిన వర్ణములు లఘువు లగును. మూడేసి యక్షరములు చేరి యొకగణ మేర్పడును. వీనికి అక్షరగణము లని పేరు. మూడక్షరములలోను నొక్కొకటి గురువు గాని, లఘువు గాని యగుచుండుటచే నెనిమిదిగణము లేర్పడును. మూడుగురువులు గలది మగణము; ఒకలఘువు రెండుగురువులు గలది యగణము; గురువు లఘువు గురువు గలది రగణము; రెండులఘువులు

# ప్రాచీనకాలపు నేత పరిశ్రమ

## ఉత్తర హిందూస్థానము



మగ్గమువద్ద



దూదియేకుట



జముకాణముల నేత



నవారుపట్టలను తయారు చేయుట

నొకగురువును గలది సగణము; రెండుగురువులు, నొక లఘువును గలది తగణము; లఘువు, గురువు, లఘువు గలది జగణము; ఒకగురువు రెండులఘువులు గలది భగణము; మూడులఘువులు గలది నగణము. మాత్రాగణము లక్షరముల సంఖ్య ననుసరింపక మాత్రల సంఖ్య ననుసరించి యుండును. నాలుగుమాత్రలుగల వర్ణసముదాయమున కొకగణ మని పేరు. ఈ యక్షర మాత్రాగణములు వేరు వేరు విధములుగా కూర్పబడుటచే క్రమముగా వృత్తములును జాతులును నేర్పడును. వృత్తములు సమము లనియు, అర్ధసమము లనియు, విషమము లనియు మూడు విధము లగుచున్నవి. సమవృత్తముల నాలుగు పాదములలోను గణములు సమానముగా నుండును. అర్ధసమవృత్తములలో యుగ్మపాదము లొకవిధముగాను, నయుగ్మపాదములు మరియొకవిధముగాను నుండును. విషమవృత్తములలో నాలుగుపాదములును భిన్నభిన్నములుగా నుండును.

---

# నిద్రాదేవి

సెట్టి లక్ష్మీనరసింహము గారు

(WORDS WORTH'S "TO SLEEP")

ఒకటి వెనుక నొక్కటిగాఁగ నుండి, మంద
మందముగఁ జను గొఱ్ఱెల మంద; వాన
ధ్వని; యళుల మ్రోత; నదుల రావంబు; గాలి
హోరు; కడలి ఘోష; మొలక పైరులు; జల
జలమను సరోవరములు; నిర్మల గగనము:
వరుసగా వీని నెల్ల భావంబు నందుఁ
దలఁచి, యెన్ని భంగులఁ బ్రయత్నం బొనర్చి
నను, నిదుర రాదు నాదుకన్గవకుఁ దెలివి
తోడనే పాన్పుమీఁద నేదొరలినాఁడ:
ఇంకనో యింకనో యింటి యెదటి తోఁటఁ
గలుగు చెట్లపైఁ బిట్టల కలకలములు
వినఁబడును; గోకిలమ్మాటు వెనుకఁగాక
లీస్వనంబునం బాడు జాలిం గొలుపుచు;
రేయి నాలుగుజాము లీ రీతిగానె
నీకటాక్షంబుఁ బడయఁగాలేక, పడితి
నమ్మ, బాధ న్నిద్రాదేవి! యకట! నీవు
దారితప్పియు రావు నా తావునకును:
నేఁటి రాత్రి కేనియుఁ గరుణింపుమమ్మ!
నీకరుణ లేకయున్నచో, వేకువసిరి
యెంత యున్న, దానఁ లాభ మేమి తల్లి?
దినదినంబులనడిమి మేల్ తెరవు, క్రొత్త
తలఁపులకుఁ బంట భూమివి, తనువునఁ గల
సకలరుజలఁ బాపి సుఖమొసంగెడి ప్రియ
జననివీవమ్మ, రావమ్మ, కనికరమున.

---

## బదలాయింపు

కవికొండల వేంకటరావుగారు, బి.ఏ.,బి.యల్.

స్టేగబండిలో ఉండవలసిన జనంకంటె ఎక్కువమందివుంటే గొలుసు లాగి బండిని ఆపేపని ధైర్యంగలవాళ్లు చేస్తాంటే ధైర్యంలేనివాళ్లు గొలుసులాగకుండా ఊరికే ఉన్న జనాన్ని లెక్కేస్తూవుండడం, ఎదురుగుండా కనబడే కనీససంఖ్య గమనిస్తూవుండడం చేస్తూవుంటారు ఆలాంటి ధైర్యంలేనివాళ్లల్లో ఒకడు మధుసూదనరావు.

అత డందటికంటె ఆఖరున బండిఎక్కేడు. అది మధ్యమతరగతిబండి. సమయం మంచి వేసంగిమిట్టమధ్యాహ్నము. బండి నిలిచినతావు "గోదావరి." ఊం — ఉక్కపోసేస్తూంది. వెనక్కితిరిగి చూడ్డానికన్నా వీలు లేకుండా క్రిక్కిఱిసి పోయియుంది ఆ బండి—

అతనిభార్య జానికమ్మ, ఇద్దఱుపిల్లలు నేలనే నిలుచుకొనివున్నారు. 'మోలిమేను' పెట్టినుండి ఆలిమగల ఛాయాపటంవఱకు ఆ బండలోనే సరదాలి.

శకటరక్షకు డీలేస్తున్నాడు. సేవకుఁడు గంటకొట్టబోతున్నాడు. బండిలాగేయంత్రము బుస్సుమని ఆవిరి వదిలేసిందప్పుడే.

భర్త సామానందుకుంటున్నాడు. భార్య అందిస్తూవుంది. పిల్ల లిటు అటూ చూపుడు స్తంభాలకేసి క్రొత్తచూపులు చూస్తూవున్నారు. కూలివాళ్లింకా సామానుమీద సామాను, సామానుమీద సామాను తెచ్చి పడేస్తున్నారు. అంతా వారిసామానే, అంతా వారిసామానే.అంత వారిసామానే యని మెల్లా తెలుసునంటె ప్రతివొక్కచెంబుమీద ప్రతి వొక్కపళ్లెంమీద కూడ "మధుసూదనరావు, కె. విజయవాడ" అని చిరునామా కాగితం అంటించివుంది. ఆ—సామానంతా ఆబండిలోకెక్కెయ్యాలి. ఆబండిలో కుక్కెయ్యాలి. జానికమ్మ వొక్కర్తుక యువతల పాపం! మొగాన్ని చెమట్లు పోస్తున్నాయి. మధ్యమధ్య కోపాన్నైతేం విసుగుచేనైతేం కనుబొమ్మలు ముడివడిపోతున్నాయి. "అమ్మా! నాసంగీ తప్పెట్టి జాగ్రత్తేవ్!" అంటూ ఆడపిల్ల,"అమ్మా నాబంతిపడిపోయేనే" అని మగపిల్లవాడు అంటూంటే ఊరికే మెళ్లో గడియారపు గొలుసు సారెసారెకు సవరించుకుంటూ కిటికేలంట కొంతసామాను గుమ్మంఅంట కొంతసామాను గిరవాటేస్తోందా అన్నట్లు అందించి వేస్తూవుంది. మగడందుకుంటూ మధ్యమధ్యబండినే వ్రాసియున్న "కనీససంఖ్య ౮" అనేదిచూస్తూవుంటాడు. బండిలో అంతక్రితమే ఎక్కివున్న జనం ౭ గురు అని లెక్కేడుతూంటాడు.

పిల్లల్ని భార్యానీ ఆ బండిలోకే ఎక్కమంటాడా? మఱోబండిలోకి పొమ్మంటాడా?

పిల్లల్ని ఏలాగో అందుకున్నాడు. అందుకొని పైని పడకకమరిచిన పరుపులమీద కూర్చుండబెట్టినాడు. భార్యను "ఎక్కవే. ఎక్కు. ఎక్కవేం" అని చెయిపట్టి లాగుతున్నాడు. "నే నీ బండిలో నెక్క"నన్నట్టు కొంత సే పిటూ అటూ ఆయిల్లాలు చూచింది. శకటరక్షకుడు ఈలేసినాడు. కుటిలకుంతల బండిలో కెక్కి బండిగుమ్మముయొక్క కమ్ములుపట్టుకుని "ఇందులో కూరుకుండవలసిందేనా? గొప్పకి పోతాము. ఏదీ? పిసనైనా యెడంలేదు" అని ధాము ధూము చేసింది. ధూమశకట మంతకన్నా తాను ధాము ధూముచేయగలనన్నట్లు గుప్పగుప్పమని పొగ వదిలింది. ఇనపదండ కదిలించింది. వెనక్కి ఒకఊపుఊపి ముందుకుబండినంతా లాక్కుంది "టకుటక్ టకుటక్ టకుటక్ టకుటక్"మని వంతెనమీదకంటా నడచి వంతెనమీద కొంచెంతగ్గి, ఆపైని ఆగేకాడాగి సాగేకాడ సాగి అతివేగంగా పట్టాలమ్మటే పోతూవుంది.

తక్కిన ఏడుగురు గోదావరిలో ఎక్కి కొవ్వూరులో దిగేవాళ్లవడంచేత తరువాతి నిలుకడనే బండి ఖాళీచేసినారు. బండిలో దంపతులు పిల్లలు ఉన్నారని మరెవ్వరూ ఆబండిలో ఎక్కలేదు.

"ఈ ఆలస్యమంతా నీ" దన్నాడు మధుసూదనరావు మరెవ్వరూ తొంగిచూడని సమయం చూచి—"ఈ ఆలస్యమంతా మీ" దంది జానికమ్మ- "నీవు మధురచీర కట్టుకొని, కంచిరయిక తొడుక్కొని, సెనగపప్పులాగు పీటీచెక్క పటపటామనిపిస్తూ గుప్పెడు కవటాకు లెక్కెట్ట నమిలివచ్చేసరి కీవేళైంది. ఇంతశ్రమ అయింది" అన్నాడు.— "ఎవరైనా నవ్వుకుపోతారు - పిల్లలూ నేనూ వస్తూవున్నాము అంటే ప్రయాణానికి ముందుగా ఒక ప్రత్యేకపుబండి ఏర్పాటుగా అట్టేవుంచుకోరూ—అయినా బండిలో ఇంతమందికంటె ఎక్కువ ఎక్కకూడదని వ్రాసియుండదూ— అబ్బా! ఎంత యిరకాటకం అయిపోయింది" అంది.

అంటూ తన మడతద్దంబల్ల చెక్కఎత్తి ఒకమాటు మొగంచూచుకొని చెంపలొత్తుకొని "యీబండిలో నీళ్లుంటాయా? సబ్బెటి రుద్దుకోవాలి" అని అడిగింది జానకమ్మ మధుసూదనరావుని—"ఎందు" కన్నాడు మధుసూదనరావు. "చెబుతాగా" అంది జానికమ్మ. "అయితే ఫరంగీనీళ్లెందుకు; మన కూజాలో నీళ్లుపెట్టి మొగం రుద్దుకో"మని కూజాలోని చల్లటినీళ్లు ఆమెచేతిలో పోసినాడు. జానికమ్మ పరిశుభ్రంగా తన మొగము చందనసబ్బుతో రుద్దుకొని దూదిమెత్త తువాలుతో తుడుచుకొని చేర్చుక్కపెట్టుకొని కోక కుచ్చెళ్లు కాలిగోళ్లమీదికంటా తీసికొని తనయొడిలో పిల్లవాణ్ణి కూర్చుండబెట్టుకొని అమ్మాయిని సంగీతప్పెట్టి ఊదుకోమంటూపోగ్గాఉంది. మధుసూదనరావు ధైర్యం చిక్కబట్టలేక "చెబుతాగా అన్నావు. ఏమి" టని యడిగినాడు.

"చింపిరితలతోటి చెదిగిన తిలకంతోటి విజయవాడలో నే దిగితినా నేనొక మూట

మనిషిననుకొని యితరులుకూడా తమసామా ను సొకెత్తిని పెడతారేమోననే భయంచేత టస్సాగా ముస్తాబు అయినా" నని టకీమని జవాబు చెప్పింది. దాంతో మధుసూదనరావు పెళ్లాంచేత తా నొక టోకు తిన్నా నను కున్నాడు.

"గోదావరి"కడ తానే క్రిందవుండి జాన కమ్మనే లోపలి కెక్కించి సామానందించిఉంటే బాగుండిపొయ్యేదేమో నని యొకమాటు, అసలు కుదర్చేటప్పుడే మఱినలుగురికూలీల్ని కుదిర్చి తానూ జానికమ్మాకూడా తమసామా నంతా కూలీలెక్కించే వఱకు, గొడుగులు వేసి కొని, జోళ్లుతొడుక్కొని పరిశీలిస్తూ వుండి యుండియుంటే బాగుండిపొయ్యేదేమోనని యొకమాటు, అక్కడకూ సామాను చాల వఱకు సామానుపెట్టి కొప్పగించి వేసాను. అంతకాలమేలాపట్టిందా యీకొద్దిపాటిసామా నుకూ అని యొకమాటు, గుక్కతిరగని శ్రద్ధ తిని, గుటకపడని రుద్ధతను ఆలోచించేడు. ఆలో చించి ఆలోచించి చివరకన్నాడు. "ఆబండిలో మనకుముం దప్పుడే యేడుగు రెక్కియున్నారని యెరుగవా"అన్నాడు. "ఎఱిగుంటే"అంది."ఎన మండుగురుకంటె బండిలో ఒక్కడకూర్చో డానికి వీలులేదని తెలియదా" అన్నాడు. "తెలి స్తేనో"అంది."నిన్నుముందెక్కిస్తే నేను తొమ్మి దవవాణ్ణిఅయిపోనా" అన్నాను."అయిపోతేం" అంది. "గొలుసులాగితే నేను దిగిపోవద్దా" అన్నాడు. "దిగిపోతేం" అంది. "నాకు బదలా యింపు అయిందికదా! రేపు విజయవాడచేరి పనిఒప్పగించుకోవడం నువ్వా? నేనా?"అన్నా డు. ఇద్దఱం వొక్కసారే ఎక్కిపోయి గొలుసు లాగితే ఉండే సదుపాయం మీకేంతట్టలేదా" అని అడిగింది. "ఏమి"టన్నాడు. "మిమ్మల్ని నన్ను విడదియ్యడంచేతకాక శకటరక్షకుడు తక్కినవారిలో ఇద్దఱిని దింపివేసియుండడూ? ఆ ఇద్దఱిని మఱియొకపెట్టిలోకి పంపేసియుం డడూ?" అంది. "అంతధైర్య ముండవద్దూ నాకు?" "అంతధైర్యముండవద్దూ నాకు?" అన్నాడుమధుసూదనరావుచిరునవ్వునవ్వుతూ. ఆ చిరునవ్వు కొట్టకొన కిచకిచ 'విజయవాడ' 'విజయవాడ' అన్నట్టైంది. విజయవాడే అది.

తాబేదార్లు,క్రిందియుద్యోగస్థులు, సేవకులు, బండదుయ్యముగ్గి ఒకరుతోలుపెట్టి పుచ్చు కుంటే ఒకరుచేతిబెత్త మందుకొని అరనిమి షంలో అంతసామాను దింపి, పంతులుగారూ! గుజ్జుపుబగ్గీ ఆవలవుంది. దయచేయండి పిల్లలు మీరూ" అని వేజే మధుసూదనరావుగాని జానకమ్మగాని సామానుకేసితిరిగిచూడనక్కఱ లేనంత వినయవిధేయతలతో నమ్మకముగా వారికి తమతమ చేతుల దారిచూపిస్తూ తోడ్కొని వెళ్లినారు.

ఆ స్వాగతసమయమప్పుడు మధుసూదన రావు జానికమ్మ కేసి చూచిచూడనట్టు నటిస్తూ ఆమెచేతిలో ఒకపటముంటే అది అందిపుచ్చు కొని తానుమోసిపెడుతాననే మోస్తరుగా 'ఏదీ' అన్నాడు. "అక్కఱలేదులేండి నే తెచ్చు క్కొంటానులేండి" అన్నట్టు బొమ్మవైపు తిన

జఘనభాగమునకంటేటట్టు దాపరికంగా వ్రేలు చేతనూచుచు మోచికొని జానికమ్మ తెచ్చినది.

మధుసూదనరావు తొంగి తొంగి కని పెట్టి 'ఆపటంమఱొకరుపట్టుకువస్తేం?'అన్నాడు. "మీపేరు నాపేరు కలిపి వ్రాసాను నాచేత్తో దానిమీద"నని తన ముసిముసిసిగ్గు దిక్కులు బుగ్గలంటి పుణికిపుచ్చుకొనుటకు వీలుగా ఆ పోడిమివ్రాత నాథునికి చూపిస్తూనడిచిందిజానికమ్మ.

"ఈపట మెంతసేపు మోచినా మోటు తనంగాని మూటతనంగాని లేదు. తక్కినవన్నీ మోస్తే మోటుతనం మూటతనమూనా?" అని అన్నాడు మధుసూదనరావు. "తక్కినవాటి మీద మీపేరొక్కటే 'మధుసూదనరావు, కె. విజయవాడ' అని వ్రాసికొన్నారు. దీని మీద నాపేరు, మీపేరు కలిపి వ్రాసికొన్నాను. అదీ తేడా" అంది జానికమ్మ.

సందెలడింది. దిగినజనం వారికి పాయ యిచ్చి యొత్తిగిల్లేరు. దిగనిజనం చన్నపట్టాని కంటా ఆ ప్రేమవాక్యం స్మరించుకుంటూ వెళ్లేరు.

---

# తొల్లిటి మానాడు

(స్వేచ్ఛాగానలహరి)

వ. రామారావు గారు

ఆనాటి సౌభాగ్యమేదీ!—మనమాత
యీనాడె యిట్లున్న దేమీ!

౧

చివురుజొంపములచే, నవనవలాడింది
కవుల గానములచే క్రమరస మొలికింది
ఆనాటి.

౨

[illegible]కళలెన్నెని సృష్టించి వేసింది
[illegible]నేలగజాలు తనయుల గాంచింది
ఆనాటి.

౩

జయదేవ కాళిదాసాది పుణ్యుల గాంచి
నయకవిత్వపుపెంపు ననుజూడుమనియంది
ఆనాటి.

౪

జగమంతటకుచూప జాలింది తనశక్తి
మగటిమికి నేనహో మాతనన్నది యుక్తి
ఆనాటి.

౫

పరుల గూల్పగ జాలు పడంతులనె గాంచింది
యొరుల తనవారివలె యొప్ప చూపించింది
ఆనాటి.

౬

పట్టుపిల్లాలకే పట్టుగొమ్మయినాది
పట్టణములకు నెల్ల ప్రభ్వి తా నయినాది
ఆనాటి.

---

# తెల్లటివి అన్నీ పాలుకావు

శ్రీమతి అద్దంపూడి అన్నపూర్ణమ్మగారు

ఆ వేళ సోమవారం. రేవటిపాలెంలో సంత.

అక్కడ విస్తారమైన బయలు ఉంది. చెట్లు కొంచెము దూరముదూరముగా ఉండడంచేత జనానికి యెండతగలకుండా నీడగా ఉండెను. ఆసంతలో అన్నిరకముల పండ్లదినుసులూ, పప్పుసరుకులూ, కూరకాయలూ, మనకుటుంబ కాలక్షేపమునకు యేమివస్తువులు కావలెనో అన్నియూ దొరకును. వెంకట్రాజు అక్కడ ఒకస్థలంచూచుకొని గోనెలుపరచి, ముషిణి గింజలున్నూ, శేరున్నూ, దగ్గరపెట్టుకొని వ్యాపారముకొరకై యెదురుచూస్తూవున్నాడు. కొందరువచ్చి రూపాయకు నాలుగుశేర్లా, అయిదుశేర్లా అని అడిగినారు. వెంకట్రాజు మూడుశేర్లకుపైన ఇవ్వనని చెప్పినాడు. పాపము అతనికి ఈ ధరలు యేమీ తెలియవు. తండ్రికి జబ్బుగావున్నందువల్ల బేరమునకు బయలు దేరినాడుకాని లేకపోతే వచ్చేవాడుకలేదు. వెంకట్రాజుకి సుమారు ౨౦ లేక ౨౧ సంవత్సరములే ఉండును. అంతకు ఎక్కువ వుండదు. ఇతనుపుట్టి ఇన్నిదినములవరకూ సంత అంటే యేలాగు ఉంటుందో కూడా యెరగనే యెరగడు. సాయంకాలం కావస్తూంది. ఏమో స్వల్పంగానే బేరమయినది. చూసినాడు. లాభంలేక పోయింది. ఆఖరుకు యెవ్వరికో వెయ్యిరూపాయలకు గుత్తకిచ్చివేసి రూపాయలు తీసుకొని, సంచిలోవేసుకొని, బొడ్డులో దోపుకొన్నాడు. వెంకట్రాజు చూపుకు చాలా అందమైనవాడు. ముక్కూమొఖమూ తీరుగానే ఉన్నాయి. పొడగరిమనిషే. ఆ బిళ్లగోచీ పంచకట్టూ, వాణ్ణిచూస్తే పెద్దకులంలో పుట్టినవాడిలాగనూ, మర్యాదస్థుడుగానూ కనుపించుతాడు. ముషిణిగింజలు అమ్మి గోనెలూ, ఇంకావాడి సామానులూ అన్నీసర్దుకొనేటప్పటికి అయిదు గంటలు అయినది. ఇంకా ఇక్కడనే ఉంటే ప్రొద్దుపోవును అని వాడి నివాసస్థలానికి బయలు దేరినాడు. సంతవిడిచి ఓ పది అడుగులు వెళ్లేసరికి, నిర్ఘాంతపడి నిలిచి పోయినాడు. వానికి ముందు అడుగుపడలేదు, ఇది యేమని ఆలోచిస్తూవున్నాడు.

అక్కడ పెద్ద చింతచెట్టు. దానికొమ్మలు నాలుగువైపులనూ విజ్జిమ్మకొని ఉన్నవి. ఆ చెట్టుక్రింద ఒకస్త్రీ సుమారు ౧౮ సంవత్సరముల వయస్సుగలది నిలిచివుండెను. చారెడేసికండ్లూ, విశాలమైననుదురూ, బారెడు జెడా, ఈ కాలపు నాగరీకమైన నగలు వేసుకొన్నది. గనుక చూపరులకు చాలా ఆశ్చర్యముగా కనుపించెను.

వెంకట్రాజు ఆలోచించి "రేవటిపాలెంలో ఇటువంటి స్త్రీలుకూడా వున్నారా? ఇది యేకారణముచేత నిలచి ఉన్నది? నేను పోయి దానిని అడుగుదునా? ఛీ! వద్దు నేను అడిగినట్లయితే చూసినవాళ్లు యేమి అను

కుందురు." అని సందేహిస్తూ అక్కడ పనస పండ్ల దుకాణము దగ్గరకువెళ్లి బేరముచేస్తూ నిలువబడినాడు.

ఇంతలోపల సుమారు ౫౦ సంవత్సరముల లోపువాడు విరువిరున నడుస్తూ ఆ పిల్లదగ్గరకువచ్చి యేమోచెప్పి పండ్లుకొరుకుతూంటే, ఆపిల్ల వంచినతలయెత్తకుండా నిలువబడియుండినది.

వెంకట్రాజు తన మనస్సులో యేమని ఆలోచిస్తూఉన్నాడంటే, "వాళ్లది యేవూరై యుండవచ్చును? ఆయన యెవరు? తండ్రీ, కూతుళని అత్తవారి యింటికి తీసుకొనివెళ్లుతున్నాడా? లేక, సంతకు వచ్చివున్నారా? నేనే బుద్ధిపొరపడుతున్నాను. తండ్రి అయితే అట్లా కోపించుకుంటాడా? ఆ ముసలివాడు తండ్రికాడు. భర్త అయివుంటాడు. లేకపోతే యింతకోపించుకోడు. ఒకవేళ రెండోపెండ్లి అయివుండును. నేను వాళ్లతోటి కలసిమాటలాడితేనేకాని విషయము తెలియదు." అని అనుకుంటూవుంటే వాళ్లు ఇద్దరూ కూడా ఈ పనసపండ్ల అంగడిదగ్గరకు వచ్చి బేరము చేసినారు. వాడు వెల సరిగా చెప్పనందువల్ల, వెంకట్రాజునుచూచి, "మీరు యేలాగు కొన్నారండి?" అని ఆ ముసలివాడు అడిగినాడు. అప్పుడు వెంకట్రాజు వాళ్లవిషయం కనుక్కోవలెనని చాలా ఆతురతగా ఉండెను. ఆలావున్నసంగతి బయటికి తెలుపక, "నేను అణాకు అయిదుతొనలచొప్పున కొన్నాను." అనిచెప్పినాడు. "ఆవిధముగానైతే, నేనూ తీసుకుంటాను" అని చెప్పి, అతనుకూడా తొనలుకొని కొంచెం ఆపిల్లకుఇచ్చి, తనుకొంచెం తీసుకొని, తింటూ వెంకట్రాజునిచూచి "మీది యేవూరండీ?" అని అడిగినాడు.

"మాది వడ్లపూడి" అని బదులుచెప్పెను.

"అయితే మీరు ఇప్పుడు అక్కడికే వెళ్లుతున్నారా?"

"అవును ఆవూరే వెళ్లుతున్నాను."

"మీ నాయనగారిపే రేమండీ?, మిమ్ములిని యెక్కడనో చూచినట్లు వున్న దే?"

"యేమో నాకు జ్ఞాపకం లేదండీ, మా నాయనగారిపేరు వీరరాజుగారు"

"ఓహో! మీరా, వీరరాజుగారి కుమారుడుగారా? అయితే, యేమిపనిమీద వచ్చేరండీ? ఆయన పూర్వార్జితం చాలా ఉండేది కాదండీ? అదంతా ఇప్పుడు వుందా? అయితే మీ కేమి తెలుసునూ? అప్పుడు మీకు చాలా చిన్నతనం. నాలుగో, అయిదో యేళ్లు వుంటవి. వీరరాజుగారికీ నాకూ చాలస్నేహం. మే మిద్దరం మునుపు ఒకేవూళ్లో ఉండేవాళ్లం. ఒకేచోట తిరిగేవాళ్లం. మాకిద్దరికీ ఇప్పుడిప్పుడు వచ్చినస్నేహం కాదు. పిల్లలుగా ఉండి బడిలో చదువుకుంటూన్నప్పటినుంచీ కలదు. అవునుగానీ, మీ నాయనగారూ అందరూ క్షేమమేనా?"

"చిత్తం. క్షేమంగా వున్నారండి."

"అయితే, మీరు యేదైనా వ్యాపారం మీద వచ్చేరా?"

"అవును, వ్యాపారమే. మానాయనగారికి మొన్ననే కొంచెం వంట్లో సుస్తీగా వున్నందువల్ల నేనే వచ్చినాను."

"యేమిసరుకు వేసుకొచ్చేరండీ? యేమైనా లాభం దొరికిందా?"

"ఆధరలన్నీ నాకు తెలియవు. కాని, వెయ్యిరూపాయలకు గుత్త కిచ్చివేసినాను. యేమిలాభమో లెండి, ఇప్పుడే ఇంటికి బయలుదేరినాను. అయితే, తెలియక అడుగుతున్నాను. మనది యేవర్ణమండీ? ఏవూరికి వెళ్లదామని బయలుదేరినారు."

"మేమా, కోమట్లం. నాపేరు మీకు తెలియదేమోకాని, నాగన్నశెట్టి అంటారు. మేము కూడా ఆవూరికే బయలుదేరినాము. ఆవూరికి నేనువచ్చి చాలా రోజులయినది. అందుచేత చూచివత్తామని బయలుదేరితే, ఈ ఆడవాళ్ల తోటి చాలాకష్టంగావుంది. ఇప్పుడు రాత్రి అయిపోయింది. నాకు వూరిలో యెవ్వరినీ తెలియదు. ఇక్కడ యెక్కడనైనా బసచూసి ఉండేదా? లేక, రాత్రి అయితేనేమి ఫరవాలేదని వెళ్లేదా, అని ఆలోచిస్తూవున్నాను." అన్నాడు నాగన్న శెట్టి.

"ఈపక్కనే హోటెలు ఉంది. అక్కడకు వెళ్లి మనమంతా అక్కడనే భోంచేసి ఒకగది పుచ్చుకొని రాత్రి అక్కడనే పడుక్కొని తెల్లవారు జామునసే బయలుదేరి అంతాకలసి వెళ్లుదాము." అన్నాడు వెంకట్రాజు. సెట్టికి చాలా సంతోషమయినది.

"మీఇష్టం మీరేలాచేస్తారో నాకు అదే ఇష్టం. మా కీవూళ్లో యెవరినీ తెలియదు కదా? అయితే మీకు చాలా శ్రమకలుగజేసే వాడిని అవుతాను." అన్నాడు నాగన్న శెట్టి

"మరియేమీ ఫరవాలేదు లెండి" అ వాళ్లనిద్దరినీ హోటలుకు తీసుకునివెళ్లి భోజన చెయ్యమని, తను ఒకగదిఅద్దెకు మాట్లాడి వచ్చి భోంచేసి అందరుకలసి గదిలోపలకు వెళ్లినారు.

ఆపిల్ల అప్పటినుంచీ సిగ్గుపడేటట్టు నటిస్తూ వెంకట్రాజు చూచినప్పుడు తలవంచుకొ లేనిసమయంలో వోరచూపులు చూస్తూ డేది. ఆపెద్దగదిలో ఒకవార ఆపిల్లాను, ఇ నొకవార వెంకట్రాజున్నూ, నాగన్నశెట్టియ న్నూ పడుక్కొన్నారు. వెంకట్రాజు చాల అలిసినందువల్ల, తత్ క్షణమే నిద్దురపోయెను వెంకట్రాజు నిద్దురపోయిన తోడనే, నాగన్న శెట్టి యెక్కడకో లేచి వెళ్లిపోయెను. అప్పటి సుమారు ౧౨ గంటలు అయ్యిండును. ఈలాగ ఉంటూండగా శెట్టి లేచివెళ్లినతోడనే, ఆపి మెల్లగా లేచి వెంకట్రాజు దగ్గరకు వెళ్లిన నాలుగు ప్రక్కలా చూచి వాడి మొగమువ నే రెప్పవాల్చకుండాచూస్తూవున్నది. గుభా మని తలుపుచప్పుడు వినబడ్డది. ఆశబ్దం విని తోడనే, వెంట్రాజుకు మెలకువ వచ్చిన అంతలోపల ఆపిల్ల యేమో భయపడినట్లు వ కుతూ వెళ్లి, "నన్ను కాపాడవలసినది. నా బంధుసంపర్కమైనవాళ్లు యెవ్వరూ లేరు.

సర్వేశ్వరుడే దిక్కు" అని, భయకంపములతో వెంకట్రాజును తలుపుతియ్యనీయకుండా, ఇంకా యేమో చెప్పతోవున్న సమయంలో, బయటి నుంచి తలుపు విరిగేటట్లు తట్టినలాగు వినబడెను. ఈపిల్ల వీడిని తీయనీయడం లేదు.

"నీకేమీ భయములేదు. నిన్ను కాపాడవలసిన పూచీ నాది" అని ధైర్యము చెప్పి మెల్లగా తలుపుదగ్గరకువచ్చి తలుపుతీసెను. తీసిన తోడనే, నాగన్న శెట్టి గబగబలాడుతూ వచ్చి, ఆపిల్లను తీసుకొనిపోయినాడు.

"ఏమిదీ, దానిని ఈ అర్థరాత్రివేళ తీసుకొనివెళ్లుతున్నాడు. అయితే ముసలివాడు కాదా? దానిపైని సందేహపడి హింస చేయడానికి తీసుకొని వెళ్లుతున్నాడేమో, దానిని నేను రక్షించక తప్పదు" అని ఆలోచించుకొని లోపలనుంచి బయటికివచ్చి మెట్లు దిగుతూన్న సమయంలో, పెడేలుమని ఒక్కదెబ్బ తలమీదపడెను. ఆదెబ్బ పడినతోడనే క్రిందపడి మూర్ఛపోయినాడు. అరగంటసేపటికి వెంకట్రాజుకు కొంచెం తెలివి వచ్చినది.

కండ్లు విప్పిచూచుసరికి వీడిచుట్టూ దీపాలు పెట్టుకొని పోలీసువాళ్లు కూచుని ఉన్నారు. వెంకట్రాజు వాళ్లనిచూచి, "ఆ ముసలివాడు యెక్కడ? వాడిభార్యయెక్కడ? యెక్కడకు పోయినారు? కనపడడం లేదే, పాపం ఆపిల్లను యేమికష్టపెట్టుతున్నాడో!" అని మెల్లగ లేవపోతూంటే, వాడిని, వాడి మాటలనూచూచి, పోలీసువాళ్లు ఫక్కున నవ్వి, "ముసలివాడేఁ? ఆ ముసలివాణ్ణి పట్టుకుందుకే, ౧౦ సంవత్సరములుగా మాచేత కాకపోయింది. ఈరోజున వాడు సంతకు వచ్చినాడని తెలిసి, మేము యెంతనో ప్రయత్నపడి తేకూడా, మాచేత చిక్కక మేము వచ్చేమని తెలసే మిమ్మలినికొట్టి, వాడు పారిపోయినది. మరి యేమనుకున్నారు, బాబూ? వాడు యెవరని అనుకున్నారేమిటి? మనజిల్లాఅంతా పేరుపొందిన మొదటిదొంగైన పూతిక నారాయుడు కాదా?

ఆ పిల్ల వాడికి దొంగతనానికి టక్కు చేసేది కాదా! మీరేమో పుణ్యంచేసుకున్నారు. లేకపోతే, వాడిచేత దెబ్బతిన్నా, రూపాయలు దక్కించుకున్నారు, మీ అదృష్టమే అదృష్టము. లేకపోతే? ఒక్కదెబ్బతినేసరికి అట్లనే ప్రాణాలుపోవా! మీరు యెంత బలశాలులండీ." అని పోలీసులు చెప్పేసరికి, వెంకట్రాజు ఆలాగే చూస్తూ నిర్ఘాంతపోయినాడు.

---

# ప్రాచీన దేవాలయ శిథిలములు

సాగి వెంకట నరసింహం గారు, యమ్. ఎ.

శ్రీయుత రాజరాజ కులశేఖరుడర్థిజన ప్రపోషణా
త్యాయత దానశాలి బహుళాంధ్రజన స్తవనీయ సద్యశః
కాయుఁడు విష్ణువర్ధనుఁడుగాదె ఘటించె నమోఘమైన దే
వాయతనంబు జీర్ణమగునంచుఁ దలంచెనె యెన్నఁడేనియున్.

అల్లదె శాసనంపుశిల యాలయభిన్న శిలాతటంబులన్
మెల్లన నిల్చి చూపెడు నమేయమునై తగుపూర్వ శోభ మీ
యుల్లములం దలంప మహిమోన్నతి గుండెల నీరుచేయదే
కల్లయె కాలదేవత యకారణశత్రువుగాదె యేరికిన్.

అరరే! ఊహాకతీత మెంతటి మహోర్వాంబైన కల్యాణ మం
దిరమో యిద్ది ప్రతిష్ఠవేళ నృపనిర్దిష్టాధికంబైన వా
ద్యరమానాదము మంత్రరావము భటాద్యశ్రాంత సల్లాపమున్
బరమోత్సాహజనాభివాదము కటా, వమ్మయ్యె నిప్పట్టునన్!

శతములు వర్షముల్ గడచెఁ జాల్పడిక్రొమ్మెగ్గె విచిత్రశిల్పముల్
కతలయిపోయె నీప్రతిభ గర్హిత క్రూరతురుష్క హస్త మ
ర్దితమయి నాశమందె సముదీర్ణ శిలామయవిగ్రహంబు లీ
వితమును గాంచి కుందెదను వేంగిప్రభుత్వమహత్వ మెంచియున్.

ప్రాకారమా యిద్ది పరమాణుతుల్యమై పొడిపొడియై రాలిపోయె నయ్యొ
మంటపస్థలములా మంటిదిబ్బల బోలి కుప్పలుకుప్పలై కూలిపోయె
శిఖరంబులా యివి శీర్ణమై రూపమే లేకుండ పుడమిలో లీనమయ్యె
మూర్తియా యిది విరాణ్మూర్తియయ్యునునామమాత్రావశేషతా పాత్రమయ్యె
ప్రకృతిపురుష సమ్మేళన ప్రకటమైన-జగ మనంతము నందిట్లు విగతినందు
నంచుఁజూపుటకా యిది యహహా యిట్లు-లయము చెందెను బృథివీలలామయందు.

అఖిలభారత వంద్యమైయలరునట్టి-వేంగిచాళుక్య శిల్పవిభిన్నగతికి
వేడిరక్తాశ్రుకణముల విడువనట్టి-యాంధ్రసోదరు డుండునే యవనియందు.

---

# సిసిం(ద్రీ పత్రిక

(ఇది 15-2-1930 తేదీని, రాజమండ్రీ ఆర్ట్సుకాలేజీలో నిడమర్తి జలదుర్గ ప్రసాదరాయుడుగారి ఆధిపత్యముక్రింద జరిగిన ఆర్ట్సుకాలేజి ప్రాత విద్యార్థిసంఘముయొక్క వార్షికోత్సవ సందర్భమున నందివాడ చిదంబరముచే చదువబడినది.)

## 1. ప్ర క ట న లు

(1) మీ భార్యారత్నము, మిమ్ములను వెనకాతల ఆక్షేపించుచున్న సంగతి మీకు తెలియునా? తెలిసినచో మీరింకనూ చిరిగిన దుస్తుల నేల ధరించెదరు? ఫేషనబుల్ కోట్లు, షర్టులు, లాగులూ, పంచలూ, తలపాగాగుడ్డలూ మాచేత ఏల కుట్టించుకొనరు? మేము ప్రతీ నిరక్షరకుక్షినీ, డిప్పకాయనీ, రాలుగాయనీ, చీమిడిముక్కునీ, అనామకునినీ గూడా, కేవలమూ అందముగా మా చేత కుట్టబడిన దుస్తులతోనే, బహుఘనా నా మనిషిగనూ, అందగానిగనూ, చేయుచున్నాము. వేయేల, మేము కుట్టిన దుస్తులను ధరించి యింటికి పోయినచో మీ భార్యారత్నము సహితమూ మిమ్ములను ఎక్కువగా love చేయును. అట్టి సందర్భములలో నామెయొక్క ప్రసన్నతకు కారణము, మిమ్ములను అందమైన క్రొత్తదుస్తులలో నుండుటవల్ల ఆమె గుర్తింపకుండుటయే అని ధైర్యముగా చెప్పగలము.

అనేకమంది మంత్రులూ, జడ్జీలు, లాయర్లు, డాక్టర్లు, టీచర్లు, కుట్టుపనియందు మా నేర్పరితనమును గురించి, విలువగల సర్టిఫికేట్లనున్నూ, అనేక యోగ్యతా పత్రములనూ, కోరినిదే మాకు ప్రసాదించి యున్నారు. కొంతమంది "ఎగ్గైరాలు" గూడా మమ్ములను పొగడి యున్నారు.

వాహబ్ అండు కంపెని,
విశాఖపట్నం.

## (2) జమీందారీ కాఫి హోటల్-ఏలూరు

నవీనరుచులు!! నలభీమపాకం!!
కానవలె!! తినవలె!!

వంటబ్రాహ్మణులు:—

1. అడవి నకులుడు. B. A., B. L.
2. పురం భీముడు. B. A., B. L.

మరా:—1. B. A.—Bachelor of ఆవడలు
2. B. L.—Bachelor of లడ్డూలు

ధనము మాకు ప్రధానం గాదు. పదార్థములకు నూతన రుచిని తెప్పించుటయే మా పరమావధి. విద్యాధికులైన ప్లీడర్లు సహితమూ, పరగడుపుననే మా కాఫీహోటలునకు దయచేయుటయే, మా పదార్థములరుచికి తార్కాణము. అంతమాత్రాన, సదరు ప్లీడర్లు క్లైంట్లకొరకు వెదకులాడుచూ యిక్కడకు వచ్చెదరని అనుకొనుట తమ బోంట్లకు పాడిగాదు. ఇహ, పదార్థముల ఆరోగ్య విషయం చెప్పనక్కరయే లేదు. హెల్తాఫీసరుగారు సుమారు ఉదయమునుండి సాయంకాలమువరకూ యిక్కడనే కాలక్షేపము చేయుదురు. అంతమాత్రాన, సదరు ఆఫీసరుగారు డబ్బివ్వకయే సాయంత్రమువరకూ మా పదార్థములనే ఆరగిస్తూ ఉందురని ఊహించుట కేవలమూ అన్యాయము.

మరా:—గానమునందు అభిలాషగలవారికొరకు యిక్కడ శాస్త్రిగారి ప్లేటు ఉంచబడ్డది. గ్రామఫోను మాత్రము కించిత్తు చెడి మూలబడియుండిన నేమాయె, ప్లేటు క్రొత్తది. పిన్నులలోగూడ కొన్ని క్రొత్తపిన్నులు

కనబడకపోవు. క్రాపింగు, మీసములు వగైరా చూచి దువ్వుకొనుటకువీలుగా పెద్దనిలువుటద్దములు, మా ప్రక్క షాపులోనే ఉంచబడియున్నవి. పదార్థములను చూచుటకు మాత్రమే, టిక్కెట్టు, 0-1-0.

(3) కాలికి జోడెందుకో! కళ్లకి జోడందుకే!!

కళ్లజబ్బులేనివారుమాత్రమే ఉపయోగించుటకు అన్నిరకములైన అందమైన కళ్లద్దములునూ మాదగ్గర దొరకును. మాదగ్గిర అద్దములను వాడదలచినవారికి మా అద్దములను వాడినది మొదలుకొని మూడువారముల లోపుగా ఏవిధమైన నేత్రవ్యాధియూ క్రొత్తగా ఏర్పడదని పూచీయిచ్చుచున్నాము. మా అద్దములను వాడినది మొదలుకొని 3 నెలలులోపుగా, మా అద్దములను వాడువారు వారిబంధువులనూ, స్నేహితులనూ, జోడు లేని సమయమునకూడా ఆనవాలు పట్టగలరని ఘంటాపథముగా చెప్పగలము. మేము అద్దములతోపంపెడి గోల్డు గోల్డు చట్రము (Frame) మిక్కిలి గట్టిది. కళ్లజోడు క్రిందబడినప్పుడు అద్దములమాట ఎటున్ననూ, చట్రం మాత్రము విరుగదని ఢంకామీద దెబ్బకొట్టి చెప్పగలము.

ధృతరాష్ట్రి ఆప్టికల్ కంపెని,
15, P. T. మద్రాస్.

(4) పదునైన కత్తి యిదిగో!!

రాడ్జర్సుని తోసిరాజన్నది!!

ఇది నోటితో కోతలు కోయువారికి మాత్రము ఉండదగిన ఆయుధము. పెళ్లికోతలూ, ప్లీడరీ కోతలు, పట్నవాసపుకోతలు, పొలిటిషియను కోతలు—అన్నిటికీ పనికివచ్చును. ఇది యుద్ధముచేయువారికి పనికి రాకపోయిననూ, దొంగవానిని బెదిరించుటకు గాంభీర్యముగా నుంచదగినదే. ఉమాపతి వైద్యులుగాని, ఆయుర్వేదవైద్యులుగాని, దీనితో శస్త్రచికిత్సచేయుటకు సాహసించిననూ, రోగికి ప్రాణభయం లేదని పూచీ యిచ్చుచున్నాము!! ఈ కత్తితో నడివీధిలో ఒకమనిషిని కోయుటకు ప్రయత్నించిననూ ఒక్కరక్తపుబొట్టయిననూ క్రిందబడకపోవుటవల్ల యిది మేజిక్ చేయువారికి ముఖ్యమైన పరికరము అనిచెప్పకతప్పదు. దీనికి Arms Act వర్తించదు!!! మీరు మామాటను నమ్మనియెడల తక్షణమే మా కత్తిని కొని మాజూటాను ప్రపంచకమునకు తెలియజేయవచ్చు.

కోతల కత్తుల కంపెనీ,
బెజవాడ.

(5) ఇన్సురెన్సు! ఇన్సురెన్సు!!

వెంటనే వేలకువేలు లాభము పొందదలచినచో, మా కంపెనీలోనే ఇన్సూరు చేయండి. మా కంపెనీ యొక్క ప్రత్యేకపదుపాయము ఏమనగా, మా కంపెనీలో ఇన్సూరు చేయించినవారు ఎప్పుడు రెండు మూడు ప్రీమియములుకన్న ఎక్కువ చెల్లించి యుండకయే పరలోకగతు లగుచూ వచ్చి వారి బీదకుటుంబములకు చాలధనమును సమకూర్చుచుండెడివారు. ఇది మాకంపెనీ యొక్క చలనైన రివాజు. అందుచే, మీ భార్యాబిడ్డల మేలుగోరిచో మీరు వెంటనే మా కంపెనీలో ఎక్కువ మొత్తమునకు భీమా చేయండి. ఈ తరుణము పోయినచో తరువాత విచారింతురు. మీరు మాకంపెనీలో భీమాచేయించిన కొద్దికాలములోనే మీకుటుంబమునకు సర్వవిధములా లాభము కలుగునని మీకు మేము ధైర్యము నిచ్చుచున్నాము.

అర్జంటు ఇన్సురెన్సు కంపెనీ,
మద్రాసు.

## 2, కావలెను

(1) రాబోవు సెప్టెంబరు 1వ తారీకునుండి నవలాపురమందలి స్త్రీల కళాశాలలో ఉపాధ్యాయినిగానున్న మిస్, కె. రావమ్మ. బి. యె. గారికి వంట చేయుటకు ఒకరు కావలెను. స్త్రీ యైనచో,—ముందే చెపితిమి మంచిది—రాత్రులయందు వారి యింట్లో పరుండుటకు వీలు లేదు. నెల 1 కి జీతము 15-0-0 భోజనమూ, జీతము గాక, చివాట్లు రోజూ వేరే యివ్వబడును.

మిస్, కే. రావమ్మ, బి. యే.
నవలాపురం.

(2) రాబోవు అక్టోబరు 1వ తారీకునుండి పట్లూరు స్త్రీల ట్రయినింగు స్కూలునకు సైన్సుపాఠము గరపుటకు ఒక సైన్సు బి. యె. కావలెను. పురుషులైతే బ్రహ్మచారులుగాని, క్రాపింగు గలవారుగాని, కళ్లేడు కలవారుకాని పనికిరారు. అగిగాక, పురుషులైతే గడ్డము నెలకి రెండుపర్యాయములుకన్న ఎక్కువ గీకించకుండుటకు ఒప్పుకొనవలెను. ప్రైవేటు ట్యూషను చెప్పుటకు వీలులేదు. పురుషులైతే "Light" లోని ఒకటి గది Experiments ను చేయకయే విద్యార్థినులకు సంగతులను బోధచేయువలెను.

హెడ్ మిస్ట్రెస్సు, స్త్రీల ట్రయినింగు స్కూలు,
కుశాల్ నగరం.

## 3. వేలములు

నెల ౧కి. వెయ్యి రూపాయిలుపైన జీతముపుచ్చుకొను ఒక ఉన్నతోద్యోగస్థుని గౌరవార్థము వారికంఠసీమయందు ఉంచబడిన కర్పూరదండలు ౧౨ న్నూ, సదరు ఉద్యోగస్థుని దర్శనముచేయుటకై వెళ్లిన క్రింది ఉద్యోగస్థులు, ఆశ్రితులు, నాయకులు వగైరాలు సందర్శన సందర్భమున కానుకగా సమర్పించిన ౨౫ చక్కెరకేళీ గెలలున్నూ, బత్తాయి పళ్లు ౨౦౦ న్నూ, సదరు ఉద్యోగస్థుడు Camp లో నున్నప్పుడు రెండు మూడు పూటలకు వారికి భోజనసామగ్రి సప్లయిచేయబడినసందర్భంలో మిగిలిన ౬ మణుగుల నెయ్యిన్ని, ౬ బస్తాల బియ్యమున్నూ, ఏలూరు కాలవ ఒడ్డున రాబోవు అక్టోబరు ౫వ తేది వేలము వేయబడును గాన పలయువారు అక్కడకు రాగోరెదను.

అ. రత్నం,
వేలము వేయువాడు.

## 4. వివాహ విషయములు

ఒక జ్యోతిష పండితుడు, అనపత్యుడనైన నాకు ౧౨ నెలలలోపుగా నొక మొగశిశువు కలుగునని ధైర్యము యిచ్చియుండుటచే, నేను యిందుమూలముగా అందరికి తెలియచేయునది ఏమనగా:—

"నాకూ, మా ఆవిడకూ పుట్టబోయ్యే కుమారునికి శ్రోత్రియకుటుంబములో ౧౨ నెలల తరువాత పుట్టబోయే, అవకరములు లేని ఆడపిల్లను యివ్వదలచినవారు తక్షణం నన్ను కలసికొని, కట్నకానుకలూ, రానూపోనూ రైలుఖర్చులూ, అలక పానుపుమీద కట్నమూ, వగైరాలు స్థిరపరచుకొన వచ్చును. రాబోవు 1వ ఏప్రిల్ లోపుగా వివాహం జరగవలెను గాబట్టిన్ని, జన్మించని వధూవరులకు బదులు ఎవరో ఉండాలి కాబట్టిన్ని, వరుని తండ్రియే వధువు తల్లికి ఒక Transferable మంగళసూత్రం కట్టుటకు ఏర్పాటు. వధూవరులు జన్మించిన మూడు సం॥ ములలోపున, కాలదోషము ఏమాత్రము లేకుండా సక్రమమైన మార్గమున ఆ మంగళసూత్రమును వరునిచే వధువు యొక్క కంఠసీమయందు ఉంచబడును. Factum valet ఉన్నంత వరకు ఈ వివాహం శాస్త్రీయమే అని ప్లీడర్లు సలహా యిచ్చుచున్నారు. ఇవి అన్నియు అంగీకరించినవారు నన్ను కలసికొని వెంటనే మాట్లాడవచ్చును."

వరా:—పిల్లకి ఆస్తి సంక్రమించేయెడల, మాకు సాంప్రదాయముల పట్టింపూ, అందముల పట్టింపూ లేదు.

శారదాభయ దీక్షితులు,
అలకాపురం.

(2) కుంటూరునుండి, ౧౬ సం॥ నిండీనిండని మిస్, కె. దమయంతీ దేవి గారు—("దేవి" అని పేరు చివర ఉండుటవలన, దమయంతిగారికి వివాహం వగైరాలు అయినవని అనుకొనుట పొరబాటు)—యిట్లు ప్రకటింపమని మాకు వ్రాయుచున్నారు:—

"నాకు శారదా బిల్లు అమలులోకి వచ్చిన తరువాత గాని వివాహం చేసికొనుట యిష్టములేదు. కావున, నాయందు అభిప్రాయమున్న యువకులను, నాకొరకై తొందరపడి యిప్పటినుండియు తాము వీధులోబడి నన్ను వీధులో బెట్టవద్దని వినయపూర్వకముగా ప్రార్థిస్తున్నాను. శారదాబిల్లు అమలులోకి వచ్చిన తరువాత నాయందు అభిప్రాయమున్నవారు విద్యావిహీనుడునూ అనాగరికుడునూ అగు మా నాన్నగారితో

సం ప్రతించక నిన్నగా నాతోనే ఉత్తర ప్రత్యుత్తరములు జరపి వ్యవహారములు ఫైసలు చేసికొన ప్రార్థితులు.

మరా:—మధ్యవర్తిత్వము ద్వారా వ్యవహారము సిసలుచేయుటకు ప్రయత్నించిన అభ్యర్థి వివాహమునకు అర్హుడు కాడని స్థిరపరుపబడును.

## 5. కోర్టులు—తీర్పులు

## CASE LAW ON PRESUMPTIONS

(1) పోలీసు ఇన్స్పెక్టరుగాని, సబ్ ఇన్స్పెక్టరుగాని, ఒక ఊరునుండి మరియొక ఊరునకు బస్సుమీద వెళ్లు సందర్భమున వారు బస్‌లో నెక్కుటకు టిక్కెట్టు కొనలేదని Presumption లేదు.

25 గుడివాడ, లాజర్నల్ 261.

(2) విద్యాశాలలో సైన్సుపాఠము చెప్పు ఉపాధ్యాయుల యిళ్లలో నగపడెడి స్టవుసాయిల్యులున్నూ, గాజు గిన్నెలున్నూ, సదరు విద్యాశాలల ఆస్తియే అని Presumption లేదు.

23, రాజమండ్రి లావీక్లి, 37.

(3) తండ్రీ,కొడుకూ గూడా,ఒక వూళ్లోనే ప్లీడరీ చేయునపుడు, యిద్దరికీ సరిపడేటట్టుగా యిద్దరికి కలిపి యిద్దరిలో పాడుగైనవారి ఆదికి ఒకటే డ్రెస్సు కుట్టించి నట్టు Presumption లేదు.

34, ఏలూరు లాజర్నల్, 651.

(4) తహసీల్దారులయింట్లో వాడుకునే నెయ్యి,కూరలు మొదలైన తినుబండారపు సరుకులు వారికి సప్లయిల మూలముగా వచ్చినవని Presumption లేదు.

12, తెనాలి లావీక్లి, 67.

(5)జబ్బువిషయమై గాని, దెబ్బలతాలీకు గాయముల విషయమై గాని, డాక్టర్లు యిచ్చు సర్టిఫికేట్లలో యథార్థము లేదని Presumption లేదు.

44, విశాఖపట్నం, లావీక్లి, 89.

## 6. రాకపోకలు

(1) ఫస్టు గ్లాజుగోమల్లు తానులలోనే విశేష[ము]ను సమకూర్చు నుద్దేశ్యముతో వివేకం ఆనంద[...] పంతులుగారు భార్యాసమేతులయి గ్లాజుగోమ[...] చవుకగా గొనుటకై నిన్నగా గ్లాసుగోకు నిన్నే [...] నమై పోయిరి.

(2) డచ్చీలు కొట్టుట నేర్చుకొనుటకు డచ్చి[...] దేశమైన హాలండునకు వెళ్లినటువంటి కోతలపాటి[...] నరసింహారావుగారు నేడే బొంబాయికి తిరిగివచ్చిరి.

(3) డాక్టరు టి. యస్. రావుగారు, నిన్న రా[...] ౧౧ గంటలకు తిరుపల్లిక్కేణి నుండి స్వంతకారు[...] బయలుదేరి గానసరస్వతి బిరుదాంకితయగు వి.[...] అమ్మాళ్ గారింటికి వెళ్లి. తెల్లవారకమునుపే తిరుపల్లి[...] ణికి మరల తిరిగి వచ్చిరి. డాక్టర్ రవుగారు స[...] అమ్మాళ్ గారింటికి వైద్యవిషయంలోనే వెళ్లి[...] యింతవరకు యిక్కడ నమ్మనున్నారు

(4) శ్రీయుత బి. యస్. చౌదరి గారు పా[...] నుండి విధవ్యత్రయముచే బెజవాడలో యిటీవల[...] స్థాపించబడిన కులాసా కాఫీహోటలులోని మైను[...] బోండాలను పుచ్చుకొనుటకై బెజవాడ బస్సుమీ[...] నిన్న ఉదయముననే బెజవాడవెళ్లిరి

(5) తెనాలి తాలూకాకు చెందిన శ్రీయుత పి.[...] నాయుడు గారు ఆక్సుఫర్డు క్రాపింగు చేయించు[...] టకు నిన్ననే, బొంబాయిలో "బార్బరన్" అనే [...] నెక్కి నిన్నగా ఆక్సుఫర్డునకు పయనమై పోయిరి.

(6) లిబరల్ పార్టీకి చెందినవారిలో ముఖ్యుడు[...] మరుస్తూన్నటువంటిన్ని, బొంతమూరు గ్రామమునయొక[...] "అభినవ గోఖలే" బిరుదాంకితులు అయినటువంటిన్ని[...] శ్రీయుత స్వార్థపు రామారావుగారు, హిందూదేశము[...] రేపు అధినివేశస్వాతంత్ర్యం యిచ్చిన వెంటనే [...] ఉండి కూడా బట్టించుకు సిద్ధామని పెద్ద సూటు[...] సమేతుడయి నిన్ననే యింగ్లండునకు పయన[...] పోయిరి.

## 7. స్థానిక వార్తలు

విశాఖపట్నం:— ఈ పురమునందు నిసలుగా [ఆ]డుగులమూ ఏడుప్పేడో తక్కువపాడుగుగల పొడుగు [గా]టి వేంకటచలంగారు బి. యే., బి.యల్., ఈరోజున [కో]ర్టునకు వెళ్లునపుడు లాంగుకోటు తొడిగికొని నప్పటి [పం]చనుగూడ గట్టికొని కోర్టునకు వెళ్లినందుకు శ్రీ [జి]ల్లాజడ్జీగారు సదరు వేంకటచలంగారిని అభినందించిరని [యూ], ఆ సందర్భమునసే విశాఖపట్నం మహిళాసంఘ [ము]వారు తక్షణం సమావేశమై సదరు వేంకటచలంగారికి [కృ]తజ్ఞతను సూచించుచూ తీర్మానమును ప్యాసుచేసి [రి]రనియూ, తెలియుచున్నది.

విజయనగరం:— రెండు వందల యిరవై రెండు [పౌ]నులు బరువుగల, శ్రీయుత జీలుగ బెండు రామారావు [గారు], బి. యే., యల్. టి. నిన్న బరంపురము నుండి [విజ]యనగరమునకు వచ్చుసందర్భమున, బరంపురం స్టేషను [మా]స్టరుగారు రామారావుగారిని చూచిన తోడనే [వా]రినను కాటామీదకు ఎక్కించి, తూచి గుండెలుమీద [చే]తిని ఉంచి, "అమ్మో! మీకు వేరే సామాను Allowance యిచ్చుటకు వీలులేదు" అని అనిరట. [అ]నిమీద, శ్రీ రామారావుగారు ఘర్షణ చేయుచుండగా [ప్యా]సెంజరు ప్లేటుఫారముమీదకు వచ్చెననియు, తొంద[ర]గా రైలు ఎక్కుటకు ప్రయత్నించగా, రెండుమూడు [పె]ట్టెలయొక్క దారి శ్రీరావుగారి లావునకు చాలనం[దు]న వారు లోపలికి ప్రవేశింపలేక పోయిరనియు, తత్స[మయ]మున రైలుగార్డుగారు తొందరగా శ్రీరావుగారిని [బ]యలో పడేసి, రైలు చివరనున్న Break van దాకా [ఈ]డ్చుకొనిపోయి అందులో బల్ల వేసి కూర్చోపెట్టి[రని]యూ తెలియవచ్చు చున్నది. పురప్రముఖులందరు [ర]యిల్‌కంపెనీవారు శ్రీరావుగారికి చేసిన అన్యాయము[న]కు అసమ్మతిని తెలియుచేయుచూ తీర్మానములు [చే]సుచేసి కంపెనీవారికి పంపినట్లు తెలియుచున్నది.

ఏలూరు:— రాబోవు నవంబరు మూడవ తేదీని [నిశ్చయ]ముగా ముగ్గురు మంత్రులూ, ఈపురమునకు దయ [చే]యుదురని తెలియుచున్నది. మంత్రుల ఆహ్వానము నకై చాల ఏర్పాటులు జరుగుచున్నవి. కొందరు నాయుడు శ్రేష్ఠులు శుభ్రతకొరకై మూడు రోజులనుండి ఏరోజున కారోజు స్నానము చేయుచున్నారు. కొందరు వైశ్యులు పబ్బులసహాయ్యమున కంసాలుల అవసరములేకయే తమ కృష్ణవర్ణమునకు మెరుగుపెట్టుచున్నారు. బ్రాహ్మణులు కొందరు విలువగల కోట్లను తమఅల్లుళ్ల దగ్గరనుండి ఎరువుతెచ్చుకొని అప్పుడే జాగ్రత్త పడుచున్నట్లు తెలుస్తూంది. కొందరు గవర్నమెంటువారి జ్ఞాతులు సంత్రులను ఎలా సంతోషపెట్టవలెనా అని ఆలోచించి, చిట్టచివరకు ముగ్గురు మంత్రులకూ మీసములు లేనివారగుటవల్ల తాము గూడా చిన్ననాటనుండి పోషించిన మీసరాజములను నిర్మూలించుటకు నిశ్చయించిరి. అయితే మీసరాజములను నిర్మూలించుటకు మున్ముందు మీసములకు ఒక Farewell Address న్నూ, తత్సందర్భమునసే పురప్రముఖులకు ఒక టీపార్టీయున్నూ యిచ్చెదరని తెలియుచున్నది. బోర్డులలోనూ కౌన్సిలులోనూ నామినేషనుద్వారా దొడ్డిగుమ్మము ద్వారా దూరదలచినవారు అప్పుడే వాళ్లవాళ్ల ప్రయత్నాల్లో ఉన్నారు. మీటింగులో vote of thanks చెప్పే ఆయన అప్పుడే రానున్నదేదో కంఠసాధకుతూ అభినయం విషయంలో నిలువుటద్దం ఎదుట రోజూ Rehearsal చేయుచున్నట్లు తెలియుచున్నది. ఇవన్నియూ అటుండగా, మంత్రులరాక సందర్భమున ఈ పురమున నవంబరు మూడవ తేదీ ఉదయాన్ని ౨౦౦౦ మాసిన గెడ్డములు మంగలుల పాలగునని మంగలులు ధైర్యసంతోషములతో నున్నారు. మంగలుల సంఘము ఈ సందర్భమున తమకృతజ్ఞతను మంత్రులకు దెలుపవలెనో, లేక మంత్రులను ఆహ్వానించినవారికి దెలుపవలెనో దెలియక లావిషయం భాగా తెలిసినవారిని చెన్నపట్నంలో సంప్రతించెదరని తెలియవచ్చుచున్నది. మొత్తముమీద మంత్రులకు ఏలూరునందు మంచిఆహ్వానముండునని తలచెదము.

కర్నూలు:— సుప్రసిద్ధవైద్యశిఖామణియని పేరు వడసిన డాక్టరు కె. ఆనందరావు, యం. బి. బి. యస్. గారి దగ్గరకు ఈ సంవత్సరము మొత్తంమీద 22 మను

ష్యులు శస్త్రచికిత్సకై వెళ్లియుండిరనియూ, సదరు డాక్టరుగారు చాకచక్యముతో 20 మనుష్యులకుమాత్రము శస్త్రముచేసి తక్కిన యిరువురిని శస్త్రము చేయకయే పంపివేసిరనియూ, అందులో శస్త్రము చేయబడక పంపివేయబడిన యిరువురు మాత్రం యిప్పుడు సజీవులై యున్నట్లునూ తెలియవచ్చుచున్నది. ఈ సందర్భమున పురప్రముఖులు మొన్న ఆదివారమునాడు సమావేశమై, శ్రీ ఆనందరావుగారు మిక్కిలి తెలివితేటలతోనూ దూరదృష్టితోనూ బ్రతికియున్న ఆ యిరువురకీ శస్త్రము చేయక పంపివేసి ప్రాణములు రక్షించినందులకు శ్రీరావుగారిని మిక్కిలి కొనియాడుచూ తీర్మానమును ఒకదానిని ప్యాసుచేసి వారికి పంపిరని తెలియుచున్నది. డాక్టరుగారు దానిని సంతోషపూర్వకంగా స్వీకరించి, ఆ కాగితమునకు పటమును కట్టించి, హాలులో నుంచుకొనిరనిగూడా తెలియవచ్చుచున్నది.

తుని:—మొన్న ఉదయం మ. రా. రా. శ్రీ వి. పి. వేంకట్రావుగారు. బి. యె., యల్. టి. తమ భార్యామణిగారిపై తగినంతకారణమువల్ల మిక్కుటమగు ఆగ్రహముపూని, భార్యామణిగారికి కఠినమైన శిక్షను విధించుటలో దీర్ఘాలోచనచేసి చేసి, తుట్టతుదకు తమ బిరుసుగెడ్డమును 15 రోజులవరకూ తీయించకుండుటకు నిశ్చయించినట్లు తెలియుచున్నది. ఈ వార్త సాయంత్రం అగుసరికి పురమంతయు వ్యాపించినదనియూ, అప్పుడే పురస్త్రీలలో గయ్యాళులు సహితమూ పురుషులంటే కొంచెం భయపడుతూన్నట్టునూ తెలియవచ్చుచున్నది.

అనపర్తి:—అనపర్తి సబ్‌జడ్జీగారు నేడు కోర్టునకు సరియైన టైమునకు వచ్చుటయేగాక కోర్టుగుమాస్తాలపైనను ప్లీడర్లపైననూ మామూలువలె అయినదానికీ కానిదానికీ రుసరుసలాడలేదు

## ౮. శుక్లసంవత్సరఫలము

శుక్ల సం॥ర ఫలమునుగూర్చి ఈ క్రింది విధముగా నుండునని ఏలూరునుండి ఒకజ్యోతిషపండితుడు మాకు వ్రాయుచున్నాడు.

౧. ఈ శుక్లసంవత్సరమునందు చివరభాగమ చాలమంది విద్యార్థులకు నష్టము గలుగును.

౨. ఈసంవత్సరము బ్రహ్మచారులకు సంతా గలుగదు.

3. ఈసంవత్సరము న్యాయస్థానములయంద జడ్జీలు విచారణసమయమున ప్లీడర్లు చెప్పు వా లను నిద్రపోకుండా ఉండి శ్రద్ధగా విందురు.

౪. ఈ సంవత్సరం విదేశవస్తుదహనం టలో ప్రజలు మళ్లీ గాంధిగారిమాట శిరసావహిం వల్ల యిదివరకు కన్న రెండురెట్లు అధికముగా ర్దేశపు సిగరెట్లు తగులపెట్టబడును.

౫. ఈ సంవత్సరము పై ఉద్యోగస్థులు ములో చెమిటివారిని చివాట్లు పెట్టరు.

౬. ఈ సంవత్సరములో మొదటిభాగము యింటి యజమానులు తమ యిళ్లలో అద్దెకు వారిని అనవసరంగా బాధపెట్టరు.

౭. సరియైన మధ్యవర్తులు దొరకక పోవు ఈ సంవత్సరములో చివరభాగమునందు గవర్నమె ఉద్యోగస్థులకు, బహుమానపూర్వకంగా వచ్చేరా తప్పగా క్షీణించిపోవును.

౮. ఈసంవత్సరం చైత్రవైశాఖములలో వైశ తూనికయందు దగా ఏమియునుండదు.

౯. ఈ సంవత్సరము రైతులు కాలువ నీటికొరకు ధనవర్షము కురిపింతురు.

౧౦. ఈ సం॥రము మార్గశిరపుష్యమాసము భర్తలు భార్యానుకూలురై యుందురు.

౧౧. ఈ సంవత్సరము విద్యాశాలల యొ ప్రధానోపాధ్యాయులు కర్రపెత్తనమునందు ప్రా మును జూపుటయే గాక విద్యార్థులకు పాఠములు చెప్పుటకు ప్రయత్నింతురు.

౧౨. ఈ సం॥రము శ్రావణభాద్రపదములందు లెట్లు ప్రవహించినను మ్యునిసిపల్ రోడ్లమీదుగా కాలువలుమాత్రం చక్కగా ప్రవహించును.

౧౩. ఈ సంఘము అక్షరజ్ఞానము లేనివారికి మాత్రం ఉన్నతగౌరవోద్యోగములు లభించును.

౧౪. ఈ సంఘము బ్రాహ్మణగ్రహణం చాల కాలము ఉండును.

స్వస్తి సర్వేషాం, సమస్తసన్మంగళాని భవంతు.

## 9. ఆంధ్రవిశ్వవిద్యాలయం

ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేటునందు మెంబరు అవుదామని ప్రయత్నాలు చేస్తూన్న ఒక ఆయన తాను మెంబరు అయిన తక్షణం యీ క్రింది తీర్మానమును సెనేటు సభయందు ఉపపాదించుటకు నిశ్చయించినట్లు పెంటపాడు సంతలో అనుకుంటున్నారని మాకు తెలిసిన సంగతిని మేము నమ్ముచున్నాము:—

"విశ్వవిద్యాలయముయొక్క Convocationలో ఒకేసారి భార్యయు భర్తయూగూడా బి. యె. డిగ్రీగాని, తదితరడిగ్రీగాని, పుచ్చుకొనవలసివచ్చినచో ఆదంపతులు ఇరువురూ ఒకే గౌనులో దూరి Convocation నకు హాజరైననూ, విశ్వవిద్యాలయమువారికి ఏ అభ్యంతరమూ లేదు."

## 10. మోడరన్ రిసర్చి ఇన్స్టిట్యూట్, పట్లూరు

౧ శ్రీయుత టి. యన్. మణి, బి. యె., డి. యస్. సి. గారు, యిటీవలనే కర్పూరపు కేళీలో కర్పూరము గాని హారతికర్పూరముగాని లేనట్లు స్థిరపరచిరి.

౨. శ్రీయుత పి. టి. గుహ్యాం, యం. ఏ. గారు, మిఠాయికిల్లీలో మిఠాయి లేనట్లునూ, నేతి బీరకాయిలో నెయ్యి లేనట్లునూ కనిపెట్టిరి.

3. పైపులు ఉన్న ఊళ్లలో పిచ్చుకలు ఎక్కువగా ఉన్నట్టు చెప్పబడుచుటవల్ల ఈ మధ్య ఆచార్య వి. యల్ మంగళీ, బొంబాయి గారు, కొన్ని Experiments మూలంగా, గాలిలో పిచ్చుకవలె ఎగిరెడి వన్నియు పిచ్చుకలు గావనియు వాటిలోని చాల భాగము బలిసిన దోమలనియూ గనిపెట్టెరి. దీనిని బట్టి దోమ తెరలలో యింక గొప్పగొప్పమార్పులు గలుగవచ్చు.

## 11. మరణవార్త

"సూప ప్రియ," "నేతిలోల," "గారెహంతక," "ఆవడానంద," "పులిహోరసఖ" "లడ్డూసచివ," "భోజన ప్రియ" వగైరా బిరుదములు గొట్టిన శ్రీయుత అప్పడాల ఆదినారాయణశాస్త్రిగారు మొన్న అమలాపురంలో జరిగిన వనసంతర్పణయందు భోజనముచేసిరనియూ భోజనానంతరమున కన్నీలు అవసరములేకయే కూర్చునిన చోటునుండి యిద్దరు వంటబ్రాహ్మణుల సాహాయ్యమాత్రమున లేవనెత్తబడిరనియూ, అట్లు సదరు శాస్త్రిగారు లేచుసందర్భమున వారి పొట్టమడతలలో నెప్పుడో యిరికి నలిగియున్న ఒకనల్లతేలు వారిపొట్ట మడతలలోనుంచి క్రిందబడి ఆకస్మికముగ మరణించెననియూ, మా స్వకీయవిలేఖరి మాకు వ్రాయుచున్నాడు.

## 12. సంభాషణలు

(1) రామా—నాకు తీపి సరుకు లిష్టం లేదండి.

వెంక—మరి మీరు తరుచు మిఠాయి కిల్లీ వేస్తారని చెప్పిందే, వామనరావు భార్య.

(2) వెంక—ఏమండీ, రామావధానిగారూ, చూస్తూ చూస్తూ మా అమ్మాయిని నరసింహారావుకి ఎలా గండీ యివ్వడం? అతనికి బాగా నత్తి ఉందట.

రామా—నయమండోయి! ఏమిటి, అలాంటారూ? నరసింహారావుకి మాట్లాడేటప్పుడే గాని, వ్రాసేటప్పుడు ఏమీ నత్తి ఉండదు. అతడు గజవ్రాతగాడు.

(3) సు—యివ్వాళ మంత్రిగారు జిల్లాబోర్డు ప్రెసిడెంటు గారితో చాలాసేపు ప్రసంగించారుటగా?

రా—అవును. మంత్రిగారు అధిక ప్రసంగం చేశారని నేనూ విన్నా.

(4) శేష—అయితే వేంకట్రాముడు పొట్టిగా ఉండి చిన్నవాడిలాగున కనబడతాడుటగా?

చిదం—అవును. అతను ఆట్టే పెద్దమనిషి గాడు.

## 13 ప్రెస్సుఫోటో బీరువా

మొదటి పటం:—మొన్న సాయింత్రం కాకినాడలో మంత్రుల గౌరవార్థం యిచ్చిన టీపార్టీకి ఆహ్వానము లేకయే దయచేసిన అతిథులు.

రెండవ పటం:—ఈ సంవత్సరము వేసినచందాలలో మొత్తముమీద రెండు వేల రూపాయలు కన్న ఎక్కువ ఎగగొట్టిన లక్షాధికారులు మొన్న మద్రాసులో సమావేశమయిన సందర్భమున దీయబడిన గ్రూపుఫోటో.

మూడవ పటం:—మీసమును కత్తించుటలో నేర్పరితనమును సంపాదించుటకై ఫ్రాన్సుదేశమున కేగిన శ్రీయుత టి. ఆర్. నాయుడుగారు పగం బి. యే., నేడే ఫ్రాన్సునుండి మద్రాసునకు తిరిగివచ్చిరి.

## 14. విచిత్ర ప్రభుత్వ గెజెటు

యిన్‌కంటాక్సు శాఖ:—పెంటపాడు జిల్లా యిన్‌కంటాక్సు ఆఫీసరుగారైన పి. సుబ్బారావుగారికి వారి భార్యామణిగారియొక్క జ్వోపోసనసందర్భమున మెడికల్ సర్టిఫికేటుమీద మార్చి 3 వ తారీకునుండి 3 రోజులు "సిక్కులీవు" యివ్వడమైనది.

అబ్కారిశాఖ:—అంబరపేటజిల్లాలో సర్కిలు యిన్స్పెక్టరుగారయిన ఆర్. టి. మొదలియారుగారి భార్యారత్నము కల్లు,సారాయి స్వయముగా త్రాగుట మొదలిడి గవర్నమెంటు గారికి అబ్కారీరాబడి ఎక్కువ చేయుటకు స్వయముగా ప్రయత్నములు చేయుచున్నందున, ఆమెను ప్రోత్సాహపెట్టుటకు గవర్నమెంటువారు ఆమెభర్తగారిని కమీషనరుగా నియమించడమైనది.

## 15. లోకల్ సెల్ఫు గవర్నమెంటు

(1) పొట్టూరు గ్రామమునందు పార్టీలు లేక దానివల్ల అల్లర్లు లేక ఉండుటనుబట్టి గవర్నమెంటువారు ఆగ్రామమునందు ప్రజలు అనాగరికులుగానున్నారని తెలిసికొని అక్కడ ఒకయూనియన్‌బోర్డును పెట్టుటకు నిశ్చయించినారు.

(2) పి.టి. సుబ్రహ్మణ్యంనాయుడుగారు మొద్దూరు తాలూకాబోర్డుమెంబరు బోర్డుమీటింగులకు హాజరవలసిన సమయములయందు కారణాంతరములవల్ల భార్యారత్నంగారిని ఒంటరిగా గృహమునందు వెళ్లుటకు యిష్టములేనట్లు తెలిపియున్నందున స... మెంబరుగారి భార్యారత్నంగారైన తులశెమ్మగా... కూడ మొద్దూరు తాలూకాబోర్డు మెంబరుగా నియ... చడమైనది.

(3) వైద్యశాఖ:—దెందులూరుగ్రామములోని ... అసిస్టంటు సర్జనుగారికిన్ని వారిక్రింద పనిచేయు... మంత్రసానిగారికిన్నీ రెండు నెలలబట్టి భేదాభిప్రా... ములు బయలుదేరి ఆసుపత్రి సరిగా నడచుట లేనంద... గవర్నమెంటువారు సదరు సబు అసిస్టంటుసర్జనుగా... కొల్లూరునకు ట్రాన్సుఫరుచేస్తూ దెందులూరు ఆసుప... లో క్రొత్త డాక్టరుగారు వచ్చేవరకూ, సదరు ఆసుప... కాంపౌండరుగారున్నూ మంత్రసానిగారున్నూ కలిసి... చేస్తూండవలసినదని ఆర్డరుచేయడమైనది.

(4) ఆరోగ్యశాఖ:—ప్రెసిడెన్సీలో నీక్రింద చె... బడిన అంటువ్యాధులు దిగువ చెప్పబడిన జిల్లాల... ఎక్కువగా జూలైమాసమునందు వ్యాపించినట్లు తెలి... చున్నది:—

మద్రాసు:—లెజిస్లేటివు కౌన్సిల్సులో "ని... అనే అంటువ్యాధి.

పశ్చిమగోదావరి:—కాఫీ హోటళ్లలో గ్రా... ఫోను ఉంచడం అనే వ్యాధి

తూర్పు గోదావరి:— విద్యార్థులలో ద... పెట్టి పేక ఆడుటయందు ఉత్సాహము.

కృష్ణా:— ధనికులే ఓట్లు వ్యవహారముల... జయము కాంచుట.

## 16. విచిత్రచట్టనిర్మాణచండశాసనసభ

(1) ఈసభయొక్క రాబోవుసమావేశమున ఈ ప్ర... తీర్మానమును గవర్నమెంటువారి స్నేహవర్గము... చెందిన గౌరవనీయులగు శ్రీయుత జె. పి. నాయ... గారు ఉపపాదించెదరని ఉద్యోగముకొరకై ఆయ... నమ్ముకొని యున్న ఒక చిన్న పెద్దమనిషి మ... తెలియజేయగా అది నిజమని నమ్ముచున్నాము:—

"హిందూదేవాలయాధికారులు దేవాలయముల యొక్క ధనమునూ, ఆస్తినీ, బాధ్యతలేక యిష్టానుసారముగా అనవసరమైన ఖర్చులనుబెట్టి పాడుచేయుచున్నారు గనుక ఈసభవారు ఆదుర్వ్యయమును ఆపుటకు రెండవ ఏర్పాటుగా (మొదటిది "Endowments Act"), ప్రస్తుతం మనరాజధానిలోని గుళ్లలో నుండెడి వెండిశఠగోపములను విక్రయింపజేసి శఠగోపములకు బదులు చవుకధరలో దొరకు మూర్ మార్కెటులోని ఈవెనింగ్ హేటు (Evening Hat) లను ఒక్కొక్క గుడికి ఒక్కొక్కటిగా సప్లైచేయించవలసిన దని దేవాలయాధికారులకు గవర్నమెంటువారు తెలియజేయమని గవర్నమెంటువారిని గోరుచున్నారు."

(2) ఈసమావేశమునందే గవర్నమెంటు వారి "జ్ఞాతి వర్గము"నకు చెందిన ఇ. పి. ఫాక్సుగారు, ఈక్రింది తీర్మానమును ఉపపాదించెదరని, మాకు తెలియవచ్చుచున్నది.

"ఈ రోజులలో కొందరు మనుష్యులకు వారి రూపలావణ్యముచేతనైతేనేమి, సహజగుణసంపత్తిచేతనైతేనేమి, వారికిగల మానవజాతియొక్క లక్షణములు క్రమక్రమముగా అదృశ్యమగుచున్నట్లు గనపడుటవల్ల అట్టివారికి దేహారోగ్యము భంగము కలిగినప్పుడు వారిని పశువైద్యశాలలోకి రానియ్యవలసినదనియు, తత్సందర్భమునకే మనకుగల పశువైద్యశాలలో ప్రత్యేకముగా వొకమనుష్యులవార్డును పెట్టించవలయుననియు, ఈ సభవారు గవర్నమెంటువారిని కోరుచున్నారు."

(౩) దేశీయమహాజనసభయొక్క ఆజ్ఞానుసారంగా గవర్నమెంటు విరోధివర్గమునకు చెందిన స్వరాజ్యవాదులు తమ సభ్యత్వములకు రాజీనామాలనిచ్చిన తదనంతరము పార్టీలు కూర్చుండు ఆసనములలో మార్పుల విషయము ఆలోచనవచ్చినది. ఈసందర్భమున గవర్నమెంటుయొక్క మిత్రవర్గమునకు చెందిన జె. పి. నాయుడు గారు, ఈక్రింది తీర్మానమును మొన్నటి సమావేశమునందు, ఉపపాదించిరి:—

"స్వరాజ్యవాదులు ఎన్నిదినముల నుండియు అనుపూర్ణస్వతంత్రపు అభిప్రాయములతోనూ, స్వతంత్రపు కరతాళధ్వనులతోనూ, స్వరాజ్యపు మోటుదుస్తులతోనూ, కొన్ని ఆసనములలో గూర్చుని వాటిని మలినము చేసినందున ప్రభుత్వమువారిని మన్నించు ఏపార్టీవారైననూగూడ ఆ యాసనములలో గూర్చునినచో వారుగూడా స్వతంత్రపు అభిప్రాయములూ, స్వరాజ్యకాంక్షా వగైరాలతో పాడైపోవుదురు గావున, అట్టి విపత్తు దేశమునకు గలుగకుండా ఉండేటందుకు స్వరాజ్యవాదులు గూర్చుని పాడుచేసిన ఆసనములను ఈ సభవారు "ఫెనైలు"తో గడిగించి శుభ్రపరచవలయునని గవర్నమెంటువారిని గోరుచున్నారు."

ఈ తీర్మానమునకు గవర్నమెంటువారి జ్ఞాతి వర్గమునకు చెందిన గా॥ ఇ. పి. ఫాక్సుగారు, "ఫినైలు" నకు బదులు "లైసాల్"ను వాడుటకు సవరణను ఉపపాదించిరి.

దాని మీదనే యిండిపెండెంటు వర్గమునకు చెందిన గా. పి. రంగాధామరావు గారు రసాయనశాస్త్రపండితు డగుటచే, స్వరాజ్యవాదులు గూర్చునిన ఆసనములలో నొక్క సమావేశమున గవర్నమెంటువారి జ్ఞాతివర్గమునకు చెందిన యూరోపియనులు గూర్చునినచో స్వరాజ్యవాదులయొక్కయూ, యూరోపియనులయొక్క యు అభిప్రాయములలోని పరస్పర భేదములకు Neutralisation కలిగి ఆసనములయందలి అభిప్రాయకల్మషము పూర్తిగా నిర్మూలింపబడుననియు, తెలుపు ఒక సవరణను ఉపపాదించిరి.

ఈ తీర్మానముమీద నామినేటెడ్ సభ్యుల తరపున ఒకరు యిట్లు మాట్లాడినట్లు తెలియవచ్చినది:— "గవర్నమెంటువారు దయతో ఎన్నాళ్లు మమ్మలను సభ్యులుగానుండనిచ్చెదరో అన్నాళ్లూ మేము ఈ ఆసనము బాగులేదనిగాని ఆ ఆసనము బాగులేదని గాని, పేచీపెట్టువారముగాము ఆమాటకువస్తే మమ్మలను క్రింద కూర్చోమనిననూ మేము సంతోషముగా ఏదో మూల జాగా చూసుకుని సర్దుకొని కూర్చుండుటకు సంసిద్ధులై యున్నాము. మమ్మలను సభనుండి వెడలగొట్టకుండా ఉంటే అదే మాకు పదివేలు. ఈతీర్మానముమీద మేము

ఏపార్టీవారికి మావోట్లు నియ్యవలెనో మేము యింకా నిశ్చయము చేయలేదు గాని గవర్నమెంటువారు ఎటు తిరిగితే మేమునూ అట్లే తిరిగెదమని సభవారికి మనవి చేయుచున్నాను"

పై సవరణలమీద విశేషముగా ఉపన్యాసములు అయినతరువాత, ఓటునకుబెట్టగా రంగధామరావుగారి సవరణ నెగ్గినది.

ఈ విషయముతరువాత సభ ముగిసినది.

## 17. ఇంటర్మీడియేటుపరీక్ష: రసాయనశాస్త్రము

రాబోవు యింటర్మీడియేటుపరీక్షకు కూర్చుండ దలచినవారు రసాయనశాస్త్రములో నీదిగువ నుదహరించిన ప్రశ్నలను జాగ్రత్తగా చూచుకొని జవాబులను తయారుచేసికొనినచో లాభ ముండక పోదని ఒక రసాయనశాస్త్రజ్ఞుడు నాకు వ్రాయుచున్నాడు:—

### రసాయనశాస్త్రము

(1) ఏ రసాయనపద్ధతులవలన ఈ క్రింది పదార్థములు దిగువచెప్పబడిన Compounds లో నుంచి extract చేయగలవు?

(ఎ) "వంటలక్క"నుండి "లక్క"ను దీయుము.

(బి) "కలెక్టరు మామిడికాయ" నుండి ఒక కలెక్టరుగారిని గాని, డిప్యూటి కలెక్టరును గాని దీయుము.

(సి) "ఆవుకాయ" నుండి "ఆవును"గాని, కనీసం "దూడను" గాని దీయుము.

(డి) "పెరుగు తోటకూర" నుండి "పెరుగును" గాని కనీసం "మజ్జిగను" గాని దీయుము.

(2) ఈ క్రింది వాటిలో ఏది భౌతికమార్పు (physical change), ఏది రాసాయనిక మార్పు (chemical change) కారణములతో కనబర్చుము:—

(ఎ) "రాజకీయవ్యవహారములలో, ఒకమానవుడు చిరకాలమునుండియు కాంగ్రెసుమతావలంబకుడైయుండి, హఠాత్తుగా రంగు ఫిరాయించి ఏ జస్టిసుపార్టీవాడుగనో మారుట."

(బి) "గాంధిమహాత్ముని బ్రతికియుండగనే పాతిపెట్టవలెను"అని శెలవిచ్చిన ఒక ఉద్యోగస్థుడు ఉద్యోగమును విడిచి కాళ్లూచేతులూ కడుగుకొని కళ్లుతుడుచుకొని స్వదేశమునకు బోవునపుడు ఆగాంధిని గురించియే ఒకపత్రికా విలేఖరితో, "గాంధిమహాత్ముడు మహాపవిత్రమైన ఆత్మనుగలవాడు" అని అనుటలో సదరు ఉద్యోగస్థునియందు కలిగినమార్పు.

(3) "కాఫీహోటలులలో కాఫీకొరకై ఉపయోగించెడిపాలున్నూ, భోజనపు హోటలులలో "మజ్జిగ" అనెడి పదార్థమున్నూ, రైలుస్టేషన్లలో సంబంధభోజనశాలలో దొరికెడు చారున్నూ, ఒకే కుటుంబములోనివి" ఈ వాక్యమందలి యదార్థమును వెల్లడిపరచుమూ, పైమూడు పదార్థములలోనుంచి నీరువచ్చునో, లేక నీటినుంచియే పైమూడు పదార్థములు వచ్చునో, లేక ఈ మూడు పదార్థములు నూ నీటియొక్క Allotropic Forms ఓ, తెలియచేయునది.

(4) (ఎ) గవర్నమెంటు ఉద్యోగమును మాన్యఫాక్చరుచేయు సందర్భమున దేనిని (Catalytic Agent) గా వాడవలెను?

(బి) అల్లుడు మామగారి దగ్గరనుండి ధనమును Extract చేయు సందర్భమున దేనిని Catalytic Agent గా వాడవలెను?

(5) కోర్టులలో యిచ్చెడి "జడ్జిమెంటు" అనే Compound లో (1) "జడ్జి" (2) ఆ జడ్జియొక్క "మెంటాలిటీ" అనే రెండుపదార్థములేనా, లేక యింకా యితరము లేవైనా గలవా? యితరవస్తువు లేవైననూ ఉన్నయెడల. వాటిని ఎట్లు కనిపెట్టగలవు?

## 18 ప్రకటన

—నాథపురంలో నున్న "విడోస్ హోమ్" అనే వితంతుశరణాలయమునకు పురుషులో భార్యలను గోల్పోయినవారుగూడా "మమ్మల్ని చేర్చుకోండి, మమ్మల్ని చేర్చుకోండి" అని చాలామంది అర్జీలు పెట్టుచున్నారు గాబట్టి, యిందుమూలముగా సుగవిధవలకు నేను తెలియచేయునది ఏమనగా,సదరు "విడోస్ హోమ్"

...నికి పురుషులను చేర్చుకొనకూడదని సదరు శరణా లయనిబంధనలలో నున్నందున పురుషులను "ఆ విడోస్ హోమ్" లోనికి చేర్చుకొనరు.

సెక్రటరీ, విడోస్‌హోమ్,
అనాథపురం.

## 19. నిరుద్యోగసమస్య: మద్రాసు కాన్ఫరెన్సు

మొన్న సాయంకాలము మద్రాసులో నిరుద్యోగశేఖర బిరుదాంకితు లగు శ్రీ యం. ఆర్. రావు గారి ఆధిపత్యము క్రింద జరిగిన నిరుద్యోగశిఖామణుల యొక్క సమావేశము జయప్రదముగా జరిగినదని చెప్పక తప్పదు. సభికులయొక్క సంఖ్యవలన నేమి, విషయము యొక్క ఆధిక్యతవలన నేమి, వక్తలయొక్క వాగ్ధాటి వలన నేమి, ఆమోదింపబడిన తీర్మానములబట్టియేమి, ప్రోగ్రాముకార్యక్రమముయొక్క బలమువలన నేమి, నిరుద్యోగచూడామణుల కాన్ఫరెన్సు ఎప్పుడును యింత బాగుగ జరిగియుండలేదు. యీ దిగువ నుదహరించిన తీర్మానములు మొన్నటి కాన్ఫరెన్సులో ప్యాసుచేయబడిన వాటిలో ముఖ్యములు:—

తీర్మానములు:—

౧. ఈ నిరుద్యోగ సంఘములోనికి క్రొత్తప్లీడర్లు గాని, క్రొత్తడాక్టర్లుగాని, చేరదలచినచో యీ సంఘమువారికి ఏ అభ్యంతరము లేదు.

౨. ఈ సంఘములోనికి కోడళ్లుగల 'అత్తగార్లు' కూడా సభ్యులుగా నుండవచ్చును.

3. ఉద్యోగస్థులే ఈ సంఘుసభ్యులకు ఉద్యోగములు యివ్వక యిన్నిదినములనుండియూ బాధబెట్టు చున్నందున వివాహాదులలో నిరుద్యోగులు ఉద్యోగస్థులతో సంబంధబాంధవ్యములు గలుపుకొనకూడదు.

4. ఉద్యోగస్థులకు పనిచేయు మంగలులను చాకలులను గూడ నిరుద్యోగులు బహిష్కరించవలెను.

5. ఉద్యోగస్థుల గౌరవార్థము యివ్వబడే విందులు, వీడుకోలు సభలకూ నిరుద్యోగులు వెళ్లగూడదు.

6. సంవత్సరాదిరోజున అపరాహ్ణము తిరుగక ముందు ఏ నిరుద్యోగియూ ఉద్యోగిని చూడరాదు. అట్లు 'అపశాత్తూ' చూచినయెడల వెంటనే స్నానము చేసి ప్రాయశ్చిత్తము చేయించుకొనవలెను.

7. నిరుద్యోగులకు ప్రత్యేకముగా ఒక నియోజక వర్గమును (Constituency) యివ్వమనిన్ని దానినుండి యిద్దరు ప్రతినిధులు లెజిస్లేటివు కౌన్సిలుకు వెళ్లునట్లు చేయవలెననిన్ని గవర్నమెంటువారిని ఈ సభవారు గోరుచున్నారు.

౮. జిల్లాబోర్డు ప్రెసిడెంటు, తాలూకా బోర్డు ప్రెసిడెంటు, వగైరా గౌరవపదవులు ఈ నిరుద్యోగులకే నామినేషను ద్వారా యివ్వవలెనని యీ సభవారు గవర్నమెంటువారిని గోరుచున్నారు.

౯. ఈ సంఘుసభ్యులు ఉద్యోగానంతరము తమ అప్లికేషనులను పంపు సందర్భమున కవర్లకు అణాబిళ్లను అంటించుటలో Exemption యివ్వవలసిదని పోస్టల్ డిపార్టుమెంటువారిని యీసభవారు గోరుచున్నారు.

౧౦. ఈ నిరుద్యోగులకు గవర్నమెంటు వారు ఉద్యోగము నివ్వదలచినచో సదరు నిరుద్యోగులు మీసములవిషయములో గవర్నమెంటువారు ఎలా చెప్పితే అలా చేయుటకు—అనగా, మీసము ఉంచమనిన ఉంచుటకు, తీసివేయుమనిన తీసివేయుటకు—సంసిద్ధులయియున్నారు.

౧౧. ఈ నిరుద్యోగులను "Depressed Classes"లో చేర్చమని యీ సంఘమువారు గవర్నమెంటు వారిని గోరుచున్నారు.

యిట్టి నిరుద్యోగులయొక్క దీనస్థితి యీ సంఘము వారు తీర్మానించిన తీర్మానములబట్టియే చెప్పక చెప్పుచున్నది. గవర్నమెంటువారున్నూ, వారి జ్ఞాతులున్నూ, కాస్త కనిపెట్టకపోయినచో, ఈ నిరుద్యోగులు ఏమగుదురో ఊహించుట కష్టము గాదు. నిరుద్యోగసమస్యను పారదోలుటకు ముందుగా ప్రయత్నములు చేయవలసియున్ననూ, దానికన్న ముందు సదరు సంఘమువారు గవర్నమెంటును కోరిన విషయములలో గవర్నమెంటు సానుభూతి చూపుట ముఖ్యావసరమై యున్నది. నిరుద్యోగులకు శీఘ్రమే మేలుగలుగు గాక యని మేము ఆశీర్వదించుచూ యింతటితో విరమించెదము.

# భారతవృద్ధరాజప్రతిజ్ఞ

దేశభక్త, కొండ వెంకటప్పయ్య గ

1

ఊరులఁ గుట్టల గట్టులఁ జడజనవ్రాతంబునున్ బ్రోవ నా
కాలంబెల్ల గతించె; వార లెఱుఁగంగాలేరు నారీతి; వా
రాలుఁ బిడ్డల స్వార్థచింతనల నాయాసంబులఁ స్రుక్కఁగా
బోలుఁ; నాకు జనంగయుక్త మెట పెంపుంబొందు విజ్ఞానమో.

స్థిరతఁ ద్రిమ్మరువాఁడ జీవితదశాశేషంబు సార్థంబుగా
ధరనెల్లఁ; సుఖదుఃఖసంతతులు నాదాయాదులై పోరనొం
టరినైనఁ, ధరణీజలంబులను పూర్ణప్రజ్ఞ జాటించుటఁ
బిరుదుల్, కానుకలు, పేరుకీర్తులను నేవిస్తారమార్జించితిఁ.

జనభూయిష్ఠ విశాలదేశములు; సంసర్గాదినై సర్గముల్
మన రాజ్యంబుల పాలనావిధులు; సమ్మానక్రియాచారముల్
దనరఁ గాంచి గ్రహింపగల్గితిని తత్తద్వస్తు తత్వంబు; నో
య్యన రారాజులగౌరవంబుగొన నాహ్లాదంబు రెట్టించెఁ జూ!.

సోదర యోధవీరసమరోత్సవ సంజనితాభిలాష చే,
మేదురసంగరావని నమేయభుజాబల మొప్ప, మిత్రులా
మోదముఁ బొంద నే విజయముఁ గని; భారతయుద్ధమందు స
మ్మోదము మీర నిల్చి కురుముఖ్యులదాడి నెదిర్చి పోరితిఁ.

మణులహారమునందు న మణులచాయ-సరసులందున పద్మసంచయము సర
సకలవిధభోగ్యవస్తు సంస్థానమందు భాగసంస్మృతిగల్గి నే బరగుచుంటి.

ఇచటనే యని చేరగానేగ నంత-కంతకుఁ దూరమరుగు దిగంత మటులు
నెఱిఁగినకొలంది తరుగక పెరుగుచుండు-నంత మొందదుజ్ఞాన మనంత మరయ

సానఁబెట్టిన మెరయు వజ్రంబుభాతి-చికిలిచేసిన ఖడ్గపుత్రికవిధాన
వాడుకను వన్నెమీరెడి వస్తువట్లు-దేహపతనంబు దనుకను ధృతిదలిర్ప.

ఫలముగోరక తనవిధుల్ సలుపవలయు-గాని కార్యకర్మంబుల గట్టిపెట్టి
మౌనమూనుట వీరులమార్గమగునె?-రిత్త బ్రదుకుట పందలరీతి గాదె?

కనవశమె జ్ఞానమూలము?-కనుగొనగా జన్మలెన్నిగావలయు నొకో!
చనె నాజీవితకాలం-బని చింతల నేల నున్న దల్పంబైనన్.

గడియగడచిన మరిదాని బడయఁదరమె?పరమగంభీరకాల గర్భంబుఁ జొచ్చు
గడియగడియయు చరితాత్మకంబుగాగ-గడపఁదలచితి కాలంబు గణుతిగాంచ.

వృద్ధతనువున తారుణ్యహృదయ మొప్ప-మనుజ బుద్ధి కతీతసన్మార్గపథము
నస్తమించు నక్షత్రంబు ననుకరించి-విపులవిశ్వంబునందు నే వెదఁకబోద.

చంద్రసేనుఁ డితండు సౌజన్యశీలుండు కూరిమిసుతుడు నా కులము ఫలము
ప్రజలబిడ్డలవోలె పాలించి లాలించి విద్యావిధానంబు పెంపుజేయు
తోటిరాజ్యంబుల త్రోసిరా జనురీతి దేశసౌభాగ్యంబు దేజరిల్ల
కార్యధుర్యతనాత్మగౌరవప్రతిపత్తి సుగుణసంపదలను సొంపొనర్చు
నట్టివానికి పట్టంబుగట్టి నేను-నాదు ధర్మంబు నెరవేర్పఁబోదు నితఁడు
వంశకీర్తి స్వధర్మ సంవర్ధనముగ-కులము పెద్దలవేల్పుల గొల్చుచుండు.

అల్లదె రేవు; సిద్ధముగ నచ్చటగన్పడు నావ; చాపయున్
వెల్లుగ గాలి నింపుకొని పెంపుదలిర్చు; మహాంబుధిన్ జలం
బెల్లెడ నీలమేఘరుచు లింపుగఁ బూసిన చాయఁదోప నా
యుల్లము పల్లవించును; మహోదధిరూపము చిత్ర మారయన్.

సరిసాటిన్ గనరాని కష్టసుఖ సంసర్గంబులన్ దాటుచున్;
సరసాలాప వినోదముల్ సలుపుచున్; శ్రావ్యంబులౌ వర్ణనల్
పరగన్ జేయుచు, గ్రీష్మవాతముల కుంభద్రోణవర్షంబులన్
భరియింపన్ జరియించు నావికులు నాభ్రాత ల్గదా సర్వదా.

పొడమిన్న వార్ధకంబు విడిపోదు; శుభాశుభకర్మశూన్యతన్
తొడర్కి క్రియాకలాపములు తోఁచినమాత్రము చేయగాఁదగున్ ;

వడిగొని మృత్యుయోగమది వచ్చెడిలోపల చిత్తశుద్ధితోఁ
దడయక నెద్దియే నలిపి ధన్యతముండనకీర్తి గాంచనౌ.

గ్రక్కున భానుమండలము కాంతిదొరంగి తొలంగె నింగిపై
చుక్కలు మిక్కుమిక్కుమను సొంపుజనింప నభఃస్థలంబునం
దక్కజమొప్ప ఘూర్ణిలు మహాంబుధి జన్యతరంగ సంఘముల్
రిక్కలరేడు తూర్పున వెలింగెడి బంగరురంగు లీనుచున్.

వెతకుచు నభినవభువనము-లతిరయమునబోవ నిప్పు డదె నటు గాన్
చతురతకోలల నొడ్డుచు-కుతుకంబున నడపుడుదధిఘోషిలనావన్.

పరమపదసుఖంబుపై లక్ష్యము న్నిల్పి-తారకాళిగ్రుంకు స్థలము గడచి
భానుఁ డస్తమించు పదము ను దాటియు-జీవుడుండు దనుకఁ జేర నెంతు.

చేరురె నెంతొకొంత; మఱిచేకురయత్న మొనర్పగాఁ దగున్;
ప్రాకటశక్తి మింటికిని మంటికి రెంటికి నొక్క తాళమున్
జేకొని కూర్పఁగాదగిన చేవ గతించిన లోప మున్నదే?
మాకును మీకు జుకు నణుమాత్ర మెఱుంగని శౌర్యముండెగా.

కాలము కర్మమున్ గలసి కాయబలమ్మును వమ్మొనర్చినన్
జాలును చిత్తనిశ్చలత; సాధనసంతతి నేది సాటిరాఁ
బోలును దీనికిన్; నలుపఁబూనిన కార్యము పట్టువీడకే
లీలనొ చేయ యత్నము ఫలించును దైవకృపావశంబునన్.

[నా మిత్రులగు శ్రీ ఖ్యాత దేశభక్త కొండ వెంకటప్పయ్యగారు, టెన్నిసను కవికృతమగు యూలిస (Ulysses), కొంతకాలముక్రిందట ఆంధ్రీకరించిరి. బెజవాడవాస్తవ్యులును, నాస్నేహితులును నగు శ్రీ యన్ రాఘవయ్యంగారు, ఆపద్యములను గొంతసవరించినమీఁద, వాని నిందుఁ బొందుపరచితిని. రాయసం వెంకటశివుఁ

---

౧

'సులతానీ!'

ఈపిలుపు ముగియక మునుపే సులతానీ పెదవులమీఁద చిఱునవ్వు పంచదార వలెను, లలాటమున బొమముడి అలచందపూవువలెను కానిపించెను. తనను ఇటులు పిలిచిన శాంతయ్య కడకు వచ్చి అది 'నీభాంఛను; నీ కాల్ముక్త*, అసలు పేరున పిలవండి బాబయ్యా!' అన్నది.

అది యిటులు వేఁడుకొనఁగా శాంతయ్య కొంత శాంతస్వరముతో 'నీ అసలు పేరు లోకు లందఱూ మఱచిపోయారు సరేకాని, ఇవ్వేళ అదోమోస్తరుగా ఉన్నావు, చంకలో ఆరైక ఏమిటి? బుజంమీఁద ఆ చీరేమిటి? ఏదో జరిగినటు లుంది' అని తేటి పాఱఁజూచెను.

దాని చేతిమీఁద కపోలముల మీఁద ఎఱ్ఱని కదుములు, లలాటము మీఁద మంకెన పూవు అతికించినటులు నెత్తురు, చూచిన శాంతయ్య కనులనిండ నీరు.

ఇంటిలోనుండి శాంత వచ్చి చూచి 'ఏమిటో రగడ జరిగింది. చెప్పవే' అనెను.

సులతానీ గిరుక్కున వెనుదిరిగి 'అమ్మా! నేను మీయింటిలో ఉండిపోతా' అనిఅన్నది.

'అలాగే ఉండు మంచిది' అని శాంత అన్నది.

ఈ సమాధానము వినిపించుకొనకయే సులతానీ తాను అంట్లుతోము మావిమొక్క కిందికి వెళ్లి చంకలోని రైకయు బుజముమీఁది కోకయు మావిపంగటిలోఁ బెట్టి కూర్చుండి అంట్లు తోమ మొదలిడెను.

శాంత లోలోపలనే నవ్వుకొనుచు 'మాఱుమనుములో మాయ కామోసు' నను కొనుచు లోనికి వెళ్లిపోయెను. శాంతయ్యయు మామిళ్ల క్రింద అల్లపు మళ్లలో కలుపు తీసికొనుచుఁ గూరుచుండెను.

సులతానీ అంట్లుతోమి ఇల్లలికి తుడిచి శుభ్రము చేసెను. ఇతరుల పనిగూడఁ గొంత చేసెను. ముంగిటికి వచ్చి కూర్చుండెను.

ఏమియు తోఁచనినాఁడు ఊరక కూరుచుండినను తోఁచదు.

సెలవు పుచ్చుకొనవచ్చిన పాలేరు పోతఁడు ఊరక కూరుచున్న సులతానీని చూచి 'నీవు ఇక్కడే ఉండిపోతావా ఏమిటి? ఇంటికి వెళ్లవూ?' అన్నాఁడు.

సులతానీ మాటాడలేదు. పోతఁడు ఎదుటికి వచ్చి సులతానీని చూచెను. ప్రతిదినము కౌతుకముతోఁ జూడఁబడు ముఖము కాదు ఆనాఁటి ముఖము. సులతానీ చూపునెదుట

* 'నీ బానిసను; నీ కాలు మొక్కుతా.'

వాఁడు ఆఁగఁజాలకపోయెను. వెనుకకు మరలెను. కొంచెము దాపున నిలిచి 'ఇవ్వేళ సులతానును వదిలిపెట్టేస్తావా ఏమిటి ?' అనెను.

సులతానీ మాటాడలేదు.

మామిళ్లక్రింద చప్పుడాయెను. పోతఁడు ఉలికిపడి చూచుచుండఁగా శాంతయ్య సుంగిటికి వచ్చెను.

పసుల పాకలోనుండి వీరఁడు మెల్లగా వచ్చెను.

'సరే మీరు అన్నాలకు పోయిరండి' అని శాంతయ్య అనఁగా పాలేళ్లిరువురును ఇండ్లకు వెళ్లిరి.

శాంతయ్య లోనికేఁగఁగనే శాంత 'దీనిని మీరు మన ఇంట్లో ఉండనియ్యొద్దు' అనెను. మొగము చిట్లించుకొని శాంతయ్య 'నన్ను ఉండనియ్యొద్దని నీవు ఉండనియ్యడానికా ?' అనెను. శాంత 'అదేమి? నేనూ ఉండనియ్యను' అని అనెను.

లోపలి పలుకులు ఆలకించుటకు చెవులు దోయిలించుకొని కూరుచున్నది సులతానీ.

వెనుకనుండి పిల్లులు పట్టువానివలె సులతాను వచ్చెను. ఇలు వాకిండ్లు పరికించి చూచెను. సులతానీ ముందు వాలెను.

సులతానీ రెండడుగులు వెనుకకు జరిగి కూరుచుండెను.

'నాదిబుద్ధితక్కువఅయింది;నన్ను కూడా రెండుకొట్టు' అని సులతాను మేనువంచెను.

సులతానీ మెడవాల్చి కూరుచుండెను.

'నాకు చిన్నతనం తేకు. బాబుగారితో చెప్పకు. ఆలోచించి వెంటనే నా మా పాటించు. లే ఇఁక లే. బాబుగారు చూ బాగుండదు.' అని సులతాను అనెను.

సులతానీ మెడ ఓరఁబెట్టెను. నల్లకల వలకు మెల్లకనులు పెట్టు సులతాను కాటు కనులు సులతానీ కనులలోఁబడెను. సులత కనులు మెలమెల్లగా ముకుళించుకొనిపోయెను. ఒక రెప్పపాటులో సులతానీ కనులు తెఱచెను. సులతాను లేచి దాని ముందు విచిత్రము నాట్యము చేసెను. గవాక్షమునుండి శాం కును శాంతయ్యకును ఆనాట్యము కానిపించు చుండెను.

సులతాని లేచెను.

సులతాను మామిడిమొక్కక్రిందికిపో చీరను రైకను తీసికొనివచ్చెను. 'రా పోదా అనెను.

'పద! నీవు ముందర పద! ఇఁక నోరెత్తకు! అని సులతానీ దారికేసి చేయి చూపెను.

కిక్కురుమనక సులతాను పోయి పె డెము కడ నిలువఁబడి చూచుచుండెను.

లోపలినుండి శాంత వచ్చెను. 'అమ్మా ఇంటికి పోతాను సెలవియ్యండి' అని సులతా అనెను.

'అదేమే మేఁకల జగడ మయింది?' శాంత యనెను.

'అమ్మా, ఏమీ లేదు. ఇంటికి పోతాను' అని ప్రత్యుత్తరము అపేక్షింపక సులతానీ వెళ్లిపోయెను.

౨

చుట్టును ఎఱుకల గుడిసెలు, దొమ్మర గుడిసెలు; చాకలిపేట, మంగల గూడెము. నడుమ పెద్ద గంగానమ్మ — వేపచెట్టు. దాని క్రిందనే సులతానీ గుడిసె.

సూర్యుఁడు అస్తమింపఁబోవ నున్నాఁడు. ఎఱుకతలు పిల్లలకు సోదె పాఠములు చెప్పచుండిరి. దొమ్మర సానులు పదములు పాడుచుండిరి. శుద్ధిదేవతలు చాకితలు మడతలు పుచ్చుకొని గ్రామములోనికిఁ జనుచుండిరి వరాహావతారములు, వీరభద్రవాహనములు రాకపోకలు చేయుచుండెను.

సులతాను వేపచెట్టుక్రిందఁ బ్రేఁపచువ్వలతో బుట్టల్లుచుఁ గూరుచుండెను. దాపుననే కూరుచుండి గురువు చింతయ్య సిద్దప్పద్విపదలు పాడుచు తన్మయత్వము చెందుచుండఁగా సులతానీ ఆలకించుచుండెను. శివల మల్లయ్య, సాలె (శ్రీ) రాములు, మంగల మంగి, చాకల పుల్లి, ఎఱుకల మస్తాను, వీరందఱును శ్రోతలు. రాత్రివేళ మబ్బులమీఁది నగలు ఛత్త్రతముల నన్నిటిని తన పురిమీఁదనే మోచి ఒకనెమలి సులతానీముందు నాట్యము చేయుచుండెను.

సులతాను సులతానీతో రాజీపడిన తరువాత కల్లు త్రాగి పండువుచేసి కొనెను. ఆ పండుగులోనే బుట్టలల్లుచు కూరుచుండఁగా చాకల సుబ్బఁడు వచ్చి "రాత్రి పొద్దుపోయిందాఁకా యీూరి రేవులో బట్టలుఉతుకుతూందిట" అనియు, మంగల శోభనాచలము' (శ్రీ) రాములు ఈఊరునుంచి లేచిపోతాట్ట; వాఁడికి శాస్తి చేయకుండా వెళ్లనియ్యఁగూడ' దనియు-ఇటులే పలువురు పఱుతగవులు చెప్పకొనిరి. సులతాను రాజీలు డిక్రీలు ఇచ్చి అందఱను పంపివైచెను.

గురువు చింతయ్య మాధుకరమునకు లేచెను. ఎవరిదారిని వారు వెడలిపోయిరి.

సులతానుచూపులు పిఱుఁదులకు తాఁకుచుండఁగా బుజముమీఁద కడవతో సులతానీ చెఱువునకుఁ బోయెను.

చీపురుకట్టతో శుభ్రముగా ఊడ్చినటులు ఉన్న ఒకసందునుంచి వచ్చి ముంగిలో నిలిచి సులతానుఅక్క తొంగితొంగి చూచు చుండెను. సులతాను దానిని చూచి 'బోగీ! రా!' అనెను. బోగి గుడిసెలోనికి పోయి నాలుగు మూలలు చూచి వెలికి వచ్చెను. సులతాను కూర్చుండు మని పేఁపచదరు వైచెను. బోగి కూర్చుండెను.

'నీ డబ్బంతా సులతానీ మాయం చేస్తూంది. నీకు తెలియడం లేదు.'

'చీ చీ! అబద్ధం. ఎవఁడు చెప్పాఁడే నీకు?

'శాంతయ్యగారిదగ్గఱ పదికాసులు దాఁచిందిట. ఆసంగతి శాంతయ్యగారు మునసబుగారితో చెప్పతుంటే మీా బావ విన్నాఁడు.'

'నిజం?'

'నిజం;'

'అలా అయితే సంకురుమయ్యపండుగు నాఁడు బావతో జూదం ఆడానన్న మాటే. నీ కోకాసు ఇచ్చా నన్నమాటే.'

'ఆ అన్నీ యిచ్చావు. నిన్నటి అయిదు రూపాయలలో నా కేమయినా అంద నిచ్చిందీ?'

'ఈ తేప అల్లాకాదు. నీకు కాసియ్యకపోతే నేను నీతమ్ముణ్ణి కాదు.'

'చేతిలో చెయ్యి వెయ్!'

సులతాను బోగి చేతిలో చెయి వేయఁ బోయి కొంచెము తూలిపడెను. పిదప లేచి 'ఇదిగో ఇదిగో ఇది చెఱువునుంచి వచ్చేవేళ అయింది. నీవు మెల్లగా వెళ్లు! పోనీ కూచో! పోనీ వెళ్లు! పోనీ ఈ!' అనెను.

బోగి లేవఁబోవుచుండఁగా సులతానీ అడుగుబెట్టెను. రుసరుస లాడుచు దాపునకు వచ్చి 'రా వద్దంటే నీ విక్కడికి ఎందుకు వచ్చావ్?' అనెను.

'పోనీ రానులే' అని బోగి పోఁబోయెను. సులతాను కొంచెము గుక్క తిప్పుకొని 'వస్తే యేం? రాకూడదా?' అనెను.

'రాకూడదు ముమ్మాటికి రాకూడదు.'

'వస్తుంది ముమ్మాటికి వస్తుంది.'

'వస్తే నీ గుడిసెకు నిప్పెట్టి లేచిపోతా. బాబయ్యగారు నాకు కూడా గుడ్డా ఇస్తా మన్నారు తెలిసిందా? అది ఇక్కడికి వస్తుందా? మానుతుందా? చెప్పు. వస్తే ఈకుండ ఇక్కడే పగలేసి ఈదారినే బాబుగారింటికి పోతా. మాటా చెప్పు.'

సులతాను ముఖము జేగురుగడ్డ.

'మహా వారింట్లోనే ఉంటానంటావు. మాత్రం తిండి పెడతారో చూదాం. పో లే పో!'

'నా వెళటంమాట అటుంచు! బోగి ఇక్క డికి రాకతప్పదా? నాడబ్బంతా నాకుఁ గాకు డా నీకుఁ గాకుండా తప్పదా?'

'మన ఇద్దఱికీగాదు, బోగికీ గాదు. శాం య్యగారికి కాక తప్పదు. నీవు ఆయనకుఁ గా తప్పదు.'

'ఛీ ఛీ. బాబయ్యగారివద్ద డబ్బ ఉంచు కుంటే కడుపులో ఉంచుకున్నట్లే.'

'అయితే ఎంత ఉంచావు.'

'ఎంతో కొంత. నేను లేచి వచ్చేటప్పుడు నాపాఁతమగఁడు ఇచ్చాఁడు నా కాడబ్బు దాన్ని గుఱించి నీవు అడుగవలసినపనిలేదు.'

'వాఁడు వట్టి వెధవ. వాఁడిపేరు నాదగ్గిఱ చెప్పకు. నీవు నాదగ్గిఱకు ఎప్పుడు వచ్చావో అప్పుడే అది నాడబ్బు. నాడబ్బు నాకు తెచ్చి పెట్టు, ఇయ్యి!'

'ఇయ్యను ఇయ్యను ఇయ్యను.'

సులతాను అల్లుచున్న బుట్ట నావల బాఱవైచి ఒక నిడుదచువ్వతో సులతానీని వేసెను. చువ్వ పొడుగునను తోలు లేచెను. మూపుమీఁది కడవ లొటు చిల్లపెంకులై నే నాశరించెను. సులతానీ నేలవాలెను.

'దొంగవేసం' అని బోగి మెల్లగా ననెను.

'వేసాలూ గీసాలూ నాదగ్గిరా?' అని సులతాను సులతానీని ఎడమెడఁ గొట్టెను. రాతికేని దెలియుఁగాని సులతానీకి తెలియదు.

బోగి మెల్లగా జారెను. సులతాను సులతానీని కదిలించి తెల్లఁబోయెను.

నలుగురును చేరిరి. తలాయొక మాట అనిరి. సులతాను గబగబ గుడిసెలోనికిఁ బరుగెత్తి మంచముక్రింద దాఁగుకొనెను.

పదిమంది చూచుచుండిరిగాని వారి కేమి చేయను తోఁచలేదు.

సులతానీ మొదటి మగఁడు పరమానందాయియు ఆగుంపులో నుండెను. ఒక ముంతతో నీరుతెచ్చి దానినోటఁ బోసెను. చెమట తుడిచి బట్టతో విసరుచు కూరుచుండెను. 'వెళ్లి పొం'డని అందఱను అనుశాసించెను.

క్రమక్రమముగా ఒకరొకరే వెళ్లిపోయిరి. లోపల దాఁగియున్న సులతాను గీతకత్తితో తొంగితొంగి చూచుచుండెను.

కొంతసేపటికి సులతానీ మోమెత్తెను. ఎదుట పాఁతమగఁడు పరమానందాయి.

'ఛీఛీ, లేచిపో! ఊ! వెంటనే లేచి పో! చస్తావు పో' అని సులతానీ అనెను. అని వెనుకకు విఱుచుకొని పడిపోయెను.

మునసబుకరణములు వచ్చిరి. సులతానును పట్టుకొనిపోయి బండకొయ్యవైచిరి.

## 3

శాంతయ్య మోసాలముందు సులతానీ తనను తాను మొదట తెలిసికొనెను. తన మీఁదనున్న మర్రికొమ్మలు విసరుకఱ్ఱ చేయు పనిని చేయుచుండెను. ఏఁటిరింతలు బాలసూర్యునకు బాకా లూఁదుచుండెను. వడ్రంగి పిట్టలు ఎర్రతలపాగలు పెట్టుకొనిన పోలీసుల వలె చెట్టు పైకొమ్మలనుండి చూచుచుండెను.

సులతానీ మర్రియూడ పట్టుకొని లేచి కూరుచుండెను. శాంతయ్య ఎదురుగా వచ్చెను.

'బాబయ్యా! మీకు దణ్ణం. మీరే నాకు తండ్రి మీరే నాకు తల్లి' అని సులతానీ లేచి శాంతయ్యకు జేజే పెట్టెను. శాంతయ్య మోమును అటు తిప్పుకొనెను. సులతానీ గుమ్మము కడకు వచ్చి 'అమ్మా! అంట్లు వెయ్యండి! తోలిచి మఱి పోతాను' అనెను.

శాంత లోపలినుండి వచ్చి నివ్వెఱపోయి 'ఈ రాత్రెల్లా స్మారకం లేదు, ఒళ్లంతా కదుములు కట్టిపోయింది. అప్పుడే పని చేయడానికి నీకు సత్తువ ఎక్కడినుండి ఊరిందే?' అనెను.

'చేయకపోతే ఎల్లాగమ్మా!'

'ఇవ్వేళ నేనే చేసుకుంటాను గాని పాతేరును తీసుకొనినీవు ఇంటికి వెళ్లు!'

'నేనే పాలేళ్లను ఇంటికి పంపఁగలను, కాని అంట్లు వెయ్యండి తోలుస్తాను.'

శాంత ఏమనుకొనెనో ముఖము ముడుకటించుకొని అంట్లు పడవైచి లోనికి వెళ్లి

పోయెను. సులతానీ అంట్లన్నియు తీసికొని మామిడిమొక్క క్రిందికి వెళ్లి కూరుచుండెను. లోఁగడ కుండలో జాగ్రత్తపెట్టుకొనిన నీటిలో గిన్నెలు తోలుచుచుఁ దోలుచుచు 'అబ్బ' అనుకొనెను. చేతినుండి గిన్నె జాఱెను. తల గిర్రున తిరిగెను. మావి మొక కానుకొనెను.

కొంతసేపటికి ఒడలెల్ల పరికించి చూచుకొనెను. కనులవెంట నీరోడఁదొడఁగెను. అతి ప్రయత్నమున వెక్కు లాఁపుకొనెను. శాంతయ్య ముంగిటికి రాఁగనే గిన్నెలు చేతఁబుచ్చికొని సులతానీ ఎదురుగా వచ్చెను. దాని పచ్చనిశరీరముమీఁద చబుకు దెబ్బలు శాంతయ్యకు కానిపించెను. శాంతయ్య కనుల నీరు గ్రమ్మెను. సులతానీ కనులును నీటఁదోఁగెను. ఒకరొకరు మాటాడకుండ కొంచెము సేపు అటులు నిలువఁబడియుండిరి.

'సులతానీ! నిన్ను మా అమ్మలాగా పోషిస్తా. మాయింట్లో ఉండిపో! కూడూ గుడ్డా ఇస్తాను. భగవంతుణ్ణి తలఁచుకుంటూ కాలం గడుపు!' అని శాంతయ్య అనెను.

'అయ్యా! దేముఁడింకా నా తలలోకి దిగలేదు. నాకు సులతానే దేవుఁడు. కాని తమరిని ఒకటి వేఁడతాను' అని సులతానీ అనెను.

శాంతయ్య ఈమాటలతో కొంత విరక్తి కొంతరక్తి చెంది 'ఏమిటా వేఁడుకోవడం?' అని అన్నాఁడు.

'మీవద్ద నేను దాఁచికొన్న సొమ్ము నేను చచ్చినాసరే సులతానుకు ఇవ్వద్దు; ఇది ఒకటే నాకోరిక' అని సులతానీ అనెను.

శాంతయ్య మాటాడకుండెను. శాంత వచ్చి 'మీదగ్గిఱ ఆకాసులు ఉంచద్దు; దానికే ఇచ్చివేయండి! సులతానే దీనికి దేవుఁడైనపుడు ఈకాసులు ఆదేవుఁడికే నివేదన చెయ్యాలిసి వుంటుంది. మీదగ్గిఱ ఉంటే, ఆ డబ్బుకోసం కూనీలు అయిపోతవి. మీకూ మాట వస్తుంది' అనెను.

సులతానీ శాంతను ఆచి చూచెను. పిదప శాంతయ్యకేసి తిరిగి 'అయ్యా! అలాగైతే ఆ బాధ నేనే పడాలి; నాకే ఇచ్చి వెయ్యండి' అనెను.

'సరే, ఆలోచించి మళ్లీ చెప్పు! ఇచ్చి వేస్తాను.' అన్నాఁడు శాంతయ్య.

సులతానీ గిన్నెలన్నియు వాసవాని తావులలోఁ బెట్టి ఇంటిపని యెల్లయు మెల్లగాఁ జేసి శాంతయ్యకడకు వచ్చి 'బాబూ! నేనిక మీపాదాలకడనే ఉండిపోతాను' అని అనెను.

'సులతానును వదిలేస్తావా?'

'వదిలేస్తా.'

'భేష్. అలాగే ఉండిపో! ఇఁక నీకు శ్రీరామరక్ష' అని శాంతయ్య అనుచుండఁగా శాంత వచ్చి 'నీదేవుణ్ణి రాత్రిచూచి కొందువు గాని ఈపూఁట ఇక్కడే అన్నం తిని పొద్దూకిం దాఁకా ఉండు!' అన్నది. సులతానీ జేజే పెట్టి 'సరే నమ్మా!' అన్నది.

ప్రొద్దు గ్రుంకుచుండఁగా మునసబు కడ నుండి తలారి శాంతయ్యకడకు వచ్చెను.

వచ్చుచు వచ్చుచునే తలారి — 'ధొర గారూ! సులతానుగాఁడు చంక కింద కత్తి దాఁచుకున్నాఁడు. రాత్రిరి ఎవరికీ కనబడలే పొద్దున్నే కనఁబడింది. వీూరు కాస్త ఈకబుగు చెప్పి తీసుకో రమ్మన్నారు.'

ఈమాటలు వినుచు శాంతయ్య సుల తానీ మోమును జూచెను. ఆముఖమునఁగాని ఆకనులఁగాని ఇసుమంతేని భేదము కానుపింప లేదు.

'సరే వస్తున్నాను పద' అని శాంతయ్య అనెను. ఇటులు అని వెంటనే కర్ర దీసికొని తలారి ముందు నడుచుచుండఁగా శాంతయ్య కచేరీచావడిలోనికిఁ జనెను ఎదురుగా బండ కొయ్యలో సులతాను. వానిని జూచుచు వాని ప్రక్కనే పరమానందాయి. వాని ప్రక్కనే మునికోల పుచ్చికొని గ్రుడ్డిగురవాయి.

౪

గ్రామమున నేదేని విశేషము జరుగుఁ గాక అది అందఱకును వలయును — "అనా హూతోఽ ధ్వరం గచ్ఛేత్."

ముందర ఒక ఎల్లయ్యయు పిదప నొక పుల్లయ్యయు వచ్చి దూరముగా నిలువఁబడి చూచిరి. పిదప నొక ఎల్లమ్మ పిమ్మట నొక పుల్లమ్మ.తరువాత తట్టాయ బుట్టాయ కట్టాయ ంపాయ. పిమ్మట మేఁకలు గొర్రెలు ఆవులు ట్టెలు— ఇది యెల్లయు నొక మహాసభ. రమ్మనువాఁడు లేఁడు; పొమ్మనువాఁడును లేఁడు—స్వరాజ్యము. అచటి స్థలము సార్వ జనికము, కాలము సార్వజనికము. కొంతగుండా రాజ్యము—ఒకఁడు 'కొట్టు' అనుచో రెండవ వాఁడు ఆ'కొట్టు'తో ఆఁగక 'పొడు' అనియు చేర్చును. దానితో తేనెపెర కదిలినటులు అందఱును 'కొట్టుకొట్టు,పొడుపొడు!','పాపం' అని ఒకఁడనుచో రెండవవాఁడును 'అయ్యో పాపం! వదిలెయ్యండి, వదిలెయ్యండి'. అంద ఱును కలిసి 'వదిలెయ్యండి వదిలెయ్యండి వది లెయ్యండి వదిలెయ్యండి.'

సూర్యుఁడీ మహాసభ నుండి ఎవరికిని దెలియకుండ తప్పుకొనెను. అది పిఱికితనమో మంచితనమో యెవరికిఁ దెలియును? చీకటి జడవలె అల్లుకొనియెను.

మునసబుగారు లేచి అందఱను చూచి వీఁడు సులతానీని కొట్టాఁడు కాఁబట్టి, వీఁడి కిన్నీ అదే శిక్ష. 'ఒరే గుడ్డిగురవా! వీణ్ణి గది లోకి తీసకపోయి తడికె మూసి ఇరవై దెబ్బలు కొట్టు! కళ్లు కనఁబడక గోడలను కొట్టేవు సుమీ' అని అన్నారు.

గురవాయి లేచి గ్రుడ్లు త్రిప్పుచు మునికోల సవరించుచు—'ధొరగారూ!అంధఱికీ మొహం మీఁద కళ్లుంటే గురవాయికి చేతులమీఁద ఉన్నాయి' అని అనెను.

పరమానందాయియు బ్రహ్మానందాయి యు సులతానును బండకొయ్యనుండి తీసి గది లోనికి తీసికొనివెళ్లిరి.

చూడవచ్చిన మహాజను లందఱు 'సరి యయిన శాస్తి అయిన'దనిరి. కొందఱు వెళ్లి పోదొడఁగిరి. జంతుజాలము కొంత అటు, కొంత ఇటు, ఓహరిసాహరి ఆయెను. పిల్లలు నలిగిపోవుచుండఁగా పెద్దలు రెక్కలు పట్టు కొని ఆవలికి ఈడ్చుచుండిరి. గలభా ఎక్కువ ఆయెను.

ఆ గందరగోళములో ఎవరికిని దెలియ కుండ దూఱివచ్చి తడికె మెల్లగా తొలఁగించి సులతానీ గదిలో ప్రవేశించెను. సులతానీని చూచి సులతాను ఆవురుమనెను

'కొట్టినప్పు డిల్లా లేదేం?' అని గురవాయ అనెను.

సులతానీ తన కుడి అఱచేయి పైకెత్తి ఎడమచేతి చూపుడువేలు పెదవులమీఁద నిలు వుగా వేసికొనెను. గ్రుడ్లుఱిమెను.

సులతాను తెలిసికొని కిక్కురు మన కుండెను. 'చేయి చాఁపు!' అని గురవాయి గద్ద రించెను.

సులతానును ఒకమూలకు త్రోసి సుల తానీ కుడిచేయి చాఁపి ఎడమచేతి వేలితో సులతానును పొడిచెను. తెలిసికొని 'చాఁ పాను' అని సులతాను అనెను.

'ఏదీ?' అని గురవాయి పట్టుకొన వచ్చె ను. వెంటనే సులతానీ సులతాను చేయి అం దిచ్చెను. గురవాయి తడవి చూచుకొనెను. సరిగా వెనుకకు నడచెను. చేయెత్తి దైవము నకు మ్రొక్కుకొనెను.

వెంటనే సులతానును మూలకు త్రో వైచి సులతానీ తనచేయి చాఁపెను.

సులతానీ చేతిమీఁద దెబ్బలు పళప మోఁగెను. ఆ చేతినుండి రక్తమే జాఱెనో రాగిమే జాఱెనో ఆచీకటిలో ఎవరుచూచి దాపులనున్న సులతాను చూచెనా ?

గురవాయి తన పని ముగించుకొని తడి తెఱచెను. సులతానీ సులతానును ముందుల త్రోసెను. గురవాయి ముందు నడవఁగా సు తాను వెనుక వెళ్లెను.

'ఎవళ్ల యింటికి వాళ్లు వెళ్లి పొండి!' మునసబుగా రనిరి.

తుమ్మెదలవలె సంగీతములు తీసికొను ఎక్కడివా రక్కడికి పోదొడఁగిరి. సులతా తడికెకేసి చూచుచు ముందు ముందులకు చెను వాని వెనుకనే శాంతయ్య.

సులతాను వెనుక వెనుక చూచుచు నడచుచుండెను. 'మఱెవరూ కాదు నేనేర అని శాంతయ్య అనెను. సులతాను ఏడు నాఁపుకొనలేకపోయెను. వెక్క వెక్క ఏడ్చి లిడెను.

'పాపం! దెబ్బలు బాగా తగిలిన కాఁబోలు' అని శాంతయ్య అనెను.

'కాదండి బాబూ! ఆ దెబ్బలు తిన్న సులతానీ' అని సులతాను వెక్కి వెక్కి యే దొడఁగెను.

శాంతయ్య నిర్ఘాంత పోయెను. జరి సంగతి యంతయు సులతాను చెప్పెను.



ప్ర త్తినుండి విత్తులను విడదీయుట



వెంద్రుకల కుంచెయందలి వెంద్రుకలను ఒకపలకపై నతికించి చిత్రించబడిన చిత్రము

తయ్య ముక్కుమీఁద వేలువైచికొని నిలువఁబడెను.

శాంతయ్య కొంతసేపటికి 'వెంటనే సులతానీని ఇక్కడికి తీసుకో రా!' అనెను.

సులతాను వెనుకకు కాలు పెట్టుటకు కొంత తచ్చాడెను. శాంతయ్యకు విరక్తి కలిగెను. 'నేనే వెళ్లి తీసుకవస్తాను' అని శాంతయ్య అనెను.

మొగసాలనుండి ఈ ప్రసంగము నంతయు వినుచున్న శాంత ఎలుఁగెత్తి--'సులతానీ ఇక్కడికి వచ్చింది, రండి' అన్నది. శాంతయ్య గబగబ లోనికేఁగెను. వెనుకనే సులతాను. వాని వెనుకనే మెలమెల్లగా పరమానందాయి.

౫

వాకిట వ్రేలాడుచున్న దీపముముందు సులతానీ నిలువఁబడి యుండెను. దీపములోనున్న జడతేజస్సును ఒకతూరి, సులతానీముఖములోనున్న చేతనతేజస్సును ఒకతూరి, శాంతయ్య రెండుమూఁడుసారులు చూచెను.

సులతానీ తన చేతిని వస్త్రములో దాఁచికొనెను.

ముందుకు మెలమెల్లగా అడుగులు వేసికొనుచువచ్చి సులతాను నిలువఁబడెను. వాని వెనుక పరమానందాయి.

'చూచితివా నేఁటి తమాషా? చెప్పిందా నీకు సులతానీ?' అని శాంతయ్య శాంతతో అనెను.

'ఆ, దానిదేవుణ్ణి సులతాను తన్నించిందని మీరు కూడా సంతోషించాలి' అని శాంత యనెను.

'పనికిమాలినదానా! నీకెప్పుడూ తొందరే! ఇవ్వేళ వాఁడికి బదులుగా ఈ దెబ్బలు తిన్నదికూడా సులతానీయే' అని శాంతయ్య అనెను.

శాంత కనులు రెండును ఏకాగ్రములాయెను.

సులతానీ వెనుదిరిగి చూచెను—దూరముగా నిలువఁబడి యున్నారు సులతానును పరమానందాయియు. సులతానీ ముఖమును మరల ముందుఁకు త్రిప్పుకొనెను. దాని ముఖమున మార్పేమియు లేదు.

ఇంతలో ప్రకృతికి వచ్చి 'శాంత అది యేమిటి?' అనెను.

'సులతానీ! ముసుగునుండి నీచేయి తీసి చూపు' అని శాంతయ్య అనెను.

సులతానీ చూపలేదు.

'సులతానీ! నీలో ఒక తేజస్సు ఉన్నదని నాకు మొదటినుంచీ తెలుసు. కర్మ చాలక ఇక్కడ పడ్డావు. నీవిఁక మాఇంటివద్ద ఉండిపో. నిన్ను మాఅమ్మలాగా చూచుకొంటాను. భగవంతుణ్ణి తలఁచుకుంటూ కాలం గడుపు!' అని శాంతయ్య అనెను.

శాంత చేరువకువచ్చి 'సులతానీ! చేయేది చూపు, చూపు!' అనెను.

సులతానీ ఏమి యోజించుకొనుచుండెనో శాంత మాటలుగాని శాంతయ్యమాటలుగాని వినలేదు. అపుడు తలయెత్తి చూడఁగా తన యెదుట శాంతయు శాంతయ్యయు నుండిరి. అది వెంటనే వారి యిరువురికి సాష్టాంగనమస్కారము చేసెను. దాని చేతినుండి రక్తము స్రవించుచుండెను.

సులతానీ సొమ్మ దోఁగెను.

శాంతయ్య నీరుతెచ్చి మొగము మీఁద కొట్టి చేతికి కట్టుకట్టెను. శాంత విసరుచు నిలువఁబడెను.

సులతాను దగ్గఱకు వచ్చి—'అమ్మా, మీరు విసరఁగూడదు, నేను విసుకుతాను' అని అడ్డము వచ్చెను.

'అంట్లవెధవా! మళ్లా దెబ్బలు కొట్టించడానికి నడుమ చేరావా?' అని పరమానందాయి దగ్గఱకు వచ్చెను.

సులతాను గ్రుడ్లుఱిమెను. పరమానందాయి పండ్లు పటపట గొఱికెను

సులతానీ లేచెను. చూపుడువేలితో వారిరువురిని బెదిరించెను. ఇరువురును ఎడముగా నిలువఁబడిరి.

సులతానీ శాంతయ్యనుఁజూచి 'అయ్యా! నా దోమనవి' అనెను.

'ఏమిటి?'

'తమ వద్ద నా కాసు లిపుడు సిద్ధంగా ఉన్నవా?'

'ఉన్నవి.'

'పరమానందయ్యవద్ద నేనుండఁగా కూ నాలీ చేసి సంపాయించాను. అవి ఆయన ఆయనకు ఇయ్యండి బాబూ!'

'మంచిది.'

'నేను తమ యింట్లో ఉంటే తమకు బరువే అవుతుంది, నాకూ బరువే అవుతుంది. ఈమాట సత్తెం.'

'కాదు' అని శాంత అన్నది.

సులతానీ శాంతమాట వినిపించికొ లేదు. శాంతయ్యను చూచుచు, 'అయ్యా, దేవుఁ డింకా నాతలలోకి దిగలేదని పొద్దు తమతో అన్నాను. ఇందాఁక దెబ్బలకుముందు నాతలలోకి దిగాఁడు.'

శాంతయ్య పెదవులపై చిఱునవ్వు కా పించెను. శాంత తెల్లపోయి చూచుచుండెను. సులతానును పరమానందాయియు ఆచ్చపడిరి.

'ప్రాణాలయినా ఇచ్చే నేస్తం నాది. మళ్లీ నాకు మల్లే ప్రాణాలిచ్చే నేస్తం నాకు దొరక లేదు. ఇఁక అక్కర్లేదు.'

సులతానును పరమానందాయియు తల లు వంచుకొని నిలువఁబడిరి

'బాబూ! నేస్తంలో చేదు విఱిచి తీసి సంపాయించాలి. నేను తమకూ బరువు మో పను. నేనూ బరువు మోయను. బిచ్చ మెత్తు కొనే బికారినయి పోతా. తిరుపతి వేంకటేశ్వర్ల దాసరి నవుతా. నా కిఁక వెయ్యి నామములవాఁడితోనే నేస్తం. నాకు మీరందఱూ సెలవిప్పించండి.'

౫౬

ఉభయభాషా ప్రవీణ, మిన్నికంటి గురునాథశర్మగారు

ఏమో పొంగెదు నాకు సాటి గలఁడే యీవిం జగంబందు నం
చో మేఘుండ! సమస్తజీవనము స్వాదూదంబునం బొంది యు
ద్దామస్పర్శనగాఢఘాతములఁ గాదా దాతవై తీవు? నీ
కే మాత్రంబును దోడఁ బుట్టినవి గా వీత్యాగవైదగ్ధ్యముల్.

చీరికిం గొనక నిన్, జే సాఁపకున్న శుక్తికిఁ బొట్టనిండ ముత్తెములు వోసి
ముట్టకు మమ్మంచు మోము వాల్చిన పద్మినులకుఁ జిత్రపురత్నములఁ దగిల్చి
మీయాశ్రితులమె సుమీ యన్న ద్విజుల మొగాన నెంగిలి చేయిఁ గసరివిసరి
లేనివారల మంచ లేనివారల మాదుకొమ్మన్న హంసలఁ గోపగించి
నీకృపారస మెంతయే లేకయున్న-నయ్య! మాఁడిపోదురు బిడ్డ లన్న యుర్వ
రాలతాంగి పొట్టఁ బగిల్చి జాలి లేక-యుఱిమెదవు మేఘుఁడా! యిదియును ఘనంబె!

నెఱఁ దాతవు గావయ్యా!-మెఱమెచ్చుల దాతవే సుమీ నీ వివిక్
బరమార్థంబుగఁ జేయక-పరు లెఱుఁగన్ బొగడఁ జేయువాఁడవు గానన్.

సప్తసాగరమ్ములు నిండఁ జాలునట్టి-నీ వొసంగు జలమ్మును ద్రోవలోని
చిన్ని చెలమ యొసంగు దోసెఁడుజలమ్ము-తుల్యమసుమీ సఖుండ! పాథోధరుండ!

చెఱువులఁ గుంటల గడిగో-పురముల నిర్మింపకున్నఁ బోనీ పగవన్
జెఱిచెద వారు లొనరింపఁగ-హారియశోర్వరసమ! యేమనందును నిన్నున్.

ఇంకొకమారు సాలుఁదసీ యెత్తినఁ బండుఁ గదయ్య స్వామి! నా
వంకఁ గటాక్ష ముంచుమని పల్కు కృషీవలు పొట్టఁగొట్టితే
జంకక గాలివాన విరసంబుగఁ జొప్పి సమస్తసస్య మి
ట్టింకఁగఁ జేసి ద్వీపవతి, నేటికి మ్రొక్కిన చేయిఁ గోయఁగన్.

ఎట్టిక్షమ! పిడుగునకు మున్-దొట్టు నుఱుము దానికి మును దొడరు న్మెఱుమున్
గొట్టక మును దిట్టు బుధుఁడు-తిట్టక మును గంటి కెఱుపుఁ దెచ్చు ననునటుల్.

తిప్పలకూఁతులొనదులఁ దిన్నఁగ నిల్ వెడలించి యెల్లెడల్
ద్రిప్పుచు భంగపెట్టి పయిఁ బ్రేలెదు కూడదు 'ఘోష' యంచు నీ

ఎప్పుడు విద్యుదంగనను నిల్ వెడలింపక ఘోషపెట్టు దీ
చెప్పుట లేమి యన్యులకుఁ, జేయుట లేమి? పరప్రతారకా!
నీలనిచోళసంవరణనిష్ఠ గృహంబున నెంత దాఁచినన్
లోల కటాక్షపఙ్క్తిఁ త్రుటిలోనఁ గనుంగొనిపోయె సుమ్మ నీ
యాలి క్షణప్రభాతరుణి; యంబుద! కృష్ణను గంకణాల, ము
త్యాలసరాలశుక్తిమతిఁ దన్ని రహస్యము లాడు నీవగల్.

ఉన్నమ్మకె యున్నమ్మయు-నున్నమ్మకె లేనియమ్మయుం బెట్టునటుల్
మున్నీటికె మిగుల నీ-వున్నదులుంగూడ జలము వోయుట ఘనుఁడా!

ఇచ్చె జలముమాత్రమ్ము-న్వచ్చె జగత్ప్రభుత మేఘునకును, సవితయున్
నిచ్చలు కరములు సాఁచుచు-వచ్చుటఁ గద చూడరానివాఁ డయ్యె భువిన్.

జలదా! నీదానంబున-సలలితకిసలయయుతములు సర్వద్రుమముల్
భళి! భళి! గాంజిల్లేళ్లకుఁ-దొలుతటి యాకులకె బెడఁద దొడరెం గదరా!

భాసురసత్పథక్రమముఁ బాడొనరించియు, రాజహంస ప
ద్మాసన సంస్థితిం జెఱిచి యంతటఁ బంకకులంబుఁ జోపి వి
శ్వాసవిహీన! మిత్రవసుసంతతి గుప్తముసేసి నాకు నే
నే సరి, నే ఘనుండ నని యేటికిఁ బొంగెదు మిన్నుముట్టఁగన్.

ఏకడఁగన్న భేకముల యేడుపు లబ్బకరోదనాలె సూ
ర్యాకృతి గానరాదు, జగమంతయుఁ బంకమయంబు, రాజహం
సాకులత న్వహించుటకె యంతము లే, దిది యేటి పొంగుపా
టో కదె? మింట నాడెడిఁ గడు న్మదిరుం డిఁక నెంతకాలమే?

నవలన్ బ్రాఁకులఁ గూర్చితో హరితవర్ణచ్ఛన్నలం జేసి యం
త నదీకాంతల నల్లన న్మెలపితో నవ్యాంబరాడంబరం
బున సింధ్వీశునిఁ జేరఁ దారలను సంపూర్ణేందు వ్రాకువ్వ నే
ల? నట త్వద్భువిన్ రవిం గలుప వేలా? గర్జ లంబు ప్రదా!

మబ్బా! మబ్బా నీకును?-గొబ్బున నడికడలినుండి కొనితెచ్చి జలం
బిబ్బడిగఁ జవిటినేలల-ద్రొబ్బెదు కల్పకుజ మానతోఁ గనుచుండన్.

—(అడవిపువ్వు




## దొర

ఉప్పులూరు వెంకట సుబ్రహ్మణ్యము గారు

ఒకపుడు ఒకయోగి విక్రమాదిత్యుని ...మున కెదురుగా నున్న నదియొడ్డున ...ప్పండియుండెను. అతడు ఒక మాంత్రి... . విక్రమాదిత్యు డాయోగి నిద్రాహార ...లేకయే బ్రతుకగలడని విని యతనిజూడ ...మునని తలచి భిక్షుకునివేషమున అతనిని ...బోయెను. యోగి భిక్షుకుని వేషమున ... రాజును జూచి కొన్నిమంత్రముల నుచ్చ...ను. వెంటనే రాజు నల్లకుక్కగా మారి ...ట్టినుండి కదలలేకపోయెను.

మఱునాడు రాజు ఇంటికి తిరిగిరాకుండు... ...నగళ్లలోవారు, మంత్రులు, అందరు భీతి ...రి. అంతఃపురమున ఏడుపులు పుట్టినవి. ...తులు రాజును వెదుక సేవకులను ...రి. రాజుపోయిన జాడను వారు కనుగొన ...యిరి. రాజుమాంత్రికులు మంత్రశక్తిచే ... యోగిదగ్గర నల్లకుక్క రూపమున ...డని తెలిసికొనిరే కాని వారికి అతనిని ...చుకొను ఉపాయము తెలియకపోయె... అప్పుడు వారిలో నొక బుద్ధిమంతుడు "అయ్యా, మనము రాజు కడపటి కొడుకును బంగరురంగు తలవెంట్రుకలు గలవానిని దుప్పి గాజేసి యోగికుటీరము వద్దకు బంపుదము. అప్పుడు కుక్కయై అక్కడ నున్నరాజు ఈ దుప్పివెంటబడివచ్చును. మన మప్పుడు మన మంత్రశక్తిచే రాజు తొల్లిటిరూపమునుపొందు నటులు చేయుదము" అనిచెప్పెను. ఈ ఉపాయమున కందరు సంతసించిరి. అంతట వారు రాజు కొడుకును సమీపించి కొన్ని మంత్రముల నుచ్చరించిరి. రాజపుత్రు డంతలో ఒక తెల్లని దుప్పియయ్యెను. రాజకుమారుడని తెలియుట కాదుప్పి నాలుగుకన్నులను, బంగరువన్నెగల కొమ్ములను, వెంట్రుకలను గలిగియుండెను.

తరువాత ఈ దుప్పి యోగి పర్ణశాలదగ్గరకు పోయెను. నల్లకుక్క దీనినిచూచి తరుముకొని వచ్చెను. బుద్ధిశాలియైన దుప్పి మాంత్రికుల యాజ్ఞానుసారము నదీజలంబులం బడి యావలిగట్టుచేర నీదుచుండెను. ఆవలియొడ్డున రాజమాంత్రికులు దానికయి వేచియుండిరి. యోగి యీ తంత్రమును తెలిసికొని వారు

తన్ను మోసగించినందులకు మండిపడుచు తా నొక గద్దరూపమును బూని నీటిలోనీదుచున్న దుప్పికన్నులను రెంటెని పొడిచెను. కాని,దుప్పి యోర్చుకొని, యెట్టులో గట్టు జేరి, దట్టమైన యడవిలోదూరి, గంతులు వేయుచు పరువెత్తి పోయెను గ్రద్దమైనయోగి దానిని వెంబడించ లేక ఆయడవినంతయు కాల్చివైచెను. రాజ మాంత్రికు లామంటలలోబడి మృతి దుప్పిమాత్ర మొక నీటిగుంటలో బరుండి తప్పించుకొనెను. కాని నీటిలో మునుగని పైభాగము కొంత కాలిపోయెను. ఇట్లు ప్ర ఈదుప్పియే మొదటినల్లదుప్పి. దీని స ఇపుడున్న దుప్పులు. *

---

## బసవన్న

గో. వెంకయ్య

ఈశ్వరుడు మానవలోకాన్ని సృజించాడు మానవులకు వ్యయప్రయాసలు లేకుండా, సుఖంగా—హాయిగా జీవనోపాధి గడిచేవిధం, కల్పించాలనుకున్నాడు. ఆలోచించాడు—ఆలోచించాడు.—యేమార్గమూ కనుపించక పోయింది. పోనీ, పూర్తిగా సుఖము లేక పోయినా కొంతవరకైన, సదుపాయాలు చేద్దామని తిరిగి యోచింపగా యోచించగా ఆఖరుకు ఒకమార్గము మనస్సుకు తట్టింది కాబోలు; చివ్వున లేచి "ఔనౌ" నని పెద్దపెట్టున యొక హర్షనాదము చేసి సంతోషంతో ఉప్పొంగిపోతూ బసవదేవుణ్ణి పిలిచి "నీవు మనుజలోకానికి పోయి వారానికి రెండు మార్లు భోజనమూ, దినానికి ముమ్మారు అభ్యంగనము చేసుకోండని వారితో చెప్పి అన్నాడు. బసవన్న వెళ్లుతూ మా ఒకచోట కూర్చుని ఆలోచించాడు. " రుని ఉద్దేశ్యము యేమీం బాగుండ దాంట్లో కొంత మార్పుచేస్తే బాగుంటు అనుకొని దీర్ఘంగా యోచించి "ఏమైనా ఈశ్వరుడు చెప్పినదానికి తల్లక్రిందుగా నికి రెండుమార్లు అభ్యంగనమూ—ది ముమ్మారు భోజనము—" అని చెపు స్థిరపరుచుకున్నాడు.

అంత బసవన్న అనుకున్నట్లు నెరవేర్చుకుని చక్కా ఈశ్వరుడు ద వెళ్లి నిలుచున్నాడు. ఈశ్వరుడు "ఏం వు?" అని అడిగాడు బసవన్నను. బస

---

* విక్రమాదిత్యు డేమయ్యెనో, మతి యతం డెట్లు మనుష్యరూపమును పొందెనో తెలియదు. కాని దుప్పియొక్క పుట్టుక తెల్లమారెను. ఇప్పటికిని, కాలిపోవుటవలన నల్లనైన దేహభాగమును, నీటియందు గియుండి దాని తొల్లిటియందమును తెల్పు బంగారురంగును తెల్లనిరంగును కల క్రిందిభాగమును దుప్పి మనము చూడవచ్చును. అగ్నిజ్వాలలకు ప్రాగుటచేతనే దుప్పికొమ్ములు నల్లనై మెలితిరిగి యున్నవి. దుప్పి క్రింద, కనుగ్రుడ్లులేని రెండు తోలుసంచులు కానవగును. అది యోగి గృధ్రరూపమున బొడిచిన రెండుకన్ను

ను చెప్పివచ్చిన విధం చెప్పాడు. బసవన్న ఆజ్ఞమీరినందుకు మితిమీరిన కోపం వచ్చింది ఈశ్వరుడికి. పాదరక్ష తీసుకుని బసవన్న మూతిపై విసిరికొట్టాడు. ఆ దెబ్బకు బసవన్న పైపళ్లన్నీన్నీ గవ్వల్లాగా రాలిపడ్డాయి. భయముతో గడగడ లాడుతూ నిలుచున్నాడు బసవన్న.

ఈశ్వరుడు మహాకోపంతో చూస్తూ "పో. వాళ్లకు పెద్దకుమారుడవై పాటుబడి వాళ్లను పోషించుకో. నీవు చేసుకుంది నీకే వచ్చింది" అన్నాడు. నాటినుండి బసవన్న సంతతి అయిన ఎద్దులు పాటుబడుతూన్నాయి మనకోసం. మఱిన్నీ వాటికి పైపండ్లును లేవు.

# గోరిడిపిట్ట కథ

అనగా అనగా వొకవూరు. ఆవూళ్లో ఒక అమ్మి వుంది. ఆ అమ్మికి వొక కూతురు. అమ్మి వొకరోజున అడివి కెళ్లి యేడుగంపల విప్పపువ్వు తెచ్చింది. ఆ యేడుగంపల విప్పపువ్వు యెండలో పోసింది. పోసి, కూతుర్ని కాపలా పెట్టింది. తర్వాత ఆ అమ్మి యేదో పనిమీద వూళ్లోకి వెళ్లిపోయింది. సాయంత్రం వచ్చి యింటికి వచ్చింది. ఎండీన విప్పపువ్వం గంపల్లోకి యెత్తడం మొదలెట్టింది. అంత పువ్వు వొక్క గంపకే సరిపోయింది, దాని అనుమానం కలిగింది. కూతురితో "యేమే తినేసీ, ఆరుగంపల విప్పపువ్వా యే మొగుడి కిచ్చేసేవే" అంది. "అదేమోనే అమ్మా, నే నెరగను, పువ్వంతా అంతే"అని కూతురు. అమ్మికి కోపం తగ్గలేదు. "ఇదిగో! యివాళ కెందుకని వూరుకున్నా. మళ్లా యిలాగే మరోమాటు చేసేవంటే చూడు యేంచేస్తానో" అంది.

మర్నాటి పొద్దున్నే ఆ అమ్మి అడవి కెళ్లింది. మళ్లా యేడుగంపల విప్పపువ్వు తెచ్చింది. ఎండలో పోసింది. కూతుర్ని కాపలా పెట్టి "ఇవాళ యెవరికేనా యిచ్చేసేవంటే చూసుకో" అని కూతుర్ని భయపెట్టి తన పనిమీద వెళ్లిపోయింది. సాయంత్రం యథా ప్రకారం యింటికి వచ్చింది ఆ అమ్మి. విప్పపువ్వు గంపల్లోకి యెత్తడం మొదలెట్టింది. ఒక్కగంపెడే అయింది. కూతురివైపు వురిమి చూసింది. కళ్లెఱ్ఱపడ్డాయి. మాటలు తడబడ్డాయి. కోపం పట్టలేక పోయింది. దగ్గర వున్న వొక యిటికబొంతను తీసి కూతురి మీద విసిరికొట్టింది. కెవ్వున కేకవేసి ఆపిల్ల కింద పడింది. గిలగిల తన్నుకొని కళ్లు మూసేసింది.

మర్నాడు ఆ అమ్మి మళ్లా అడివి కెళ్లింది. ఏడుగంపల విప్పపువ్వు తెచ్చింది. ఎండలో పోసింది. తనే కాపలా కూచుంది. అతి జాగ్ర

త్తతో చూస్తూంది. ఎవ్వరూ యెత్తుకు పోకుండా కాస్తూంది. సాయంత్రం పడింది. ఎండిన పువ్వంతా గంపల్లోకి యెత్తుదా మనుకుంది. ఎత్తడం మొదలెట్టింది. ఒక్క గంపెడే అయింది. అమ్మి కంగారు పడింది. నిశ్చేష్టురాలై పోయింది. మూర్ఛపడింది. కొంచెం సేపటికి తెలివి వచ్చింది. "అయ్యో నా కూతురా" అంటూ కేక వేసింది. దుఃఖం పట్టలేకపోయింది. కిందపడ్డాది. పూరిడీపిట్టగా మారిపోయింది.

విప్ప పువ్వ
నా కూతురు
భూకాంత!

(అర్థం: ఓ భూదేవీ, విప్పపువ్వుకోసం చంపేసిన నాకూతురేదీ అని)

అని పాడుతూ యెగిరిపోయింది. ఆపా యిప్పటికి పూరిడీపిట్టలు పాడుతూ వుంటా కావాలంటే యెవరైనా వినిచూడొచ్చు.

టే.

---

# పిల్లలపాటలు

(యం. వి. పాపన్నగుప్తగారు సంపాదించినవి)

## ౧

పసిబిడ్డలను నిలువబెట్టికొని చక్కిలిగింతలు బెట్టుచుండ వారి నవ్వుల మాధుర్యమును గ్రోలుచు ఆ మందస్మితవదనారవిందమునుండి చిన్నచిన్నగ తొంగిచూచు పలువరుసను గాంచి తల్లు లీవిధముగ సహజకవిత్వము తేటపడ పల్కుదురు.

చింతాకు చిగురాకు ఏడ వున్నాది?
చింతమ్మతోటలో కాన వున్నాది
అబ్బబ్బ! దానిలో బూచి వున్నాది
బూచికి నాచేత మందు వున్నాది
మందూకు నానోట మంత్ర మున్నాది
మంత్రాన్కి మావిడి పండువున్నాది[యి.
పండ్లన్ని అమ్మాయి నోటిలో నిండివున్నా

అని "సారి గిలగిల! చక్కిల గిలగిల" అని తిరిగి నవ్వింతురు.

## ౨

## బొమ్మల పెండ్లి

బాలబాలికలు బొమ్మలకు పెండ్లి చేయునప్పుడు పెండ్లికూతురివంక బాలిక పెం కొమారుని, వేషమును వారిమర్యాదను, ప వును పరిహసించుట.

గజ్జకాయిలే గంటీలు
కుక్కతోలే కుల్లాయి
నక్కతోలే నడికట్టు
పులితోలే పూలహారం
అగిశాకే తోరణము
అలసందులే పూరణము
ఔరౌర! పెండ్లికొడుక
నీమనుసే కారణము.

# కన్నడిగలు-తెలుగలు

విద్వాన్, కూరిగనూరు నరసింగరావుగారు, బి.ఎ., యల్.టి.

## ౨

గీ. మునుపు మన కర్ణయుగ దేశమును గడు నల
రారఁజేసినయట్టి కర్ణాటదేశ
మదియిదిగొ పరికింపఁగదయ్య నయన
యుగిని మిగులఁగ నలరించుచున్న దిపుడు.'

—తెలుగు విశ్వగుణాదర్శము.

ఉన్నతమై ఘూర్ణ్యంతరాగ్ని ప్రకోపోద్భూతలోహ రసప్రవాహమున నల్లబాఱిన నేల గలదియై కమ్మని ...ట్లుగలదియై కృష్ణానదిని నీలగిరులను లోఁగొని దక్షిణో త్తరములందు గోదావరీకావేరీనదుల నే మేరలుగాఁ గల ...శాలప్రదేశమే కర్ణాడని సకారణముగా నిర్ణయించితిమి. ...రిపాలనా సౌలభ్యమునకై పంచబడిన మద్రాసు మహా ...ష్ట్ర) రాష్ట్రములలోని కర్ణాటఖండములు అల్పములు ...గానవచ్చినను, భాషనుబట్టి వానినెల్ల నొక్కటిగా ...ర్చిన వాని అఖండవైశాల్యవైభవము విశదమగుననియు ...ందు దెలిపితిమి. పైబేర్కొన్న యెల్లల నడుమ నుండు ...యందు తమ జన్మస్థానము లుండెనని జెప్పికొన్న పంప, ...న్న, రన్న, జన్న, సోమనాథ, శ్రీనాథ, కృష్ణదేవ ...యమొదలగు మహాకవులు కర్ణాటకులని వారి గ్రం ...స్థవాక్యములను బట్టియే నిరూపించితిమి. నన్నయ ...మును, నారాయణభట్టును ముందు దెలిపిన కారణములం ...బట్టి కర్ణాటకులే యైయుందురనియు కనుగొంటిమి. ...ల్లాడుగుఱించి కొంత తెలిసె. ఇక కన్నడిగలగూర్చి ...ంత దెలిసికొందము.

కర్ణాటకులు పురాతనకాలమునుండి దక్షిణహిందూ ...శములో బుట్టి, పెరిగియుండు, ద్రావిడ వర్గమను ...ఘములోనివారు. సంప్రదాయములనుబట్టి హిందూదేశ ...సులు గౌడులనియు, ద్రావిడులనియు రెండు ప్రత్యేక ...తెగలుగా విభాగింపబడినారు. వింధ్యోత్తరవాసులు ...డులనియు వింధ్యపర్వతమునకు దక్షిణముననుండువారు ...ద్రావిడులనియు చెప్పబడినారు. ఛందశ్శాస్త్రమునందు సంస్కృతవృత్తములు, జాతివృత్తములు అని భేదమును కనుపఱచియుండుట, కన్నడిగలు, తెలుగలు, ఆర్యేతరులని నిర్ధరించుట కొక ప్రబలతార్కాణమని మున్నే నుడివితిని. ఈ గౌడ ద్రావిడ వర్గవిభాగమును ద్రావిడుల ఆర్యేతరతను బలపఱచు మఱొకతార్కాణముగానున్నది. ద్రావిడులలో ముఖ్యమైనవారు తమిళులు, మలయాళులు, కన్నడిగలు, తెలుగలు. విద్వాంసులు పైజాతుల పేరుల కర్థములను వివిధరీతుల జెప్పినారు. అయ్యవి తృప్తికరములుగా లేవనియు దేశజాతిప్రధానలక్షణములను దెలుపవనియు, ఆయాజాతివారే వానికి వివిధార్థములను కల్పించుటవలన వెల్లడిచేయుచున్నారు. ప్రకృతిప్రధానలక్షణమును బట్టిచూచిన, చిక్కు లేమియు లేక, పైపేరులకెల్ల సమంజసమైన యర్థములు సిద్ధించుచున్నవి. దాని నింత పరీక్షింతము. తమిళన్ అనగా తమిళదేశమున నుండువాడు. తమిళ్ అనువాక్యమును విఱిచిన తమ్ + ఇళ్ అని రెండు పదములగును. తమ్ అనునది జలసంబంధమును జూపు పదము. నీటబుట్టు తామరకు 'తమ్మి' యనుచున్నాము. చలవకు కన్నడమున 'తంపు' అందురు. నీళ్లకు తమిళమున 'తణ్ణి' యనుపదమును వాడుదురు. ఉండుచోటునకు తెలుగున 'ఇల్లు' అందురు. దానికి తమిళమున 'ఇల్' అనుచున్నారు. కన్నడమున నాశబ్దము క్రియారూపమున నున్నది. ద్రావిడభాషలలో నొక బాసయందు నామవాచకముగానే యొకశబ్దము వాడబడిన, నయ్యది మఱొక భాషయందు క్రియావాచకముగా వాడబడుచుండును. ఉదాహరణము—మనె యనిన కన్నడమున నిల్లని యర్థము. ఈ నామవాచకము తెలుగున మనుధాతువుగానే విశేషముగా ప్రయోగింపబడుచున్నది. దానినుండి మనుగడ యను వాక్యమయ్యెను. అలలు, శయగుట ద్రావిడభాషా సంప్రదాయము. కన్నడమునందలి ఇర్ ఇల్ అయినది. మఱియు తమిల్ నందలి కడపటి అక్షరము ళ్ గా మాఱినది. ఇట్లు తమిళ్ అను పదరూపము సంభవించినది,

దీనినే సంస్కృతమున తమిళ, దమిళ, దమిడ, ద్రవిడ యను మార్పులుగా గొనినారు. ఇప్పుడు తమిళ్ అనిన చలవగలచోటని అర్థము జేసితిమి. అట్టిచోటనుండువాడే తమిళఁ. ఈ తమిళఁ ఉండుచోటు చలవచో టెట్లా యెనన్న తమిళులు దొలుత సముద్రతీరవాసులే అయి యుందురు (Castlanders). పిదప వారు సమభూము లకు వచ్చియుందురు. వారు చేపలబట్టువృత్తిని బ్రదికెడు వారు కాబోలు. ఇప్పటికిని వారు బెస్తలుగా నున్నారు. అందుచేతనే వారు ద్రావిడసంఘములోని తదితరజాతుల వారికంటె సముద్రయానమునందు ఎక్కువ సామర్థ్య సాహసములు గలవారై యున్నారు. మలయాళులు పర్వతప్రదేశమందు జీవించువారు (Mountaineers). కన్నడిగలు నల్లనేలయందు నివసించువారు. తెలుగలు నల్లనేలగాని వేఱుచోటున నుండియుందురు. అదిగాక, తొలుత కర్ణాటకులతో నుండి చీలిపోయిన సుందరాంగు లైన నయియుందురు.

ఉ. హారసురస్రవంతులు, కు
చాచలముల్ మృదురోమవల్లికా
సూరతనూభవల్ ఘనవ
సుప్రకరంబులు, నాభివాపికల్
మీఱుట నుర్వీమూర్తులన
మించెదు నాంధ్రపురంధ్రులఁ మహీ
దారులు నా భుజించెదరు
ధన్యు లిటఁ పరిపూర్ణయౌవనుల్.

—తెలుగు విశ్వగుణాదర్శము.

వీరిని కర్ణాటకులు మూడలవారని పిలుచుచున్నారు. మూడలవారన్న ప్రాచ్యులని యర్థము. వీరు కర్ణాటకులకు పూర్వదిశలో నుండబోయిరి కాబోలు. ప్రథమమున ద్రావిడులందఱు నొక పంఘముగా జీవించియుందురు. తరువాత, వారు జనసంఖ్య యెక్కువ కాగా జీవనోపాయనిమిత్తమున తమిళులు, కన్నడిగలను, రెండు తెగలై చీలిపోయియుందురు. అటుమీద తమిళులను విడిచిపోయినవారు మలయాళులును, కన్నడిగలనుండి వేఱయిపోయినవారు తెలుగలు, నయియుందురు. ఇందుకే అర్వాచీనపు తెలుగుకవులు తాము కర్ణాటకులనియు,

తాము తెలుగున వ్రాసినను నయ్యది కర్ణాటభాషయని నుడివినారు. దీనివల్లనే తెలుగుబాసలో కర్ణాటజా జాలమ్మును, దాని వ్యాకరణమార్గమై ఖరియు, ఛందపా మును చూపట్టుచున్నవి. మధ్యమయుగమునందు యెంత పెద్దదియైనను తెలుగునూతురు కన్నడతల్లి స ధమును జెప్పికొనకయుండలేదు. ఇట్టి నడక కొఱత యేమియు లేదు. అందువలన తెలుగుబాసయొ అందమున కేమియు కుందు రాలేదు. తల్లిని మించిన యుండరాదా? కన్నడతెలుగుబాసల నడుమ పర సంబంధముండుటయు, కన్నడిగల తెలుగలలోనుండు సంప్రదాయములు పోలికగలవై యుండుటయు, ప్రా చాళుక్యపరిపాలనకాలముననేమో తెలుగు మన్నె స్వతంత్రులై కన్నడిగలనుండి వేఱగుటయు, తె నుండి మధ్యమయుగమునందు సంస్కరింపబడుట తొలుత కన్నడిగలు తెలుగలు కలసిమెలసియుండిరన కును, తెలుగును కన్నడమునియుండుటకును కారణ గా పరిణమించుచున్నవి.

గీ. 'శూద్రు డూరూర నధిపతి; క్షోణిసురుడు
కరణమయి వానిచెంత లెక్కలను బలుకు
మరువునం జెలునట్టు లొక్కరుడు వైది
కుడు గలిగెనేని విస్తరిగుట్ట బంత్రు'

—తెలుగు విశ్వగుణాదర్శ

ఇది యిట్లుండ కన్నడిగలలోనే పలుతెగ లున్నారు. అందు తుళువారు, తోడలు, బడగవా కొడగలు ముఖ్యులు. తుళుశబ్దము తుడుశబ్దము రూపాంతరము. ద్రావిడభాషలలో 'డు' అనుయక్షర 'ళు' అనురూపాంతరము జెందుట ప్రసిద్ధము. తుడువా అనిన అమ్ముల దొడుగువారని యర్థము. 'తుడు' అ కన్నడమున, ఎక్కువెట్టు అని యర్థము. తుళువారు శస్త్రో పజీవులు. తుళువారిలో బిల్లవరు (archers) ముఖ్యులై వారు. ఇది వృత్తినిబట్టి వచ్చినపేరు. తోడలు కన్న గలతోనుండినవారు కాబోలు. తోడయనుశబ్దము తెలు తోడయనుమాటకు సమానమైనది. తోడ యను శబ్ద కన్నడమున ప్రత్యేకముగా వాడబడుచున్నను తో తోళ + మదుమగ = తోళమదుమగ యను సమాసో

న్నది. తమిళునందు నయ్యాది యాయర్థమున నే వాడబడు న్నది. బడగలు తమిళులకు నుత్తరమున నివసించువారు లు. కొడగలు కొండములలయం దుండువారు. ంగు అను తమిళుమాటయు కోడగమను కన్నడ టయు పర్వతవనసంబంధమునుబట్టియే కోతికి వచ్చి ండపలయును. ముక్కడ మనుపదమును మర=చెట్టు డగాగలది కోతియనియర్థము. వనపర్వతప్రాంతముల ంచు కన్నడిగలు తమపతాకమున కోతినే గుఱుతు ుంచికొనిరి కాబోలు. తెలుగువారిని ఆర్యులనిపించు వంగూరి సుబ్బరావు మొదలగువారు పలుత్రిప్పులు ారు. అట్టివారి త్రిప్పులు జూచి ఆంధ్రు లార్యులా? మామిడిపూడి వెంకటరంగయ్య, యం. ఎ., గారి వారు అపహాస్యముచేయకుందురా? (భారతి 7 th rch 1925) తెలుగు రు ఆర్యులైన ఏకకుటుంబము జేరియుండిన కన్నడిగలును ఆర్యులే కావలయు. డిగలు ఆర్యులైన భాషయందేమి చరిత్రయందేమి సంబంధముగల తమిళులును ఆర్యులు గావలయును. 'సర్వం ఆర్యమయంజగత్' కావలసియుండును. ఆర్యు ంచుకొనుటబట్టి గొప్ప యేమియు లేదు. ఆర్యేతరు ంచుకొనుటబట్టి కొఱతయేమియు లేదు సత్యాంశము గౌరవ మీయవలసియున్నది. ద్రావిడవర్గమనిపించు తమిళ, మలయాళ, కన్నడిగ, తెలుగ, తెగలవారు రులని ఛందోవిభాగమునుబట్టియు జనాంగవిభాగ ట్టియు నిర్ధరించితిమి. ఇక మఱికొన్ని విషయము పరీక్షింతము. ఈ విషయములకు మనము వారి షావిషయసంప్రదాయములకు బోవలసియున్నది. ద్ధమునకు అవయవార్థము స్పష్టముగా లేదు. ఘనత డు ఆర్యుడని నుడువబడియున్నది. Aura యనిన భాషయందు కాంతి యని యర్థము. చక్రము గలది అరి + యనిపించుకొనుచున్నది. ఇయ్యాది క్రము. కాలచక్రమైన సూర్యుడు కాంతిమంతుడే. ంద మనగా కేసరములు బొందినదియని యర్థముజేసి సూర్యకాంతినిభొందునది యని యర్థముచేయనగు సూర్యోపాసకులైన శీతమండలనివాసులు శ్వేతవర్ణ కాంతినిబొందిన వారగుటనో సూర్యకాంతిచే భరింపబడువారగుటనో కాంతినే దెలుపు దివిజులు దేవులు మొదలగుపదములతోపాటుఆర్యులని పేరుబెట్టుకొనిరేమో? అట్లున్న నది వారికి తగిన పేరే. అయిన నిది యుష్ణమండల మున నల్లవన్నెను గలిగియుండు ద్రావిడులకు తగినపేరు గాదు. ఆర్యేతరు లసభ్యు లనధైర్యమెవరికైనబొడమునా? వ్యక్తిచరిత్రమునుబట్టి సభ్యాసభ్యతను నిర్ణయింపవచ్చును గాక వేఱుగాదు. అదిగాక ఉష్ణమండలమున నుండు ద్రావిడులకు సూర్యు డుపాసనాదేవతయు గాదు. శీత మండలమువారైన ఆర్యులు వెలుతురును వేడిమిని వేడిన, ఉష్ణమండలమువారు నీడను నీరును గోరుచుందురు. అందు కే ఆర్యులు సూర్యుని మిత్రుడనియు, లోకబాంధవు డనియు, జగచ్చక్షువనియు, కర్మసాక్షియనియు, త్రిమూ ర్త్యాత్మకుడనియు, పొగడుచుందురు. అగ్నిని వారు గృహ దేవతగా బూజింతురు. ఆర్యేతరులైన ద్రావిడులయం దీసంప్రదాయము లేదు. పెండ్లిపేరంటంబు లెవ్వియైన ద్రావిడులు వననివాసులగుటంబట్టి నీడనిచ్చి,నీరొగులు గా నుంచు వేపచెట్టునో మఱ్ఱిచెట్టునో దేవతగా బూజింతురు. దప్పిని దప్పించు నీటిని అర్చింతురు. కావున దేవతా రాధనమునందును ఆదిమనివాసమునందును ఆర్యులకును ద్రావిడులకును అత్యధికభేద మగుపడుచున్నది. ఆర్యులు హిమప్రళయమునకును అంధకారమునకును వెఱచిరి. ఎక్కువవేసిమికిని వెలుతురునకును వెఱను నుష్ణమండలపు ద్రావిడులు దవాగ్నికిని పర్వతాగ్నికిని భయపడిరి. ఆర్యులయొక్క నాగరికత హిమప్రళయములవలన నెట్లు నాశముజెందెనో అట్లనే ద్రావిడులనాగరికత అగ్ని పర్వతప్రకోపములవలనను గనదహనమువలనను రూపు మాసెను. ఆర్యులు వైదికనిలయమునకు దిగువనుండు దక్షిణప్రదేశములను అధోలోకములనియు, పితృయాన మనియు, రాక్షసనివాసములనియు , బిలిచిరి. వారు తొలుత క్రిందిలోకముల నంతగా నెఱుగరు. సూర్యు డీ భాగమునం దుండుటంజేసి యాసూర్యుని బంధనమునకు కారణ మీలోకములేయని, వానినెల్ల రాక్షసమనిరి. ద్రావిడులే ఆర్యులైయున్న తమ్ము తా మట్లు పిలిచి కొందురా? తమదేశమును అధోలోకమందురా? ఉష్ణ మండలమునందు వేడి, వెలుతురు, నీరు, వలసినంత

యుండుటంబట్టి వృక్షసంపత్తి విశేషముగా నుండును. అందువనే దక్షిణహిందూస్థానమునందు వనము లనేకము లుండెను.

క. 'ప్రతినగరంబు వనమ్ములు
ప్రతివనమును బూగతరులు పాకోన్ముఖముల్
ప్రతిపూగంబు సుమమ్ములు
ప్రతిసుమమును మధురసంబు, బరగెడు నిచటన్'.

—తెలుగు విశ్వగుణాదర్శము.

అట్టివనములనే ఆర్యులు పితృవనములని బిలచిరి. లయకర్తయగు రుద్రునికి ఆదేశమును నిర్దేశించిరి. ద్రావిడులే ఆర్యసంతతికి జేరినవారయిన తమ నివాసస్థానమును శ్మశానమునకు బోల్చికొనరుగదా? ద్రావిడులు మరమ్మను = మారెమ్మను = చెట్టుతల్లిని భయభక్తులతో బూజింతురు. తమ్మ కాపాడు కాటప్పకు నోములు జేయుదురు. తమజాతి యాడవాండ్రకు మగవాండ్రకు మారెమ్మ, కాడమ్మ కాళమ్మ, కాడప్ప, కాటప్ప, యనుపేరులను బెట్టుదురు. కట్టెపనిజేయు కమ్మరివారియం దీపేళ్లు చాల కనబడుచున్నవి. వారే మారెమ్మ అర్చకులుగా నున్నారు. ఇట్టి నామకరణ మార్యులందు జూపట్టదు. శైవము బహుకాలమునుండి దక్షిణహిందూస్థానమునం దుండినను అర్వ్యాది వనదేవతాపూజకు వావల వచ్చినమతము. శైవము ఆర్యపిత్రుయానాసమ్మిశ్రితము. లేకున్న ద్రావిడులు తమ శైవమతమునందు విష్ణుపాదోద్భూతయైన గంగను శివుని తలకెక్కించి యుండరు. విష్ణుని మూడవయడుగు అధోలోకమున నుండుటం బట్టి దానినుండి బుట్టిన గంగ వారి యిష్టానుసారముగా శివుని శిరోభూషణము జేయబడియున్నది. మితిమీరిన ప్రతాపముగల ఉష్ణమండలపు సూర్యాగ్ని లేమి శీతకరుడగు చందురుడేమి, సమానముగా నప్రియులే. వానిని వారు, లయకర్తగా నియమింపబడిన శివుని మూడుకన్నులుగా జెప్పిరి. శివుని దిగంబరుడనియు, వనవాసియనియు, చర్మవసనుడనియు, శబరరూపుడనియు బల్కిరి. ఇవి యన్నియు వన్యనిలయముగల యుష్ణమండలమువారి ప్రియాప్రియములను జీవనవృత్తులనుబట్టి పొందించినవి. ఇవి యార్యేతరలక్షణములని యొప్పికొనకతప్పదు. పగటిని మూడుభాగములుగా జేసి ఆర్యులు వానికి ముగ్గు రధి[...] లని జెప్పిరి. ప్రాతఃకాలమున సూర్యుడు బ్రహ్మరూపి[...] యు, మధ్యాహ్నమున రుద్రరూపియనియు సాయం[...] యమున విష్ణురూపియనియు వాక్రుచ్చిరి. ఇందు సృ[...] స్థితి, లయములు క్రమముగా జెప్పబడలేదు. మ[...] నుండుస్థితి కొనకుబోయినది. కొననుండదగుకర్త మ[...] స్థానమునకు వచ్చినాడు. మధ్యందినమార్తాండుడు రుద్రుడు జెప్పబడినాడు. ఇయ్యది యార్యరాని వేడిమి[...] సూర్యుడుండు ఉష్ణమండలమునకే అన్వయించునుగా[...] తదితరప్రదేశమునకు గాదు. వైష్ణవులు శివుని విష్ణు[...] మనిగా జేసి యతనికి పితృవనాధిపత్యమునిచ్చి యత[...] విష్ణుపాదోదకము ధరింపజేసి వీరవైష్ణవునిగా వర్ణించి[...] శైవులు శివుడు బ్రహ్మశిరస్సును దునిమెననియు, ద[...] ఘుని దహించెననియు నరసింహముతో శరభుడై పోరా[...] ననియు ననేకక్షుద్రకథలను ప్రతీకారబుద్ధినికట్ట ప్రా[...] భించిరి. మొత్తమున శివవైష్ణవమతములందుండు విర[...] క్తులే ద్రావిడులకును ఆర్యులకు నుండిన విరోధము[...] జాత్యభిమానములను చూపించుచున్నవి. ఇదియు ద్రా[...] డు లార్యేతరు లనుదానిం దెలుపుచున్నది. ఈ రెం[...] జాతులవారు తమతమ దైవములకు ల ణనామ[...] నిమ్చుటలోనే తమ ప్రత్యేకతను భేదభావమును జూ[...] చినారు.

ఇందుకు నిదర్శనము :—

| విష్ణువు | శివుడు |
|---|---|
| చక్రపాణి | ఖండపరశు |
| విశ్వంభర | విశ్వనాథ |
| వైకుంఠుడు | గిరీశుడు |
| పీతాంబరుడు | కృత్తివాసుడు |
| శార్ఙ్గి | పినాకి |
| వనమాలి | రుండమాలి |
| బలిధ్వంసి | క్రతుధ్వంసి |
| గరుడధ్వజ | వృషధ్వజ |
| పుండరీకాక్షు | విరూపాక్షు |
| జనార్దన | హర |
| త్రివిక్రమ | త్రిపురాంతక |

| | |
|---|---|
| గంగాజనక | గంగాధర |
| హృషీకేశ | వ్యోమకేశ |
| అచ్యుత | స్థాణు |
| శ్రీపతి | ఉమాపతి |

ఇట్లు పేరులపేరులు గట్టి 'శివాయ విష్ణురూపాయ పాయ విష్ణవే' జేయ పందెము వేసికొని పాటుబడి . వీనినుండి యొక గొప్పఫలము గలిగినది. ఆర్యులు వుని కిచ్చిన పరివారనామప్రదేశములనుబట్టి వారు వాసులనియు ద్రావిడులు తమదేవత కిచ్చిన పరివార ప్రదేశములను బట్టి పర్వతప్రదేశనివాసులనియు గ దెలియుచున్నది. మఱియు వేడిమిని నల్ల బాఱిన డులను ఆర్యులు రాక్షసులనిరి. వారివలన దాక్షిణా లనుపదము రాక్షసపర్యాయపద మైపోయినది. సులకు నలుపువన్నె ఆర్పింపబడినది. ద్రావిడులే లైన తమ్ము తామట్లు గేలి చేసికొందురా? వైష్ణవ ంభవము ఉత్తరలోకములతోను శైవమతసంబం దక్షిణలోకములతోను సంబంధముగలవి యని స్థూల జెప్పవచ్చును. ద్వీపవాసులగు ఆర్యులు అనంతాస శ్వేతద్వీపము మొదలగువానినే విష్ణునివాసస్థానము జెప్పుటయు, విష్ణువును సాగరశయనునిగా వర్ణిం యు, సంసారమును సాగరమునకు బోల్చుటయు వాసులదేశజీవనాభిప్రాయములని కొన్పించుచున్నవి. nd dweller's conception of god and life) వనవాసిగను, వనచరుడుగను, ఖండపరశుగను, భూత ను, చర్మధారిగను, సారంగధరుడుగను, గిరీశుడుగను, పతిగను, నాగభూషణుడుగను, గజారిగను, నంది డుగను వర్ణించియుండుటయు, సంసారమును ఘోర ని పోల్చుటయు వనప్రదేశవాసుల దేవజీవనాభి యములను సూచించుచున్నవి (Land dweller's eption of god and life). ఒక్కమాటలో ఆర్య దుల మతసంప్రదాయములను జెప్పవలయునన్న ని క్రమముగా ద్వీపవనసంబంధములవలన గలిగినవి చాలును (Islandish and landish concep- ).మానవజాతి కతిప్రీతిగానుండు మతము నందే యిట్టి దము కల్పించిన ద్రావిడులు ఆర్యులు ప్రత్యేకజాతి

వారని జెప్పుట కెట్టి సందేహము నుండదు. సంఘము గాలి వానలకు చలివేడుములకు తాళజాలక తొలుత జనులు గవి గళు=పర్వతగుహలయందును గుడిగుండారు=బాళ్ల చేరికల యందును కప్పులయందును నివసించియుండుట ప్రకృతి ధర్మము. అట్టిసమయములందు సంఘమువారు క్రూర మృగముల బాధనుండి కాపాడికొనుటకై గుంపులుగా జీవించియుండు టావశ్యకము. అట్టి గుంపులకు నా యకు డొక డుండును. అతడే గణపతి, వినాయ కుడు. వన్యవైచిత్ర్యమున పొడమిన యద్భుతాశ్చర్య ములనుండి శాక్తేయమతము బుట్టినట్లు, వనాంతరపశు సంపత్తిని సంభవించిన విస్మయంబునుండి పాశుపతము బుట్టినట్లు జనవర్గముల నాయకత్వమునుండి గాణా పత్యము బుట్టియుండును. శైవవైష్ణవజైనమతములు తరువాత వచ్చినవి. గాణాపత్యము కొడగుదేశమునందు చాలప్రసిద్ధము. పేరుబెట్టుటయందు అందలి జనులు గణపతిపదమునే విశేషముగా నుపయోగింతురు. గణపతి ఆహారవిహారములందు తనగుంపునకు మేటియై ముందు బంటుగానుండు. ఆహారాన్వేషణమునందు వారు పులుల తోను సింహములు మొదలగు హింస్రమృగములతోను పోరాడవలసియుండును. అందుకే వారు శస్త్రశాస్త్ర నిపుణులు కావలసివచ్చెను. కన్నడిగలందు తుళువారు= బల్లవరు అట్టివారు. ఉష్ణమండలములో నగప్రదేశమున నాగములు పెక్కులుండు. కొండచిలువలకును త్రాచు పాములకును జనులు మిగుల భయపడుచుండిరి. ఆకారణ మునుబట్టి ద్రావిడులయం దిప్పటికిని నాగారాధనము భయభక్తులతో జేయబడుచున్నది. పామునోము ద్రావిడు లకు ప్రధానమైనది. ఆనోము జేసినవారికి కంటికి రాదం దురు. దుర్గమవన్యప్రదేశములందు పాములు వారికంట బడవని దానియర్థము. శీతదేశములందలి పాములవలెగాక ఉష్ణమండలపు పాములు మారకములు. వీనివిషము అనివార్యము. అందుకే ద్రావిడులు అంతభయపడి పాము లకు నోములుజేయసాగిరి. ఈయాచారమునే, ఆర్యులు దక్షిణమునకువచ్చి ద్రావిడులతో సంబంధములు కల్పించు కొన్న తరువాత దానిని "అనంతవ్రతము"గా మార్చిరి. పాము కఱచినపుడు విషము దింపుటకై ద్రావిడులు

తమ వనదేవతారూపమైన, మఱియు చేదుగలిగిన వేపాకుల నుపయోగించిరి ఇప్పటికిని విషమును దింపుటకును విషక్రిములను సంహరించుటకును వ్యాధిభూతవేదనలను నివారించుటకును ద్రావిడులు వేపాకులను వాడుచున్నారు. వనలక్ష్మీవ్రతమునో మరలక్ష్మీవ్రతమునో ఆర్యులు వరలక్ష్మీవ్రతముగా మార్చియుందురు. వటసావిత్రీవ్రతము నిట్టి మూలముగలదియ యగు. వ్రతము లన్నియు గణపతి పూజతో ప్రారంభ మగుచున్నవి. తరువాత పవిత్రజలములు పూజింపబడుచున్నవి ఇష్టదేవతావ్రతము నదీతీరములందును వనాంతరములయందును కాలయాపనను ఆచారము విధింపబడినది. గణపతిపూజ, జలపూజ, వన్యపూజాస్థానము ఇవి యన్నియు నార్యేతరలనివాసమత సంప్రదాయములను స్పష్టముగా నిరూపించుచున్నవి. అనేకవ్రతములు స్కాందపురాణమునందే దొరకుచున్నవి. స్కాందము శైవపురాణము. ద్రావిడులు శైవమతాసక్తి గలవారు. ఈ కారణములనుబట్టి ద్రావిడులు ఆర్యజాతివారు గారు. ద్రావిడులకు వేదగ్రంథములు లేవు.

గీ. వేదవైదికకర్మవిద్వేషదూషి
తులును భస్మవిలేపనధూసరితులు
లింగసంగతవక్షస్థలీవిషములు
చండరూపులుగలరు పాషండులిచట.

— తెలుగు విశ్వగుణాదర్శము.

ఇది దాక్షిణాత్యులను గుఱించి జెప్పిన ఆర్యుని యభిప్రాయము. ధ్రువమండలనివాసమును వదలివచ్చిన యార్యులు మతాభిమానమును విడువక తమ వేదగ్రంథములను వ్రాసియుంచికొనిరి. ద్రావిడులు ఆర్యసంతతివారైన వారివేదములును వేదాభిమానమును ఎక్కడ? వా రార్యజాతివారుగాని నీరెండును వారియందు గన్పట్టవు. ఆర్యులందుండు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రజాతులు ద్రావిడులందు లేవు. వృత్తులనుబట్టి బదునెనిమిది కులములున్నవి. గోత్రర్షులు ద్రావిడులకు లేరు. మఱియు నుత్తరహిందుస్థానమునందలి యార్యులు సౌరమానమును బట్టి కాలమును లెక్కించుచున్నారు. దక్షిణహిందూస్థాననివాసులగు ద్రావిడులు చాంద్రమానమును బట్టి కాలమును లెక్కించుచున్నారు. ఇవియుగూడ ద్రావిడులు ఆర్యేతరులని దెలుపుచున్నవి. ఇవి గాక, భాష[...] లును, వ్యాకరణఛందోలంకారములును ద్రావిడు[...] తరులని నిర్ణయించుచున్నవి. ఈ విషయము సా[...] మును గుఱించి వ్రాయుచోట విస్తరముగా దెలుప[...] ఇప్పుడుండు ఇన్ని ప్రబలకారణములను బట్టి మ[...] ద్రావిడులను ఆర్యేతరులనియే యందుము. ఆర్య[...] గౌరవవాచకముగా ప్రయోగింపబడుటంజేసి ద్రా[...] లను అనార్యులను పదముతో పిల్చుట అనుచితము[...] అసహ్యముగను ఉండును. గనుక ద్రావిడులను ఆర్యే[...] లందుము. కన్నడిగలు ద్రావిడులనిపించుకొనుట గ[...] హీనముగా దలపరు. ద్రావిడులని తమిళుల కేల [...] పెద్దతన మీయవలయునని తెలుగులు భావించి[...] దాక్షిణాత్యులనియో ఆర్యేతరు లనియో పిలువ న[...] రింతురు గాక!

ద్రావిడులు ఆర్యేతరులని నిదర్శనములు [...] నిర్ధరించితిమి. ఇక నార్యేతరులలో నొకరగు కన్న[...] చాల కాలమునుండి దక్షిణహిందూస్థానమున నుండినవా[...] పలికితిమి. ఎంతకాలమునుండి యుండినవారో [...] నింత విచారింతము. కర్ణాటపదమే ప్రాచీనమను నర్థ[...] వాడబడుచున్నది. ఎంతప్రాచీనము? ఈ ఇరువది[...] రేండ్లలో అగ్నిపర్వతప్రకోపము దక్షిణహిందూ[...] మున కలిగినట్లు లేదు. అవి యెగ్గు లప్పుడప్పుడు [...] యుండవచ్చును. భాగవతమున నట్టి దవాగ్నిదహ[...] జెప్పబడియున్నది. అది యుండని. కర్ణాటకులు [...] రెండువేలేండ్లనుండి కన్నడిగలై యుండుటకు వి[...] మేమియు లేదు. దానికిముందు ద్వాపరాంతమున [...] పాండవులు దక్షిణమున నుండిన వనముల వాసము[...] వచ్చియుండిరని భారతమువలన దెలియుచున్నది. అ[...] వాసకాలమున పాండవులు కర్ణాటకమండలమున నుం[...] విరాటనగరిని నివసించియుండిరని దెలియునగు. మ[...] భూపాలుడని విరాటరాజునకు పేరు. మత్స్య[...] కన్నడమున మీన్. మీన్గొందె యనునది [...] మండలమున నున్నది. ఆలూరుతాలూకానందు చిన్న[...] పెద్దహ్యాటయను రెండు గ్రామములున్నవి. అవి [...] సమీపముననున్నవి. ఈ పెద్దహ్యాట చిన్నహ్యాట గ్రా[...]

...టనే విరాటనగరముండెనని స్థలపురాణము వ్రాయబడినది. స్థలపురాణోక్తవాక్యము లంత ...యములుగావు. అయిన సత్యాంశము లేకయుం ...గొండెయన్న కొండ. మీన్గొండెయన్న చేపవలెకన ...డ. అట్టికొండయుండు ప్రదేశము మత్స్యదేశమన ...హ. ఆనెగొందె=ఏనుగుకొండ. ఏనుగువలె నాకార ...కొండ యని భావము. శేషాచలము=పామువలెనుండు ... ఇవి యాకారములబట్టి జెప్పినవాక్యములేగాని ...బట్టి జెప్పినవిగావు ఈమీన్గొందెచెంతనుండిన ...నగరమే హ్యాటయను రూపాంతరము జెందినదని ... జనులు చెప్పెదరు. బొంబాయి కర్ణాటమున నట్టి ...కటి గలదని యందలివా రందురు. అందుకే స్థల ...ము లంత నమ్మదగినవి కావనుట. ఇందు సత్యాంశ ...నేని యది కర్ణాటకుల దయాదార్యములను, పరంప ...మైన ధర్మపక్షపాతమును స్థిరపఱచుచున్నది. ఇది ...ను అర్జును డశ్వమేధహయరక్షకుడై దక్షిణ ...ముల నెల్ల దిరిగె. అందు కుంతలదేశమును ... కుంతలాధిపుడైన చంద్రహాసుని సందర్శన ...భ్యమును సంపాదించె. కుంతలాధీశుడు న్యాయ ..., దైవభక్తుడును, శూరాగ్రేసరుడును సుం ...నగు చంద్రహాసుడు. ఇయ్యది కర్ణాటకుల ...ను చంద్రహాసునివఱకు గొంపోయినది. పితృ ...పాలనమునకై శ్రీరాముడు దండకారణ్యమును ...డె. అందు పంపాక్షేత్రమున వాలిని సుగ్రీవుని ...తుని జూచె. శ్రీరాముడు వాలిని వధించి, సుగ్రీ ...జేసిన కిష్కింధపట్టాభిషేకమును, సుగ్రీవాంజ ...ప్రముఖులు సీతను రామునియెడ జేర్చుటకై చేసిన ...త్నమును శ్రీమద్రామాయణమునందు వాల్మీకి ...యే వ్రాసియున్నాడు. అతనికి కర్ణాటకాభి ...మియు నుండియుండదుగదా? వాల్మీకి మహర్షి ...ణమున ఉన్నంత, విన్నంత, కన్నంత, రామచరి ... వ్రాసినాడు. కర్ణాటకదేశమున కిష్కింధ ... కిష్కింధాఖండమున పంపాక్షేత్ర మున్నది. ... వీరులనుటకు రావణుని పదితలల పురుగని ...దార్థము ఉయ్యాల గ్రాడగట్టిన వాలిబల మొక సాక్షి. అధికారమున కర్ణాటులు దక్షు లనుటకు సుగ్రీవాజ్ఞ యొక నిదర్శనము. ఆర్తుల కాశ్రయమిచ్చి దుష్టశిక్షణమును శిష్టరక్షణమును చేయుటయందును, దైవభక్తిని, పాపభీతిని, ప్రజానురక్తిని గలిగి వివేకవర్తనము జేయుటయందును కర్ణాటకులు ఆసక్తిగలవా రనుటకు దేదీప్యమానమైన మారుతి సచ్చారిత్ర మొకదృష్టాంతము. కర్ణాటకుల ప్రాచీనత త్రేతాయుగమువఱకు బ్రాకినది. అయిన దాని ప్రాచీనత కృతయుగమునను కన్పట్టకపోలేదు. కర్ణాటపు పశ్చిమభాగము పరశురామక్షేత్ర మనిపించుకొనుచున్నది. వృక్షములవలె నున్న కార్తవీర్యార్జునుని కరములను పరశురాముడు తన పరశువుతో దునుమె నను వర్ణన వనభూయిష్ఠమైన దక్షిణమునకే అన్వయించుచున్నది విష్ణువు చక్రమునుమాని పరశువును ధరించె నననదియు అలంకారోక్తి గల ఆర్య ద్రావిడవైరములోని వర్ణనగా నున్నది. మలయాళులు పరశురాముని నిగ్రహానుగ్రహములకు పాలైరి. వారికి చేరువనుండువారు కర్ణాటకులగు తుళువారు. పితృవాక్యపరిపాలనార్థము పరశురాముడు తనతల్లి తల గోసిన స్థల మిదియని కర్ణాటకులు హులిగిహొసూరులను జూపుదురు. అం దిప్పటికిని రేణుకాదేవి శరీరమునకు పూజ జరుగుచున్నది. ఈ విషయములనుండి జమదగ్ని యాశ్రమము కర్ణాటమున నుండెనని యూహింపనగు. ఇంత ప్రాచీనత చాలును.

కర్ణాటకులు ప్రాచీనులై వీర్యశౌర్యాదార్యన్యాయవర్తనములు గలవా రొక్కటియెగాక వర్తకులై వివిధదూరదేశములకు బోయియుండిరనియు వలసబోయిన స్థలములు తెలిసినంతవఱకు గ్రీసుదేశమువఱకును ఇటలీ దేశమువఱకును వ్యాపించియుండెననియు దెలియుచున్నది. క్రీ. పూ. సాలమన్ మున్నగువారి కాలమందు ప్యాలస్తీన్, బ్యాబిలోనియా రాష్ట్రములకు నెమళ్లను దంతపువస్తువులను బంగారును సముద్రయానమం దారితేరిన తమిళులు గొంపోవుచుండిరని ఇతిహాసాధారముల దెలియుచున్నది. దక్షిణహిందూస్థానము, కుమారస్వామికి వాహనముగా నెన్నబడు నెమళ్లయందును, శివుని దర్పమునకు పాల్పడిన యేనుగులయందును కర్ణాటమున వలసి

నంత కన్పట్టు బంగారువందును ప్రసిద్ధికెంది యుండెను. పొన్ అనిన బంగారని యర్థము. కర్ణాటకులకు, లోహములలో బంగారు మొదట కనబడియుండును. వారు బంగారువ్యాపారము జేసియుందురు. ఏలనన కర్ణాట దేశము బంగారునకు బుట్టినిల్లు. మఱియు వారు ఇనుమును కర్పొన్ = నల్లబంగారు, బెళ్పొన్ = తెల్లబంగారు అనియు వాడుచున్నారు. పొన్ అనిన లోహమని యర్థముకేసికొనినను ద్రావిడులకు లోహములు పురాతన కాలమునుండి దెలిసినవి యని దెలియుచున్నది. గ్రీసు దేశమునందు ఆక్సిరింకస్సను ప్రదేశమున దొరకిన గ్రీకు నాటకమునందు కర్ణాటపుమాటలు కన్పట్టుచున్నవి. దీనివలన కర్ణాటజనవ్యాప్తియును భాషావ్యాప్తియు నంతవఱకుండెనని జెప్పవచ్చును. ఏసుక్రీస్తు భారతీయుడని రామస్వామి అయ్యరుగారు ఊహించి కారణములు జూపినది యంత నిరాధారమైన సిద్ధాంతము గాదు. ఏసు వలసబోయిన దక్షిణహిందూస్థానమువాడయి యుండవచ్చును. మేరి మరమ్మ=మారెమ్మ ఏసుతల్లి. సక్కరయ్య మొదలగు నామములును దక్షిణహిందూదేశీయు లందుండునవి. అది యటుండనిండు. మఱియొక నూతనవిషయమే మనిన క్రైస్తవుల వేదమునందు (Bible) 'హొసన్న' యనుపదము వాడబడినది. అక్కడివారు ఏసుక్రీస్తును హొసన్న యని బిలిచిరి. ఇది శుద్ధకర్ణాటపదము. తమిళముగాను, తెలుగును గాదు. తదితర విగుప్తదేశభాషలో నిదియు గాదు. హొసన్నయన కన్నడమున క్రొత్త అన్న యని యర్థము హొసన్న=new brother. వలసబోయిన కర్ణాటకులాతని నట్లు సంబోధించియుందురు. ఏసు దేవపితృత్వమును మానవభ్రాతృత్వమును బోధించెను (Fatherhood of God & Brotherhood of men.) దానింబట్టియే యతడు కన్నడిగలచేత నట్లు పిలువబడెను. ఇది ఐతిహాసికోక్తి; క్రైస్తవుల వేదవాక్యము.

కర్ణాటకులు మతసహిష్ణుత గలవారు. కర్ణాటము త్రిమతస్థులకు శరణాలయమై యుండెను. వారు తొలుత వనదేవత నారాధించుచున్నట్లు కనబడుచున్నది. వారిలో తుళువారు మంచి యోధులైరి. తోడలు గొల్లలైరి. మహిషమండలము కర్ణాటములోనిది. పాలుపితుకు బఱ్ఱెలు మెందు. వానిని పోషించి పాడిచేసి బ్రదుకువా[ఱు]. బడగలు పాడి పంట జేసికొని యుండువారైరి. [త]... కన్నడిగలు వర్తకము మొదలగు వివిధవృత్తులందును, ... లందును ప్రవీణులైరి. వనపర్వతప్రదేశముల నుండు స్థి... నందఱును వీరవృత్తినే యవలంబించియుండిరి. ధీరో[దా]... లైనవీరు లెప్పుడును ఔదార్యభావముగలవారై యుండ[ుట] సహజము. వీరియందు నదియే కన్పట్టుచున్నది. తరు[వాత] కర్ణాటమున పాశుపతము సంభవించినది. అటుపి[మ్మట] శైవము ప్రవేశించినది. ఆమీద వైష్ణవము చొచ్చిన[ది]. ఈమూడుమతముల సంకరము జైనమయినది. గుణగ్ర[హ]హిణులగు కర్ణాటకులు సమస్తమతములను సమదృష్టి... సమరసభావమునను సంరక్షించినారు. ఇప్పుడు మహ[మ్మ]దీయక్రైస్తవమతములకు నట్టి స్వాగతమే యొసగబడె[ను]. ఏమతమువారికి నెట్టితొందరలు లేవు.

గీ. 'బుధునకును మూర్ఖునకు నొక్క పోల్కి గార
వంబు నేయుదు రిచ్చటి ప్రాజ్యజనులు.'

— తెలుగువిశ్వగుణాదర్శము

కర్ణాటకులు పండితపామరుల నొక్కపగిది స[మా]దరమున జూచుచుందురు. కన్నడిగలు మతోద్రేక మ[ను] మాట నెఱుగరు. ద్వైతవిశిష్టాద్వైతాద్వైతమతము[లు] ఇందు ప్రబలినవి.

కన్నడిగలు ధర్మప్రవర్తనమును, నైతికసంప[ద] గలవారై యుండిరని కనబడుచున్నది. వారి శౌర్య[ధైర్య]ర్యములు రామాయణభారతములందు వర్ణింపబడియు[ండు]టయే గాక మధ్యయుగమునందు వచ్చియుండిన హ[ుయ]న్ట్స్యాంగను చీనాప్రవాసిగ్రంథమునను కర్ణాటకుల ... సంధతనుగుఱించియు, న్యాయప్రియత్వమునుగూర్చియు శౌర్యాదార్యములనుగూర్చియు పొగడ్తయున్నది. అ[క్క], అమ్మ, అత్తె, మావ, గండ, హెండతి మున్నగు వా[డు]కలుండుటం బట్టియు, ప్రకృతశీలసంప్రదాయము[ను] బట్టియు కన్నడిగలు సౌశీల్యము గలవారని దెలియు[చు]న్నది. కన్నడిగ లనుకంపాపరులని తెలియుచున్[నది]. వారి భూతదయాబుద్ధియే అహింసాపరము లగు ... రామానుజమాధ్వ బసవారాధ్యమతములకు సాను...

ణమును నొసగతోడ్పడియుండునని తోచుచున్నది. ము వారి యుదారగుణమే ప్రజారంజనము చేయు రాజవంశ మెద్దియైనను దానికి సింహాసనారోహణ భాగమును గలిగించినది. పూర్వకాలమునుండి వారు రి యధికారమున మన్నవారు. నాయకులయందు విధేయతలు చూపు అలవాటు కన్నడిగలకు మొదట యుండుటం బట్టి ప్రభువగువాడు తనజాతివాడు ండినను ప్రజారంజకుడుగా నుండిన వానిపరిపాలనకు డేవారు. అందుకే అనేక రాజవంశములు కర్ణాటము వి.

కర్ణాటకులు పరిపాలనశక్తియందును పేరుబొందిన . సుగ్రీవాజ్ఞయను గాథయే వారి అధికారాసక్తిని పుచున్నది. పురాణకాలపు రాజులు గాక కర్ణాటము ఇమ్మడిపులికేశి, కృష్ణదేవరాయలు చక్రవర్తులై స్వధర్మ స్వదేశరక్షణము జేసి ఆచంద్రతారార్క కీర్తిని గడించిరి. రాజభక్తి కేమి, చక్రవర్తిభక్తి కేమి రు రాజ్యమును, బ్రిటిష్‌కర్ణాటరాష్ట్రమును ఇతర ష్ట్రములకెల్ల నాదర్శప్రాయములుగా నున్నవి.

కన్నడిగలు లలితకళలయందతినిపుణులు. వారి శాస్త్రపరిజ్ఞానము చూచి కన్నులపండువు చేసికొన నయెడల హంపి, ఎల్లోర, బేలూరు మున్నగుస్థలము యందు కట్టడములనుమాత్రము పరికించిన చాలును. ఈ ములజూచి ప్రశంసింపని పరదేశప్రవాసియే లేడు. భిమానమున బొడము ఈర్ష్యాసూయలను సైతము వీనిని బొగడని మనుజుడే లేడు. ఇక సంగీతశాస్త్ర దన్ననో, దక్షిణహిందూస్థానపు సంగీతము కర్ణాట తమనియే ప్రసిద్ధిజెందినది. హులిసితాళమును పదములు టపదములు. కర్ణాటసంగీతము హిందూస్థానిసంగీతము ను సూక్ష్మమైనదియు, సంపూర్ణమైనదియు, శాస్త్రీ మైనదియు, సౌఖ్యదమైనదియు నై యున్నదని స్వజాతులవారు సమ్మతించినారు. ఇట్టి సంగీతజ్ఞానము కర్ణాటకుల సాహిత్యమునందు సంగీతమున కేమి వ? కర్ణాటసాహిత్యమునందు పాడుంగబ్బమని సాహిత్యవిశేషమే గలదు. కర్ణాటకులు సంగీత లగుటంబట్టియే

‘ బిందువిసర్గం వ్యంజన
మొందిద దడ్డక్కరల పదాంత్యం దీర్ఘం.’

—నాగవర్మఛందస్సు.

అని పాదముయొక్క కడపటి లఘువును సైతము గురువుగా జేసికొని విడిచినారు. తెలుగునం దిట్టి స్వాతంత్ర్యము లేదు. పదియవ శతమానమునం దుండిన కావ్యమీమాంసాకర్తయగు రాజశేఖరుడను సంస్కృతకవి కర్ణాటకులు పద్యములను టంకారముతో చదువుదురని ప్రాంకముగా బలికినాడు. హిందూస్థాని సంగీతము ఆర్యసంపర్కము గలది. అయ్యది ఆహాహూహూశబ్దనలతో మునిగియును. కర్ణాటసంగీతమున్న సప్తస్వరముల సూక్ష్మోచ్చారణములతోను, రాగతాళశక్తితోను హృదయానందకరముగా నుండు. సప్తస్వరముల ధ్వనులు వన్యమృగపక్షులధ్వనులతో పోల్పబడినవి. వనగిరులందు వసించుచుండిన కర్ణాటకుల చెవికివి చిన్నప్పటినుండియే తెలిసియుండును. ఈ కారణమును బట్టియే కాబోలు, కర్ణాటకులు సంగీతకళయందు ప్రవీణులైరి. వీణను కర్ణాటకులే కనిపెట్టియుందురు. సంగీతము నెఱింగినవారు సాధనముల జేసికొనకయుందురా? వీణకు వలసిన కట్టె, సొరకాయ, తంతులు కర్ణాటకుల కున్న చోటనే దొరకువస్తువులు. వీణసింహముఖము సహితము వన్యజాతికర్తృత్వమును వెల్లడించుచున్నది. వనపర్వతప్రాంతముల నివసించుచుండిన ద్రావిడులు పాములను నయభయభక్తులతో జూచుచుండిరి. వానిని జంపిన పాపమని భావించుచుండిరి. అయిన విషప్రాణియైన నాగమునుండి తప్పించుకొనుటకై విషపదసులనైన తల లూపజేసి శ్రోత్రేంద్రియపరవశులుగా జేయజాలు మంగళకరమైన నాగస్వరమును కూడ సంగీతమునందు సహజమైన పాండిత్యముగల కర్ణాటకులే కనిపెట్టియుందురు. నాగములు చక్షుఃకర్ణములగుట వినువపుడు కనుగొనజాలవు. అట్టివేళ ద్రావిడులు వానినుండి తొలగిపోవుచుండిరి. ద్రావిడులు నాగస్వరము వాయించుటయందు నిపుణులనుట లోకప్రసిద్ధము. ఇట్లు కర్ణాటకులు సంగీతమును, సంగీతసాధనములను వృద్ధికి దెచ్చినవారు. సంగీతసాహిత్యసమ్మేళనము జేసిన కర్ణాటకులలో పురందరదాసు ముఖ్యుడు. అతడు ఆనందమత సాహిత్యము

తో పాటు సంగీతమును జేర్చి పాటల వ్రాసి త్యాగరాజు లకు ఆదర్శకవి యాయెను.

క. 'దురితవ్రాతము లెల్లను
బరిమార్చెడి హరిగుణముల బాడుచు నెపుడున్
పరవశుడై విలయుపురం
దరదాసుని మహిమములను దలచెద మదిలోన్.'

అని త్యాగరాజు తన ప్రహ్లాద భక్తవిజయ మను రూపక మున పురందరదాసుని ప్రస్తుతించినాడు. త్యాగరాజు కృతుల నెల్ల ద్వైతము నిండియున్నది. హరి హరులను భాగవతసంప్రదాయమున సమముగా స్తుతించినాడు గాని ద్వైతాద్వైతమతభేదమును శాస్త్రానుసారముగా గుర్తింపక పోయినాడు. 'ద్వైతము సుఖమా? అద్వైతము సుఖమా?' యని డోలాయితమనస్కుడై పోయినాడు. అయిన ననుభవమున ద్వైతమునే యనుసరించినాడు. తన సాహిత్యమందతడు రామదాసోహమ్మని పలుమారులు పలికియుండినను శ్రీరాముడు తనదాసుడైన త్యాగరాజును 'పదిపూటలపై గాచెద'నని పలికియుండినను, కొంద అతని సాహిత్యమును, స్వభావస్వానుభవములను వేరుగా దలచుచున్నారు. పురందరదాసులు భావకవిత్వమును సంగీతముతో గలపి, పండితపామరరంజకముగా త్యాగరాజు సంగీతమును భావకవిత్వముతో గలిపి శాస్త్రజ్ఞులు తెలలూప కర్ణాటసంగీతకీర్తిని కేంద్రస్థానము జేర్చిరి. ఇంతయె కాదు కర్ణాటకులు నాట్యకళయందును అసమాన పాండిత్యము గలవారు. నాట్యము తాండవము, లాస్యమని ద్వివిధము. తాండవము పురుష నాట్యము,

లాస్యము స్త్రీనాట్యము. తాండవము ద్రావిడులకై శివుని నాట్యమగుటచే నది పురుష నాట్యముగా భా బడియె. శివునకు మహానటు డను బిరుదు గలదు. శివునిభక్తుడగు నంది మంగళవాక్యము. కొడగువా దిప్పటికిని తాండవమాడు వాడుక గల దందురు. మై మొదలగు కర్ణాటదేశపువారి నాటకప్రదర్శన త్వము సర్వజనవిదితము. ఉష్ణమండలమునందు వే వెలుతురు నుండుట నచిరకాలములోనే వస్తువుల ము లగున ట్టిక్కడివారి బుద్ధియు తదితరమండలము బుద్ధికంటెను శీఘ్రకాలములోనే పరిపక్వ మగుచున్న ప్రఖ్యాతభూగోళశాస్త్రజ్ఞుల సిద్ధాంతము; అ వేద్యము. జలసమృద్ధియందును, ఫలాహార సమృద్ధి దును కొదవలేని యుష్ణమండల ప్రదేశములందు జీవనోపాయప్రయత్నము లల్పవిషయములై యుం వారు విశ్రాంతిని మెండుగా గలవారై యుం అట్టి విశ్రాంతి కాలమున వారు సకల తత్త్వశాస్త్ర పరులై యుందురనియు, సహజముగనే కుశాగ్రబుద్ధి వారై యుందురనియు మానవచరిత్రము నుండి తెలిసికొనవచ్చును. ద్రావిడు లుష్ణమండలమున వారు. అందునను కర్ణాటకులు సుందరదేశమున వారు. వారు సమస్తశాస్త్రములందు ఘనపాండిత్య గడించిరి. కనుకనే వా రిట్లు వర్ణింపబడినారు.

గీ. 'వేదముల నభ్యసింపక వీరు శాస్త్ర
వాదముల నెల్ల వేళల నాదరింత్రు.'

— తెలుగు విశ్వగుణాదర్శము

---

# మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుల సంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, కార్యాలయమునకును తెలుపగోరెదము.

మేనేజరు, 'భారతి.'

# శాతవాహనవంశీయుల శాసనములు

భావరాజు వేంకటకృష్ణారావుగారు

(వెనుకటి సంచిక తరువాయి)

## ౮

(ఇది ౮ వ గుహయొక్క వెనుకతట్టు గోడపయిన ద్వారమునకు కుడిప్రక్కగా నున్నది.)

### మూలము: ప్రాకృతము

౧ దాసకస ముగూదాసకస[1] సపరివారస లెణ[2] దెయ ధమ[3].

### సంస్కృతము (ఛాయ)

౧ దాశకస్య ముగూదాసస్య సపరివారస్య లేణం దేయధర్మమ్.

### ఆంధ్రీకరణము

ఈ గుహను సపరివారుడయి ముగూదాసుడు ధర్మముచేసినాడు.

### సంగ్రహవ్యాఖ్య

'సపరివార' శబ్దమునకు సరియైన అర్థము చెప్పుట కష్టమని పాశ్చాత్యదేశపు పండితులు అభిప్రాయపడిరి. ...యులకు సపరివారు డన్నమాటకు అర్థము సులభముగా తెలియుచున్నది. కొందరూహించినరీతిగా 'స...గా' నని యనుకొనినచో లేఖరి అట్లు అర్థమిచ్చు బంధుత్వమును దెలుపు పదముల నేల వాడియుండ...ప్రశ్న వచ్చుచున్నది. అందువలన 'సపరివారు' డనగా చుట్టును కొలిచియున్నవారలతోగూడి యనిగాని ...తో కలసి యనిగాని అన్వయము చేసుకొనవచ్చును. ఈ ముగూదాసుడు దాశకుడు. ఈతని పేరుగలవాడు ...దారు" డొకడు కూడ నితని సమకాలికు డనదగువాడు కలడు. ఆతనిగూర్చి ముందు తెలుపబడును.

## ౯

(ఇది ౮ వ గుహయొక్క వసారా వెనుకటిగోడపయిన ద్వారమున కెడమప్రక్క నున్నది.)

### మూలము: ప్రాకృతము

౧ చెటిక-ఉపాసకియస ముగూదాసస[1] సపరివారస లెణం[2] దెయధమ[3]

ఎతస లెణస[4] బొధిగుత-

౨ ఉపాసకస పుతెన ధమనందినా దతం[5] ఖెతం[6] అపరిలీయ కణ్హహినియ

ఎతొ చ ఖెతాతొ చీవరికం[7] పవైతస.

---

౧. 'ముగుడా' యని చదువవచ్చును. రెండవఅక్షరముపై దీర్ఘము కానుపించుటలేదు. ౨. లెణం. ౩. ధంమ.

పాఠభేదములు:— ౧. మోగూ. ౨ లెణ. ౩. ధమొ. ౪. లెణస. ౫. దత. ౬. ఖెత. ౭. చీవారిక.

## సంస్కృతము (ఛాయ)

౧ చేటిక ఉపాసకీయస్య ముగూదాసస్య సపరివారస్య లేణం దేయధర్మమ్.
ఏతస్య లేణస్య బోధిగుప్త
౨ ఉపాసకస్య పుత్రేణ ధర్మణనందినా దత్తం క్షేత్రం అపరస్థలీయ కణ్హాహి
నీయ ఏతత్ చ క్షేత్రం చీవరకం పరివ్రాజకస్య.

## ఆంధ్రీకరణము

'చేటిక' సంఘమునకు చెందిన ఉపాసకుడు ముగూదాసుడు సపరివారుడై యీగుహను ధర్మముచేసెను. గుహయందు నివసించు పరివ్రాజకులకు వస్త్రములనిమిత్తము పడమటికణ్హాహిని గ్రామమునందున్న ఒకపొలము ఉపాసకుడైన బోధిగుప్తుని పుత్రుడు ధర్మణనందనుడు దానముచేసెను.

## సంగ్రహవ్యాఖ్య

ఈ శాసనమును, పై శాసనమును సరిపోల్చి చూచునది. 'చెటిక' కులము అనునది ఈకాలమున నేకులమున సంబంధించినదో యని యూహ పొడముచున్నది. చెటికకులమువాడైన ముగూదాసుడు చేపలబట్టువృత్తి చేయు చున్నాడు. చెటిక ఇప్పటి చెట్టి, లేక సెట్టిగకులమున కేమైన వర్తించునా? ఇంకను విమర్శింపవలసియున్నది ఈ శాసనమునందు "అపరిలీయ కణ్హాహినియ" అను పదములు అర్థముగాకున్నవి. 'అపరిలీయ' 'అపర' (పశ్చిమ శబ్దముయొక్క విశేషణమా యని సందియము కలుగుచున్నది. ఈ రూపము ఎక్కడను కనబడదు. మరియు నాల్గవశాసనమందు పేర్కొనబడిన 'అపర కఖడియ' అను పదములందలి 'అపర' శబ్దమునకు సరిపోవుటలేదు 'అపర కణ్హాహినియ' గ్రామమున గల యా దత్తక్షేత్రనామముగూడ కానబడదు. ఇంతకును 'అపరిలీయ' పద సందిగ్ధముగానుండి బోధపడకున్నది.

## ౧౦

(ఇది పదియవగుహయొక్క వసారాలోని వెనుకతట్టు గోడపైన పైకప్పునకు క్రింద నున్నది.)

## మూలము: ప్రాకృతము

ఈ శాసనమును డాక్టర్ హోర్నల్ గారు ఇండియను ఆంటిక్వెరీ ౧౨ వ సంపుటము ౨౭ వ పుటయందు డాక్టరు భండార్కరుగారందే ౧౩౯ పుటయందును ప్రకటించియున్నారు. చదువరులు పరిశీలింపదగును.

౧ సిద్ధమ్. రాజ్ఞః క్షహరాతస్య క్షత్రపస్య నహపానస్య జామాతా[1] దీనీక
పుత్రేణ ఉషవదాతేన త్రిగోశతసహస్రదేన నద్యా బార్ణాసాయాం
సువర్ణదానతీర్థకరేణ దెవతాభ్యః బ్రాహ్మణెభ్యశ్చ షొడశగ్రామదెన
అనువర్షం[2] బ్రాహ్మణ శతసహస్రీ భొజాపయిత్రా

---

౧. 'జామాత్రా' లో 'త్రా' స్పష్టముగా తప్పు గానవచ్చుచున్నది. ఇది లేఖకదోషము 'త' కు ఉకార మిచ్చినట్లు కనబడుటచేత 'జామాతు' అనికూడా చదువవచ్చును. ౨. 'వర్ష'

౨ ప్రభాసె పుణ్యతీర్థె బ్రాహ్మణేభ్యః అష్టభార్యాప్రదేన భరుకఛె దశపురె
గొవర్ధనె శోర్పారగె చ చతుశాలావసధ ప్రతిశ్రయప్రదేన ఆరామ
తడాగ[3] ఉదపానకరేణ ఇబా పారాదా దమణ తాపీ కరబెనా
దాహనుకా నావా పుణ్యతరకరేణ ఎతాసాం చ నదీనాం ఉభతో
తీరం సభా—

3 ప్రపాకరేణ పిండీ[౪]తకావడె గొవధనె సువర్ణముఖె శో[౫]ర్పారగె చ రామ
తీర్థె చరకపర్షభ్యః గ్రామే[౫] నానంగొలె ద్వాత్రీశతనాళీగెర మూల
సహస్రప్రదేన[౬] గొవధనె త్రిరశ్మిషు పర్వతేషు ధర్మాత్మనా ఇదం
లేణం[౭] కారితం ఇమా చ పొఢియొ[౮] [॥*] భటారకా అంజ్ఞాతి య[౯]
చ గతోస్మిం[౧౦] వర్షారతుం మాల యె హి రుధం ఉతమభాద్రం[౧౧]
మొచయితుం

౪ తె చ మాలయా ప్రసాదెనెవ అపయాతా ఉతమభద్రకానం[౧౨] చ క్షత్రి
యానం సర్వె పరిగ్రహా కృతా తతో[౧౩]స్మిం[౧౩] గతో పొక్షరాణి తత్ర
చ మయా అభిసెకొ కృతో త్రీణి[౧౪] చ గొసహస్రాణి దతాని
గ్రామొ[౧౫] చ [॥*] దతచానెన[౧౬] క్షెత్రం[౧౭] బ్రాహ్మణస వారాహి
పుత్రస అశ్వభూతిస హథెకీనితా మూలెన[౧౮] కాహాపణసహస్రెహి
చతుహి ౪౦౦౦ య సపితు సతక నగరసీమాయ ఉతరాపరాయ
దిసాయ[౧౯] ఎతో మమ లెణె వస—

౫ తానం[౨౦] చాతుదీసస[౨౧] భిఖుసఘస ముఖాహారో భవిసతి.

సంస్కృతము (ఛాయ)

౧ సిద్ధమ్! రాజ్ఞః క్షహరాతస్య క్షత్రపస్య నహపానస్య జామాత్రా దీనీక
పుత్రేణ ఋషభదత్తేన త్రిగోశతసహస్రదేన నద్యాం బార్ణాసాయాం

---

3. 'తడాగ' ౪. 'పిండీ' ౫. 'గ్రామ' ౬. 'సహస్రదేన' ౭. 'లెణ' ౮. 'పొఢియొ' ౯. 'అంజ్ఞాతియా' 'అ' తరువాత అనుస్వారము పొరపాటుచేత లేఖరి వ్రాసియుండవచ్చును. ౧౦. 'స్మి' ౧౧. 'ఉత్తమ ౧౨. 'కానాం' ౧3. 'స్మి' అనుస్వారము తప్పు. ౧౪. 'తీనిగొస' ౧౫. 'గామొ' ౧౬. 'చనెన' క్షేత్ర' ౧౮. 'మూలెన' ౧౯. 'దిసా' ౨౦. 'తాన' అనుస్వారము తప్పు. ౨౧. 'చతుదిస'

సువర్ణదాన తీర్థకరేణ దేవతాభ్యః బ్రాహ్మణేభ్యశ్చ షోడశగ్రామదేన
అనువర్షం బ్రాహ్మణశతసహస్ర భోజయిత్రా

౨ ప్రభాసే పుణ్యతీర్థే బ్రాహ్మణేభ్యః అష్టభార్యాప్రదేన భరుకచ్ఛే దశపురే
గోవర్ధనే శోర్పారగే చ చతుశ్శాలావసథ ప్రతిశ్రయప్రదేన ఆరామ
తటాక ఉదపానకరేణ ఇబా పారాదో దమన తాపీ కరబేన దాహా
నుకా నావా పుణ్యతరకరేణ ఏతాసాం చ నదీనాం ఉభయతీరం సభా

౩ ప్రపాకరేణ పిండీతకావడే గోవర్ధనే సువర్ణముఖే శోర్పారగే చ రామతీర్థే
చరకపర్షభ్యః గ్రామే నానంగోలే ద్వాత్రింశత నాళికేర మూలసహస్ర
ప్రదేన గోవర్ధనే త్రిరశ్మిషు పర్వతేషు ధర్మాత్మనా ఇదం లేణం కారితం
ఇమాం చ పృథివీం భట్టారకైః ఆజ్ఞప్తశ్చ గతోస్మి వర్షర్తుం మూల
యైః రుద్ధం ఉత్తమభద్రం మోచయితుం

౪ తే చ మాలయాః ప్రనాదేనేవ అపయాతాః ఉత్తమభద్రకానాం క్షత్రి
యానాం సర్వే పరిగ్రహాః కృతాః తతోస్మిన్ గతః పుష్కరాణి తత్ర
చ మయా అభిషేకః కృతః త్రీణిచ గో సహస్రాణి దత్తాని గ్రామశ్చ
దత్తః చా నేన క్షేత్రం బ్రాహ్మణస్య వారాహిపుత్రస్య అశ్వభూతేః
హాధేకీనితా(?)* మూల్యేన కాహాపణ సహస్రైః చతుర్భిః సపితు
సుతక(?) నగరసీమాయ ఉత్తరాపరదిశాయ ఏతన్మమ లేణే వస

౫ తః చాతుర్దివసస్య భిక్షుసంఘస్య ముఖాహారో భవిష్యతి.

## ఆంధ్రీకరణము

స్వస్తి! క్షహరాతక్షాత్రపుడును రాజును అగు నహపానుని అల్లుడును, దీనీకుని పుత్రుడును, అగు బు
దత్తునిచేత నీయబడిన ధర్మము: దేవతలకును బ్రాహ్మణులకును బార్ణాసానదియొద్దను మూడులక్షలగోవులను దా
చేసినవాడును, సువర్ణదానములను తీర్థములను (తిరునాళ్లు) జరిపించినవాడును, షోడశగ్రామములను బ్రాహ్మ
కును దేవతలకును దాన మొసంగినవాడును, అనువర్షము (సంవత్సరపర్యంతము) శతసహస్రసంఖ్యాకులకు (లక్ష
బ్రాహ్మణులకు భోజనములు పెట్టువాడును. 'ప్రభాస' పుణ్యతీర్థమున బ్రాహ్మణులకు అష్టభార్యల నొసంగిన
నః*, భరుకచ్ఛ, దశపుర, గోవర్ధన, శోర్పారగ నగరములందు వాసయోగ్యము లయిన చతుశ్శాలా (నాలు
భవంతివంటిది, చుట్టును వసారా గలిగినటువంటిది) సత్రములను కట్టించినవాడును, ఆరామ, తటాక, ఉదపా

---

*. ఇదియేమో నాకు తెలియుటలేదు. ఒక క్షేత్రము పేరా యని సందేహము కలుగుచున్నది. ఇంక
విషయము విచార్యము.

*. వ్యాఖ్య చూడుడు.

…వీరు (త్రాగు తొట్టెలవంటివి?) లను నిర్మించినవాడును, ఇబా, పారాదా, తాపీ, కరబెనా, దాహనుకా …ఉచితముగా దాటించుటకై పుణ్యముగొఱకు నావలు వేయించినవాడును, ఈ నదుల యుభయతీరము …విశ్రాంతిమందిరములను, పానీయశాలలను (చలివేంద్రలు) నిర్మించినవాడును, 'నానంగోల' గ్రామమున …రెండువేల నారికేళమూలములను (కొబ్బరితోటయా?) (కొబ్బరి అంట్లుగాని, మొక్కలుగాని కావచ్చును) …వడ, గోవర్ధన, సువర్ణముఖి, శోర్పారగము, రామతీర్థము మొదలగు నగరములందు గల చరకసంఘముల …ఖీయులగు (బ్రహ్మచారులు గావచ్చును) కు దానముచేసినవాడును అగు ఋషభదత్తుడు ధర్మచింతతో …డై గోవర్ధనమందున్న త్రిరశ్మి పర్వతములపై యీ గుహను ఇందలి నీటిగుండములను దొలిపించి దానము … [నేను] భట్టారకుని (రాజు) చే యాజ్ఞాపింపబడి ఉత్తమభద్రుల నాయకుని వర్షఋతువులో మాలయులచే …ంకణవాస్తవ్యులు కావచ్చును) బంధింపబడినవానిని చెఱనుండి విముక్తుని చేయుట కరిగితిని. నారాక తెలిసి …నే మాలయులు భీతచిత్తులయి పారిపోయిరి. అంతట ఉత్తమభద్రకులచేత వారందరు పట్టుకొనబడి బంధిం… అప్పటినుండి (పుష్కరిణి) పోష్కరతటాకమున కరిగి యందు స్నానమాచరించి మూడువేల ఆవులను …మును దానము చేసితిని. అప్పటనే వారాహి (భట్టు) కుమారుడైన 'అశ్వభూతి' వలన అతనికి పైతృక…ము, పూర్వార్జితమైనట్టియు తనకు నిరాటంకముగా సంక్రమించినట్టియు పొలమును, మరియు నగరసీమలందు …తరదిశ (వాయవ్యదిశ)గా నున్న 'హాథేకీనిత' మను పొలమును రెంటెని నాలుగువేళ కాహాపణములు మూల్య…యమునకు తీసుకొని దానముచేయుచున్నాను. నేను దొలిపించిన యీ గుహయందు మార్గస్థులుగావచ్చి …ము లుండిపోవుచుండు భిక్షుకసంఘమునకు, ఈ దత్తిక్షేత్రమునుండి వచ్చు ఫలాదాయములు ముఖ్యాహార…చుండవలయును.

## సంగ్రహవ్యాఖ్య

…శాసనములో మొదటిభాగము అనగా 'అష్టభార్యా ప్రదేన' అను వచనారంభమువఱకు గల వాక్యము …ు స్వల్ప పాఠభేదములతో తప్ప కార్లీ గుహశాసనములలో ౧౩ వ దానితో సరిపోవుచున్నది. ఈ విష… కార్లీ గుహశాసనములను సంపాదించి ప్రకటించినపుడును చర్చింతును.

…అష్టభార్యా ప్రదేన' అనుటచేత ఒక్కొక్కనికి ఎనమండుగురు భార్యల నిచ్చిన అని యర్థముచెప్పుట … సమంజసముగా తోచుటలేదు. ఆకాలమున నట్టి యాచారమేమయిన నుండెనేమో మనకు తెలియదు. …నా కొకయూహ పొడముచున్నది. అది వింత యని కొందఱకు తోచవచ్చును. పురాణములందు మనకు …వఱకు అష్టభార్యాయుతు డొకడే యున్నాడు. అతడు శ్రీ కృష్ణుడు. మన నహపానునికాలము నాటికి …ుని పరమాత్మస్వరూపుడుగ పరిగణించి ఆరాధించుట బ్రాహ్మణులలో నాచారమైనట్లు గానవచ్చెడిని. … శ్రీ కృష్ణభగవానునకు అష్టమహిషీకళ్యాణము గావించి యా సువర్ణవిగ్రహములను బ్రాహ్మణులకు …చేయుచుండువాడని యర్థము చెప్పవలయును. పండితులు దీని నింకను వితర్కింతురుగాక.

…పురము తక్క మిగిలిన నగరము లన్నియు నీవఱకే నిర్ధారింపబడియున్నవి. ఈ దశపురము మాళవమందలి …ర్ అని ఫ్లీటుపండితుని యభిప్రాయము. (గుప్తచక్రవర్తుల శాసనములు, పుట ౭౯. ౨ వ నోటు) మాళవ…స్థానమందున్న దశపురమయినచో నదియే గావలయును. ఇచ్చట శకజాతులు నివసించుచుండినట్లు …వ శాసనమందు తెలుపబడియున్నది. కావున నీ పురము ఉత్తరప్రాంతమున నున్నదే యని నిర్ధారింప

పిండీతకావడ, సువర్ణముఖి, ఇంతవఱకు నిర్ధారణ చేయబడియుండలేదు. నానంగోల్ గ్రామము తాణా మీద సంజాము నగరమునకు సమీపముగా నాలుగుమైళ్లదూరమున నున్న నార్గోలు గ్రామమునకు సరిపోవు దని భగవన్‌లాల్ ఇంద్రాజి పండితుడు ముడిపెట్టుచున్నాడు.

'చరక పర్షద్భ్యః' అనగా బౌద్ధ (మహావస్తు 3, ४०१.) జైనగ్రంథములందు 'అన్యతీర్థంక చరక ప జకా' అని పేరుతో గానవచ్చెడి. బ్రాహ్మణసన్యాసులు గావలయునని యూహ పొడముచున్నది. అ చరకశాఖీయులు అనగా యజుశ్శాఖీయు లగు బ్రాహ్మణు లని యర్థము చెప్పుటకు వీలుగలదు.

'గోవర్ధనము' నాసికకు ఆరుమైళ్లు దూరములో నున్న 'గోవర్ధన' గంగాపురము కావలయును. 'సా తాణాజిల్లాలో 'బేసిను'కు సమీపముగా నున్నది. ఇప్పటికి నిచ్చట 'రామకుండము'ని యొక కోనేరును చ చుచుందురు. ఇందు స్నాన మాచరించుటవలన పుణ్యము ప్రాప్తించు నని జనుల విశ్వాసము. భరుకచ్ఛము బ్రోచ్ పట్టణ మనుట నిస్సంశయము.

ఇందు పేర్కొనబడిన నదులను భగవన్‌లాల్ ఇంద్రాజి పండితు డీవిధముగా నిరూపించుచున్నా ఇబానది అంబిక, పారాదానది పార్, కరబెనా నది గుజరాత్ దేశమునం దున్న కావేరి, దమన నది దమణ దహనుకానది నేటి దహానూ ఉప్పుటేరు బర్ణాసానది సంస్కృతమున పురాణములందును మహాభారతమున పేర్కొనబడిన పర్ణాశానదితోడను, రాజపుత్రస్థానములోని బాణాస్ యేటితో సరిపోల్పవచ్చును. పర్ణా ఆబూపర్వత శిఖరప్రాంతమున జనించి కచ్ఛి సింధుశాఖలో కలియుచున్నది. బాణాస్ చంబల్‌నదికి ఉప నున్నది. వీటిలో రెండవదానికంటె మొదటిదానితోడనే బార్ణాసానదిని ముడిపెట్టవచ్చునని పండితుల ప్రాయము. బాణాస్‌నది వర్ష కాలమున తప్ప నితరఋతువులందు ప్రవహింపదు. కావున ఋషభదత్తుడు వదిలోనికి సోపానములు కట్టింపవలసిన అవసరము కలిగియుండ దని వారి యూహ.

ఈ శాసనమునందు పేర్కొనబడిన దానపతి నహపాణనృపాలుని యల్లుడు ఋషభదత్తు డనువాడు. బ్రాహ్మణుడు లేక బ్రాహ్మణమతావలంబకుడు. ఈ శాసనమం దాతడు పూర్వము బ్రాహ్మణులకొఱకు మహాదానము లన్నియు నుదాహరింపబడియున్నవి. అతడు బ్రాహ్మణుడయినను, అప్పటి కాలధర్మానుసార గాబోలు బౌద్ధ భిక్షుసంఘము కుగూడ కొన్ని దానములను చేసినాడు. ఇంతమాత్రమున కొందఱు పండి తలంచినట్లు ఋషభదత్తుడు బ్రాహ్మణ్యమును వీడి బౌద్ధమతమును స్వీకరించుటచే జరిగియుండెనని తలంప ఈ దానములబట్టి యాతని ఉదారశీలతయు, త్యాగబుద్ధియు, పరమతసహనమేగాక, పోషణచింతయు మనకు పడుచున్నవి. ఈ త్రిరశ్మిపర్వతముపై ఈ శాసనమున్న పెద్దగుహను (౧౦ వ సంఖ్యగా ఆర్కియాలాజికలు మెంటువారిచే గుర్తింపబడుచున్నది.) ఇరువదిమంది బౌద్ధభిక్షువులు సుఖముగా వర్షఋతువులలో నివసి కనుకూలమైనదానిని దొలిపించి, ఋషభదత్తు డందు సంచారముచేయుచు నాలుగుదినము లుండుచు పోవుచు సించు సన్యాసులకు భోజనాదికవసతులు విరివిగా నేర్పఱచినాడు.

ఇందు పేర్కొనబడిన ఉత్తమభద్రు లెవరో యింకను తెలియకపడలేదు. మాలయులు ఎవరోకూడ యుటలేదు. వీరు మలయపర్వతవాసు లనుటకంటె, మహారాష్ట్రవాసు లయిన మావలేలు అగుదురా యని యము కలుగుచున్నది. పొఖర లేక, పొష్కర అనునది అజ్మీరునకు ఏడుమైళ్లదూరములో నున్న 'పుష కావలయును.

(స శేషము.)



కాటరాయందలి బోధిసత్వవిగ్రహము
ఎత్తు 2 అ. 3¼ అం



జమాల్‌పురపు పాటిదిబ్బయందలి బుద్ధవిగ్రహము;
గుప్తయుగమునాటిది
ఎత్తు 7 అ. 2½ అం.

## ఆకస్మిక ఛాయాచిత్రములు



ఒంటిమిట్ట కోదండరామస్వామి దేవాలయపు లోపలిభాగము



భిన్న భావములు



విశాఖపట్టణము

ఛాయాచిత్రకారుడు : ద్వారము జగన్నాథరావుగా[illegible]



ఛాయాచిత్రకారుడు : యన్. వెంకటరావుగారు.

# హమ్ఫ్రీ డేవీ

జి. వి. రాఘవరావు గారు, బి. ఏ. బి. యల్.

దీపములను, పొటాసియమ్ మొదలగు తువులను, క్షేమదీపికలను గనిపెట్టి నకు మహోపకారము చేసిన డేవీ పరిశోధకుడు ఇంగ్లండు దేశములోని ' పురమున ౧౭౭౮ సంవత్సరము నెల 17 వ తేదీని జననము నొందెను.



సర్ హమ్ఫ్రీ డేవీ

పూర్వులు పురాతన కాలమునుండి ముగా కాలక్షేపము చేయుచుండిరి. డ్రి కొయ్యనగిషీ పనివాడు. వీరియింటి 'టాంకిన్' అను ఘనవైద్యుడొకడు ముండెను. అతడు మంచి భాగ్యవం అతనికి వీరికుటుంబముపై చాల యభి యుండెను.

అయిదారుసంవత్సరముల ప్రాయ బాలుడై యున్నపుడు తలిదండ్రులు డి కంపించిరి. కాని యాబాలు డేపుడును పాఠములు సరిగా చదివెడివాడు కాడు. చిత్రలేఖనమునందును, వనవిహారమునందును వానికిగల ప్రీతి బడికిపోయి పాఠములు చదువుటలో కనబడకుండెను. ప్రగల్భోక్తులు చెప్పి తోడిబాలుర విస్మితులజేసి యాడించుటలో నితనికి మరియొకడు సాటిలేకుండెను. మంచి మంచి పద్యము లింపుగా చదువుటయందును, వినువారు హాయిచెందునట్లు చక్కగా పాటలు పాడుటయందును, కథలు రసవంతముగా కల్పించి చెప్పుటయందును బహు సమర్థుడు. కనుక తోడిబాలురందరు నితనిచుట్టు జేరి కథలు చెప్పమనియు, పాటలు పాడుమనియు కోరుచుండిరి. 'అల్లులలో మల్లుపెద్ద' యని వారికందఱకు నితడే పెద్ద యయ్యెను. రాజులను గూర్చియు, యుద్ధములను గూర్చియు నితడు చెప్పుకథలు చెవులారవిని తోడిబాలకులు వీరరసపూరితులై కఱ్ఱకత్తులను, అట్టల డాళ్లను పట్టుకొని యుద్ధములకు బయలువెడలుచుండిరి. వేట తమకముచేత కొందఱు అతనితో గూడ సమీపమున నున్న కొండలమీదకు బోవుచుండిరి. మఱియొకప్పుడు వారందరును సాయంతనవిహారమునకు సముద్రమున కరిగి, ఆ తీరమందు బడియున్న గవ్వలు, గువ్వలు, చందమామలు నేఱుకొని వినోదించుచుండిరి.

ఈసందర్భములో చదువు సన్నమగుచుండెనని వేరే చెప్పవలెనా? పాఠములు సరిగా

అప్పజెప్పకపోయినపుడు ఉపాధ్యాయుడు డేవీ చెవులు రెండును నులిపి బుద్ధి చెప్పుచుండెను. ఒకనాడా కొంటెబాలుడు రెండు చెవులకును బంకపట్టించుకొని బడికి వచ్చెను. అది చూచి ఉపాధ్యాయుడు "ఏమిరా! అబ్బాయి! చెవులకేమో పట్టించుకున్నావేమి?" అని యడిగెను. "మీరు మాటిమాటికిని నా చెవులు నులిమి నలుగురిలో నన్ను చిన్నబుచ్చుచున్నారు. ఇక నాగాగు నులిపినపక్షమున మీ చేతికంటుకొనుటకు నా చెవులకు బంకపట్టించుకున్నా"నని డేవీ ప్రత్యుత్తరమిచ్చెను.

బడిసంగతి యిట్లున్నను వీరి యింటిపొరుగుననున్న ఘనవైద్యునికడ నితనికి చాల చనువుండెను. ఈవైద్యునియొద్ద నీబాలుడు విద్యుద్యంత్రములను గూర్చియు, లేడెన్ సీసా (Leyden-Jar)ను గురించియు, వోల్టామహాశయుడు కనిపెట్టిన విద్యుద్ఘటమాలను (Voltaic Cells and battery) గూర్చియు పెక్కు సంగతులు తెలిసికొని స్వయముగా కొన్ని ప్రయోగములుకూడ చేసెను.

ఇంతలో నితనితండ్రి కాలము చేసెను. తరువాత వీరిపొరుగుననున్న వైద్యుడు టాంకిన్ దొర యీబాలునిపై మరింత యభిమానముంచి తరిఫీదునిమిత్తము (Apprentice) ఇతనిని వేరొకవైద్యుని కప్పగించెను. ఆ వైద్యుని మేడమీదగదిలోనే ఇతని శాస్త్రపరిశోధన ప్రారంభమయినది. వైద్యగురుని మందులు, మ్రాకులును, వంటయింటి పాత్రసామగ్రులను మేడమీద నొకగదిలో పెట్టి, అదే ప్ర
శాల (Laboratory) గా నేర్పఱచుకొని
పరిశోధనలు చేయ నుపక్రమించెను.
ధర్మాత్ముడొకడు ఒక గాలిపంపు (Air-P
లు ఆపిన్నవానికి బహుమానముగా ని
కనుక ప్రకృతి శాస్త్రవిషయములను గు
విజ్ఞానము వృద్ధిచేసుకొనుటకు అతనికి
లసినన్ని యవకాశము లేర్పడినవి.
సహజముగా మంచి ధైర్యశాలి. ఒ
డితనిని కుక్క కఱచెను. ఆ సంగతి
రితో చెప్పక, తనకుతానే కత్తి చేతబ
కుని, పండులో కుళ్లినభాగము మనము
వేయునట్లే, కుక్కపండ్లు తగిలినంతమ
చుట్టును, సునాయాసముగా చరచర
పారవైచి మందుపెట్టుకొని, కట్లు కట్టు
గాయము మాన్పుకొనెను.

అతడు తనకు తెలియని సంగతు
డెవరు చెప్పినను నేర్చుకొని, తనకు తె
దంతయు నందఱకును చెప్పవలయునని
డు నుత్సాహపడుచుండెడివాడు. మరి
తనకు తెలియవచ్చిన శాస్త్రాంశములు
యము వచ్చినపుడు సరిగా ఉపయోగము
తెచ్చుకొని తాను సంకల్పించిన కార్యము
నేర్చుకొనుచుండెను ఇందుకు రెండు ఉదా
రణములు:

౧. ఒకనాడొక చిన్నబాలు డితని
వచ్చి "అయ్యా! పేపబెత్తపు ముక్కలు
చక్కా వేడిపుట్టి వెలుగగుపడెను. ఇట్లగు

...మేమి? అని యడిగెను. ఆ సంగతి
...తవఱకు తెలియదు. అది విని డేవీ
...సనా? అనుచు తత్క్షణమే రెండు
... ముక్కలు తెప్పించి మథించి చూచి
... చెప్పినది నిజమే నని తెలుసుకొనెను.
... పేమును సూక్ష్మముగా పరిశీలించి
...గా దానిపై పొరమీఁద నిసుకతో
... గఱుకుతొక్క యేర్పడియున్నట్లు
...య్యెను. ఇట్టి గఱుకుతొక్కల రాపిడి
...జ ఉష్ణము లిందు సులభముగా పుట్టు
...ని యతడు గ్రహించెను. తరువాత
...లమునకు ఒకప్పుడు ఐర్లండు దేశము
...యితులయెదుట వ్యవసాయరసాయన
...ములకు గల సంబంధమునుగూర్చి యుప
...ు లిచ్చునపు డీ యంశమును గూర్చి
...ఱకు చెప్పి, తన చిన్నతనములో నీ
... యొకబాలునివలన తాను నేర్చుకొని
...డ తెలిపెను.

... మరియొకప్పుడు 'డంకిన్' అనునొక
... డేవీకి గట్టిగా వాదము పొసగెను.
...భయులు ఉష్ణధర్మములనుగూర్చి వాద
...దములు సలుపుచుండిరి. రాపిడిచేత
...గడ్డలలోనయినను వేడిపుట్టునని డేవీ వా
... "ఏడిసినట్లే యున్నది. మంచుగడ్డలో
...ట్టునా! నీ మొగము! నీకేమి తెలుసును"
...కిన్ ఖండించుచు తూలనాడెను. అయి
...మథించుటవలన ఉష్ణ ముదయించుటలో
...మేమని డేవీ, ప్రశ్నింపగా, "ఒరే"
...ు! నీకుతోచదు మావంటివారు
చెప్పినను వినవు. నీవుబట్టిన కుందేటికి మూడే
కాళ్లను మూర్ఖుడవు. నీతో మాటలేల?" అని
నిరసించెను. మాటలేల? క్రియకే చూతము
రమ్మని డేవీ తన ప్రతిపక్షిని సమీపనదీతీర
మునకు తీసుకొనివెళ్లి నదిలోని మంచుగడ్డలు
రెండుతెచ్చి గట్టిగా మథించెను. అందువలన
వేడిపుట్టి మంచుగడ్డలు రెండును లోపలిభాగ
మున కరగెను. మథించుట మానినతరువాత
వేడిలేక, మంచుగడ్డలు కఱగుట మాని రెం
డును ఏకమై ఒక్కటే గడ్డయయ్యెను. ఈక్రియ
యిట్లు చేసిచూపి డేవీ ప్రతిపక్షినోరడచెను.
తరువాత చాలకాలమునకు లండనులో తగు
మనుష్యుల యెదుట ప్రకృతి వైచిత్ర్యములను
గూర్చి యుపన్యసించుచు డేవీ యీప్రయోగ
మునే విశేషార్భాటముతో చూపగా సభికు
లద్భుతరసమగ్నులయిరి.

౧౭౯౮ సంవత్సరములో ననగా నిరువది
సంవత్సరముల ప్రాయమపు డితనికి మంచియు
ద్యోగము లభించినది. ఇంగ్లండు దేశములో
క్లిఫ్టను నగరమున డాక్టరు బెడ్డోసు అను
నాతడు పెద్ద వైద్యశాల కట్టించి, శస్త్రచికి
త్సాదులలో తనకు సాయముగావలసి, తగు
వేతన మిచ్చి యీపిన్నవానిని తనకార్యా
లయమునకు రమ్మనెను; ఈయుద్యోగము
స్వీకరించుటకు బయలుదేరుచు నితడు భగవం
తు నిట్లు ప్రార్థించెను. "దేవా! నావంశమా
గొప్పదికాదు. నాకు ధనమూ లేదు. అధికార
మూ శూన్యము. అయినను ఇట్టిలోపములవలన
నే జేయదలచిన శాస్త్రజ్ఞానాభివృద్ధికిని,మానవ

సేవకునుమాత్రము లోపము రాకుండున ట్లను గ్రహింపుము" అని యిట్లు సవినయముగా లోకేశ్వరుని ధ్యానించి, పెద్దల యాశీర్వచనములబొంది మహోత్సాహముతో దేవీ యిల్లు వెడలెను. ఉద్యోగలాభ మటుండ యితని కిపుడు చదువుకొనుటకు కావలసినన్ని పుస్తకములు, గొప్పగొప్పవారితో పరిచయము ననులాభములు మరి రెండు కలిగినవి. కొంత కాలమీయుద్యోగములో నుండినతరువాత నితడు తాను చేసిన రాసాయనికప్రయోగములను గూర్చియు, పదార్థతత్త్వవిషయములనుగూర్చియు నొక చక్కని గ్రంథము వ్రాసి ప్రకటించెను. ఈ గ్రంథప్రకటనమువలనను, వారిగొప్ప సిఫార్సులవలనను రాజసంస్థాపిత మగు శాస్త్రపాఠశాల (Royal College of Science) లో నితనికి సహోపాధ్యాయపదవి లభించినది. ఆ వెంటనే యీతని తెలివితేట లింకను పరిమళింపదొడగినవి. వింతవింత ప్రయోగములకు తోడు సహజముగా రసవంతమగు వాక్చమత్కారము గలవాడగుటచేత నాతడు శ్రోతల మనస్సులను పూర్ణముగా రంజింపజేసి వారలను విస్మయానందములయం దోలలాడించుచుండెను. మరి కొలదికాలముననే యితనికి ప్రధానోపాధ్యాయపదవికూడ లభించినది.

ఇక గావలసిన దేమున్నది? ఇనుమడించిన యుత్సాహముతో నితడు క్రొత్త పరిశోధనలు చేయదొడగెను. ప్రశస్తములైన విద్యుద్ఘటమాల లతనిచేతులలో నున్నవి. కనుక ముందుగా క్షారలవణములను నీటిలో విలీనము గావించి బలమైన విద్యుత్ప్రవాహము నార్ద్రావణములను భేదించిచూడగా క్రొ ధాతువు లిట్టె బయల్పడజొచ్చెను. ౧. పొ సియము, ౨. సోడియము, 3. మెగ్నీసియ ౪. కాల్సియము, ౫. స్ట్రాన్షియము, ౬. యము అను నీయారు క్షారధాతువు వేర్వేర ప్రత్యేకించి ఇతడు రసాయనశా మునకు ముఖ్యము లయిన నూతనాధ్యా ములను చేర్పగలిగెను. ఇందు గొన్నింటి వి ముల నిచట సంగ్రహముగా వ్రాయుచున్నా

౧. పొటాసియము:—ఇది వెండి ధవళమయినది. మైనమువలె మెత్తనిది. తగిలినంతనే అందలి వాయుసంపర్కమ ధావళ్యము గోల్పోవును. చిన్నముక్క ళ్లలో బడవైచినను తత్క్షణమే వర్తులా సుందరమై చిటపటమనుచు జిఱ్ఱున దిరు నేరెడుపండుఛాయగల జ్వాలతో మండిప నీటిని రాసాయనికముగ భేదించి హైడ్రో వాయువు నవలదోలివైచి బలమైనక్షారమ నేర్పడును. కనుకనే దీనిని సీసాలలో చ లో ముంచియుంతురు. ఈ లోహము రామునివంటిది.

౨. సోడియము:—ఇదిగూడ పొటా మువంటి దేగాని అంతశక్తిమంతమయినది గా చన్నీటి నంతగా భేదించజాలదు. వేడినీటి చిన్నముక్క బడవైచినపుడు వర్తులాకార దరమై పదియారవవన్నె బంగారు ఛాయ భళ్లున మండుచు నేత్రోత్సవము చేయ

ఇదికూడ సీసాలలో చమురులో నుండ
దే.

౩. మెగ్నీసియము:—ఇది సోడియము
ు శక్తిహీనమయినది. తెల్లగ, మెత్తగ
నీలోహము ముట్టించినపుడు కనులు
ట్లుగొనునంతటి యద్భుత తేజస్సుతో
ను. మన దేశములో దీపావళి అమా
నాడు మన బాలబాలికలు కాల్చి వినో
గాఁడీ తీగె యీ మెగ్నీసియమే. పచ్చ
బాలలో దీనిగుండ కలుపుదురు.

౪. కాల్సియము:—ఇది సున్నము, సుద్ద
లోనగు పదార్థములలో నున్న ధాతువు.
పర్కముగలిగిన జ్వాల, ఎఱ్ఱగా ననగా
న యిటుకల ఎఱుపు గలిగియుండును.

౫. స్ట్రాన్షియము:—ఇది పగడమువలె
ను. ఎఱ్ఱమతాబాలలో దీనినికలుపుదురు.

౬. బేరియము:—ఈవర్గము లోహము
లో నిది స్వల్ప. ఈధాతువు తగిలిన
ఆకుపచ్చ వర్ణము గలిగియుండును.

మ్మట విద్యుచ్ఛక్తిచేత నితడు హైడ్ర
మ్లమును (Hydro Chloric Acid) భేదిం
పసుపువలె పచ్చగానున్న 'క్లోరిన్' అను
వాయు వొకటి పొడచూపెను. ఈ క్లో
వాయువుతో పైని వర్ణింపబడిన సోడి
ధాతువు సమ్మేళనమైనపుడు ఉప్పుపుట్టు
ది. ఇదే మన "రుచులకు రస"మైనఉప్పు.
ట్టి చిత్రవిచిత్రవిషయములు గనిపెట్టి
గా నితడు ప్రకటించుచుండుటచేత నా కాలపు రాసాయనికులలో గొప్ప గందరగోళము పుట్టెను. "ఏడెవడోగాని అసాధ్యుడు బయలుదేరి మాశాస్త్రమును తలక్రిందుచేయుచున్నా" డని వారితని దిట్టుచుండిరి.

డేవీ మంచివక్త. సమయస్ఫూర్తి గలవాడు. ప్రజాహితరతుడు. తనకు తెలిసిన శాస్త్రాంశములన్నియు తోడిమానవుల కందఱకును తెలియజెప్పవలయు నను నుత్సాహము కలవాడు. కనుక నందఱకును చక్కగా తెలియునట్లు శాస్త్రవిషయములను గురించి తేటమాటలతో నుపన్యాసము లిచ్చుచు చెప్పినదంతయు వినువారి మనస్సులకు పట్టునట్లు వారియెదుటనే ప్రత్యక్షముగా ప్రయోగములు చేసిచూపుచు నాబాలగోపాలమును విస్మయానందములచే మైమఱచునట్లు చేయగల్గు చుండెను. జనసామాన్యమునకు జ్యోతిషవిషయములు ఫెర్గుసన్ పండితుడును, పదార్థవిజ్ఞానరసాయనశాస్త్రవిషయములు డేవీయును, తేటతెల్లముగా నుపన్యసించుచు, ప్రశంసాపాత్రమగు సేవచేసిరి. ఫెర్గుసన్ పండితుని యనంతరము హెర్షెల్ జ్యోతిశ్శాస్త్రమును విస్తరింపజేసినట్లు, డేవీ యనంతర మతని శిష్యుడగు మైకేల్ ఫేరడే ఈశాస్త్రజ్ఞానము నింకను వృద్ధిచేసి నేటి నాగరకజీవనమునకు ప్రాణపదములనదగు విద్యుద్యంత్రసమితి నెట్లు స్థాపింపగల్గెనో ఫేరడే జీవితచరిత్రలో వర్ణింతుము.

డేవీద్వార కీర్తి ఐర్లండు దేశమునకు వ్యాపించెను. అచటి రయితులందరును చందాలు

వసూలుచేసుకొని యితని యుపన్యాసములు వినగోరి ఇతని నచ్చటికి రమ్మని యాహ్వానించిరి. రసాయనశాస్త్రజ్ఞాన మనుదోహదము వ్యవసాయాభివృద్ధికి చాల ప్రయోజనకరమని యిత డచ్చట నుపన్యాసము లిచ్చెను. ఇతని కృషి చేత వ్యవసాయరసాయనశాస్త్రము లత్యంతసన్నిహితము లయినవి.

౧౮౧౨ సంవత్సరములో మూడవజార్జి రా జితనికి సర్ బిరుదము నిచ్చి గౌరవించెను. పిమ్మట నితడు భాగ్యవంతురాలగు నొక పూర్వ సువాసినిని వివాహమాడెను. విధవావివాహము లా దేశములలో జనసమ్మతము లే, దూష్యములు గావు.

పిమ్మట నీతడు తనశిష్యుడగు ఫేరడేతో కూడ యూరపుఖండమునందలి ప్రతిదేశమునకు వెళ్లి ముఖ్యపట్టణములలో నుపన్యాసము లిచ్చెను. అప్పుడు ఇంగ్లీషువారికిని, ఫ్రెంచివారికిని ఘోరయుద్ధములు జరుగుచుండెను. అయినను నెపోలియన్ చక్రవర్తి "శాస్త్రవేత్త లే దేశమువారైనను, ఏకాలమునందైనను సర్వత్ర పూజనీయులు. ఆంగ్లజనులతో విరోధమున్నది గాని శాస్త్రజ్ఞులతో నాకు వైరము లేదు." అని ప్రత్యేకముగా డేవీదొర నాహ్వానించి బహూకరించి పంపెను.

దిగ్విజయము చేసుకొని గురుశిష్యులిద్దరు నింగ్లండుదేశమునకు మరల వచ్చుసరికి దేశములో గొప్పప్రమాదములు జరిగి వేలకొలది జనులు చనిపోవుచుండిరి. ఇందుకు కారణమేమనగా:—ఇంగ్లండు దేశములో రా బొగ్గుగనులు విస్తారముగాగలవు. ఈగనులలో మార్షుగాస్ (Marsh gas) అనబడు నొక చెడుగాలి వ్యాపించియుండును. దీపస్పర్శమైనంతనే తుపాకిమందువలె యీ చెడుగాలి ఘోరముగా ప్రేలి అమితముగా ప్రజానష్టము గావించుచుండెను. భూగర్భమునందున్న గనులలో రాతిబొగ్గు త్రవ్వి పైకి తెచ్చుకొనినగాని దేశస్థులకు దినచర్య జరుగదు. చిమ్మచీకటి వ్యాపించియున్న బొగ్గుబిలములలోనికి దీపములు లేకుండపోవుట సాధ్యము గాదు. మామూలుగ దీపము వెలిగించినంతనే యీ పాడుగాలి ప్రేలుటచేత గింజుకొనుట కేడములేక గనిలోపలివారందరు క్షణములో చచ్చుచుండిరి. ఇట్టి విపత్తులు జరుగకుండ ప్రతివిధాన మాలోచింపవలసినదని యనేకు లితనిని ప్రార్థించిరి. 'సరే—కానిమ్ము' అని డేవీ తీవ్రముగా యోజించి తుదకొక చక్కని ప్రతిక్రియ కల్పించెను. సన్నని యినుపతీగెను వలలాగున అల్లించి దీపము చుట్టు నమర్పించెను. 'వైరుగాజు' అనబడు నీలోహపువల దీపము చుట్టునుండి, లోపల దీపపు వేడిని ఎప్పటికప్పుడే పరిగ్రహించి, తనలో నడిపి చల్లార్చి వేయుచుండెను. ఈయుక్తిచే దీపమునకు చెడుగాలితో తత్‌క్షణసంపర్కము లేకుండ అంతరము గల్పింపబడినది. ప్రమాదములు తప్పినవి. బొగ్గుగనులలోని పనివారలకు క్షేమము కలిగినది.

ఈయుక్తి పేటెంటు చేయించుకొనియుండినపక్షమున డేవీకి లక్షలకొలది ధనము లభించి

...ను. కాని దేశబాంధవుడును, ప్రజా ...డుడును నగు నీ మహాపురుషునకు ధన ... జీవితాశయము కాదు గనుక పేటెంటు ...లేదు. 'మీ సేవయే నాసంతోషము'న ...దారబుద్ధితో వదిలిపెట్టెను.

...ద్యుత్ప్రవాహముచేత దీపములు వెలి ...వచ్చునని ఇతడే మొట్టమొదట లోక ... నిరూపించినాడు. 'మర్డల్'వార కల్పిం ...దీపములకు డేవీకల్పితములైన విద్యు ...లు ప్రబలప్రతిస్పర్థులై యున్నవి. ప్రపం ...యం దీరెంటికిని జరుగుచున్న పోటీలో విద్యుద్దీపములకే జయ మెక్కువ గల్గుచున్నట్లగుపడుచున్నది.

పిమ్మటకూడ నితడు రాజసన్మానమును విశేషముగా పొంది 'బారొనెట్' బిరుదము గూడ బడసెను. రాయల్ సొసయిటీ (Royal Society) కి అధ్యక్షు డయ్యెను. రసాయన, విద్యుత్, కాంతశక్తులనుగురించి యావజ్జీవము నేవో పరిశోధనలు చేయుచునేయుండి,౧౮౨౯ సంవత్సరము మేనెల ౨౯వ తేదీని స్విట్జర్లండు దేశములోని జెనీవా నగరమున నితడు కాలధర్మము నొందెను.

---

# ...మి !

విశ్వనాథ సత్యనారాయణ గారు, యం. ఏ

పరిగాఢశర్వరీచ్ఛవి దరిద్ర
  తానిధానము, తేజోవిహీన, మనవ
రతపరిస్రుత బాష్పధారామిళితము
నన్ను నీవుండుమన్నంగణంబు తండ్రి !

ఈ మహాంధకారంబున నెపుడో ఒక్క
సారి మెఱసితి వానాడు స్వామి ! నా కు
టీర మానందవాయుప్రచారశతస
హస్రకుసుమపరిమళవ్యాపృతంబు.

దానితోసరి ! మరల నాంధ్యంబు క్రమ్మె
తొలి చివురులేని యీచీకటులును నేను
నొక్కరొక రప్పళించుకొం చుండినాము
నిన్ను నీనాటిమెఱుపు మన్నించుకొంచు.

---

# గుంటూరు పాపయ్యగారు

బులుసు పాపయ్యశాస్త్రి గా

గుంటూరు పాపయ్యగారు గుంటూరు పెద్దయ్యగారి (చూ. భారతి విభవ సం॥ మాఘమాస సంచిక) రెండవ కుమారుడు. ఈయన అన్నగారయిన సుబ్బయ్యగారికి తండ్రిగారి సాహిత్యమూ, కవిత్వమూ అబ్బలేదు. లౌక్యప్రజ్ఞ కుదిరెను. ఆయన హెడ్డుపోలీసుగా గవర్నమెంటు కొలువులో ఉండేవారు. పాపయ్యగారికి తండ్రివిద్యలు కొంతకొంత పట్టుపడెను. సాహిత్యమూ, కవిత్వమూ అటుండగా ఆయన వాక్నైపుణ్యము చాలా జనరంజకముగా ఉండేది. ఆయన గ్రామానికి పొరుగున ఉన్న గ్రామములో ఉండే రాజబంధువులైన ఉత్తమక్షత్రియకుటుంబములోనివా రొకరు తమ కొడుకును పాపయ్యగారివద్ద సంస్కృతమూ, తెనుగూ నేర్చుకోవడానికి పంపేవారు. ఆరాజుగారు, "మాపిల్లవాడికి సంస్కృతసాహిత్యమూ, తెనుగుసాహిత్యమూ అబ్బినా అబ్బకున్నా పాపయ్యగారిమాటలు, నేర్పయినా కొంత అబ్బితే మాకు అదే చాలా సంతోషము." అనేవారు. సమయోచితమైనమాట, సమయోచితమైన ఊహ ఆయనకు తడుముకో నక్కరలేకుండా తోచుతూ ఉండేవి. ఆయనస్వభావము సాత్త్వికము. ఆయన అపకాలమందయినా తొట్రుపా టెఱుగరు.

ఆయన న్యాయబుద్ధి గలవారనీ, తగవులు తీర్చడములో చాలా నేర్పరులనీ ఆయన గ్రామములోనే కాకుండా, చుట్టుపట్లనున్న గ్రామాలలో కూడా ప్రసిద్ధి వ్యాపించెను. అందువల్ల జనులు చాలామంది తమ తగవులు ఆయనచేతనే తీర్పించుకునేవారు. ఆయనతీర్పు సాధారణముగా ఉభయపక్షాలకూ సమ్మతముగానే ఉండేది. దుర్మార్గులయిన బలవంతులు దిక్కుమాలిన పేదలను బాధించిన తగవులలో మాత్రము ఆబలవంతులకు ఇష్టమయేది కాదు.

ఆలాగు ప్రతికూలపుతీర్పు పొందినవా డొకడు ఒక మాలవాడికి దిట్టముగా కల్లు పోయించి వాడిచేతికి కత్తి యిచ్చి, పాపయ్యగారు సాయంకాలము పొలము నుండి యింటికి వచ్చేతోవలో కాచియుండి ఆయనను చంపుమని పంపెను. ఆమాలవాడు ఆలాగే కాచు ఉండగా చీకటిపడుతూ ఉన్న సమయములో పాప గారు ఒంటిగా వస్తూఉండిరి. "ఆ! నిలు, పాపయ్యా! గారు నిన్ను నరికి చంపుమన్నారు." అని ఆమాలవా కేక వేసెను. కల్లుమత్తుచేత తూగిపడుతూఉన్న వాడి చూచి పాపయ్యగారు, "ఓరీ, ఒక్కనరుకుతో చ మన్నారా, రెండు మూడు నరుకులు వే న్నారా?" అని లేశమూ తొట్రుపాటులేనిమాటల అడిగిరి. "ఒకనరుకో, రెండునరుకులో ఆరు శెప్పలేదు" అని మాలవాడు మయికపుమాటలతో జబాబు చెప్పె "పోయి అడిగి రారా," అని పాపయ్యగారు శాంతము చెప్పిరి. వాడు అడుగడానికి వెళ్లెను. పాపయ్యగా గండము తప్పి యిల్లు చేరిరి.

మరి ఒకప్పుడు మరొక బలవంతుడు ప్రతికూల తీర్పు పొంది పాపయ్యగారిని నోటికసితీర తూలు లాడిపోయెను. తరువాత అతడు తన మామూలు ర్మార్గపుపని యేదో చేయగా హెడ్డుపోలీసుగారు అ నక్కపల్లిలో కచేరీయెదుట బొండలో పెట్టిం ఆకస్మికముగా పాపయ్యగారు ఆరోజున నక్క వెళ్లిరి. బొండలో ఉన్నతడు చదువుకున్నవాడూ, వంతుడూ, మాట చెల్లుబడిగలవాడూ—పాపయ్యగా చూడగానే, కళ్లనీళ్లు పెట్టుకుని, 'పాపయ్యబావగారు' అని ఆర్చెను; తనవృత్తాంతము చెప్పుకొనెను. ఆ హె పోలీసుగారికి పాపయ్యగారియందు అత్యంతము గౌరవము. పాపయ్యగారు ఆయనవద్దకు వెళ్లి యేమి లాడిరో తెలియదు గాని, తిరిగి బొండవద్దకు వచ్చి,

"నీవకార్యైత్వపుఁ బనమ్మ- నేలఁగలయ!
లెమ్మ, సెల విచ్చి, రింకఁ బాటి-పొమ్మ, పొ

అని తమచేతితో బొండకొయ్య ఊడదీసిరి.

పాపయ్యగారి జనరంజకత్వానికీ, ఉదారస్వభా సమయస్ఫూర్తికీ నిదర్శనా లయిన చిన్న చిన్న ఇంకా ఉన్నవి గాని అవి అటుంచి ఒకచిత్రమైన తము మాత్రము ఇక్కడ వ్రాస్తున్నాను:

సత్యవరము ఏలుతూ ఉండిన కాకరలపూడి రాజ బములో తుదిరాజు గా రయిన అప్పలపాయక వింగారు ఆన 1776 సం.లో కాలము చేసిరి. ఆయన సంతానము లేదు. ఆయన భార్యకున్నూ, తల్లికిన్నీ రు. 10,000-0-0 ఇచ్చే షరతుమీద బ్రిటిషుగవర్న వారు ఆజమీందారీ విజయనగరముసంస్థానమువా లు ఇచ్చిరి. అప్పల పాయకరాయనింగారి భార్య ౧౮ సం.లో కాలము చేసెను. ఆమె కుమారుణ్ని కున్నట్టు చెప్పిరి గాని ఆ పెంపకము బ్రిటిషు మెంటువారు అంగీకరించలేదు. ఆమె మరణానం ఆమెకు ఇస్తూ ఉండిన అల్లవెన్స ఆపివేసిరి. ఆ చేత దత్తపుత్రుడి అన్నగా రయిన జగన్నాథ గారు ఆన ౧౮౩౨ సం.లో కొందరు అనుచరులను చేసుకుని పాయకరావు బిరుదు వహించి ఫితూరీ చెను. రస్సెలుదొరగారు ఆయనను ఆన ౧౮౩౮ లో ఉరిదీయించిరి.

ఆయన ఫితూరీకాలములో సత్యవరానికి రెండు దూరములో ఉన్న పెంటకోట అనే గ్రామము దోచుకోవడానికి వెళ్లిరి. గ్రామస్థులలో చాలా భయపడి సొమ్మూ, ధాన్యాలూ ఇచ్చి బతికిరి అలాగున తమంతట తామిియ్యనివారిని కట్టించీ, చీ, వారి తలుపులూ, పెట్టెలూ బద్దలు కొట్టించీ డు చేయించిరి.

ఆ గ్రామములో అప్పుడు వం.న. గారుఅనే శ్రోత్రి డు ఉండేవాడు. ఆయన ధనికుడు కాడుగాని చేయి కుండా బీదకాలక్షేపము చేయడానికి చాలిన మా గలవాడు. ప్రొద్దుటిపూట స్నానమూ, జపమూ, భోజనము కాగానే పురాణమూ, ఈ విధముగా నెమ్మదిగా, ఒకశిలక్ష్యములేకుండా దినాలు పుచ్చుతూ ఉండేవాడు.

పాయకరావుగారు పేదలను బాధించడము మామూలు లేదు. అందుచేత, ఊళ్లో దోపుడు జరుగుతూ ఉన్నా నాడుసహా వం. న. గారు ఎప్పటిలాగే పురాణకాలక్షేపముచేస్తూనే కూర్చుండిరి. కాని ఓర్వలేనివాళ్లు ఎవళ్లో ఆ బ్రాహ్మణుడి యింట్లో చాలా ఆస్తి ఉన్నదని పాయకరావుగారి చెవిని వేసిరి. ఆ మాట నమ్మి పాయకరావుగారు ఆయనయింటికి తమ అనుచరులను పంపిరి. సొమ్ము ఇమ్మని వారు ఆయనను చాల బాధలుపెట్టిరి. ఆ బీద బ్రాహ్మణుడు నిజముగా సొమ్ములేనివాడే కనుక ఏమీ ఇయ్యలేకపోయెను ఆయనను పాయకరావుగారి యెదుటికి తీసుకు పోయిరి 'ఆస్తి యే నూతిలోనో, యే గోతిలోనో దాచినావు, చెప్పు' మని ఆయనను అక్కడ చాలా తర్జించి బాధలుపెట్టిరి. ఆయన ఆస్తి లేదని చెప్పుకొనిరి గాని పాయకరావుగారు ఆయనమాటలు నమ్మక చెప్పుడుమాటలు నమ్మి ఆయనను కాళ్ళూ చేతులూ కలియగట్టించి తమబస అయిన డొంకాడలోనికు తీసుకు పోయిరి.

అక్కడ మర్నాడు కూడా ఆయనను చాలా బాధపెట్టిరి గాని ఆయన ఆస్తి యేమీ దాచుకోలేదనే చెప్పిరి. పాయకరావుగారికి మాత్రము ఆమాటమీద నమ్మకము కలుగలేదు. తుదకు అనుచరుల దుర్బోధవల్ల నాటి సాయంకాలము ఆ బ్రాహ్మణుణ్ణి డొంకాలమ్మకు బలి వేయడానికి నిశ్చయించి ప్రయత్నములు జరిపిరి. ఆయనకు ఒకగోచిమాత్రం పెట్టి మొగానికి పసుపు పూసి మెడకు వేపదండలు కట్టి ఎండలో ఒకరాతిబండమీద కూర్చుండబెట్టిరి. దీపాలవేళ బలివేయడానికి అంతా సిద్ధముచేసిరి.

డొంకాడలోపల ఈపనులు జరుగుతూ ఉండగా పెంటకోటలో వం. న. గారికుటుంబములోవారు తెల్లవారుజామున లేచి, అక్కడకు ఎనిమిదిమైళ్లదూరములో ఉన్న కేంపాడు పరుగుపెట్టి అక్కడ మనకథానాయకులయిన పాపయ్యగారికాళ్లమీద పడి ఆయనతో తమ దుఃఖము చెప్పుకొనిరి. పాపయ్యగారి రెండవ భార్యా, వం. న. గారూ అన్నదమ్ముల బిడ్డలు. ఆవచ్చినచుట్టాలూ,

పాపయ్యగారిభార్య ఏడవడం చూచి పాపయ్యగారు ఢోంకాడలోవకు బయలుదేరిరి. అప్పటికి జాము ప్రొద్దెక్కెను. అటువంటి సమయములో భోజనము లేకుండా ఎండలో బయలుదేరిన ఆయనను చూచి గ్రామములో ఉన్న ప్రముఖులయిన రాజులు కొందరు, ఆయన బయలుదేరినందుకు కారణము విని, "మీ ప్రాణానికి తెగించి మీరు బయలుదేరుతూ ఉంటే రాచపుట్టుక పుట్టి మేము ఇంట్లో కూర్చుంటామా?" అని చురకత్తులు మొలను వేసుకుని చేపాటికర్రలు పట్టుకుని బయలుదేరిరి. పాపయ్యగారు వద్దనిరి గాని వారు మానలేదు. అక్కడకు ఢోంకాడలోవ ఆరుమైళ్లదూరము ఉంటుంది. వీరందరూ అక్కడకు చేరబోయేటప్పటికి మధ్యాహ్నమయినది.

పాయకరావుగారికిన్నీ పాపయ్యగారంటే చాలా గౌరవమే. పాపయ్యగారితో కూడా వెళ్లిన రాజులను చూడగా ఆయనకు కొంచెము అనుమానము కలిగెను. గాని, శాంతరసమే కనపడుతూ ఉన్న పాపయ్యగారి మొగము చూడగానే ఆ అనుమానము పోయెను. పాపయ్యగారు సమీపించి,

చ. "బళి! నరసింహ భూమిపతి
పాయకరాయ! సుధీపిధేయ! నీ
కలకల నవ్వు నబ్బురపు
గబ్బిజజాయి తుపాకిదెబ్బచేఁ
గలఁగె విశాఖపట్టణము,
కంపము నొందెను జెన్నపట్న, మా
కులపడె గోలకొండ, పడి
ఘూర్ణిలె నా కటకాదు లన్నియున్."

అని చదివెను. పాయకరావుగారు నమస్కరించి, పాపయ్యగారి నొసట గంధాక్షతలు లేకపోవడము చూచి, "ఈ అబోధవేళ భోజనము లేకుండా యీలాగు వచ్చినారేమి? మీరూ, రాజులూ కూర్చుండండి" అని రాజులవైపు తిరిగి కొంచెము లేచినట్టు అభినయిస్తూ, "లేచినానండి" అనిరి.

పాపయ్యగారు—"నేను కాశీకి ప్రయాణమై ప్రభువువారితో మనవిచేసి సెలవు పుచ్చుకోవడానికి వచ్చాను. ఈ రాజులు నాయందున్న అభిమానము నన్ను విడువలేక కొంతమేర నాతో వచ్చినారు." అ

పాయకరావుగారు:—మిట్టమధ్యాహ్నము భో నము చెయ్యకుండా కాశీకి ప్రయాణమేమి? సామ అంతా సిద్ధము చేయిస్తాను. వంట చేసుకుని భోజన చెయ్యండి. రాజులకు మాకందాలో ఏర్పాటు చేస్తా

పాపయ్యగారు:—నేను భోజనానికీ, సుఖా నోచుకోలేదు, మహాప్రభూ! నాయింటివద్ద జ బోయే విపత్తు వినకుండా వీలయినంతవేగం నేను దే విడిచి పోవలెను; సెలవు దయచేయండి.

పాయకరావుగారు:— అంత మహావిపత్తు ఏ టండీ?

పాపయ్యగారు:—నా అవస్థ యేమి చెప్పు దును? నా ప్రథమకళత్రము కాలముచేసిన తరువా మళ్లీ వివాహము చేసుకున్నాను. ఇప్పుడు మళ్లీ ము పటిగతే వస్తూఉన్నది. అందువల్ల సంసార మొల్ల కాశీకి పోతున్నాను. సెల విప్పించండి.

పాయకరావుగారు:—ఏమి? ఇప్పుడు లోగిట్ల దేహము అస్వస్థముగా ఉన్నదా? వైద్యము చేయిం లేదా!

పాపయ్యగారు:—దేహము అస్వస్థముగా ఉం యేమందయినా యిప్పించుకుందును. మనోవ్యాధికి ఏ మందు తెత్తును?

పాయకరావుగారు:—మీవంటివారు దేశం విడి వెళ్లిపోతారంటే ప్రాణానికి నొప్పిగా ఉన్నది. అంత మనోవ్యాధి హఠాత్తుగా ఇప్పుడే కలిగినదా?

పాపయ్యగారు:— తమరు మాకు తలిదండ్రుల వంటివారు. అందుచేత మనవిచేస్తున్నాను. పెంట కోటలో ఉండే వం. న. అనే పరమదుర్మార్గుడు నా భార్యకు అన్నగారు. ఇన్నాళ్లకు ఆదుర్మార్గుడి పాప పండి అతడు తమకు చిక్కినాడట. అటువంటి పాపిష్ఠ డికి ప్రభువువారు తగినపని చేయించి భూభారము తగ్గిస్తారని మేము సంతోషిస్తూ ఉంటే ఆమూర్ఖురాల

ఎంత ఊరడించినా వినక ఉరిపెట్టుకోడానికి తూ ఉన్నది. రాత్రీ పగలూ కాచుకోలేము ఎప్పుడో అంతపనీ చేస్తుంది. ఇక నాకు ఏమి ము?

పాయకరావుగారు:—అన్నా! గట్టి చిక్కే!

పాపయ్యగారు:—చిక్కు ఏమీ లేదు. నాకు కాశీ కు సెలవు దయచేయించండి. ఆ దుర్మార్గుడికి ఱ చేయించవలసినపని చేయించండి. దుష్టశిక్ష భుధర్మము.

పాయకరావుగారు:—మీరు దేశాలపాలయి వెళ్లి ంటే మామనస్సునకు చాలా నొప్పిగా ఉన్న దుర్మార్గుడు ఆమెకు అన్నగారా? ఆత్రణ్ణి ఈ కాలము డొంకాలమ్మకు బలి వేయించడానికి చేయించి —

పాపయ్యగారు:—(హర్ష సూచనతో) భేష్! ప్రభు అందరూ మెచ్చదగినపని నిశ్చయించినారు. ప్పకుండా జరిపించవలసినదే. ఆలాగు జరిగితే సంతోషిస్తారు.

పాయకరావుగారు:—ఎవరు సంతోషించినా మీ కి కుటుంబహాని అవుతూవుంటే ఏలాగు సహిం

పాపయ్యగారు:—నా ఒక్కడికోసము తమరు పనిలో వెనుకదీసి దొరికిన దుర్మార్గుణ్ణి విడిచి అందరూ విచారిస్తారు. తమరు మాకు ప్రభు మపూర్వులు ఇప్పించిన మాన్యాలు నేటికిన్ని టుంబమువారు అనుభవిస్తున్నారు. అందుచేత ము పోతూ తమ సెలవు పొందడానికి వచ్చాను. మరేమీ లేదు.

యకరావుగారు:—(కొంచెము ఆలోచించి, ) రండి (అని ముందు నడచిరి).

పయ్యగారున్ను, రాజులున్ను లేచి ఆయన రి. వారందరున్ను వం. న. గారు ఎండలో పిరుదులు మాడుతూ, మొగాన్ని పసుపు పూతతోనూ, మెడను వేపమండలతోనూ కూర్చున్న బండరాతి దగ్గరకు చేరిరి. పాపయ్యగారిని చూడగానే వం. న. గారు కళ్ల నీరు పెట్టుకొనిరి. పాపయ్యగారు శోకావేశమును అపుకుని బలవంతముగా ముఖానికి చిరునవ్వు తెచ్చుకుని, "ఓహో! బావగారికి ఇన్నాళ్లకు తగిన సత్కారము జరగబోతూ—ఉన్న దని లోకమంతా సంతోషిస్తూ ఉన్నది. ఈవేషముతో ఉన్న మిమ్మల్ని చూచి మా కళ్లు సఫలము లయినవి. అహో! స్వామిరూప మడగనా?" అనిరి. పాయకరావుగారు లోలోపల నవ్వుకుంటూ, "పాపయ్యగారి మూలాన్ని బతికిపోతూ ఉన్నావయ్యా, మూర్ఖుడా," అని వం. న. గారి కట్లు విప్పబోయిరి. పాపయ్యగారు, "మహాప్రభూ, ఈపాపిష్ఠుణ్ణి విడిచిపెట్టి లోకులసంతోషమూ, అమ్మవారితృప్తీ యెందుకు చెడగొట్టుతారూ? ఇంతకు మునుపు తమరు తలపెట్టినసత్కార్యమే కొనసాగించండి" అనిరి. పాయకరావుగారు వం. న. గారి కట్టు విప్పివేసి, పాపయ్యగారి వైపు తిరిగి, "వేగంగా ఈమూర్ఖుణ్ణి తీసుకువెళ్లి లోగిట్లో చూపించండి. మీరు భోజనం లేకుండా యింతశ్రమ పడవలసి వచ్చినందుకు విచారిస్తున్నాము" అనిరి. పాపయ్యగారు "మహాప్రభూ, నాకుటుంబము నిలబెట్టినందుకు సంతోషమూ, దుష్టుడు తప్పిపోతూ ఉన్నందుకు విచారమూ నామనస్సులో తొట్రుకుంటూ ఉన్నవి. ఏలినవారికి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధి కోరుతూ సెలవుపుచ్చుకుంటాను," అనిరి. పాపయ్యగారితో వెళ్లిన రాజులు నమస్కరించి, "ప్రభువులు మాగ్రామముదీపము మళ్లీ నిలబెట్టినారు, సెలవు," అనిరి. పాయకరావుగారు, "పాపయ్యగారు మనకందరికీ పూజ్యులే," అని పాపయ్యగారికీ, రాజులకూ నమస్కరించిరి. పాపయ్యగారున్ను, రాజులున్ను మెల్లగా వేంపాడు చేరిరి.

పాపయ్యగారితో సంబంధించిన వినోదకరమైన రెండు చిన్నకథలుమాత్రము ఇక్కడ వ్రాస్తాను:

పాపయ్యగారి ప్రథమభార్య పోయిన తరువాత రెండవభార్య అత్తవారింటికి వచ్చేవరకూ పాపయ్యగారి

 

యింట స్త్రీదక్షత లేకపోయెను. ఆసమయములో పాపయ్యగారియందున్న గౌరవబుద్ధిచేత, పరంపరాబంధువయిన వడలి............అనే అతడు పాపయ్యగారి యింట ఉండి ఆయనసంరక్షణ చేస్తూ ఉండేవాడు. అతడు జీతము అపేక్షించి వచ్చిన వంట బ్రాహ్మణుడు కాడు; మర్యాదకుటుంబములో వాడు. కొంత కొంత కవిత్వము నేర్చినవాడు. అందుకు అతడు కోమటి.. ......మీఁ చెప్పిన పద్యమే సాక్షి. అతడు చాలా హాస్యప్రియుఁడు, పాపయ్యగారివద్ద చాలా చనువుగా మసలేవాడు అతడు చెప్పినది సీసపద్యము గాని సీసపాదములలో మోటుమాటలున్నవి. గీతముమాత్రము ఇక్కడ వ్రాస్తున్నాను:

గీ. తాటకా శూర్పణఖలకు సాటిసేయ
వచ్చునన మించు మిక్కిలి గచ్చు మీరి
చిత్తగింపుడు............
ముండ మిండలకాల్పోఁడ మోటుముండ

హెడ్డుపోలీసుగారు తాము ఉంచుకున్న సాని చేత ఉపమాక దేవాలయములో భాగవతము కట్టిస్తూ తాలూకాలో తగుమనుష్యులందరికీ కబుర్లు పంపి రప్పించిరి. పాపయ్యగారున్ను ఆయన హాస్యప్రియపరిచారకుడున్ను వెళ్లిరి భాగవతము ప్రారంభమయి భామవేషము తెర బయలుదేరే సమయానికి వచ్చి హెడ్డుపోలీసుగారు వాణీ ఒల్లెవాటుగా వేసుకొని, చేతికర్ర తుంటికి ఆనుకొని, పొగచుట్ట కాలుస్తూ సభకు పక్కగా నిలబడిరి. పాపయ్యగారి పరిచారకుడు అది చూచి చటుక్కున లేచి ఆవలకు పోయి తానున్ను వాణీ ఒల్లెవాటుగా వేసుకుని, చేతికర్ర తుంటికి ఆనుకుని, పొగచుట్ట చేత పట్టుకుని సభకు రెండవపక్కను హెడ్డుపోలీసుగారికి ఎదురుగా నిలబడెను. హెడ్డుపోలీసుగారు ఆవేషము చూచి, "ఎవఁడాపోకిరీ," అని కేకవేసిరి. వడలి, "వీఁడొకచిన్న పోకిరీ," అని కేకవేసి పారిపోయెను. అతడు హాస్యప్రియుడనిన్నీ, పాపయ్యగారి పరిచారకుడనిన్నీ తెలిసినందున హెడ్డుపోలీసుగారు క్షమించి ఊరకుండిరి.

ఒక సంవత్సరము పాపయ్యగారి యింట వివాహము తటస్థించెను. వారున్నది చిన్నపల్లె కావడముచేత సామగ్రి చాలాభాగము దగ్గిర పెద్దగ్రామమయిన నుండి తెప్పించుకునేవారు. ఆవివాహానికి కా వెల్లముకోసము తుని చీటి వ్రాసి పంపుమని కోమటితో చెప్పిరి. అప్పటికి కాకితాల సమృద్ధి తాటాకులమీదనే చీట్లు వ్రాసుకునేవారు. తాటా గంటమూ పుచ్చుకొని కోమటి పరపర చీటి వ్రా

ఆచీటి పట్టుకుని తుని వెళ్లడానికి ఏర్పాటు గొల్లవాడు కోమటితో "బావా, మాగబంబ రాసి అదేటో సదూ" అనెను. కోమటి ఆచీటిలో వ్రాసిన అక్షరాలు తానే పోల్చుకోలేక, "చీకటి డోయి," అనెను "దీపంకాడికి ఎల్దాం పద" అనెను వాడు. వారు దీపమువద్దకు వెళ్లిరి. కోమటి అక్ష లను ఎంత శోధించినా పోల్చుకోలేక తుదకు, "పెద్ద బావా" అనెను. గొల్లవాడు ఆచీటిని పాపయ్య వద్దకు తీసుకపోయి యిచ్చెను. ఆయన పెద్దదీపము యెంతో శోధించి సాధించగా అందులో ఈక్రింది రము లుండెను:

"సుటురిప పయగారిబు యిమోకంగన్క మ బెల్లపపిత్సునలెఁ." పాపయ్యగారు నవ్వుకుని తా వ్రాసి యిచ్చిరి.

పాపయ్యగారు చెప్పిన చాటుపద్యములు కొ యిక్కడ వ్రాస్తున్నాను.

శ్రీకాకుళం జిల్లా జడ్జీకోర్టులో శిరస్తాదా ఉండి నిరతాన్నప్రదాత అని పేరు పొందిన చింత న్నాథం పంతులుగారు పాపయ్యగారి రెండవ అల్లు పాపయ్యగారు ఆయనమీద చెప్పినపద్యము:

చ. తెగువఁ దనర్చు నెంతకు, ను
దీర్ఘఫలాభ్యుదయంబుఁ గాంచుఁ
క్కఁగఁ గరమం దమర్చుఁ, దగు
ఖండనలాడును, వాఁడి మీఱు స్నే
హగరిమ మించు, సద్గుణస
మంచితమై చను నెల్లవేళ, న
ప్పగఱ ననంపఁజూచు? గద
పంతులచిత్తము చాయకత్తియే.

...ం్రడేగుల పాపయ్యగారిమీద సమస్య పూర్తి
...ప్పినపద్యము:
...రంబగు నీ తేజము
...ంచి విపక్షరాజతిమిర మడంపఁగ
...డెండు సూర్యులనఁదగుఁ
...్రడేగుల పాపయాఖ్య, గతరిపుముఖ్యా.

ఈ పద్యము విని వారు మనకవిమీద ఈ క్రింది
...చెప్పించిరి:

...దాసమయూర బాణమురజిత్
కల్పన్, గుణావల్పునిన్
...శాసనసుందరీకవిత నీ
ణావాదనప్రక్రియా
...భాసికవిత్వశాలిని దగన్
బాటింతు గుంటూరు వం
...క్షీరపయోధి శీతఘృణిఁ బా
పయ్యాఖ్యవిద్వన్మణిన్.

...ంపాటి రాజులమీద చెప్పిన పద్యము:—

...త్తురంగమాతంగసంగళిగృహ
ప్రాంగణుండగు పెద్ద రంగరాజు
...త్రప్రతిపక్షపక్షశిక్షాదక్ష
లక్షితభుజశాలి లచ్చిరాజు
...రహారపటీరశారదానీహార
హారకీర్తివిహారి పేరరాజు
సకలార్థిరాధేయ సద్గుణధౌరేయ
రాయరాయవజీరు రాయరాజు

గీ. శౌర్యగాంభీర్యధైర్యపత్కార్యములకు
వీరి నల్గురితోఁ బోల్ప వారు వీరు
సాటి యన రార యెనరారు చక్రవర్తు
లార్థ రైనను నృపులు పదార్థ రైన.

గురిజాలకృష్ణంరాజు గారిమీద చెప్పినపద్యము:—

సీ. తాడు చెక్క తుపాకి తగ రొమ్ము క త్తితేఁ
బులులకు బెదురు, రిపులకు నదురు
బల్లెమ్ము చేఁ బట్టి బరికాపు గాచితేఁ
బంది కుకుటు, పరిపంథి కదుటు
చేకత్తి యొర దూసి చేఁగత్తి పట్టితే
బంట్లకు నులుకు, పెన్‌బంట్ల కలుకు
కైజారు పరిజించి కైజాఱుచేసితే
రురులకు దుడుకు, వైరులకు నడుకు

గీ. ఆహహా! నీవేట మహనీయమైన దౌట
నోరు లెవరు పూఁట నీతోడ నొక్కపూఁట
..................................
కృతబలాటోప, గురిజాల కృష్ణభూప!

పాపయ్యగారి ముగ్గురు కొమారులలో పెద్దవా
రయిన సుబ్బారాయుడుగారికిని, మూడవ వారయిన శ్రీ
హరిగారికిని సాహిత్యమూ, కవిత్వమూ పట్టుపడినవి.

# స్త్రీ నీతిరత్నావళి

(ఏప్రిల్, 1905.)

కీ. శే. శ్రీమన్మహోపాధ్యాయ
బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రి

[కుమారికి జనని యుపదేశించినట్లు భావించి సులభశైలిని నాచే రచియింపఁ యిప్పద్యంబులు స్త్రీజనోపయోగంబులు గావున స్త్రీజనోపయోగ్యంబగు నితర పత్రికార బులయందుఁ బ్రకటింపఁ దత్పత్రికాధిపతులు ప్రార్థితులు.]!

ఒడలిక నుస్సురుస్సురని వచ్చిన భర్తకుఁ దెల్పకమ్మ! నీ
యిడుమలు; పాదశుద్ధికొఱ కిచ్చి జలంబును దాళవృంతమున్
వడిఁ గరమందుఁ బూని నునుపాన్పున జేరిచి, సేద దీర్చి, నీ
వడుగుల నొత్తి, సౌఖ్యముల నందఁగఁ జేయుము మానినీమణీ.

వరుఁ డొకవేళఁ దిట్టినను, బైఁ బడి నీ వెదురాడకమ్మ! యె
వ్వరు పతిభక్తి నుండుదురొ వారికి ముక్తి ఫలించుఁ గా మనో
హరవరు నెల్లయప్డు మనసార భజింపుచుఁ గన్నతల్లి! మం
దిరశుభలక్ష్మి నాఁగ నవనిన్ యశ మొందుము మానినీమణీ.

చిన్నతనాననుండి యఱచేత మెలంగెడునట్టి నిమ్మపం
డున్న తెఱంగునం బెరుఁగుచుండిన నా మురిపెంపు దొంతి! నిన్
గన్నది యాది యొక్క త్రుటికాలము మ మ్మెడఁబాయవైతి వో
యన్నులమిన్న! యత్తమతి నత్తుచు వర్తిలు మానినీమణీ.

మఱఁదుల నెల్ల సోదరులమాడ్కిఁ బ్రియంబుగఁ జూడు మమ్మ! యెం
దఱు నినుగూర్చి దూషణ మొనర్చిన నీదగు సత్ప్రవర్తనం
బెఱుఁగని మూఢు లౌదురు గదే కొదు వేమి భవచ్చరిత్రకున్?
జెఱుతల శ్రేయ మీవు పరిశీలన చేయుము మానినీమణీ.

పొరుగున నున్నవారిపయి మోపకు మమ్మ వృథాపవాదముల్
కొఱకొఱలాడఁబోకు మనుఁగుం గొమరుల్ చిఱుపోరు వెట్టినం
బరులు యశోధనంబులను బచ్చఁగ నుండిన నోర్వలేమితో
దురుసుఁదనంబుఁ జూపకుము తుల్వతనం బగు మానినీమణీ.

పలుమఱు నిల్వకమ్మ తలవాకిట! పక్కన నవ్వకమ్మ ! బం
ధులయెడఁ బ్రీతి దాల్పవమ! దుర్గుణకాంతలతోడ నెన్నఁడుం
గలియకుమమ్మ! నిద్దురను గాలముఁ బుచ్చక సత్ప్రవర్తనం
బులను జెలంగవమ్మ! గుణభూషణశాలిని! మానినీమణీ.

అలుగకుమమ్మ నీవు కలనైనను దెమ్మని భూషణావళుల్!
చెలులకు దివ్యభూషణము సేవ యొనర్పుట గాదె భర్తకుం?
దులువలయట్లు వస్తువులతోఁ దులఁదూఁగుదు నందు వట్టి భ్రాం
తులఁ బడకమ్మ! దాన నగు దుర్భర మావెత, మానినీమణీ.

పతి పొరుగూరి కేఁగిన సెబా సని త్రిమ్మర కమ్మ వీధులం
గుతుకముతోడఁ బుష్పములు గ్రొమ్ముడిఁ దాలిచి వన్నె చీరలం
బతియెడ లోప మున్న నది పాటిగఁ జూడకుమమ్మ! కొమ్మ! నీ
సతిగుణమే త్రికాలముల స్వాంతమునం దిడు మానినీమణీ.

పుట్టిన యింటి గౌరవము పోయినఁ జుల్కన యౌఁ గదమ్మ! నీ
మెట్టిన యింటివారికి సమీపమున న్వసియించు వారికిన్
గుట్టును జెప్పకమ్మ! యదిగో యదిగో యని త్రిప్పి బీదలం
జెట్టలఁ బెట్టి యన్నిటికిఁ జెం గొడిగట్టకు మానినీమణీ.

కనికర ముంపవమ్మ ! పనికత్తెలెడ న్దయ మాలి యేర్చినై
నను గఠినంపుమాటల మనంబును నొవ్వఁగఁ జేయకమ్మ! నీ
కనుపమ కీర్తి గల్గునమ! యార్యులు విన్నను మెత్తురమ్మ ! యే
వనితలలోన నైన నగుఁబాటులు పొందకు మానినీమణీ.

అత్తకు మామకు న్వలయునట్టి సపర్యలు సేయుచుంటలోఁ
జిత్తము నిల్పవమ్మ! యది సేమము నీకును బుట్టినింటికిం
బుత్తడిబొమ్మ! యెన్నఁడును బోకుము నీపొరుగిండ్ల కూంకే
యెత్తటినైన బొంకకుమి; యెందును నమ్మరు మానినీమణీ.

పనులను జక్కఁ బెట్టుటను బానిసవై, విభుమ్రోల నిల్చి యు
క్తిని బచరింప మంత్రివయి, క్లేశముఁ బాపఁగ నౌషధంబవై,
చనవునఁ బాయసాన్నములఁ జక్కని కూరలఁ బిండివంటలం
దనుపఁగ మాతవై, సతులధర్మము నిల్పుము మానినీమణీ.

తడిసిన యట్టిపుట్టములు దాల్చకుమమ్మ! విశేషభాగ్యముల్
గడన నొనర్చలేదనుచుఁ గాంతునిపైఁబడి తిట్టకమ్మ! యె
ప్పుడును బరోపకారమును బూని యొనర్పఁ దలంపుమమ్మ! నీ
యెడఁదను; లేని యాగడము లెన్నఁ డొనర్పకు మానినీమణీ.

మగనికిఁ దెల్పకుండ మటుమాయము సేయఁదలంపకమ్మ! నీ
నగలను; బెద్దలం గనిన నమ్రతఁ జూపుము; భర్తకన్న ముం
దుగ భుజియింపకమ్మ! యతిథుల్ సనుదేరఁగ వారివారికిం
దగు విధ మెంచి పూజల నొనర్చి చరింపుము మానినీమణీ.

ధవునకు నెన్నడుం బ్రతిహతంబుగ వర్తన సేయకమ్మ! మా
ధవుని స్మరింపుమమ్మ, యవధానము గల్గిన యెల్లయప్డు! వ
స్తువులను జూచి వాడుకొనుచుం భయభక్తుల నుండవమ్మ! జం
తువులయెడ న్దయారసముతోఁ జరియింపుము, మానినీమణీ.

ముసుఁగిడి నిద్దురింపకుము మో మటు ద్రిప్పకుమమ్మ! యెవ్వరే
న్విసిగిన యంతమాత్రమున వేగిరపాటును జెంది యన్యులం
గసరకుమమ్మ! బావలెడ గౌరవ ముంపుము; మంకుమాటలం
బసలకుమమ్మ, నీకు నవమానము గల్గును, మానినీమణీ.

నిలిచినచోటనే నిలిచి నిందలు వొందకుమమ్మ! కార్యముల్
సలుపునెడం బ్రమాదమున జా గొనరింపకుమమ్మ! యింటనుం
గలిగినదాననే తనివి గల్గి మెలంగుము నీదు భర్తకుం
దెలియక యెన్నఁడుం బుణము దీయకు మమ్మరో! మానినీమణీ.

చిలుకలకొల్కి! మాయెదుటఁ జేసెదు చిన్నతనంపుఁ జేష్టలం
గులుకకుమమ్మ! యత్తకును గోపము వచ్చును, మామ తిట్టు; నాఁ
కలి గొనువేళలందుఁ గినుక న్భుజియించుట మానకమ్మ! పెం
దలకడ లేచి యింటిపని దప్పక చేయుము మానినీమణీ.

---



శిల్పములు చెక్కిన తాయి, మాహా వెల్లిపురము



దేవలోకమందలి దర్బారున గద్దెలపై తైమూర్ షా లేక టామర్ లేను వఱకుగల
ఔరంగజేబు పూర్వపురుషులు

శ్రీ శ్రీ శ్రీ జయపూరు మహారాజావారి ఒక భారతీయచిత్రము నుండి.

## ...ల పంచ భూతములు

జి. నరసింహామూర్తిగారు

౧

...వ్యాసమును ప్రారంభించుటలో తొలుదొల్త ...భారతదేశముయొక్క శాస్త్రాభివృద్ధిని గూర్చి ...సికొనుట మిక్కిలి ముఖ్యము. హిందూదేశచరి... చూడ మన పూర్వులకు అనాదినుండియు ...లో అభిరుచి మెండని స్పష్టమగుచున్నది. ...కాలమందు వృక్షశాస్త్రము, రసాయన ..., వైద్యశాస్త్రము, ఖనిజశాస్త్రము మొదలగు ...న్నియు విశేషముగా అభివృద్ధి గాంచినట్లు ... ఈనాటికిని నిలిచియున్నవి. పైన పేర్కొ... ...స్త్రము లన్నిటిలోను ముఖ్యముగా నభివృద్ధి ...ద్యశాస్త్రము. వైద్యశాస్త్రమునకును రసా...స్త్రమునకును గల పరస్పరసంబంధముచే రసా...స్త్రమును గూడ ప్రాచీనహైందవులు విశేష పరి...ట్లు కానవచ్చుచున్నది. ఇందులకు ఒక నిద... కనబరచవచ్చును. ఢిల్లీకి సమీపమున నున్న ...నారు పూర్వులచే తయారుచేయబడిన ఒక ...భము ఈనాటికిని నిల్చియున్నది. ఈ ...మున నమర్చిన యిత్తడి శిఖరముపై చిత్రిం...లిపిని బట్టి యీ స్తంభము క్రీస్తుపూర్వము రెండువేల సంవత్సరములక్రిందట నిర్మించినట్లు ...శోధకులు నిర్ధారణచేసిరి. ఈ స్తంభమును ...యుటయందు మన ప్రాచీనులు కనపర్చిన ...నశాస్త్రజ్ఞులకు ఆశ్చర్యమును నెలకొల్పుచున్న ...స్త్రలోకమునకు విశదమే. ఇట్టి విశేష ...ఖలాలు కనపర్చవచ్చును. ఇచ్చో చదువరులు ...జ్ఞాన మిట్లు ఎదుగకుంటుటకు కారణ మేమని ...వచ్చు. దానికి అనుకూలముగా ఒక్క కారణము ...చున్నది. నానాటికి మన పెద్దలు భౌతికశాస్త్ర...మాని ఆధ్యాత్మికశాస్త్రపరాయణు లగుట వల్లను, రానురాను ప్రభుప్రోత్సాహము లేకపోవుట వల్లను, ప్రస్తుతము శాస్త్రజ్ఞానము కడు విచారకరమగు స్థితిలో నున్నదనుట మిక్కిలి సత్యము.

౨

ఇక ముందు వారికాలపు కొన్ని శాస్త్రీయాంశముల చర్చ ప్రారంభింతము. శాస్త్రీయాంశము లన్న వివిధశాస్త్రములలో నున్న అంశములను ఇచ్చట ముచ్చటింతునని చదువరు లూహింపవచ్చును. కాని, అట్లొనర్చుట యీవ్యాసమున కెంతయు అనవసరము. అది యటుండగాక యీ చిన్నవ్యాసమున దుర్లభము. కాబట్టి ప్రస్తుతము రసాయనశాస్త్రమున విశేషము మార్పు చెందిన కొన్ని యంశముల నే మిమర్శింపదున్నాను. అట్టివి మనపూర్వులచే అనాదినుండియు గుర్తింపబడి ఋషికుల సంప్రదాయముగా వచ్చుచున్న భూమ్యాకాశాదిపంచ భూతములు. ఈభావన మన కెట్లవసరము? అది యెట్లు ఉత్పత్తి గాంచినది? రానురాను ఈ భావన యెట్లు భిన్నాభిప్రాయములచే నావరింపబడి తుట్టతుదకు ప్రస్తుతము (ఈవ్యాసమున చూపింపబోవు)మార్పు చెందినది?— అను అంశముల నే చర్చింప నీవ్యాసము ముఖ్యోద్దేశము.

ఏశాస్త్రమునకైనను ముఖ్యమైనది సృష్టిరహస్యముల నొక్కొక్కటిగా బహిరంగపరచుట. ప్రకృత శాస్త్రదృష్టితో పరికించి చూడ మనస్సు నాకర్షించువిషయము లనేకములు చూపట్టుచున్నవి. ఒకచో వృక్షప్రపంచము చిత్రవిచిత్రములగు వలువలు ధరించి ప్రకృతిమతల్లి మందహాసమును వెల్లడించుచున్నది. వేరొకచో జంతుప్రపంచము విశ్వమంతయు తన ప్రభావమే యని చాటుటకో యన మితిలేని యాందోళన మొనర్చుచు, తనకై, తరువాత తనజాతికై యిచ్చట నిత్యమగు స్థావర మేర్పర్చుకొనుటకుగాను యుద్ధసంరంభములు గావించి కట్టకడకు మృత్యువు వాతం బడుచున్నది. ఇట్లు

సృష్టి దృశ్యాదృశ్యములచే నిండియున్నది. ఇట్టిచో పైసూచించిన భిన్నచేతస్కమైన సృష్టికి మూలమేదైన కలదా యను ప్రశ్న శాస్త్రజ్ఞుని మనంబునకు చిర కాలముక్రిందటనే తట్టె ననుటయందు ఆశ్చర్యమే మున్నది? వేదాంతశాస్త్రజ్ఞుడు ఊహాయను తపస్సున సిద్ధి పొంది యీ సృష్టికంతకు శక్తిసంభూతు డగు ఈశ్వరు డొక్కడున్నట్లును, జీవప్రపంచము ఆయనలీల యనియు వెల్లడించుచున్నాడు. అట్లే మనము చర్చింప బోవు రసాయనశాస్త్రమునకూడ. ఈచరాచరసృష్టి కం తయు సృష్టికర్త యొకడేనా లేక ఆదిద్రవ్య మేదైన నుండి దానినుండి యీ వస్తుసముదాయము పుట్టినదా? ఈ అంశము శాస్త్రము అనాదినుండియు శాస్త్రజ్ఞుల మనంబుల గట్టిగ బట్టి యున్నది. పూర్వపు పాశ్చాత్య శాస్త్రజ్ఞులును, భారతీయశాస్త్రజ్ఞులును తీవ్రమగు ఊహాశక్తిచే ఐదు ద్రవ్యములను మూలపదార్థములు (Elements)గా గుర్తించిరి. వీనినే పంచభూతము లం దురు. ఈఐదున్ను భూమి, వాయువు, జలము, అగ్ని, ఆకాశము. కాబట్టి యీఐదు ద్రవ్యములరసాయనపుమార్పు లచే పదార్థసముదాయ మేర్పడుచున్నదని వారి యభి ప్రాయమై యున్నది. అనగా ఈ చరాచరసృష్టి యం తయు ౫ విధములగు పదార్థములుగా విభజింపవచ్చునని యు, అందు ఘనపదార్థములన్నిటికి 'భూమి' యాధార మనియు, ద్రవపదార్థములన్నిటికి 'జల'మాధారమనియు, గాలి, మేఘము, శ్వాస మొదలగువానికి 'వాయు'వాధార మనియు, సూర్యుడు మంట మొదలగువానికి 'అగ్ని' యాధారమనియు వారిభావన. వారి 'ఆకాశము' ఈ నాటి యీథర్ (Ether) కు పోలియుండు నని మన మూహింపవచ్చును.

ఈపంచభూతము లన నర్థమేమో జాగ్రత్తగా తెలిసికొనవలసి యున్నది. పై నుదాహరించిన ౫ పదార్థ ములున్ను మూలద్రవ్యములనిన్ని (Elementary Materials), వీనియొక్క సంయోగము (Combination) చేత వస్తుసముదాయము (Material Universe) ఏర్పడు చున్నదనియు పూర్వుల యుద్దేశము లయినట్లుగా ఇంతక్రితమే చెప్పియుంటిని. మూలద్రవ్య మను పదము రసాయనపరిభాష (Chemical Nomen ture)యం దొక్కటై యున్నది. ఈ పదమునందు సరియగునర్థము చదువరులకు తెల్లమగుటకు గాను ఉదాహరణములను చూపవచ్చును బంగారమున్న కొందము. బంగారపుముక్క నొక్కదానిని తీసి కొట్టవచ్చును. తీగగా తీయనగును. ఇట్లెన్ని మార్పులు దినను బంగారము బంగారమే. దాని ననుసరించు ఘనపరిమాణము, శబ్దము మొదలగు సహజలక్షణ వీడవు. ఏవిధముచేతనైనను బంగారునుండి తద్వ్య రిక్తమగువస్తువు వేరొకటి తీయలేము. అనగా బం నుండి యెట్టిప్రయోగముచేతనైనను వెండిగాని, గాని మరియే యితరపదార్థముగాని తీయలేము. ఇట్లే తము, తామ్రము, పాదరసము, ఉదజని (Hydrogen) జని (Oxygen) (ప్రాణవాయువు) మొదలగునవి. రసాయనశాస్త్రమున మూలద్రవ్యములు (Elemen అందుము. ఈపదార్థము లెన్ని రసాయన-మార్పులపొ నను తమ నైసర్గికధర్మములను కోల్పోవు.

ఈ యుద్దేశముల పూర్వుల పంచభూతము ప్రయోగించిచూతము. ఏలన, వారు పంచభూత పేర్కొనుటయందు వారియుద్దేశము మూలద్రవ్యములని కాబట్టి భూమి, జలము, వాయువు, అగ్ని, ఆకా మూలపదార్థములని వారి యుద్దేశము. అనగా ఈ పదార్థములనుండి తామ్రము, బంగారు, రజతము తద్వ్యతిరిక్తమగు పదార్థములను లాగ నశక్యమని యుద్దేశము. ఈ ఉద్దేశమెంతవఱకు నిజమో ములో చెప్పవచ్చును. భూమినితీసికొందము. ఈభూ యెన్ని విధములగు ఘనజలవాయుపదార్థముల సము మో చదువరులకే గ్రాహ్యము. ఇట్లే జలము. ఈజల గూర్చి విపులముగా తర్కించి మన నవీనుల యుద్దే లెట్టివో పరికింతము.

౩

జలము మూలపదార్థమను నమ్మకము సు క్రీ. శ. ౧౭౭౦ వరకును వచ్చుచునే యున్నది. ౧౭ సం॥న పాశ్చాత్యశాస్త్రజ్ఞులు 'ప్రీస్ట్లే' (Priestl

(Cavendish) మొదలగువారు ఉదజని శోధనలు జరుపుచు, ఆ సందర్భమున ఉదజని మండుటచే జలమేర్పడుచున్నట్లు గుర్తించిరి. వారి పరిశోధనల ననుసరించి తదితరులు, అనగా యర్ (Lavoisier) మొదలగువారు మిక్కిలి ములగు పరిశోధనలచే నీరు మూలపదార్థము , అది ఆమ్లజని ఉదజని యను రెండువాయు రాయనసంయోగ మనియు సిద్ధాంతీకరించిరి. సందర్భమున జరిపిన ప్రయోగములు రెండు విభజించి చదువరులకు తేటతెల్లము చేయ . ఎట్లన ఒకపదార్థము రెండు మూలపదార్థ ములైన మన్నచో ఆపదార్థము ఆయా మూల సంయోగము (Synthesis) చే ఏర్పడ టొకటి; రెండవది ఆ పదార్థమును పృథక్కర Analyse) చేసిన దానిలో నుండు రెండు మూల ములు వెలువడవలయును. కాబట్టి పైన చెప్పిన ముయొక్క సత్యమారయవలెనన్న వారొనర్చిన ను తెగల ప్రయోగములను మనము పరిశీలించ . అట్లు చేసిన రెండు తెగల ప్రయోగములు ంశమును బలపరచినచో సిద్ధాంతము సత్యమని ర్యము. కాబట్టి వారొనర్చిన రెండు తెగల గములను రకమున కొకటిగా తీసి తెల్లము న.

## పృథక్కరణము

### ప్రయోగము (Experiment)




చిత్రము ౧

జలముయొక్క పృథక్కరణమం దుపయోగింప ఉపకరణముల (Apparatus) నమర్చిన విధంబు పైపటమునందు తెల్లముగుచున్నది. పటమం దుపయోగింపబడిన వివిధోపకరణములు తొలుదొల్త చూచుటకు వింతగా నుండినను వానిపేర్ల సహాయమున అంతయు సులభముగా తెలిసికొననగును. రెండడుగుల నిడివిగల యొక్క బలమగు గాజు (hard glass) గొట్టము (అ)ను శుభ్రమగు ఇనుపముక్కలతో సుమారొక యరడుగు నింపవలయును. పిమ్మట నాగొట్టము ఇరుపార్శ్వముల సన్నని ఏకరంధ్రముగల రబ్బరు బిరడాలచే మూయవలెను. ఈ రంధ్రములగుండా సరిగాపట్టు నాల్గంగుళముల గాజునాళికల (ఆ, ఆ) పోనిచ్చి పిదప దానిని పటములో కనపరచిన ట్లమర్చియుంచవలెను. అదియట్లుండ, వేయిశతాంశమీటర్ల ఘనపరిమాణము గల్గి (thousand cubic - centimetres capacity) గుండ్రని పొట్టగల యొకగాజుపాత్ర (Flask)ను గాని, రాగిపాత్రనుగాని శుభ్రపరిచి మూడువంతులు నీరుచే నింపవలెను. తరువాత నాపాత్రమూతి నొక సన్నని యేకరంధ్రము గల రబ్బరు బిరడాచే మూయవలెను. ఈసన్నని రంధ్రముగుండా సుమారు నాల్గంగుళముల నిడివి కల గాజునాళిక నొకదాని నమర్చవలెను. ఇట్లమర్చిన యుపకరణముయొక్క గాజునాళికను మొదట పేర్కొనిన గాజుగొట్టము (అ)తో రబ్బరు (ఇ) నాళికచే జతపర్చవలెను. గొట్టముయొక్క ద్వితీయ పార్శ్వమున నున్న గాజునాళిక (ఆ)కొక రబ్బరునాళిక (ఇ) యమర్చి యానాళిక నొక నీటితొట్టియం దుంచవలెను. తరువాత వాయువును ప్రోగుచేయు పాత్ర (వ)ను (Gas collecting jar) పూర్తిగా జలముచే నింపి పిదప నాపాత్రను జలాంతర్భాగమున తలక్రిందుగా రబ్బరు (ఇ) నాళికకొన పైపటములో చూపినవిధంబుగా నుంచవలెను. ఇట్లుపకరణముల నంతయు సలక్షణముగా నేర్పరచి ప్రయోగ మారంభింపవలయు. తొలుదొల్త ఇనుపముక్కలను వేడిచేయు నారంభింపవలయును. తరువాత నీటిపాత్రను వేడిచేయవలెను. ఇట్లు వేడిచేసిన కొలదికాలములో నీరు ఆవిరగుటకు ప్రారంభించును. ఇనుపముక్కలు ఎర్రగా కాలును. నీటియా

విరి (ఇ) ద్వారా యినుపముక్కలను తాకుచు స్రవించును. ఈ గొట్టమందు రసాయన మార్పు కల్గును. ఇట్లు కొలది కాలము గతించగానే జలముతో సీసాలోని (ఎ) యందు బుడగలు దృశ్యమగును. ఈ బుడగలు నీటియావిరి కాదని విశదమే. నీటియావిరి యయినచో నీటియందు కలసి పోవును. కాబట్టి బుడగ లొకవాయుపదార్థమని గ్రహింపవలెను. ఈ బుడగలు (ఎ) యందుండు జలమును క్రమక్రమముగా స్థలాంతరమునకు చేర్చును. పాత్రయంతయు నిండినపిదప దాని మూతిని గాజుబిళ్ల (Watch-glass) మూసి బయటకు తీయవలెను. ఒక మండుచున్న పుల్ల నీవాయువునందుంచిన, చిన్నశబ్దము చేసి పాత్రమూతియొద్ద నీవాయువు నీలవర్ణపుమంటతో మండ నారంభించును. దీనినే ఉదజని యందురు. తరువాత గొట్టమునందున్న యినుపముక్కలను తీసి చూచిన అవి మామూలు విధంబున లోహపుటుక్కుముల వలె యొకవిధం బగు ఎర్రనిపొడిచే కప్పబడియుండును. దీనినే మనము వాడుకభాషలో 'త్రుప్పు' అందుము. ఇనుమును ప్రాణవాయువుతో సంయోగపర్చినప్పు డెల్లప్పుడును త్రుప్పు ఏర్పడును.

పై ప్రయోగముయొక్క సారాంశ మేమి? లోహపుముక్కలు ఎర్రగా కాలిన యవస్థయందు నీటియావిరితో ప్రతిభూతమై ఉదజనియను వాయువును, త్రుప్పును పుట్టించుచున్నవి. త్రుప్పనగా (లోహామ్లజనిజము) లోహము ఆమ్లజనితో కలియుటచే కల్గిన పదార్థము (Iron-Oxide). కాబట్టి పై చెప్పిన ప్రయోగమునుబట్టి చూడ నీరు వియోగము చెంది ఉదజని, ఆమ్లజని (Hydrogen and Oxygen) అను రెండు వాయువులుగా మారుచున్నది. చదువరు లొక ప్రశ్న వేయవచ్చును. ఈ వాయువులు ఇనుమునుండి యేల రాకూడదు? కాని యినుమొక మూలపదార్థము. అనగా దానినుండి తద్వ్యతిరిక్తమగు పదార్థము వెలువడదని చదువరులకు గ్రాహ్యమే.

ఇక రెండవతెగ ప్రయోగ మొకటి పరికింతము. అనగా సంయోగమార్గము. పై నుదాహరించిన ప్రయోగమునుబట్టి చూడ నీరు మూలపదార్థము కాదనియు, నీటియందు రెండు మూలపదార్థములు (ఉదజని, ఆమ్లజని) జతకూడి యున్నవనియు చెప్పనయి యున్నది. కాని ఒక్క ప్రయోగముమాత్రమే పరిశోధనయొక్క నిజానిజములు స్థిరపరుపలేక పోవచ్చును. కాబట్టి మనము పైన తేటపరచిన సిద్ధాంతమును సంయోగప్రయోగ సహాయముచే బలపరచుట యుక్తము. ఈదిగువ ప్రయోగమును పరికింతము.




చిత్రము ౨

1. యశదతునుకలు
2. నిర్జలగంధకికామ్లము
3 లోహామ్లజనిజము
అ. 'వుల్ఫ' పాత్ర
ఆ. రబ్బరుగొట్టి
ఇ. నీటిసీసా
ఈ. గాజు గొట్టము.

ఒక వుల్ఫ (Wollfe) గాజుపాత్రలో కొన్ని యశద (Zinc) తునుక లుంచి దాని రెండు మూతులను ఏకరంధ్రపు బిరడాలచే మూయవలెను. ఒక బిరడా గుండా పటము ౨ లో చూపినట్లు గాజు నాళికను అమర్చవలెను. రెండవ బిరడా రంధ్రము గుండా రబ్బరుగొట్టి ఒకటి అమర్చవలెను. ఇట్లమర్చిన యుపకరణమును సన్నని రబ్బరునాళికద్వారా ఒక జలాకర్షణపాత్ర (Drying-bottle) తో జతపర్చవలెను. తరువాత నీయుపకరణమును ప్రథమప్రయోగములో పేర్కొనినయట్లు పొడుగాటి గాజుగొట్టముతో కలుపవలెను. రబ్బరుగొట్టియందు సజలగంధకికామ్లము పోయవలెను. అట్లు పోయుటచే ద్రవపదార్థము 'వుల్ఫ' పాత్రలోనికి దిగి యశదముపై పడును. పడినవెంటనే ఉదజని

en) యను వాయువు బయలువెడలును. పూర్వము సీసాయందు చాలినంత నిర్జల ము (Sulphuric Acid) ముంచవలెను. పైన ఉదజని యీ నిర్జలగంధకికామ్లము ద్వారా (Bubbles) లేచి నీటియావిరిని పూర్తిగా . తరువాత నీపొడి ఉదజని (Dry Hydro- గొట్టముద్వారా ప్రవహించును. ఈగాజుగొట్ట ముగాను, పొడిగాను చేసి దానియందు ప్రథమ మున తయారయిన లోహామ్లజనిజము (Ferric ముంచవలెను.

యోగము మొదలిడుటకుగాను నీ యుదజని మువములు స్వేచ్ఛగా గొట్టముగుండా పానీయ ట్లోన చేచే నుపకరణాంతర్భాగము నావ ను గాలి యావత్తు స్థలాంతర మొందును. గొట్టమును ఎఱ్ఱగా వేడిచేయ నారంభింప గాజుగొట్టము వేడిచేయుచున్నంతకాలమును దానిగుండా ప్రవహించుచునే యుండవలెను. రూకతతో ప్రయోగము జరిపిన కొంతకాల గొట్టము చివరిభాగమందు నీటిబిందువు లేర్ప ప్రయోగమున నీ రెట్లేర్పడుచున్నది? ఉద లోహామ్లజనిజమును ఎఱ్ఱని పొడి వేడిచేయుట . ప్రయోగాంతమున గాజుగొట్టములోని లోహామ్లజనిజమును పరీక్షించిన దానియెఱ్ఱరంగు పోయి లోహలక్షణములు చూపును. అనగా నీపదార్థముపై సూదంటు రాతినుంచిన అంతయు నాకర్షింపబడును.

### విమర్శన:

ప్రయోగపూర్వమున గొట్టములో లోహామ్ల జనిజముంచితిమి. దానిని ఉదజనిచే నావరింపజేసితిమి. పిమ్మట లోహామ్లజనిజమును ఎఱ్ఱగా వేడిచేసితిమి. కొంతకాలమునకు జలబిందువు లేర్పడినవి. అదియునుగాక లోహామ్లజనిజము లోహముగా మారినది. కాబట్టి యీ ప్రయోగమునుబట్టి చూడ ఉదజని లోహామ్లజనిజములో నున్న ఆమ్లజనితో కలయుటచే ఉదకమేర్పడుచున్నది.

ఉదజని + లోహామ్లజనిజము —> జలము + లోహము

Hydrogen + Iron-oxide —> Water + Iron

## ౪

ఇట్టిప్రయోగము లింకను అనేకము లుదాహరింప వచ్చును. కాని పరిమితమగు నీ వ్యాసమున సూచింప నశక్యము. కాబట్టి పైచెప్పిన రెండు ప్రయోగములవలన స్పష్టముగ విషయ మెట్టిదన, జలము మనపూర్వులూహించి నట్లుగా మూలపదార్థము కాదనియు, ఉదజని, ఆమ్లజని యను రెండు మూలపదార్థముల రసాయనసంయోగముచే ఏర్పడుచున్నదనియు తేటతెల్లమగుచున్నది.

---

## కనము

కే. చెంచురామయ్యగారు

రవిశాలసంవీక్షవారి
లి తుంగతరంగవిభ్రమము తోడ
మనోవీథియందుఁ బర్వె
! ఒక్కమాత్ర నిల గాంచినంత—

టుకణస్పర్శఁ జేసి తప్త
యమందెను స్వస్థత— ఈ జగంపు

టుకలన్నియు మాయ, నే నెలమి నీదు
వీచికాడోలికల నూఁగి వెడలి వడలి—

దివ్యతేజోమయుండగు దేవదేవు
ప్రోల నిలిచితి—కన్గవ మోడ్చునందె—

దానిఁ దెలివగ నుంటి నీతటము పైని
విస్మయాధీనమతిని నిర్విణ్ణుఁడనయి.

---








# సింహళమునందలి సనాతనచిత్రములు

తలిశెట్టి రామారావు గారు, బి. ఏ., బి. య

రాజకీయపరిస్థితులవలన నిప్పుడు సింహళము ప్రత్యేకదేశముగ బరిగణింపబడుచున్నను అనాదినుండియు నిది హిందూదేశమునం దొకభాగమైయున్నది. రెండుదేశముల నిప్పుడు విడదీయు జలసంధి నూతనముగ నేర్పడినటుల కానవచ్చును. రామాయణమునందు రావణుని రాజ్యముగ పేర్కొనబడిన "లంక" బండేల్ఖండుజిల్లాయనియు, జావాద్వీప మనియు చరిత్రకారులు వ్రాయుచున్నను ఇప్పుడు "సిలోను" అని పిలువబడుచున్న ద్వీపమే "లంక" యని హైందవప్రజాసామాన్యము యొక్క నమ్మకము. అశోకుడు బౌద్ధమత ప్రచారమునకై మహేంద్ర, సంఘమిత్ర అను బౌద్ధసన్యాసులనుపంపినప్పుడు సింహళమునం దామతము పాదుకొని యాదేశవాసులనందరిని తనలో గలుపుకొనెను. తరువాత నీదేశమును పాలించిన రాజులను హైందవు లనియే చెప్ప వచ్చును. ఆచారములందును, సాంప్రదాయములందును ఈదేశముల ప్రజలకు భేద మత్యల్పము. బౌద్ధయుగమున ప్రవేశపెట్టబడిన చిత్రరచన యీకాలపు సింహళచిత్రములందు కానబడుచు హైందవనాగరికతయొక్క కళ సింహళనాగరికత యని చాటుచున్నది.

ప్రజల నాకర్షించుటకు మతప్రచార నందు క్రైస్తవులు చిత్రముల నుపయోగిం టను మనము చూచుచున్నాము. బౌద్ధయు మునందే యిట్టిప్రచారమును ప్రచారమునం బెట్టి హిందూదేశము తక్కిన దేశములకు మా దర్శి యయ్యెను. బౌద్ధసన్యాసులు చైనా, జపాను, సింహళము, తురుష్కస్థానము మొ లగుదేశములకు బోవునప్పుడు తమతో చి ముల ననేకములను గొంపోవుచుండిరి. అజం బాఘ్, సీగిరియ చిత్రములవలన మన కిప్పు కొంచెము కానవచ్చు అత్యద్భుతసనాత హైందవచిత్రరచనాప్రవీణత వీరికి తో డెను. బుద్ధభగవానుని పవిత్రజీవనమును, వా పూర్వజన్మములనుగూర్చి తెలియజేయు జాత కథలను చిత్రములరూపమున నాయాదేశవా సుల కందజేసి, వారి నాకర్షించి తమ మతమ నం దభిలాష కలుగజేసి కృతార్థు లగుచుండిరి.

కూడుటవలన నప్పటి చిత్రరచన శము నం దంతగా నభివృద్ధిజెంది పర మున్ననల నార్జింపగలిగెను. జపాను, సింహళములం దిప్పటికిని హిందూ ఆదర్శకమై యున్నది. ఖోటాను దేశములందు హిందూ చిత్రరచన పూర్వ మెక్కువ ప్రచారమునం ని చెప్పుటకు నిదర్శనములు విరివిగ చున్నవి.

వాలయపు గోడలమీదనుండిన చిత్ర మాసిపోయినప్పుడు క్రొత్త చిత్తరువు యుటకు సింహళపు దేవాలయాధి చిత్రకారులను నియమించుట వలన చిహ్నమాత్రముగ దప్ప సనాతన లన్నియు మాయమయ్యెను. కాని ఆ నకు జెందిన అజంత, బాఘ్ చిత్రము ధికాంశములు మతమునకు జెందినవగు ంహళమునందలి చిత్రములలో నించు న్నియు మతవిషయకము లని యూ మ్పను. ఇప్పుడు శిథిలావస్థలో నున్న పొలన్నరువలందు మాత్రము సనా ములు కానవచ్చుచున్నవి. ఇవి మత సంబంధించినవిగ నున్నవి. దేవాలయ లి చిత్రములు (పైన జెప్పిన కారణము నవీనము లగుటవలనను, వీటిని చిత్రించు దృక్పథము పశ్చిమదిశవైపు మరలుట ఇటీవల హైందవచిత్రశైలి వెనుక న్నది. కాని దీనిని పునరుద్ధరించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి—పరిస్థితులును అనుకూలముగ నున్నవి.

బౌద్ధమతము సింహళమునందు వ్యాపించిననాటినుండియు నచ్చట భారతీయచిత్ర రచన సామాన్యమయ్యెను. దేవాలయములు, విహారములు, బహుశః యితరనివేశనములు చిత్రములతో నలంకరింపబడియుండెను. రాజ గృహములు చిత్రాలంకృతములనుటకు సింహగిరి నిదర్శనము. శిలావిగ్రహములును జీవించి యున్నవను భ్రమ గలిగించుటకు రంగులతో నలంకరింపబడి యుండెను. శిల్పరచన ప్రాముఖ్యము వహించిన పిమ్మటకూడ చిత్రరచన యభ్యాసమున నుండినటుల కానవచ్చును.

అజంత, బాఘ్ చిత్రములవలె నివియు వ్రాయబడినవి. మన్నుతో ఊకను, ఇసుకను కలిపి గోడలపై మెత్తి చదునుచేసిరి. ఈ లేపనము ఎండినపిమ్మట దానిపై పలుచగ సున్నమును బూసిరి. ఇది యారకమునుపే చిత్రరచన ప్రారంభించుటవలన రంగులు సున్నములోనికి యింకినవి. వర్ణలేపనము చేయులోపల నితరభాగము లారినయెడల నాయాభాగములను నీటితో దడుపుచుండిరి. ఇటుల చిత్రించుటవలన రంగులు పొక్కి రాలుట కాని, చెరిగి పోవుటకాని, మాసిపోవుటకాని సాధారణముగ కలుగదు. రసాయనశాస్త్రజ్ఞానము మిక్కుటముగ నున్న యీకాలమునగూడ గోడలమీద చిత్రరచన చేయుట కింతకు మించిన యేర్పాటు తెలియదని పండితుల యభిప్రాయము. అయి

నను మన దేశముల తీవ్రమైన వేడిమివలనను, వర్షమువలనను సింహగిరి చిత్రములు తప్ప తక్కినవన్నియు చాలవరకు నశించినవి. సింహళదేశపు ఆర్ష శాఖవారు తగినశ్రద్ధ వహింపక పోయినయెడల అజంత, బాఘ్, చిత్రములవలె సింహగిరిచిత్రములుకూడ చెడిపోయెడివి.

సింహగిరి

సింహగిరినే యచ్చటి ప్రజలు సీగిరియ అందురు. ఇది యొకయెత్తయిన కొండరాతిపై గల దుర్గము. ఇచ్చట పెద్దసింహపు ప్రతిమ లుండుటచే దీని కీపేరు వచ్చెనని యూహ. కశ్యపుడను రాజు తనతండ్రియగు ధాతుసేనుని క్రూరముగ జంపి తనయన్నకు భయపడి యీ దుర్గమును గట్టుకొనెను. దగ్గరనే నీటివసతి యుండుటవలనను, తినుపదార్థములు పరిసర ప్రాంతములందు సులభముగ లభించుటవలనను ఈతడిచ్చట పదునెనిమిది సంవత్సరము లెట్టి భయమునులేక రాజ్యమేలెను. కాని తుద కితడు యుద్ధమున పరాజితుడై యాత్మహత్య గావించుకొనుటవలన నటుపై నీకోటను జూచు వా రెవరును లేకపోయిరి. రాతిపై కట్టిన మెట్లును, దుర్గమును చాలవరకు చెడియుండు టచే నిప్పు డామీదికెక్కుట కష్టమయ్యెను. కాన నందుగల చిత్రరాజములు చూపరుల యవివేకమువలన అజంతచిత్రములవలె చెడుట సంభవింపలేదు. ఆర్ష శాఖవా రిప్పుడొక బలముగు త్రాటినిచ్చెనను వ్రేలాడగట్టుటచే కష్టముగ మీదికెగబ్రాకి చిత్రములను దర్శింప వీలగుచున్నది.

ఇచ్చటి చిత్రములన్నియు పదునెనిమి పదునేడుగురుస్త్రీలు మాత్ర మొకరి వెన నొకరున్నటులనున్నది. కాన అజంతయందు బాఘ్‌నందును గల రచనాభేదము సింహ యందు కానరాదు. చిత్రములు రచించుకా మున కశ్యపుడు పరాజితుడై ఆత్మహ గావించుకొనుటవలన కాబోలు నివి పూర్తి వ్రాయబడకపోవుటచే వెనుకభాగమున నుం వలసిన దృశ్యములుకాని, ఇతరములైన హం లుకాని వీటియందు కానరావు. అచ్చటచ్చ చిత్రకారు లుద్దేశించిన మార్పులుకూడ యి టికిని కానవచ్చుచున్నవి. అన్ని వ్యక్తులు నడుమువరకే వ్రాయబడియున్నవి. వీరిలో కొందరు కశ్యపుని రాణులనియు, తక్కినవా (ముఖ్యముగపళ్లెములు చేతనున్నవారు) సేవ



డనియు, రాతి దిగువనున్న బుద్ధభగ
ుని పూజించుటకు పోవుచున్నారనియు
దరిమతము. ఈ యూహ నిజమని తోచు
న్నది. కొందరు పాడుచున్నటుల నున్నది
పాట బుద్ధభగవానుని స్తోత్రమై యుండ
చ్చును. పాడుచున్నటుల నున్న పెదవు
యంతస్వాభావికముగను, లావణ్యముగను
న్నవి.

వీరందరు దేవకన్యకలనియు, మేఘముల
య్య నున్నటుల నుద్దేశింపబడెను కాన నడు
వరకే చిత్రింపబడిరనియు, దేవకన్యకలు
క పాడుచున్నటుల నున్నారనియు కొందరి
దము. హస్తముల యేర్పాటీవాదమును
ంత బలపరచుచున్నది. అభినయమును
పునటుల కానవచ్చు హస్తములు అభినయ
మునే సూచించుచున్నవని నిర్ధారణగ జెప్ప
జాలము. వీరభినయమునే చేయుచున్న యెడల
కొందరిహస్తములందు పుష్పములేల యుండ
వలెను? మేఘమండలిని చిత్రకారుడు వ్రాయ
నుద్దేశించెనా? పరిశీలించిచూచినయెడల చిత్ర
ము లున్నంతవరకే చదునుగ నున్నటుల కాన
వచ్చును. తక్కినభాగమంతయు కాలపరిమితిని
—కఱుకుగనుండుటచే— మేఘమండలివలె కాన
రాగలదు. వీరు పాటలు పాడినంతమాత్రమున
దేవకన్యకలని యూహించుట సాహసము. దేవ
కన్యకలు సేవకులను వెంటబెట్టుకొని వచ్చుట
పురాణాదిగ్రంథములందు చదివి యెరుగము.
సేవకులు వెంటనున్నను పుష్పము లెవరికి?
బుద్ధునకా? అటులైన వీరీనగరునుండి క్రిందికి
పోవునటుల వ్రాయుటేల?



చిత్రములు పూర్తికాకపోవుటవలన నిట్టి
యూహలకు తావు కలిగినది. వ్రాయుచుండిన
భాగము పూర్తియైనవెంటనే తక్కిన భాగము
లను చదును చేయించి చిత్రములను పూర్తి
చేసియుందురేమో—ఆచిత్రకారులు!

బొమ్మలన్నియు రెండు గదులందున్నవి.
ఈగదులు ఆయుధాగారములుగ నుండె నను
టకు నిదర్శనములు కలవు.

వ్యక్తులన్నియు చాలా సుందరముగను,
స్వాభావికముగను, సజీవము లైనటులను
ఉన్నవి అజంతయందువలె వీరందరును యౌ
వనవతులు; సుకుమారాంగులు; ఎట్టివారి
నైనను చపలచిత్తులుగ జేయజాలినవారు. వీరి

నగలు అజంతాస్త్రీల నగలవలె నున్నవి. శిరో



జములు పొందికగా అలంకృతములై మనో హరములుగ నున్నవి. కిరీటములు లేక పోయినను ఇవి కిరీటములవలె కానవచ్చునటుల నమర్చబడినవి. కర్ణాలంకారములు మాత్రము క్రొత్తవిధముగ పెద్దవలయములు చెవులకు వ్రేలగట్టబడినటుల నున్నవి. అజంతయం దిట్టి కర్ణాలంకారములు లేకపోవుటనుబట్టి సింహళ మునమాత్ర మాకాలమున నిట్టిభూషణములు సామాన్యములై యున్నటుల నూహింప వచ్చును. ఇట్టినగలను గదబ లనబడు అనాగ రికు లిప్పటికిని ధరించుట గలదు. ఈ స్త్రీల హస్తాలంకారములను ఇప్పటి గదబల హస్తము లందు జూడనగును.

హస్తముల చిత్రములను చిత్రించుట యందు హైందవులను మించినవారు లేరు. దేవతాప్రతిమల హస్తముద్ర లెంతమనో ముగ చెక్కబడినవో మనకందరికిని దెలియ ముద్రాహస్తము కానప్పుడు గదయో, చక్రములో, శూలమో, ఖడ్గమో, లేక యేయాయుధమో హస్తములం దుండును లయినయెడల కుసుమము సామాన్యము. పుత్రచిత్రములందు పురుషుల హస్తముల కూడ పుష్పము లుండుట కలదు. వ్రేళ్ల న్యాము చెప్ప నలవికాదు. ప్రతి వ్రేలియంద



జీవము తాండవమాడుచున్నటుల నుండు హస్తములును మాటలాడగలవా, ముఖ వలె భావమును ప్రదర్శింపగలవా యనిపించు సింహగిరిచిత్రము లీవిషయమున తక్కిన చిత్రసంచయమునకును వెనుకబడదని యు గల చిత్రములను జూచినవారందరికిని తెలి గలదు.

రేఖారచనయందును హైందవు ల యులు. రేఖల శైలియందు సింహగిరి చిత్ర కులు అజంత, బాఘ్‌వారినికూడ మించిరి. టను చలనము లేదు; తప్పు లేదు; దిద్దుబా లేదు. ఒక్కచోటమాత్రము హస్తము

ముగ వ్రాసి మరల మరియొకవిధముగ ల గలదు. ఇట్టిమార్పులను ప్రతి చిత్ర ను చేయుట కలదు. ఈమార్పు చేసి లన చిత్రముయొక్క సౌందర్య మెక్కు మయ్యెను. రేఖారచనయందలి లోపము ట్టి దిద్దుబాటు చేయవలసివచ్చినది అని ము తలంపకూడదు.

రేఖ లన్నియు గాఢమైన రంగులతో వి లోతైనరంగు కనుబొమలు మొదలగు లందు కావలసివచ్చినప్పుడు గాఢమైన ప్పు నుపయోగించిరి. చిత్రముల వెనుక మున లేతపసుపువర్ణము కలదు. ఈరంగు కనవివరముల నన్నిటిని వ్రాయనెంచిరి లు. ఉత్తమస్త్రీలవలె కానవచ్చువారి చ్ఛాయ లేతయైన ఎరుపుగను, సేవకు వర్ణము మట్టిరంగుగను ఉన్నది. ౧౫౦౦ సరము లైనప్పటికిని వర్ణముల సహజమైన ములు యిప్పటికిని వాడకయున్నవి. ఆచిత్ర వర్ణజ్ఞాన మట్టిది. వర్ణలేపనమునందు శేషముగ శ్రమపడలేదు. వర్ణముల సం ము తక్కువగ నున్నది. శ్రమయు, రచనా తయు లేకనే మనఃఫలకమున జొప్పట్టు మును ఉన్నదున్నటుల ప్రదర్శింపజాలుట కారుని సద్గుణములలో నొకటి. ఈ విషయ నుబట్టి చూడ సింహగిరి చిత్రకారులు న్యులు కారని తోచును.

సింహగిరి చిత్రము లన్నియు క్రీ. శ. ౫ ౬ వ శతాబ్దములలో చిత్రింపబడినవి కాన నివి అజంత, బాఘ్ చిత్రములకు సమకాలికములు. రచనయందును, వర్ణలేపమునందును, ప్రదర్శనమునందును, తదితరవిషయములందును ఈమూడుతావులందుకల చిత్రములన్నియు నొకేవిధమున నున్నవి—కొన్ని పాటింపనవసరములేని విషయములందు తప్ప.

పోలన్నరువ

బౌద్ధమతము క్షీణించి, హిందూమతము జనుల యామోదమును బడసినకాలమున చిత్రరచనయొక్క ప్రాముఖ్యము తగ్గి శిల్పరచనయొక్క ప్రాముఖ్యము హెచ్చెను. తిబెత్తు, చైనాలందు కానవచ్చెడిచిత్రములును, తారానాథుని చరిత్రయందలి అంశములును ఇటీవల ఘూర్జరమునందు లభించిన చిత్రములును ఆధారముగ లేనియెడల క్రీ. శ. ౬ వ శతాబ్దము మొదలు అక్బరుచక్రవర్తి పర్షియా చిత్రరచనను మనదేశమున ప్రవేశపెట్టినంతవరకు ఎట్టి చిత్రములు మనదేశమున వ్రాయబడెనో చెప్పుటకు సాధ్యముకాదు. ఇట్టిపరిస్థితులే సింహళమునందును కలిగెను. ఆరవశతాబ్దమునాటి సింహగిరిచిత్రములతరువాత పన్నెండవ శతాబ్దమునాటి పోలన్నరువచిత్రములవరకు నెట్టి బొమ్మలను వ్రాసిరో చెప్పుట కెట్టియాధారములును లేవు. పోలన్నరువయందలి వేలునసారామనిర్మాణమునుబట్టి యిచ్చటి చిత్తరువు లానాటివని చెప్పవలెనేకాని మరియొకయాధారము లేదు.

ఇచ్చటి చిత్తరువులు చాలాకాలము వరకు మరుగుపడియుండినవి. సింహళదేశపు

ఆర్ష శాఖవారు శ్రద్ధవహించి శిథిలావస్థయం దున్న యీస్థలమునంతను బాగుచేయించి యిది వరకే చెడియున్న యచ్చటి యద్భుతమైన చిత్రము లింకను చెడకుండునటుల మీద నొక నివేశనమును కట్టించి కాపాడుచున్నారు. వందల కొలది సంవత్సరము లివి వర్షమున దడసి, ఎండ కెండుటచే వీటి యాకారమును పోల్చుటయే కష్టమగుచున్నది. ఉన్న చిహ్నములను బట్టి కళాయాత్రికు లగు శ్రీయుత మణీంద్రగుప్త గారు రచించి ప్రచురింపించిన రెండుచిత్రముల నిందు పాఠకులు చూడగలరు—రేఖా మాత్ర ములుగ.

పోలన్నరువ క్రీ. శ. సం. ౩౬౮ రమున రాజనివాసమైనను పండ్రెండవ శతాబ్దము వరకు రాజధాని కాలేదనియు, అటుపిమ్మట యీచిత్రములు కల వేలువనారామమున పరా క్రమబాహుడు కట్టించెననియు చరిత్రకారులు నిర్ణయించిరి. సింహగిరికి పోలన్నరువ ఇరు మైళ్లదూరముననే యుండుటవలన చిరకాల నుండియు సింహగిరి చిత్రరచనాసాంప్రదా ము లిచ్చటను ఆమోదింపబడుచుండెనని చె వచ్చును. శైలియందు అజంత, సింహగిరి చి ములను పోలియున్నను వాటి గొప్పతన వీటికి లేదు. వీటినిరచించిన చిత్రకారులు సిం గిరి చిత్రకారుల తరగతివారే యైనను పో లేకయో, కాలగతిని బౌద్ధమతము వీరి నా వంతులుగ జేయజాలక పోవుటవలననో రేఖ రచనయందును, వ్యక్తివిన్యాసమునందు భావప్రదర్శనమునందును వాటి కివి య తరగతుల వెనుకబడి యున్నవి. చిత్రము





చెరిగిపోయి, రూపు చెడియుండుటవలన యిం కెక్కువ విమర్శించినయెడల నాచిత్రనిర్మాత కన్యాయముచేయుట యగును.

త. ౧౩ వ శతాబ్దానంతరము పోల యొక్క ప్రాముఖ్యము తగ్గిపోవుటచే ములు క్రీ. శ. ౧౨-౧౩ వ శతాబ్దముల యుండవలెను. ౬ వ శతాబ్దమునాటి చిత్రము మంచిస్థితియందున్నను,౧౪వ మునాటి యీ బొమ్మలు చెడుటవలన చిత్రకళాచరిత్రకారులకు తీరని లోప టిల్లినది. ఇవియే మంచిస్థితియందుండిన ట్టియంశములను వెల్లడిజేసి యుండె ఆకాలమునందు దేవాలయపు గోడల చిత్రింపబడిన చిత్తరువు లన్నియు నటు డినచో నీకాలమున సింహళమంతయు గారముగ నుండి ప్రపంచమునంతను చియుండును. మన రచనను మరచి గ్యమున కర్మలము కాకయున్నప్పుడు దానికి వగచిన లాభమేమి ?

లు

దునెనిమిదవ శతాబ్దమునాటి చిత్ర కలదు. (శ్రీయుత మణీంద్రగుప్తగారు నది.) హిందూచిత్రశైలి యిందు కాన న్నను మునుపటి రచనామాధుర్యము, త్రత, జీవకళ కానరాకున్నవి. ఉన్న



దైనను అత్యల్పము. దేవాలయపుగోడల నలం కరించుట కేవో కొన్ని చిత్రములను వ్రాయిం చుట పరిపాటియయ్యెను కాన నిట్టి బొమ్మలు రచించుట కలిగెను. ఈతరగతికి జెందిన చిత్ర ములు కాండి, మాతలి, దంబాల మొదలగు స్థలములందు కానవచ్చుచున్నవి.

హిందూదేశమున నిప్పుడుజరుగుచున్నట్టి ప్రయత్నములను సింహళ దేశీయులు చేసి చిత్ర రచనయందు తమ వ్యక్తిత్వమును, ఆత్మగౌర వమును కాపాడుకొందురుగాక!

# పూర్వస్మృతి

అవ్వారి సుబ్రహ్మణ్యశా

## ఎండ్లూరు

నీ మట్టిలోఁబుట్టి నిఖిలదేశంబుల వెలిగించియుండేఁగా తెలుఁగువెలుఁగు
నీ నీట తేటమై నానాస్థలంబుల నాక్రమించెనుగదా ఆంధ్రకీర్తి
నీలోని గాలిలో లీలమై పలుచోట్లఁ జెంగలించెనుగా త్రిలింగదీప్తి
నీ పైరుపంటల నిగ్గయి యెల్లచోఁ దనరారియుండెగా తెనుఁగుశక్తి
ఏ జెముడుపొదలలోన నిమిడి దాఁగి యుండెనో యిప్పుడల్ల నీయుచ్ఛ్రియంబు
రామచంద్రరాజేంద్రుని రామభద్రు భూరమణుఁ గన్నతల్లి! యెండ్లూరు! పల్లి!

ఒంగోలు రాజుల యుద్ధతి వినుచునే ఫాదుషా వడవడ వడకిపోయె
ఒంగోలురాజుల యుగ్రత గనుచునే వెంకటగిరి బిగి వెరిగిపోయె
ఒంగోలురాజుల యున్నతి మనుచునే *భాంజి శౌర్యోన్నతి ప్రబలిపోయె
ఒంగోలురాజుల సంగాతియగుచునే తెలుఁగు పౌరుష మిల దెలిసిపోయె
నంచుఁ బ్రజనాలుకలె యాకులగుచునుండ-హృదయలేఖినులఁ లిఖియించి చదు
కథలెకాని పుస్తకములు గానరావు పేరుమోసినదాన వెండ్లూరుపురమ!

పుడమివేల్పులకు నీపుత్రులొసంగిన రమ్యమహాగ్రహారముల పేర్లు
జంగముకథలలో శృంగారపూరమై పాడుచునుండెడి వీరరసము
తాతలనాటికథల్ చెప్పుకొనుచుండు కులవృద్ధుల బెడంగు గలుగునుడులు
క్షాత్రప్రియుల్ మదిఁ స్మరియించుకొని శిరశ్చలనంబుతోఁ జేయు శ్లాఘనములు
నీదుచల్లని కాన్పున నెగడినట్టి పౌరుషౌదార్యరేఖలఁ బ్రస్తుతించు
పోవునో యేమొ నీపేరు పుడమి విడిచి శూరగర్భ వౌకప్పు డెండ్లూరు తల్లి.

* భాంజి యన బెండపూఁడి భాంజి యను నొక యాంధ్రబ్రాహ్మణశూరుఁడు. బాపట్లతాలూకా టూరు కాపురస్థుఁడు. ఒంగోలు రాజులకు సంగడీఁడు.

# ...య సంగీతశాస్త్రాధ్యయనమునకు ప్రవేశిక*

హులుగురు కృష్ణాచార్యులుగారు
[భారతసంగీతశాల, హుబ్లీ]

[అనువాదకుడు: కొంపెల్ల జనార్దనరావు గారు]

...దాసు సంగీత కళాపరిషత్పత్రిక నుండి—

...రతీయసంగీతసంప్రదాయము క్రీస్తు పూర్వ ...బయలుదేరినది. అది వైదికయుగమునుండి ...దనుటకు వైదికవాఙ్మయమగు బ్రాహ్మణ ...సూత్రములు, ప్రాతిశాఖ్యములు మనకు నిదర్శ ...చున్నవి. అనగా నేటివలె నంత ఉన్నత ...వస్థ నది యలరారుచుండెడిదని కాదు; ...ప్రవంతి పుట్టుక నస్పష్టముగ నచట పట్ట ...నాడు మొదలది నేటి కనేకమార్పులు, ...ందుచువచ్చినది.

... మనకు తెలియురీతిని ఋగ్వేద మెల్లకాల ...త్తానుదాత్తస్వరములతో ఉచ్చరింపబడుచు ...ప్పుడు పరాసరిగా పఠింపబడుచుండినట్లు ... వారి పఠనపద్ధతివశమున ఇతరులకంటె ...ఉత్కర్ష కలిగెను; ఇట్లు కాలక్రమమున ...ఉచ్చావచస్వరవిశిష్టపఠనక్రమమునే అవలం... ఈ విధానము ఇంకను కొనలు సాగినది. ...మన పఠనమునకు 'ఆర్చిక' మని పేరు; ...ను దానికి 'గాథిక్య' మని పేరు. ఇటు ...ము నిల్లరు నవలంబించిరి. ఈ విధము ...డినది, యజ్ఞకర్మల నిర్వహించు 'హోతృ' ...ద్గాతల'కును క్రియాకలాపముల భేదము. స్వరము ...ంటె నెక్కువ వాడుక చేయు ఈ నూతనాభి ...క్యకము 'సామిక' యని పేరు. ఋగ్వేదము ...త్రకము; సామికలు ఇంక నెక్కుడుస్వరములు ...చు తమకల్పమును పెంచుకొనెను. ఇట్లు ...రి, పంచస్వరి, షట్స్వరి, సప్తస్వరి గాయనము' ... తుది (సప్తస్వరి) రీతిలోని సప్తస్వరములును ...త్కృష్టము లేక కృష్టము, ప్రథమము, ద్వితీయము, తృతీయము, చతుర్థము, మంద్రము, స్వరితము లేక అతిస్వరము' అను పేర్ల బరగుచుండెడివి. ఈ క్రమము సాగను సాగను, ప్రాయశః ఒకానొకస్థానమున చతుస్స్వరతంత్రి ఒకశ్రుతితో మేళగించి చాల శ్రుతి పేయముగ నున్నట్లు పొడగట్టియుండును; ఈ స్వారస్యమున కుత్సాహ మినుమడింప, వారు ఇంక నిట్టిస్వరములు గైకొని రెండుచతుస్స్వరతంత్రులను, ఒకటి హెచ్చుది, ఒకటి తగ్గుది, భర్తిచేసిరి: అనగా సప్తస్వరయుక్తమైన ఒకస్థాయి పూర్తిచేసిరన్నమాట.

ఇది కాక 'సామము'న కొన్ని (౭ మొదలు ౧౦ వఱకు), 'సంగతులు' ఉన్నవి. అవి యించుమించు మన గమకములను (వికార, విశ్లేష, వికర్షణ, అభ్యాస, విరామ, స్తోభములను) పోలియుండును.

ఈసందర్భమున కొన్నివిషయములు చెప్పదగును.

ప్రాథమికావస్థలలో నొకప్పుడు, ఒకస్వరముతో శ్రుతి గలిపి చదువుట చాల ఇంపుగ నున్నట్లు గుర్తించియుందురు. (ఇదే 'వాదిత్వ' మూలసూత్రము.)

స్థిరనాదము గల చతుస్స్వరతంత్రి శ్రుతి (షడ్జ) స్వరముతో వివిధసంబంధములలో మేళము నెఱపుచు, సుఖము కలిగింపజాలును. (అనువాదిత్వ సంవాదిత్వములు; గానము లేక ఆలాపము.)

చతుస్స్వరతంత్రిలోని మిక్కిలి పెద్దస్వరమును, మిక్కిలి చిన్నస్వరమును గ్రామములోనెల్ల సంవాదము కూర్చుటకు ప్రధానములైనవి. (సంవాది.)

తుదిస్వరములు రెండును * గూడ శ్రుతి(షడ్జము)తోను, దాని అష్టమము (వాది)తోను సంవాదిత్వము గలిగినవయ్యు, పరస్పరము మైత్రీలక్షణము లేమిని విభి

---

*అనగా, మొదటి తంత్రి తుది స్వరమును, రెండవ తంత్రి తొలిస్వరమును కాగలయును.—అను

న్నములై యుండును. ('సంవాద ద్వయము,' లేక 'షడ్జ పంచమభావము': స్వరాంతము.)

స్థిరపరిమాణముగల ఒక్క అంతరము హెచ్చుది గాని, తగ్గుది గాని రెండుతంత్రులకును పైని గాని, దిగువను గాని చేర్చినచో, అంత్యస్వరముతోను, దీనికి విలోమముగను, సామరస్యము గలుగును.* (ద్విగుణభావము.)

రెండు చతుస్స్వరతంత్రులను, ఒక స్వరాంతరమును కలిసి ఒక్కస్వరగ్రామము పూర్తియగును : మరి ఆ చతుస్స్వరతంత్రులు కలిపి ప్రయోగించినచో సామరస్యముతో పల్కును.—'వాది'.

సాపత్యమునుబట్టి చూడ, క్రిందిది గాని, పైది గాని యేదో ఒక్క షడ్జమునే ఉపయోగించుటకు మారు రెండును ఉపయోగించినను, క్రిందిది గాని, పైది గాని మఱొక్కస్థాయిని పహో చేర్చుకొన్నను, ఆ మేళనస్వారస్యమే అనుభవమగునని, ఋజువగును. (అనగా, 'ఆవర్తము'ను, 'మంద్రతారావ్యపస్థ'యు.)

పైదానింబట్టి విశదముగున దేమనగా, చతుస్స్వరతంత్రిలోని రెండు సంవాదిస్వరములును విలోమముగ పరీక్షించినను విలువయును, స్వారస్యమును మారక యుండును. ఏలయన, 'ప'కు పై 'స'తో గల సంబంధము కాని, 'స'కు పై 'మ'తో గల సంబంధము గాని మారలేదు; కనుక 'మ'కు పై 'స'తో గల సంబంధము గాని, 'స'కు పై 'ప'తో గల సంబంధముగాని మారదు. కావున ఈ దిగువ సమీకరణము లేర్పడును:—

సమ + పస + మప = ౧ స్థాయి
సమ + మపస = ౧ స్థాయి
సమప + పస = ౧ స్థాయి

అనగా, రెండు చతుస్స్వరులును, ఒక స్వరాంతరమును కలిసి ఒకస్థాయి.

కలిపి ప్రయోగించిన, స్థాయ్యంతరమైత్రీస్వారస్యముతో వినవచ్చిన స్వరములను 'వాదు' లనిరి: ఇక గ్రామమున నాల్గవ, ఐదవ స్వరముల మైత్రి గ... 'సంవాదు' లని.

'సంవాదద్వయ'పద్ధతిని మేళవించి స్వరప్రస్తా... (మూర్ఛన, చేయగా, రెంటిలో ఒకషడ్జమును విడిచి శ్రుతులు ప్రాప్తించినవి, యిరువదిరెండు. ఇట్లు స్వరగ్రామ... నిర్ణీతములైనవి. ఈ ప్రస్తారము ప్రాచీనవైదికవాఙ్... మున నెప్పటను విశదముగా తెలియరాదు ఇది 'ఋక్... శాఖ్య,' 'యాజ్ఞవల్క్య శిక్షా', 'పాణినిశిక్ష'ల నుండి బయలుదేఱును: అందు 'స, మ, ప'లు స్వ... లని, అనగా సానభవ (సంవాద) సంబంధము క... యున్నది. ఇక మరి భరతునివఱకును ఏ గ్రంథము... ఈ 'సంవాదద్వయ' భావము వికాసముగాని, తత్ప్రయో... ముగాని కానరాదు.

స్వరపద్ధతికిని, మేళపద్ధతికిని చెందిన ప్ర... యంతయు భరతుడు కూర్చిపెట్టినాడు. తరువాతి గ్రంథకారుడును భరతమత సంప్రదాయమును ప్ర... టింపలేదు. ఆది యిపుడు భారతదేశమంతటను వా... లోని కెక్కిపోయినది. 'రాగాలాపము'నకు 'స్వరసం... దము'ను వినియోగించు రక్తిసూత్రము ననుసరించి ... తుడు ఒక సమగ్రలక్షణమునే నెలకొల్పెను.

రానురాను, ఈ సంప్రదాయమునే యుక్తమని 'సంగీతరత్నాకర' మను గ్రంథమున నిశ్శఙ్క శార్ఙ్గ... డును, చతురుడగు నాతని వ్యాఖ్యాత చతురకల్లి... పండితుడు స్థిరపఱిచిరి.

తరువాతి గ్రంథకారులందఱును భరతశార్ఙ్గదే... పరిభాషతో తమ తమ సొంతములగు సం... సంప్రదాయముల వివరించుకొనుటలో నెన్నో తప్పు... చేసిరి. అర్థము చేసికోలేక భరత శార్ఙ్గదేవుల గ్రంథము... మూలద్రోసినచో, ఇక నిట్టి యుత్కృష్టగ్రంథము... ఈకాలమున సంపాదించుట దుర్ఘటము. ఇక చాల ...

* ఇది ఇట్లుండవలయునేమో: స్థిరపరిమాణముగల ఒక్క అంతరము హెచ్చుది మొదటితంత్రికి (చతు... స్వరమునకు) పైని గాని, తగ్గుది రెండవతంత్రికి (ఆ తంత్రిలో మొదటిస్వరమునకు, అనగా పంచమమునకు) దిగువ... గాని చేర్చినచో, సదరు రెండుస్వరములకును ఐక్యముకల్గును—అని.—అను.

ఏ ఈగ్రంథములవలె జనాదరము పడయగల యొకటి లభింపగలదని యాశ లేదు.

అర్థము చేసికొలేక అట్టి గ్రంథములు మూలనుంచుట మనిషి కాక మతముగా బయలుదేరినది. ఈవిష దక్షిణమునకంటె ఉత్తరమున ఎక్కువ అనుభవ ఏలయన, భరతగుతము కడచిన మూడుశతాబ్దు తక్కిన ప్రాంతముల నంత గొప్ప ప్రభావ వెలుగలేక పోయినప్పటికిని, దక్షిణమున నిలిచియున్నదిగదా! దక్షిణదేశప్రభావాని ఒక ప్రామాణ్యమును ప్రకటముగ నవలంబించుచు, క్రమే సంప్రదాయపటిష్ఠత గలదని యెంత నను, తన మహదాశయమును తగు రీతి నను అపడిగట్టును వ్యాపింపజేయుటకు యత్నింప వున నది దేశమున నేమూలనోవసించు కొందఱు ల ప్రత్యేకగుతమట్లు నిబద్ధమైపోయినది. ఔత్త సంగీతము సాంప్రదాయిక క్రమమున ఉన్మీలితము వ, దక్షిణభారతమును సహా అగ్గపఱుచుకొన్న పఱుచుకొనుచున్నది.

గోపాలనాయకుడ, అహోబలుడు, భావభట్టు, డు లోనగు దాక్షిణాత్యపండితు లనేకులు, శమున మహమ్మదీయప్రభువులకడనో, హైందవ డనో నియుక్తులై యుండినను, సంగీతశాస్త్ర లు రచించి సంగీతవిద్యావాటికను కర్ణాటము నిలబెట్టిరి. ప్రాచీన సంగీతకళాపారిశుద్ధ్యమును ళావళిచే కాపాడ పాటుపడిన భరత, శార్ఙ్గదే, లును కర్ణాటమువారే. ప్రతికర్ణాటగాయకుడు నీయులనుండియే తనసంప్రదాయ మవతరించిన కొనువాడయ్యెను, వారి మతము తెలియునా త్రము తనకు తెలియదని వెంటనే యొప్పుకొన డుట కడుంగడు శోచనీయమగు విషయము.

ఔత్తరాహ దాక్షిణాత్యపద్ధతుల రెంటికిని సమ గు సంగీతకళారీతి నేర్పఱుపవలెనన్నచో, ఆ ము శ్రద్ధతో జదివి, ఉభయవ్యవస్థలను లెస్సగ ని, నేర్పుమై నొకొక్కకదాని గుణాగుణములను కనబఱుచుచు కళాతత్త్వమును సరిగ నిరూపింపవలెను ఉదారమగు బుద్ధితో, పక్షపాత మెఱుగని మనసుతో నిది కావింపవలెను. ప్రతియుక్తియు సహేతుకమై, సలక్షణమై ఒప్పియుండవలెను.

ముఖ్యముగ గమనింపదగు విషయము లేవన:— వాడుకలో నున్న గేయరచనలు, వాని స్వభావము; ఉభయవ్యవస్థల తాత్పర్యము. పరమార్థము; కళ ఏ నియమములపై ఆధారపడియున్నది, అది ఏ మార్గముల నభివృద్ధి గాంచవలయు నను విషయము; సంగీత వాఙ్మయమునకు, సంగీతవిద్యకు గల ప్రాపు; విదేశీయ గాంధర్వముతోడను, విదేశీయవాదిత్రములతోడను గలిగిన సంయోగమువలని మార్పులు;— ఇవి.

నేటి హిందూస్థానీ సంగీతమున మూడు రీతులున్నవి. అందు దేని ప్రతిష్ఠ దానిది. ప్రాచీన సాంప్రదాయికత నెంతవఱకు పరిశుద్ధముగ నిలుపుకొన్నవో దానినిబట్టి కొంతయును, మఱి స్థిరవ్యవస్థ, ఇది ప్రత్యేకమిది యని పొల్పగు వైఖరీ ప్రామాణ్యము నెంతవఱకు గలవో దానిని బట్టి కొంతయు వాని ప్రతిష్ఠ ప్రత్యేకమేర్పడుచుండును. ఆ మూడును ధ్రుపద (ధ్రువపద), ఖయాల, కవాలీరీతులని చెప్పుకొ వచ్చును.

ధ్రుపదములు కవితాసంపదతో నొప్పు ప్రాచీనతనుములగు గేయరచనలు. ఠుమరీలును ఆనాటి రచనలే. తరణములు, చతురంగములు, లక్షణగీతములు, స్వరావర్తములు—ఇవన్నియు ధ్రుపదరీతికి చెందినవే. ధ్రుపదమున సాహిత్యము సాధారణముగా ఈశ్వరస్తుతి, భక్తిమున్నగు ఉన్నతకల్పనలు గలదిగా నుండును. ఠుమరీలు కేవలము కృష్ణునెడల గోపుల గోపికలయు, బృందావనగోపికలయు నిర్మలస్నేహము కీర్తించును. ధ్రుపదముల సంప్రదాయము భరతునినఱకును దిగివచ్చినది.

ఖయాల్ రీతి ౧౭ వ శతాబ్దితో మొదలగును. టప్పారీతియు ఇంచుమించు ఈ కాలముననే మొదలగును. ఇది ఖయాల్, ఠుమరీరీతుల కూడిక. పిదప బొత్తిగ నవీన మగురీతి యొకటి తలచూపినది. ఇది కవాలీరీతి. దీనివలననే పుట్టినవి మిక్కిలి జనాదర పాత్రములగు

'గజల్' గేయములు. ఇవి చాలవఱ్ఱు ఉర్దూభాషలో గలవు. ధ్రుపదములందలి కూర్పు సంగీతశాస్త్ర గ్రంథములలో విధించిన లక్షణముల ననుసరించి కడు తీర్పుపొందికలతో వెలయుచుండును; వీని సంగీతమును ఉత్తమజాతికి చెందియుండును. 'సంగీతరత్నాకరము' న పేర్కొన్న శుద్ధవికృతజాతుల లక్షణము లిందు కాన వచ్చును; ఈశుద్ధవికృతజాతులే వెనుక నెనుక 'రాగము' లను పేర పిలిపించుకొన జొచ్చినవి. ఇక ఠుమరీ లన్ననో, సంకీర్ణ జాతి లక్షణములన్నియు దాల్చియున్నవి: ఈ సంగతి ఈ వ్యాసము తుదిభాగమున సాపితమగును.

ఖయాల్ రీతి వాడుకలోనికి వచ్చు పూర్వము, ధ్రుపదగాయకులు నేటివలెనే వీణ, సితారు, సారంగి లోనగు వాద్యములపై రాగాలాపము చేయుచుండెడి వారు. ఈ ఆలాపము శ్రోతలకు ఖయాలుగాన మంతటి గాఢమగు రక్తి నీయు నిచ్చును. దానికి లయ లేకపోలేదు. ఖయాలు లయక్రమమున విస్తరిల్లినట్లే ధ్రుపదీయుని ఆలాపమును విలంబిత, మధ్య, ద్రుతము లను మూడు లయ గతులను నడచుకొనెడిది; ఒక్కొకప్పుడు మృదంగము గాని, తబలాగాని అనుగమించుచుండెడిదికూడ. ఖయాలు రీతి పూర్ణవికాసము గాంచగనే 'నోమ్ తోమ్' అనెడి ఆలాపరీతి అంతరించినది; కాని 'బీన' మున్నగు జంత్రములు మాత్రము ఇంకను ఆరీతిని నిలుపబెట్టుచువచ్చెడిని.

కవాలీరీతి పారసీకరంజనములయు, భారతీయ రంజనములయు సాంకర్యము. భాషయు, కవితయు చిత్రమగు క్రొత్తరకమువి. రచన ఉర్దూ, పారసీక భాషల సమ్మిశ్రమములో నుండును. మఱి ఠుమరీల భాష కేవలము భారతీయము. ప్రత్యేకము గజలులన్న మహమ్మదీయుల కెక్కువప్రీతి: వానియందు సంగీతముకంటె తత్త్వములు, నీతులు ఎక్కువ ప్రధానముగా నుండును గనుక. కడచిన శతాబ్దిలో హిందీకవులు హిందీభాష యందు ఎన్నో కవాలీలు, గజల్లు నల్లిరి. ఈబానీ ఉత్తర హిందూస్థానమున, వంగమున, పాంచాలమున, ఘూర్జరమున, తుదకు మహారాష్ట్రమునను, చాలవ్యాప్తి గడించినది. దీనివలన 'శాస్త్రకట్టు' పాటవ్యాప్తికి దెబ్బ తగిలినది.

హిందూస్థానీ సంగీతము తనప్రాశస్త్యము గాపాడుకొనుటకు విదేశీయవాద్యముల ధాటివలన దాని హాని చేపడకుండుట యొకకారణము. కాని యిదియు కడచిన కథ అయిపోవుచున్నది. నాటకీయసంగీతము కంతటకు హార్మోనియము నుపయోగించుట యేనాడు మొదలైనదో ఆనాడే మన సంగీతమునకు క్షీణదశ పట్టిన దనవచ్చును. అది మన దేశీయవాద్యము లన్నిటికి స్వస్తి చెప్పి సాగనంపునది: అనగా మన సన్నిహితమైన దర్జా అయి, తిర్యగ్నిసంగీతమునకు మూలచ్ఛేద మన్నమాట. ఇంకొకలోటు ఏమనగా, సంగీతమున లక్ష్యము, విద్యను ఆమూలాగ్రముగ చర్చించుచు ప్రామాణికతతో దేశమును నడిపింపగల మంచి శాస్త్రగ్రంథ మొకటి లేదు. హార్మోనియమువలనను, ఇతరము లవలనను సామాన్యుల అభిరుచి యెంత చెడిపోయినను, నేటికిని ఆదర్శమై వెలుగుచు, అనుస్యూతమగు శాస్త్రీయసంప్రదాయము గలిగిన ఉత్తమజాతి సంగీతమగు ఖయాలు, ధ్రుపదరీతులయొక్క శిక్షితసంఘముమాత్రము తన అభిమానమును కోల్పోవజాలదు.

ఇక నేటికాలమున దక్షిణభారతీయ సంగీత మే స్థితియందున్నదో యించుక పరికింతము. హిందూస్థానీకి ఖత్తున కేదియో దీనికిని అదియే పరమాశయము; దానికి హితవగు సౌందర్యప్రాశస్త్యముతే దీనికిని హితవగును. కాని పరిసరములు, పరిస్థితులు దానివి వేఱు, దీనివి వేఱు. ఆలాపపద్ధతులందు రెంటికిని భేద మున్నది. ఉత్తరాది ఆలాపములో మొదట అతి చౌకముగా పోయెదరు; దక్షిణాదిని ఆ చౌకము కిట్టదు. ఇందు సాధారణముగా మధ్య ద్రుతలయలలో ఆలాపము నడుచుచుండును. హిందూస్థానీ ఖయాలు, ధ్రుపదములలోవలె ఇందు విలంబితములో గేయములు తక్కువ. ఉత్తమ రచనలగు కీర్తనలును, కృతులును గత రెండు శతాబ్దులలోను కూర్చినవే; అవి చాలవఱకు మధ్యద్రుతలయలలో పాడుచున్నారు. అవి ఒక నియతమైన పరిధులలో పాడుదురు; ఆలాపన నైపుణ్యము గాని, లేతకళల నగిషీ నేర్పు గాని చూపులేకు వీనిని వినియోగించుకొనరు.

ల్లవిమాత్ర విాలోపముల పూరించుకొనుటకును, సైపుణ్యములను సమ్మిశ్రము చేసి చూపుటకును వది. కాని అది అట్లు సార్థకమగుటలేదు.* పల్ల వాగ్గేయకారుల సంకల్పసామర్థ్యములవలనను—దగ్ధ్యములవలనను—ఉద్భవిల్లినవి కావు; కావున క్క-రాగములలో పాడుకోవచ్చును. కాని అది గుటలేదు.

త్తమువిాద ఒక్క విషయము మాత్రము వలెను: దాక్షిణాత్యమేమి, ఔత్తరాహమేమి, దతికి రాగ గానము — ఆలాపమును లయతో ర్పు—అదే పరిపాకస్థితి. అన్నిభంగులను పల్లవి ను బోలి కన్పట్టును; కాని ఖయాలునకు గల ఆ కుతనము, ఆ ఉందాతనము ఇంకను పల్లవిలోని లేను.

వర్ణములు రెండుఖత్తులకును నచ్చినవే. ఇవి రచ సెల్ల మిక్కిలి ప్రాచీనము లగుటయే కాక, ఆలా విస్తరిల్లుటకు తగిన లాక్షణికభంగు లన్నియు దు గలవు.

ఆరోహ-అవరోహములను, వర్జ్య-అవర్జ్యములను చినట్లే దాక్షిణాత్యసంగీతము రాగలక్షణములుగా ములలో పేర్కొన్న పది పండ్రెండుభంగులను—ంవాదిస్వరములు, అల్పత్వ దీర్ఘత్వములు, అంశ , పూర్వాంగ ఉత్తరాంగములు మున్నగువానిని, చిన బాగుండును.

ఏ సంగీతసంప్రదాయము వికాసమైనను ఆసంప్ర ము ఎట్టి వాద్యములు కనిపట్టి తానుపయోగించు న్న దను అంశముపైగూడ, అంత ప్రత్యక్షముగ న్నను, ఆధారపడియుండును. జంత్రగానము, గాత్ర నొండొంటి ప్రభావమునకు పాల్పడుచుండు నను ము చక్కగా విదితము కావలెను.

వాదిత్రము లన్నియు నాలుగుతెగలుగా విభజింప . 'తతములు'—సాగదీసినవి (తంత్రులు కలవి); లు'—ఆవరించినవి (మద్దెలవంటివి); 'ఘనము గట్టివి, గుల్ల లేనివి (తాళములవంటివి); 'సుషిర ములు'—చిల్లులు దొలిచినవి (మురళివంటివి). 'శుష్క-ము' లనియు, 'స్నిగ్ధము' లనియు కూడ ఏర్పఱుపవచ్చును. తాత్కాలికోపయోగమునకుగా మోటుగా తయారు చేసినది 'శుష్కము'. 'స్నిగ్ధ' మనునది మరల ముద్విధము చేయవచ్చును: 'గీతానుగము', 'నృత్తానుగము', 'ద్వయానుగము'—అని. ఇది ప్రాచీనవర్గీకరణము. ఇది మన కీ చర్చలో సాయపడును.

గానము ముఖ్యముగా శ్రావ్యధ్వనులను అందముగ కూర్చనేర్పు. నృత్యము లయానుగతముగు అంగవిక్షేపమును తెలుపును. ఈ రెండు విద్యలసమ్మేళము 'సంగీత' మనిపించుకొనుచున్నది. ఇది ఇప్పటిఅర్థమునుబట్టి తప్పక నృత్తగీతముల సమ్మేళమును ద్యోతనము చేయకున్నను, కలత్వము (మాధుర్యము-రంజనము), లయానుగతి అను ద్విస్వభావమును వ్యక్తముచేయును. 'గీతానుగ', 'నృత్తానుగ', 'ద్వయానుగ' వర్గీకరణము దీనింబట్టియే. మృదంగమును, తాళములును నృత్తానుగములు. మురళి మున్నగు వాద్యములు, కమానుతో వాయించు తంత్రీయుక్తము లగు వాద్యములు గీతానుగములు. లయ వేయుట కీవాద్యములకు తంత్రులు కాని, మఱొకయేర్పాటు కాని యేమియు నుండవు. వీణ, సతారు మున్నగునవి ద్వయానుగములు. కనుకనే ఈవాద్యములు ఎల్లపుడును, వేదకాలమున సహా, ప్రాశస్త్యగౌరవములతో నలరారుచున్నవి వీణలును మరల 'సకళలు', 'నిష్కళలు' అని రెండుతెఅగులుగ విభజింపవచ్చును. సకళలు శ్రుతితంత్రియు, మేళతంత్రులును గలవి. ఇదే వాద్యముల నెల్ల మేలుబంతి: ఇట్టిదాని కుదాహరణము సతార. సారంగి గాత్రగానము ననుగమించుటకు అనువైన వాద్యము; గొప్పనాదము గలది. దానికి శ్రుతితంత్రితో గలిసి ౨౮ మొదలు ౫౦ వఱకు మేళతంత్రు లుండును; లయఘాతములు కమానుచే కడు మెలకువతో మీటుచుందురు. ఇది ఇంతవ్యాప్తియం దుండుటలో అనౌచితి యేమియు లేదు. అది క్రొత్తగ కల్పట్టిన దేమి కాదు; వేదకాలమునాటి 'వానము'నకు, లేక శార్ఙ్గదేవుని ఐతిహాసికకాలమునాటిదగు ౨౧ తంత్రుల త్తకోకిలకు ఒకవికృతి. ఇంకను 'రబాబ్', 'సారోద్',

'స్వరమండల', 'సూరిసింగార' మున్నగు వాద్యవిశేష ములు ఉత్తర హిందూస్థానమున గలవు.

వాద్యముల చరిత్రము చాల మచ్చునైనది. అది కొలదిలో వ్రాయుటకు శక్యము కాదు. పూర్వకాలమున మీటు వాద్యములను 'ఆఘాతు'లనియు, కమానతో వాయించువానిని 'ధన్వ్యా'లనియు చెప్పెడివారు. 'వాన' మని చెప్పిన నూఱుతంత్రులు గల వాద్యము మన 'స్వరమండలము'వలె నుండెడిదని అనుమానించిరి; కాని అది కమాను (ధనువు లేక కోణము)తో వాయించెడివారని చెప్పియున్నది. దీనివలన ఒకటి తేలును: అన్ని తంత్రులు ధనుస్సుతో వాయించుటకు వీలు కాదు గాన కొన్ని తంత్రులు పాడుటకును, కొన్ని మేళనము కొఱకును వాడియుందురు. ప్రాచీన వీణకు ఏడు తీగ లుండెడివి కాన దానికి 'సప్త తంత్రి'యని పేరు. నేటి సతారు ఆసప్తతారకు, లేక సతతారకు, వికారము; దీనికిని వాద్యతంత్రు లన్నియే కలవు. వీణకు వేఱు పేరుగూడ గలవు: ఏవన,—ఏడు తీగలు గలది 'చిత్రా'; తొమ్మిదితీగలు గలది 'విపంచి'. 'చిత్ర'మీదనుండియే 'చితారా', 'సితారా', చివరకు 'సితార్' భ్రష్టరూపములు. చిత్ర సితారయినది; సప్త తార సతారయినది: రెండును ఒకటే. పూర్వము వీణకు, అనగా సతారుకు, మిత్రతంత్రులు (మేళతంత్రులు) లేవు. ఈమధ్య 'తరఫ్' (మిత్రతంత్రులకవి) గల వాద్యములకు చాలగిరాకి యేర్పడినది. ఇది యుక్తమార్గమున వెలయు అభివృద్ధియేకూడ. 'సంగీతరత్నాకరము' ఆఱవ ప్రకరణమున వర్ణించిన 'రుద్రవీణ' నేటి 'బీనకు' సరిగా సరిపోవును. రామామాత్యుడు తన 'స్వరమేళకళానిధి'ని క్రీ. ౧౫౫౦ లో రచించెను. అందలి 'రుద్రవీణా'వర్ణనము సోమనాథుని 'రాగవిబోధ'లోని వర్ణనకు సరిపోవును. ఉన్న భేదమెల్ల శ్రుతిచేసికొనుటలోను. భరతుని కాలములో సప్తస్వరములకును వరుసగ సప్త వాద్యతంత్రులను అమర్చి పెట్టువారు. ఈసంగతి రత్నాకరమున వర్ణనమువలన రుజువగును.

శార్ఙ్గదేవుడు రుద్రవీణ నిర్మాణమును తెలియజేయుచు, శుద్ధస్వరములకు ౧౨ మెట్లు రెండు స్వరసప్తకముల ధర్తికి అమర్చవలెననియు, ఇక వికృతస్వరము లెన్ని కావలసినను వానివాని శ్రుతిసంఖ్యనుబట్టి, ధ్వని ప్రమాణమునుబట్టి సరియగువిభాగస్థానముల సర్దుకోవచ్చుననియు చెప్పినాడు. దీనివలన తేలిన దేమన,—భరతుని కాలము రాగములు (ఇప్పటినిర్వచనము ప్రకారము) వాడుకలో లేవు; తత్స్థానే శుద్ధ, వికృత, సంసర్గజ, సంకీర్ణ జాతులు వాడుకపడుచుండెడివి. శార్ఙ్గదేవుడు ప్రాచీనమగు భరతుని గ్రామమూర్ఛనాపద్ధతిని వివరించుటయేకాక, 'మే పద్ధతి' (లేక 'జాతిసాధారణము')అను ఒక క్రొత్త పద్ధతికి త్రోవ చూపినాడు. అది వేంకటమఖి చేతిలో తన 'చతుర్దండిప్రకాశిక' యందు సూక్ష్మకల్పముగ సాధించెను. రత్నాకర కాలమున వాద్యగానము అంత పరిపక్వత గాంచ లేదని యిచట కొందఱు ప్రతివాదము చేయుదురు. ఇది అసంగతము. శార్ఙ్గదేవుడు తన నాటికి ప్రాచీనమగునట్టియు, నాటికి వాడుకలో నుండినట్టియు శాస్త్రశక్తి, కలకును ప్రయోగశక్తికలకును చాల నేర్పుతోను, మెలకువతో సమతుకు పొందించినాడు అతని గ్రంథము సూత్రచయమునకు నిండైనవివరణము; ప్రయోగమునకు (సాధకమునకు) తూణమైన ప్రమాణము. వేంకటమఖి ౭౨ మేళముల మాట యిందుకు తార్కాణ. రుద్రవీణ విషయమున నాతడు ౧౨ మెట్లకు మాత్రమే అవకాశ మిచ్చినాడు. భరతుని శ్రుతి మేళన విధానము నవలంబించి ఆ ౧౨ మెట్ల పైని అన్ని సంగతులను నిర్దుష్టముగ పలికించవచ్చును. దానికిని నేటి అభ్యాసరీతికిని సహస్రాంతర మున్నది: మనకు గ్రామ మొక్కంటికి ౧౨ స్వరము లున్నవి గాన సారికపై మొత్తము ౨౪ మెట్లున్నవి. వారు ౧౨ సరకట్లతో నెట్లు గడుపుకొనిరా యనునది నేటివఱకు చిత్రముగ నున్నది. సప్తతంత్రినిగూర్చి పైచెప్పినది జ్ఞప్తికి తెచ్చుకొన్నచో ఇది యెట్లు సాధ్య మయ్యెనో సుబోధముగా బోధపడును.

స్వరగ్రామమున వేర్వేఱు స్వరములు ఒక్కొకటి చొప్పున వరుసగా షడ్జముగ గ్రహించుచు గ్రామసంపూర్తికిగా తరువాయి స్వరములు ఆవృత్తిచేసికొనుచు పోవుచో వేర్వేఱు 'దాటులు' ప్రాప్తించునని మనకు తెలియును. సరియగు 'మూర్ఛన' పదయోజకు ప్రాచీనులీక్రమమునే అనుసరించిరి. భరతుని శుద్ధసప్తకస్వరముల పరిమాణములకు సరిగా ౭ తంత్రులను బిగించుటచే ౭

ను సరిగా పుట్టెడివి. మెట్లకు పైగా (అంటక) తీగలును ఏడుస్వరములును పలుకుచు ఒక్క పూర్తిచేయును; చివరితీగ ౧౪ మెట్లపై పై యులను పలుకును: ఇట్లు మొత్తము మూడు ౨౨ స్వరములు భర్తీయగును. నే నెఱిగినంత పూర్వు యీయేర్పాటును ఆధునికు లెవ్వరును చేయలేదు. వీరికి కొలదివాద్యతంత్రులతో, ప్రకృతి సరిగా ౧౨ మెట్ల నమర్చుకొని చేసికొన్న విధానమున ప్రాచీనవిధానమువాసన యైన నెట్లు గనుక ?

టియేర్పాటునకును, నేటియేర్పాటునకును గల డింక స్పష్టమే. నాటియేర్పాటున ౭ వాద్య ను, ౧౪ సరకట్లును ఉండెను నేటియేర్పాటున తంత్రులును, ౨౪ సరకట్లను ఉన్నవి. ప్రాత తంత్రు లెక్కన; క్రొత్తపద్ధతిని ౧౦ మె . సనాతనపద్ధతికి సున్నితముగ పదహారున లసెను; అధునాతనపద్ధతికి సున్నితముగ పదను వేట్లు కావలయును. ఈజ్ఞానము మనకు చాల పరిష్కరించుటకు తోడ్పడును; అందు కొన్ని పరామర్శింతుము. నేటి మన శ్రుతివిధానము రకారుని పరిశ్రమమువలన మనకు ప్రాప్తించిన పుడకు రత్నాకరమున పలసినంత నిదర్శనము

దక్షిణభారతమున దేశీయవాద్యములు వివిధత్వ గాని, జటిలత్వమున గాని అంత యెక్కువ దలేదు. దక్షిణమున నేడు వాడుకలో నున్న ర్వపు కచ్ఛపీవీణకు కొంచెము సంస్కరించిన . భరతశార్ఙ్గదేవులు పేర్కొనక, తరువాతిరచయి మనాథునివంటివారు పేర్కొనుటచే, నిది రుద్ర దప నేర్పడిన రూపమై యుండవలెను. గాత్రము ప్రక్కవాద్యముగా నుండుచున్నది. ఫిడేలు కాదు; పశ్చిమమునుండి మనకు దిగుమతి దీనియందు పై జెప్పిన (ఉత్తమవాదిత్ర) లక్ష ణ్నియు లేవు. ఇది చాలు తలుచుగ కంపము నుపయోగించుచుండును. దీనిధ్వని స్వభావమున మృదువుగ, బిగ్గరగ కాక, కొంత కఠినముగ, సూక్ష్మముగ నుండునని చెప్పుదురు. దీనికి శ్రుతితంత్రులు గాని, మేళ తంత్రులు గాని ఉండవు. ఇది యెప్పుడు, ఎందులకు మన సంగీతమున ఉపయోగములోనికి రాసాగినదో రూఢిగ తెలియదు. దక్షిణమున సంగీతప్రియులకు దీనిపై ఇంత గొప్ప మోజుండుట అసాధారణమగు విషయము. దక్షిణ దేశమున సామాన్యముగ ప్రక్కవాద్య మిదే.

ఇక సరస్వతీవీణనుగూర్చి ఒక్కమాట. ఈ వాద్యమున స్వరములు రుద్రవీణయందువలె గాని, హిందూస్థానపు బీనయందువలె గాని అంత దీర్ఘానురణనము లేక, కొంత చప్పున అంతరించిపోవును. గమకములు తీగ బిగువులవలన పొందుపడును గాని మెట్లవినియోగమువలన కానే కాదు; ఇక అలంకారములో, తద్రాగోచిత స్వరములవలననేకాని వాయించునపుడు లొంగుబాటుగా చేతికి తగలు ఏవో ప్రక్కమెట్లు ఆదేశము చేయుటచే పొసగనే పొసగవు. ఈ రెండుసూత్రములును వైణికులు తలుచుగా నేమఱుచుందురు. మఱియు, గమకములు ఏ స్వరములసమాహారముతో నేర్పడునో ఆస్వరముల అక్షర చిహ్నములలో ఆగమకముల తెలియజేయుటచే ఆస్వరములను పలికినమాత్రమున గమకము లేర్పడు నను తప్పు అభిప్రాయము ఇంకను కమ్ము దెచ్చుచున్నది. నేటికాలమున ఈ రెండువిధములగు అభ్యాసములందును (గమక, అలంకారములందు) గల వేఱుపాటు అవగతము కాలేదు. సంగీతగ్రంథములయందు రెంటిని స్వరాక్షరములతో ఒక్కరీతినే తెలుపుదురు. మఱి ఈ అక్షరప్రాతినిధ్యము వలన సంగీతము మాఱుత్రోవల బట్టుచున్నది.

ఈ పద్ధతులపైనే అభ్యాసము సాగించుచుండిన, భారతీయసంగీతమునకు వైకల్యము వాటిల్లగలదు. నిజమగు సంగీతము గ్రంథములవలన రాదు. అది గురుముఖతః నేర్చుకొనవలసినది: గురువే దాని విధానమును, ఆంతర్యమును యథాసిద్ధిగ ప్రసాదింపగలడు. చిహ్నాక్షరగత మగు సంగీతము, ఎటు వచ్చి, విద్యార్థికిగాని, అధ్యాపకునకు గాని ధారణకు ఊతకోలగ నుండుటకు కొంత, ప్రమాణములు చూచుకొనుటకు కొంత పనికివచ్చును.

మురళి తన సహజరూపమున మార్పు నొందక, పూర్వ మెంత ఉపయోగపడెనో ఇప్పుడు నంత ఉపయోగపడుచున్నది. ఉత్తరహిందూస్థానమునకంటె దక్షిణమున నిది యెక్కువపట్టుదలతో వ్యాసంగము చేయుచున్నారు.

నృత్యమువలెనే మృదంగవాద్యము ను ఒకస్వతంత్ర విద్య గనుక, దానికి సంబంధించు సమస్త ముఖ్యవిషయములను వినిర్ణయించుపని సమర్థులు పూనుకో దగును. వారు కావించు సూచనలు అమలులో పెట్టవలెను. ఈ విధముగ ఆవిద్య పురోభివృద్ధి గాంచవలెను.

హార్మోనియమునుగూర్చి గాయకులకు, పండితులకు అందఱకు ఐకకంఠ్యమే: ఐరోపీయసమశ్రుతి స్వరావళి (the tempered European scale) కలది కాన అది ఉపయోగింపరాదని. స్వాభావిక మగు సవికృతి గ్రామమునకు జెందిన ౧౨ స్వరములకును శ్రుతిచేసినవే యైనను దానిశ్రుతులు స్థిరముగ అతికవేసిన వగుటచే, వివిధగమకములులేనిదే నిలువజాలని భారతీయసంగీతమునకు బొత్తిగా నిరుపయోగములు. వ్రేలు మెట్లపైనుంచి కదల్చుటతో ఒకస్వరము అంతరించును, వేఱొకటి ఉద్భవిం మన రాగపద్ధతికి జీవాతువైన క్రమాశ్లేషమునకు, భ క్రాంతికి ఇందు కల్పన లేదు.

వాద్యప్రయోగరీతి నభివృద్ధిపఱుచుకొనుటకు కొన్ని సిఫార్సులు చేయదగును: స్వతంత్రముగ వాద్య నవలంబించువారికి ఉత్తరదేశపు వీణయు, దక్షిణ వీణయును; అభ్యాసకులకును, స్త్రీలకును దిల్ యును; యువకులకు మురళియును; ప్రక్కవాద్యము సారంగియు, ఈశరాజును; ప్రకీర్ణప్రదర్శనములకు మండలము, జలతరంగము మొదలగునవియును బాగుం

నే నిట సంగీతము ప్రారంభదశ జాడలు యత్నించితిని; దానిప్రాచీనత వివరించితిని; అది గ అవస్థాక్రమము సూచించితిని. ఔత్తరాహ,దాక్షిణా విధానముల తులనాత్మక పరామర్శము, వాద్యపరిణా చరిత్రము, నేటిసంగీతమునకు దాని యెడ గల అను ధమును వెంకటి పేరాలలో ముచ్చటింప యత్నించి

---

# నాజన్మభూమేదిరా?

తురగా వేంకటరామయ్యగా

౧

నా జన్మభూమేదిరా?
బాపూజీ
నాముద్దు తోటేదిరా?
నాకోకిలమ్మేదీ? నాపూలమేడేదీ?
నారాణి వీణేది? నావలపు పాటలేవి?
కలలోని సిరులాయెరా
బాపూజీ
కాఱడవి పాలైతిరా!

౨

నాయేటి లంకేదిరా?
బాపూజీ
నా యాలమందేదిరా?
నామేని పొంగేదీ? నామనసుపరుగేదీ?
నాగస్వరమ్మేది? నా యేలపాటేది?
కాలమిట్లె పోయెరా
బాపూజీ
కన్నీరే యేరాయెరా!

3

ఏనాటి కథలాయెరా?
బాపూజీ
ఈజీవ మెటు నిల్చెరా?
నాప్రేమ గెలిచేనా? నా తోట పూసేనా?
నావీణ మ్రోగేనా? నాపాట పాడెదనా?
నాపాలి ప్రభు వేడిరా?
బాపూజీ
నా కృష్ణుం డేమాయెరా?

# ...పాయిమారకము—రైతు

మోచర్ల కృష్ణమూర్తిగారు

...పాయి మారకపుసమస్య చిరకాల ...ముగా భారతీయపరిశ్రమలకు కుత్తు ...కత్తివలె ప్రాణోపద్రవమును గలిగించు ...ది. ఈదేశమున ప్రస్తుతము ప్రధానపరి ...యగు వ్యవసాయమును, రైతునుగూడ, ...ల రూపాయి మారకపు రేటును 16 ...ల నుండి 18 పెన్నీలకు మార్చుటవలన ...మించు పూర్తిగా శిథిలమై పోవుచున్నా ...యినప్పటికిని, మనరైతులయొక్కగాని, ...ధికులయొక్కగాని, ఆందోళనయందును, ...లయందును ఈసమస్య తగినంత ప్రాధా ...ను బడయకుండుట విచారకరము. ఇట్టి ...కారణము లేకపోలేదు. భారతప్రభుత్వ ...సభ్యు డగు సర్ బాసిల్ బ్లాకెట్టుగారు ...నటుల మన దేశమున "రూపాయినాణెము ...క సమస్యలగురించియు, వాని ఫలిత ...గురించియు దెలిసినవారు విద్యాధికులం ...ను బహుస్వల్పము." ప్రతిభారతీయుని ...దిన జీవితవ్యవహారములయందు అను ...మును వారి లాభనష్టములు ఈ సమస్య ...నే ఆధారపడియున్నను, తత్ఫలితములు ...త్యక్షప్రతిపాదితములు గాక పరోక్షప్రతిపాది ...లగుటంజేసి, ప్రజాసామాన్యము మూల ...ణమును గ్రహింపజాల కున్నది. ఒక ...సకలపరిశ్రమల్తోడను కలకల లాడు ...భారతదేశ మిపుడు ఒక్కవ్యావసాయిక దేశ మయ్యెను. మారకపురేటునం దిటీవల గావింపబడిన మార్పువలన ఈ దేశపు వ్యవసాయకుడును, వ్యవసాయమును గూడ అచిర కాలములోనే పూర్తిగా తుడిచివేయబడు నటుల గన్పించుచున్నది.

### రూపాయి నాణెము

భారతీయుల భాగ్యదారిద్ర్యముల కింత ముఖ్యకారణమగు "మారకపురేటుమార్పు" యొక్క లాభనష్టముల గురించి చర్చించుటకు పూర్వము మనరూపాయి నాణెముయొక్క చారిత్రమును గురించి అపరిచితులగు పాఠకుల కించుక సంగ్రహముగ పరిచయ మొనర్చుట అనవసరము గాజాలదు. రూపాయి నాణెముయొక్క తూకము 180 వడ్లగింజల యెత్తు. అందు 165 వడ్లగింజలయెత్తు వెండియు, 15 వడ్లగింజల యెత్తు ఇతరలోహమును గలవు. ఆకారమునందును, స్వచ్ఛతయందును రూపాయినాణెము 1835 సం.ము నుండియు నెట్టిమార్పును చెందకపోయినను, విలువ యందు మాత్రము ఇప్పటికి చాల మార్పులు చెందెను. 1893 సం.ము వరకును టంకసాల వద్దకు వెండిని దెచ్చి ఇచ్చి రూపాయినాణెముల ముద్రించి ఇవ్వవలసినదిగా గోరిన వారికెల్ల కొంత మజూరీ పుచ్చుకొని, ప్రభుత్వమువారు నాణెముల ముద్రించి ఇచ్చుచుండెడివారు. కాని 1893 నుండియు ప్రభుత్వమువారి స్వేచ్ఛా

ముద్రణపద్ధతిని రద్దుచేసి, తమ కిష్టమైనపుడు తాముమాత్రమే రూపాయినాణెముల ముద్రించి చలామణిలోనికి దెచ్చుటకు నిశ్చయించిరి. రూపాయిమారకపు చారిత్రమునం దిదియే ముఖ్యమగు మొదటిమార్పు. అంతవరకును రూపాయినాణెమునకును, బంగారు సవరనునకును గల మారకపు సంబంధము ఆయా నాణెములలోని వెండి బంగారు లోహముల బజారు విలువనుబట్టి నిర్ణయమగుచుండెడిది. కాని 1893 సం.మున ప్రభుత్వమువారు రూపాయినాణెముల స్వేచ్ఛాముద్రణమును నిలిపివేయుటవలన, అట్టిపద్ధతి నంత మొందించి, వెండి బంగారు విలువలతో సంబంధము లేకుండ రూపాయినాణెముయొక్క విలువను ప్రభుత్వమువారే నిర్ణయించుటకు అవకాశము గలిగెను. ప్రభుత్వమువారీ యవకాశము నుపయోగించుకొని బంగారు సవరను నాణెమునకు రు 15 లు సమానము అని 1899 సం.న శాసించిరి. అప్పటినుండియు వెండి బంగారు విలువలతో నెట్టి సంబంధమును లేకయే రూపాయి నాణెము బంగారు "సవరను"నందు 15 వంతుగ—అనగా 16 పెన్సీలుగ—ప్రకటింపబడెను. ఇందువలన రూపాయి నాణెముగూడ, నికెలుఅణాలు, రాగికానులవలెనే కొంతవెలకు చిహ్నమగు నాణెము (token coin) గ నొనర్పబడెను. సుమారు 25 సంవత్సరముల కాలము 16 పెన్నీలరేటుతో వ్యవహారములు జరిగినపిదప, 1920 సం.మున మారకపు రేటును 2 షిల్లింగులుగ మార్చుచు శాసన మొనర్చిరి. కాని ఈమార్పు శాసనమునందు వ్రాతాక్షరము మాత్రమే యుండెనుగాని చిరకాలము అమలులోనికి రాలేదు. ప్రభుత్వమువా రింత హెచ్చురేటును అమలునకు తేజాలక చాల నష్టపడి తుదకు 18 పెన్నీలు నిర్ణయించుకొని 1924-25 సం.నుండియు ఆరేటు నమలుజరుపుచు వచ్చిరి. తుదకు 1927 సం.ము మార్చిమాసమున నా రేటును ఖాయపరుచుటకుగాను తులముబంగారునకు రు 21-3-10 లు సమానమని శాసించి, 18 పెన్నీలరేటునకు చట్టరూప మగు అధికారము నొసగిరి. ఈ శాసనము ప్రకారము సవరను నాణెము రు 13-5-4 లకు మాత్రమే సమానము.

### రూపాయి విలువ హెచ్చుట

ఆకారమునందుగాని, స్వచ్ఛత యందుగాని ఏవిధముగను మార్పుచెందని రూపాయి నాణెము మారకపురేటును హెచ్చించుటవలన విలువయందు మార్పుచెందె ననియు, రూపాయి విలువ హెచ్చెననియు చెప్పినపుడు అదియెటులనా యని విస్మయము గల్గుట సహజము. బంగారము చలామణి నాణెముగ లేకపోవుటయు, ఎంతమొత్తమునకైనను ఈదేశమున రూపాయి నాణెమునే చలామణియం దంగీకరింపు చుండుటయు ఇందుకు కారణము. 1893 నందు స్వేచ్ఛాముద్రణ పద్ధతిని తొలగించినప్పటినుండియు రూపాయినాణెము తన సొంత విలువను గోల్పోయి బంగారుతో ప్రభుత్వమువారు నిర్ణయించిన సంబంధమును బట్టి వారిచే నారోపితమగు విలువకు చలా

# అజంతా చిత్రములు



౧. బోధిసత్త్వుడు

థమగుహాలయమునందలి శాలయొక్క వెనుకటిగోడపై జిత్రించబడియుండు బోధి
శిరము. బోధిసత్త్వుని ముఖమును చిత్రించుటలో చిత్రకారుడు కనుపరిచిన సౌకుమా
ర్ణనాతీతము. కిరీటముగూడ నెంతోయందముగ చిత్రింపబడియున్నది.




౨. చామరధారి

ఒకద్వారముకడ చామరమును ధరించి నిలుచున్న యొక స్త్రీవిగ్రహము.
ఈ చిత్రము పదునేడవ గుహాలయమున నుండు నొక స్తంభముపై చిత్రించబడియున్నది.

---

# కామినియా నూనె

వేనకువేల కుటుంబములయందు ఉపయోగించబడుచున్నది

## ఎందుకు?




కామినియా నూనె

వెంట్రుకలు ఊడిపోకుండా నాటంకపరచును

కామినియా నూనె

చుండును పోగొట్టును.

కామినియా నూనె

తలకు చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

తలకు సంబంధించిన వ్యాధు లన్నిటిని కుదుర్చును. ఉష్ణముగా నున్న పుర్రెకు చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

యందు వెంట్రుకలు పెరుగుట కవసరమైన వస్తువులు, మొ దుకు కావలసిన అమూల్యవస్తువులు గలవు.

కామినియా నూనె మనోహరమైనట్టియు ఆహ్లాదకరమైన సువాసనగలది.

కామినియా నూనె శిరోజములకు ప్రాణము. ఇట్టి సుగుణము లుండుటవలననే వేలకొలది కుటుంబము కామినియా నూనె ఎక్కువగా వాడబడుచున్నది.

కామినియా నూనెను ఉపయోగించునట్టివారు గనుకనే దీనిని "శిరోజములకు ప్రాణ మని" దీని గల లాభకారియైన సుగుణములను బట్టి తెలుపుచున్నారు.

బుడ్డి 1 కి ధర రు. 1. వి. పి. ఖర్చులు అ. 6. ప్రత్యేకము.

బుడ్లు 3 కి ధర రు. 2-10-0. వి. పి. ఖర్చులు 0-12-0. ప్రత్యేకము.

అత్తరులకు రాజైన

## ఓటో దిల్ బహార్ (రిజిస్టర్డు)



హిందూదేశమం దంతటను యిది విరివిగా అమ్మబడుటనుబట్టియే దీనికి సాధారణమైన శ్రేష్ఠత్వమును రుజువుచేయుచున్నది. కొన్ని బొట్లు చేతి లపైన చల్లిన సీమపుష్పములు, మల్లెపుష్పముల వాసనవలె మనోహరమైన సువాసనను గలిగించుచున్నది.

. బుడ్డి 1 కి రు. 2. $\frac{1}{4}$ ఔ. రు. 1-4-0. 1 డ్రా. 0-12-0.

వి. పి. ఖర్చులు అణాలు 6 ప్రత్యేకము.

2 అణాలు తపాలబిళ్ళలు పంపిన శాంపిల్ బుడ్డి పంపబడును.

నియానూనె ఓటోదిల్ బహారు సుప్రసిద్ధమైన స్టోరులన్నిటియందును దొరకును.

## ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ.

తపాలపెట్టె నెం. 2032. బొంబాయి నెం. 2.

# కతియవారు ట్రేడింగు కంపెనీ

## జగత్ప్రసిద్ధిగల సర్వజనాదరణీయమైన తలనూనెలు, అత్తరులు

## మీరు కోరిన సువాసనలు మీకు లభించగలవు




### మనోహరపరిమళము గల తలనూనెలు

కుసుమాల్ హెయిరాయిలు (రిజిష్టర్డు):—తలనూనెలలో సాటిలేనిది. సంపన్నులు మెచ్చినది.

వెల సీసా 1 కి రు. 1-0-0

వైట్ రోజ్ హెయిరాయిలు నెం. 777 (రిజిష్టర్డు):—గులాబీపువ్వులనిజసౌరభ మిందుగలదు. రోజాపూవుల కాసక్తి గలవారి కామోద మొసగును.

వెల సీసా 1 కి రు. 0-14-0

కోకోనట్ హెయిరాయిలు నెం. 777 (రిజిష్టర్డు):—టెంకాయనూనె తలనూనె కుపయోగించునని ప్రతివానికిని తెలియును. కాని యెట్లు సిద్ధము చేసినచో నది ప్రశస్తమో తెలియదు. ఈ 777 నెం॥ రులో (రిజిష్టర్డు) చేసిన ఈ టెంకాయనూనె శుద్ధిచేయబడి దుర్వాసనారహితముగా చేయబడి సూక్ష్మసువాసనాసంకలితముగా జేయబడినది. అందుచే అందరిచే మెప్పునొందినది. వెల సీసా 0-14-0

పుష్పమాలతీ హెయిరాయిలు (రిజిష్టర్డు):—మాలతీ పుష్పసువాసనతో అతిమనోహరమై హృదయరంజకమై యొప్పు తలనూనె యిది.

వెల సీసా 1 కి రు. 0-14-0

సువర్ణమాలా హెయిరాయిలు (రిజిష్టర్డు):—యిది సర్వజనాదరణీయమైన సుకుమార సువాసనగల తలనూనె.

వెల సీసా 1 కి రు. 0-9-0

### సర్వజనాదరణీయమైన పుష్పముల అత్తరులు

ఆటో మధుకర్ నెం. 777:—ఈ అత్తరునందుగల సొగసైన పూలవాసనచే మోహితులై అనేకమంది యీ అత్తరును తమ యభిమానసౌరభముగా భావించుచున్నారు. ఒకసారి యుపయోగించినచో సర్వదా వరించినట్లగును.

వెల $\frac{1}{2}$ ఔ. సీసా 1 కి 1-12-0 $\frac{1}{4}$ ఔ. సీసా 1 కి 1-0-0

ఓటో కుసుమాల్ (రిజిష్టర్డు) పరిమళములం దపూర్వచిత్రములు:—అప్పుడు కోసిన పూవులవాసన యీ అత్తరునందు కలదని సౌరభప్రియు లందరును అంగీకరించిరి. సారా అరఖులతో చేర్చిన యితర అత్తరులను జూచి విసుగుచెందినవారి మనోభీష్టమునకు తగిన అత్తరు. యిది సుకుమారమైన సూక్ష్మసౌరభమును వెదజల్లును.

వెల $\frac{1}{2}$ ఔన్సు సీసా రు. 2-0-0 $\frac{1}{4}$ ఔన్సు సీసా రు. 1-0-0

నెం. 777 ఓటో జాస్మిన్, ఓటో హీనా, ఓటో రోజ్, ఓటో లిలీబ్లాజం, ఓటో మస్క్, ఓటో నీరోలీ, ఓటో బకూల్, ఓటో సురంగి ప్రతిది వెల $\frac{1}{2}$ ఔన్సు సీసా 1 కి రు. 1-12-0 $\frac{1}{4}$ ఔ. సీసా 1 కి రు. 1-0-0

పాకింగు పోస్టేజీ ప్రత్యేకము. రెండణాలు-చీట్లు పంపినవారికి కోరిన అత్తరులలో ఒకమాదిరి సీసా లేక కోరిన తలనూనెలు ఏ రెంటినైనను మాదిరిసీసాలు ఉచితముగా పంపబడును.

నేడే వ్రాయుడు. దొంగమాదిరులను చూచి మోసపోకుడు. వీనికిబదులుగా వేనినైనను అంగీకరించకుడు. ఘరానాగల ఔషధముల దుకాణములన్నింటియందును దొరకును. లేదా,

## కతియవారు ట్రేడింగు కంపెనీ, బొంబాయి (నెం. 4)

### మధురలో ఏజంట్లు:—కాదర్ సాహెబు అండు సన్స్

...శి యగుచుండెనని ఇదివరకు దెలిపి యుంటి ... ప్రభుత్వమువారు మారకపురేటును సవర ...కు రు 15 లుగ నిర్ణయించినపుడు రూపా ... నాణెముయొక్క విలువ బంగారు సవరను ...ణెములో 15వ వంతున-అనగా షుమారు 7.8 ...యినుల బంగారునకు సమానముగా చలా ...శి చేయబడెను. ఇపుడు సవరనునాణె ు రు. ...5-4 లుగ నిర్ణయింపబడుటచే రూపాయి ...ణెము 8 షుమారు 8.5 గ్రెయినుల బంగారు ...సమానముగ ప్రకటింపబడెను. కనుక రూపా ...లోనివిలువ మారకపురేటుమా ...వలన నిపు ...ంచుమించు 1- గ్రెయిను 9 హెచ్చింపబడెను. ...గా (ప్రస్తుతపు రూపాయివిలువ 1/8 వ వంతు ...టికి 12½చొ.) హెచ్చింపబడెను. ఈమార్పు ...వరణయందు గలుగజేయు ఫలితము ఒక యు ...హరణమువలన విశదము గాగలవు. ఇంత ...కును "నిక్కెలు" అణా నాణెము రూపా ...లో పదునారవవంతుగ చలామణి యగుచు ...ది. ఒకవీశెడు పదార్థము రూపాయికి విక్ర ...ంపబడు చున్నపుడు, మనము ఒకఅణాను ...ణదారుని కొసగి దాని విలువకు తగిన ...ర్థ మిమ్మని అడిగినపుడు వీశెలో పదు ...రవ వంతు పదార్థమును తూచి ఇచ్చును. ...మీద అణనాణెమును రూపాయిలో 10 వ ...తుగ ప్రభుత్వమువారు ప్రకటించి రను ...దు. అపుడు మీరా రానాణెమును తీసుకొని ... పదార్థము నిమ్మని వర్తకునడుగగా నాత ... వీశెలో పదియవవంతు పదార్థము నొస ...ు. ప్రస్తుతము రూపాయినాణెమునందు ఇట్టి మార్పే జరిగెను. ఇదివరకు సవరను అనగా రు 18 లు విలువ గల సరకు—ఇపుడు సవరను =13-5-4 అని చెప్పుటవలన—రు 13-5-4 ల మాత్రమే విలువ యగుచున్నది. ఈ విధముగా మారకపురేటును హెచ్చించుటవలన బంగారులో సరకుల విలువలు మారకపోయినను రూపాయి నాణెములయందు మాత్రము నూటికి 12½ వంతు తగ్గిపోయెను.

"ఈ దేశమున ఎంత మొత్తమునకైనను రూపాయినాణెములే చలామణి యగుచున్నవి. వ్యాపారమంతయు రూపాయినాణెములలోనే జరుగుచున్నది; కనుక ఈ మారకపుమార్పు అందరను బాధింపదు; విదేశములతో వ్యాపార మొనర్చువారికిని, ఎగుమతి దిగుమతులకు సంబంధించిన వస్తువులకును మాత్రమే వర్తించు"నని కొందరు భావింపవచ్చును ఇది కేవలము పొరబాటు. బంగారునాణె మీదేశమునందు చలామణిలో లేకున్నను, బంగారునకును రూపాయినాణెమునకును గల సంబంధమునుబట్టియే చాలవరకు వెలలు నిర్ణయమగుచుండును. "మారకపురేటు హెచ్చిన యెడల దేశీయపదార్థముల ధరలు విదేశీయనాణెములలో హెచ్చును. కనుక ఎగుమతులు తగ్గును. విదేశములనుండి వచ్చు సరకుల ధరలు, దేశీయ నాణెములలో తగ్గును. కనుక దిగుమతులు హెచ్చును" అని వ్యాపారస్థు లందరకును దెలిసిన విషయమే. కాని భారతదేశపు రూపాయినాణెపు మారకపురేటు యొక్క ఫలితములు ఇంతటితో ముగియునవిగావు. రూపా

యి మారకపుమార్పు ఒక్క ఎగుమతిదిగుమతులనే గాక, ప్రతి భారతీయునియొక్కయు, పారిశ్రామికుని యొక్కయు— అందు ముఖ్యముగా వ్యావసాయకునియొక్కయు—ఆర్థికస్థితిని కూకటివేళ్లతో తారుమారొనర్చుచున్నది. కనుక విదేశీయవాణిజ్యమునం దీమారకపురేటు గావించుచున్న మార్పులను వివరించుటకు పూర్వము ఇతరవిధములుగ రైతుయొక్కయు వ్యవసాయముయొక్కయు స్థితి నీమారకపురేటు ఎటుల కదల్చి శిథిల మొనర్చినదియు చర్చింతము. మన దేశపు రైతుల ఋణగ్రస్తత జగత్ప్రసిద్ధము. తలమునుగ నప్పులులేని రైతు మన దేశమున అపురూపము. అసలే ఋణములలో మునిగి దరిజేరలేక అల్లాడుచున్న రైతుల ఋణగ్రస్తతను ప్రభుత్వమువారు మారకపురేటును హెచ్చించుట వలన నూటికి $12\frac{1}{2}$ వంతున నిష్కారణముగ హెచ్చించిరి. మారకపురేటు హెచ్చింపనియెడల రు 100. లు ఇచ్చినయెడల ఋణవిముక్తి నందెడు రైతు, ఇపుడు రు $112\frac{1}{2}$ లు చెల్లించినగాని ఋణవిముక్తుడు గాజాలకున్నాడు. ఇది ఎట్లని ప్రశ్నింపవచ్చును. మారకపురేటు 16 పెన్నీలుగ నున్నపుడు రైతుకు రు 100 లు అప్పుగల దనుకొనుడు అపుడు పుట్టికి $6\frac{2}{3}$ నవరనుల చొ. న అనగా అప్పటి రేటుప్రకారము $6\frac{2}{3} \times 15=$రు 100 లు ధర గలదని గూడ యనుకొనుడు. తన ఋణవిముక్తికొరకుగాను ఒకపుట్టెడు ధాన్యము నొసగిన యెడల నపుడు సరిపోయెడిది. రూపాయి మారకపురేటును 18 పెన్నీలకు హెచ్చించుటవలన అనగా నవరనునకు రు 13-5-4 లను మాత్రమే నిర్ణయించుటవలన, బంగారులో పుట్టిధర అదే ప్రకారమున్నను రూపాయిల సంఖ్యమాత్రము రైతునకు తక్కువ ముట్టుచున్నవి. పుట్టికి $6\frac{2}{3} \times$ రు 13-5-4=రు 88 8/9 లు మాత్రమే రైతునకు చేరుచున్నవి. మిగత రు11 1/9 ల కొరకుగాను ఇంకను $\frac{1}{8}$ వంతు పుట్టిని విక్రయింపవలసి వచ్చుచున్నది. మొత్తముమీద ఇదివరకు 1 పుట్టెడు ధాన్యముతో దీరెడు ఋణము మారకమును హెచ్చించుటవలన $1\frac{1}{8}$ పుట్టి నొసగిన గాని దీరకున్నది. దీనినిబట్టి రైతుల ఋణములు నూటికి $12\frac{1}{2}$ చొ. న ఎటుల హెచ్చినదియు దెల్లముగాగలదు. ఋణముల వలెనే రైతులు చెల్లింపవలసిన పన్నులు మొదలగునవి గూడ హెచ్చెను. మారకపురేటును హెచ్చింపనియెడల 1 బస్తాధాన్యమును చెల్లింపవలసినచోట నిపుడు $1\frac{1}{8}$ బస్తాల ధాన్యమును చెల్లింపవలసినవా డగుచున్నాడు.

### ఆస్తుల విలువలు

రైతు చెల్లింపవలసిన మొత్తము లీరీతిని అక్రమముగా హెచ్చింపబడుటయేగాక "గోరుచుట్టుపై రోకటిపోటు" అనునటుల మారకపురేటు మార్పుదలయొక్క స్థిరచరాస్తుల విలువగూడ నూటికి $12\frac{1}{2}$ చొ॥ తగ్గించెను. రైతునకుగాని ఆతనిభార్యాపుత్రాదులకుగాని యేమైన వెండి బంగారునగ లున్నయెడల వానికి రూపాయినాణెములలో నిదివరకున్న విలువ ఇపుడు లేదు. మారకమును హెచ్చించుటకు పూర్వము సవ

రు 15 ల చొ॥న రు 90 లు వెచ్చించి తనభార్యకు ఒకనగను చేయించెనను డు. సవరనునకు 13-5.4 లు మాత్రమే ప్రభుత్వమువారు శాసించుటవలన ఇపుడా సవరనుల బంగారు నగకును 6 × రు 5-4=రు 80 లు కంటె ఎక్కువరాదు. ఈ ముగనే రైతుల పనిముట్లు, సామానులు, దలగు వానియొక్కయు భూములయొక్క వెలలుగూడ తగ్గింపబడెను.

ఎగుమతులు-దిగుమతులు

ఇక ఎగుమతి దిగుమతుల వ్యాపారము క్రొత్త మారకపురేటొనర్చిన మార్పుల లింతము. హిందూదేశమునకు ఎగుమతి పారమే జీవగర్ర. విశేషముగు ఎగుమతి పారమువలన దప్ప ప్రతివత్సరము కోట్ల ది రూప్యముల సంపద విదేశములకు ప్రవ చి పోవుచుండగా-భారత దేశ మీమాత్ర జీవముతోనైన నుండగలిగెడిదిగాదు. భారత మున కాయువుపట్టగు నీయెగుమతి వ్యాపా మునందు నూటికి 90 వంతులు, వ్యావసాయి చే నుత్పత్తిచేయబడు పదార్థములు. మార రేటును హెచ్చు చేయుటవలన విదేశీయు హిందూదేశపు సరకులు ప్రియమగును. రకము 16 పెన్నీలుగ నున్నపుడు రు ల విలువగల పదార్థమువారి కొక సవ నకు లభించెడిది. మారక మిపుడు చ్చించుట వలన, రు 15 నిచ్చి ఈదేశపు కు కొనవలెననినా యెడల వారు సవరను ట హెచ్చు మొత్తము నొసగవలసి యుం దురు. కనుక వా రావస్తువులను ఇంతకంటె చవుకగా లభించు మరియొక దేశమునుండి తెచ్చుకొనెదరు. ఈవిధముగా హిందూదేశపు రైతు, తన విదేశపు ఖాతాదారులను గోల్పో వుచున్నాడు. ఇదేవిధముగ, విదేశమునుండిఈ దేశమునకు దిగుమతియగు సరకుల వెలలు,రూ పాయినాణెములలో తగ్గును. ఇదివరకు విదేశీయ వర్తకునినుండి ఒకసవరను విలువగల వస్తువును కొనినయెడల రు 15 లు చెల్లింపవలసి వచ్చెడి ది. మారకపురేటును హెచ్చించుటవలన అదే బంగారు వెలకు రు 13-5-4 లు చెల్లించిన సరిపోవుచున్నది. కనుక విదేశీయవర్తకునకు బంగారునందు ఇదివరకు వలె 'సవరను'ను చెల్లించుచున్నను రూపాయల సంఖ్యయందు మాత్రము తక్కువ చెల్లించుచున్నాము. ఈ విధముగ మన వస్తువులు విదేశీయులకు ప్రియ మగుటవలనను, విదేశవస్తువులు మనకు చవు క యగుటవలనను మన ఎగుమతులు ఎటుల తగ్గుచున్నదనియును, దిగుమతులు ఎటుల హెచ్చుచున్నదియును ఈక్రింది లెక్కలవలన స్పష్టమగును:—

| సంవత్సరము | దిగుమతుల విలువ | ఎగుమతుల విలువ |
|---|---|---|
| 1924-25 | 246,62,58,831 | 384,66,53,086 |
| 1925-26 | 226,17,77,'61 | 374,84,21,200 |
| 1927-27 | 231,22,08,176 | 301,43,58,284 |
| 19:7-28 | 249,83,64,366 | 319,15,85,366 |
| 1928-29 | 258,30,59,741 | 330,12,78,786 |

హెచ్చుమారకము నమలునందుంచిన 1924-25 సం॥ల నుండియు దిగుమతులు క్రమముగా హెచ్చెను. ఎగుమతులు చాలతగ్గెను.

స్వదేశపు బజారులలో రైతులకు పోటీ

క్రొత్తమారకపురేటు హిందూదేశపు రైతును విదేశపు బజారులనుండి వెడలగొట్టు చుండుటతో వదలలేదు. విదేశీయవర్తకులను హిందూదేశపు బజారులోనికికూడ రప్పించి మనరైతులను స్వంత గృహములనుండి గూడ వెడలగొట్టించు చున్నది. మనమారకపురేటును హెచ్చించుటవలన విదేశీయసరకులను విదేశీయుల వెలల యందెట్టి మార్పునులేకయే మనకు ఎటుల తక్కువ రూప్యములకు విక్రయింపగలుగు చున్నారో, పైన వివరించియుంటిని. ఈ యవకాశము నుపయోగించుకొని విదేశీయవర్తకులు ప్రత్తి, గోధుమలు, బియ్యము మొదలగు పంటపదార్థములను, మనదేశమునకు దిగుమతి చేయుచున్నారు. వారితో పోటీచేయుట మన రైతులకు దుర్భరముగనున్నది. వారు తమవర్తకమును నిలుపుకొనవలెననిన యెడల తమ సరకును, ఇదివరకు కంటెనూటికి12½ చొ. నతక్కువధరకు ఉత్పత్తి చేసి విక్రయింపవలెను. కానిచో తమవృత్తిని వదలుకొనవలెను హెచ్చు మారకపు రేటు అను మాయపాచికలతో జూదమాడు విదేశీయవర్తకునితో హిందూదేశపురైతుపోటీ చేయవలసియున్నది. ఇట్టి మాయజూదమున కొక్కటే ఫలితముగలదు. భారతీయరైతుల యొక్కయు పారిశ్రామికుల యొక్కయు ఓటమి. ఈ యోటమి, పై నుదాహరించిన భారతదేశపువిదేశీయ వాణిజ్యపులెక్కల వలన కొంత దెలిసెను. హిందూదేశపు రైతును, ఇంకను మిగిలియున్న వ్యవసాయ పరిశ్రమయును స్వదేశమునుండి గూడ నెటుల దరిమివేయబడుచున్నదియు నీక్రిందిసంఖ్యలు దెలుపగలవు.

| సం॥ | గోధుమలు ఎగుమతులు ల॥రూ. (లు | దిగుమతులు ల॥ రూ | ధాన్యపు పదార్థముల దిగుమతులు టన్నులు | రూ. విలువ |
|---|---|---|---|---|
| 1924-25 | 1719-50 | 5-80 | 7057 | 10,41.247 |
| 1925-26 | 360-24 | 61-30 | 37686 | 61,77 470 |
| 1926 27 | 271-07 | 66 91 | 5³,953 | 91,68,968 |
| 1927-22 | 440-57 | 109-18 | 160.897 | 2³0,70,097 |
| 1928-29 | 150-24 | 816-96 | 747,677 | 1072,80,817 |

వ్యవసాయమునకు ప్రఖ్యాతి వహించి, విదేశములకు ధాన్యములను, ఇతర ఆహార పదార్థములను ఎగుమతి జేయుచుండెడి భారతదేశమునకు-18 పన్నెల మారకపురేటు వలన విదేశముల నుండి ఆహార పదార్థములు దిగుమతి యగుచున్నవి అయిదు వత్సరముల నుండియు, గోధుమల ఎగుమతి క్రమముగా తగ్గి ఆతుద కిపుడు 1928-29 సంవత్సర ఎగుమతులను24-25సం.లముతో పోల్చినయెడల పదియవంతైన గనుపింపదు. అదేకాలమున దిగుమతులు 163 రెట్లు హెచ్చెను. మొత్తము ధాన్యముల దిగుమతులు షుమారు 100 రెట్లు హెచ్చెను.

మన దేశమునకు విదేశీయధాన్యముల దిగుమతి హెచ్చినను మనధాన్యముల ఎగుమతి గూడ హెచ్చియుండవచ్చునని ఎవరైన దలంపవచ్చును. దిగుమతి అయిన ధాన్యపు విలువ పోగా నికరపుధాన్యపు ఎగుమతివిలువ లీక్రింద నుదహరింపబడెను.

| సం॥ | రూ॥ కోట్లు |
| --- | --- |
| 1924-25 | 64.95 |
| 1925-26 | 47.38 |
| 1926-27 | 38.38 |
| 1927-28 | 40.61 |
| 1928-29 | 22.86 |

ఈ లెక్కలలో ఎగుమతులయందు అధిక[...]ము బర్మాబియ్యము. వానిని లెక్కలోనికి [...]కొననిచో ధాన్యపు పదార్థముల నికరపు [...]మతులు ఇంకను చాల తక్కువుగ గను[...]యుండును.

మచ్చునకు కొన్ని పదార్థములకు సంబం[...]చిన లెక్కలనుమాత్ర మిచట నుదాహరించి[...] మారకపు రేటును 18 పెన్నీలకు హెచ్చిం[...]చుట వలన, ఈ దేశమునకు వెన్నె ముక యగు రైతును, వ్యవసాయమును ఎట్టి విపత్తునకు గురిచేయబడినది, రైతుల ఆర్థికస్థితి కెటుల శిథిలపరుపబడు చున్నది యును వీనివలన సుస్పష్టము గాగలదు. ఈ విపత్తు నుపేక్షజేసిన యెడల, అచిరకాలములోనే, ఈ దేశపు వ్యవసాయకుడు, విదేశీయ వర్తకుల పోటీకి లొంగిపోవలసి వచ్చును. ఈ దేశమున ధాన్యము పండించుటకగు ఖరీదు కంటె తక్కువ వెలలకు విదేశీయవర్తకుడు ధాన్యమును సరపరాజేయునపుడు హిందూదేశపురైతు ఎటుల నిలువత్రొక్కుకొనగలడు? భారతీయులపుడు ఇతరపదార్థము లన్నిటికి వలెనే ఆహారపదార్థములకొరకుగూడ ఏ విదేశముపైననో ఆధారపడవలసి వచ్చును.

---

సహాయనిరాకరణమునుగూర్చి వ్రాయమనగా పూచిత్రకారు డీచిత్రమును పంపెను.





## ూకల సంచి

కో. నరసింహాచారిగారు

త్రల్లునూలుతో ననేకవిధము లగు సుందర వస్తువులను చేయవచ్చునని చెప్పియే యున్నను. అందులో బంతులను పూవులను చేయు విధమును గతసంచికయందలి వ్యాసమున చెప్పియేయున్నాను. ఈ వ్యాసమున ఉల్లుతో రూకలసంచి(Money-purse)ని అల్లువిధమును చెప్పెదను.

ఒకగుడ్డను నేయుటకు దారమును పొడుగును, వెడల్పునను వేసి నేయుదురు. పొడుగున ప్రయోగించు నూలునకు పడుగనియు, వెడల్పున కుపయోగించు నూలునకు పేక యనియు పేర్లు. పడుగుపేకలు ఒకదానికొకటి అడ్డముగా నుండి ఒకదానిక్రిందుగనొకటి మారుచు పోవుచుండును. పడుగుపేకలను వేసి నేయు సాధనమును మగ్గమందురు. నేను చెప్పబోవు రూకల సంచియందుగూడ నట్టి పడుగుపేకలు కలవు గాన దానికిని మగ్గ మొకటి కావలసియున్నది.

### మగ్గము

సంచిని అల్లుటకు వలయు మగ్గము వలయాకృతిగలిగి యుండును. ఒకఅట్టను తీసికొని దానిపై ర అను కేంద్రము(Centre)నుండి మూడంగుళముల అర్ధవ్యాసముతో ప, ఫ, బ అనువలయమును గీయవలయును. అదే కేంద్రమునుండి ౨౹౹ అంగుళ అర్ధవ్యాసముతో మరియొకవలయము (Concentric circle)ను గీయవలయును. (చ, జ, ట) ఈ రెండు వలయముల చుట్టుకొలతల మధ్యప్రదేశమున చిత్రమునందు చూపినరీతిని పండ్లవలె కత్తిరించవలెను. పండ్లన్నియు ఒకటే వెడల్పుగలవిగ నుండదగును. ఇట్టిపండ్లు ౨౦ గాని ౩౦ గాని యుండవచ్చును. పిమ్మట దంతముతోగాని, కొమ్ముతోగాని లేక ఇత్తడితోగాని చేయబడిన రెండు ఉంగరములను అట్ట పైయంచున ఒక్కొక్క ప్రక్క నొకదానిని న అనుచోట కుట్టవలెను. ఉంగరముల పైయంచున మాత్రమే కుట్టి క్రింది

యంచులను స్వేచ్ఛగా వదలివేయవలెను. తర్వాత పట్టుదారమునుగాని, లేక మరేవిధమయిన గట్టిదారమునుగాని తీసికొని దానికొనను ఒకయుంగరమునకు మ అనుచోటకట్టి నక్కిన దారమున ౧ అను పంటి సందుగుండా అట్ట యొక్క వెనుకప్రక్కకుపోయి, అచ్చటియుంగరములో దూర్చుకొని మరల ౨ అను పంటి సందుగుండా మొదటిప్రక్కకువచ్చి ఆ యుంగరమునదూర్చి మరల 3 అను పంటిసందుగుండా రెండవప్రక్కకుపోయి అచ్చటి యుంగ

## యాకలసంచి




రమున దూర్చుకొనవలెను. ఇట్లు ఒక్కొక్క ప్రక్కకు మార్చుకొనుచు అట్టయందలి పండ్ల సందులన్నిటియందును నూలునుకట్టి ఉంగరమున య అనుచోట ముగించి కట్టివేయవలెను. ఇప్పటికి అట్టపై పడుగుదారములన్నియు నేర్పడినవగును. పిమ్మట సంచి నల్లుటకు మీ యిష్టము వచ్చిన రంగు ఉల్లునుగాని లేక పట్టునూలునుగాని యొక పొడవైన సూదియందు తీసికొనవలెను. దారముయొక్క కొనను ఉంగరమున మ యను గుర్తువద్దకట్టి అచ్చట నుండి య వరకునుగల పడుగుదారములలో నొకదాని క్రిందుగను రెండవదానిపైగను ఒకటి విడచి యొకటిగా క్రింది మీదులుగ సూదిని దూర్చి పేకను వేయవలెను. పిమ్మట య నుండి మ వద్దకున, మ నుండి య వద్దకును పేకను వేయుచు రావలయును. ఇట్లు అట్ట యొక్క యొక ముఖమున మాత్రము పూర్తిగా నల్లవలెను. ఒకప్రక్క అయినతర్వాత రెండవప్రక్కన దేరీతిగా నల్లవలెను. ఉంగరములకుకుడియెడమల మ,య లవఱకు వ్యాపించియుండు అట్టభాగముకొద్దిగను ఆక్రింది యంచు ఫవఱకు వ్యాపించియుండు అట్టభాగ మెక్కువగ నున్నవిగాన మ, ఫ, య, బల మధ్య

ప్రదేశము త్వరలో పేకదారములతో నిండిపోవు ను. మ, ఫ మధ్యప్రదేశము నిండజాలదు. కాబట్టి పేక వేయునపుడు మ, ఫ, య, బ భాగములలోని పేకనూలును దట్టముగా నదుముచు మ, ఫ మధ్య పేకభాగమును వదలుగా నుండనిచ్చుచు రావలెను. ఒకవేళ ఇందియందున కొంతపనుగు మూయబడక మిలువవలసి వచ్చినను, సంచిని మగ్గమునుండి తీయగనే పేకవరుసలన్నియు ఒకదానికొకటి దగ్గరకువచ్చి సంచిని చక్కగా మూయును.

ఒకప్రక్కనంతయు నల్లినతర్వాత రెండవ ప్రక్కనుగూడ నల్లినపిమ్మట ఉంగరములకు న వద్దకట్టిన కట్లను త్రెంచివేయవలెను. తర్వాత సంచి కేయపాయమును లేకుండునట్లుల అట్లను జాగ్రత్తగా చించి బయటికి లాగివేయవలెను. ఉంగరములగుండా నొకరంగుపట్టును(Ribbon) దూర్చికట్టిన సంచి అందముగా నుండును.



---

# పెద్దన్న—న్యూనిజ్—లక్ష్మీనారాయణ

డాక్టరు యన్. వెంకటరమణయ్యగారు, యం. ఏ.

శ్రీకృష్ణదేవరాయల దండయాత్రలలో కలుబరిగె దండయాత్ర కడపటిది. దీనిని చరిత్రకారు లందఱు మఱచిరనియే చెప్పవచ్చును. ఈదండయాత్రను భాద్రపద భారతిలో వర్ణించితిని. దండయాత్ర కాలమును నిర్ణయించు సందర్భమున శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారికిని నాకును కొంత తగాదా కలిగినది. వారు సదరు దండయాత్ర నడచినది క్రీ. శ. ౧౫౧౮ లోనని; నేను ౧౫౨౧ తరు వాతనని. వారివాదము తప్పని నిరూపించుటకు పూర్వము వాదప్రతివాదములు అభిప్రాయభేదములవల్ల కలుగుచున్న వనియు, వాదప్రతివాదములయందు వాదిప్రతివాదు లొండొరుల దూషించుకొను నవసర ముండదనియు మనవి చేయుచున్నాను. ఎత్తిపొడుపుమాటలు వాదమును గెల్పింపజాలవు. వాదమునకు బలము నొసగునవి అనువగు నాధారములు యుక్తులును.

## ౧. ఆంధ్రకవితాపితామహుడు

అల్లసాని పెద్దన్నగారికి ఆంధ్రకవితాపితామహు డన్న బిరుదు ౧౪-౮-౧౫౧౮ నాటికే యున్నట్లు మేల్పాడిశాసనమువల్ల తెలియుచున్నది. ఈ బిరుదు పెద్దన్నగారికి మనుచరిత్రను రచియించుటవలన వచ్చిన దనియు, కావున మనుచరిత్ర మంతకుపూర్వమే రచియింపబడె ననియు శ్రీ కుందూరు ఈశ్వరదత్తుగా రనుచున్నారు. మనుచరిత్రయందు కృష్ణరాయల కలుబరిగపై దాడియును, ఆ పంచగౌడధాత్రీపదదిగ్విజయము నుపేక్షింపబడియుండుటచేత శ్రీ దత్తుగా రొనర్చిన కాలనిర్ణయము సరికాదని వ్రాయుచు, ఆంధ్రకవితా పితామహు డన్న పేరు పెద్దనగారికి పెక్కు సంస్కృతాంధ్రగ్రంథములు రచించుటవల్ల వచ్చియుండుననియు చెప్పితిని. అందుకు శ్రీ ఈశ్వరదత్తుగా రిట్లు ప్రత్యుత్తర మిచ్చిరి. "వీరి కీనూతన చరిత్రాంశము నెవరు చెప్పిరి? ఆంధ్రలోక మింక నాగ్రంథములపట్టిక నెఱింగియుండ లేదు... శ్రీ వెంకటరమణయ్యగా రాంధ్రలోకమున కాయుత్తమగ్రంథములఁ దెలిపి సారస్వతసేవ సేయుదురు గాక!"

నా కీ నూతన చరిత్రాంశములను జెప్పినవా రెవ్వరా? జగ మెఱిఁగిన పండితుడు, 'కవి', విమర్శకాగ్రేసరుడు, బ్ర. శ్రీ. వేటూరు ప్రభాకరశాస్త్రిగారు. వారు వావిళ్ల వారికై తాము రచించిన మనుచరిత్ర పీఠికయందు పెద్దనగ్రంథములనుగూర్చి వ్రాయుచు, "ఈత డీ మనుచరిత్రమునుగాక హరికథాసారమను వేరొక ప్రబంధమును రచించి తనగురువగు శఠకోపయతికి కృతి నొసంగెను" అని చెప్పిరి. మఱియు దుర్మతి మాఘ శు ౧ శని వారపు టాంధ్రపత్రికలో శ్రీ శాస్త్రిగారే ఒక వ్యాసమును వ్రాసియున్నారు. అందు,—

"అల్లసాని పెద్దనార్యేణ సత్యావధూపరిణయే"—

> "అఙ్గులీషుకురఙ్గాక్ష్యా శ్శోభతే ముద్రికావళిః,
> ప్రోతేవ బాణం పుష్పేషో స్సూక్ష్మలక్ష్యపరంపరా."

"అల్లసాని పెద్దనార్యేణాపి ఏవముక్తం రసమఞ్జర్యామ్"—

> "ఉడురాజముఖీ మృగరాజకటి
> ర్గజరాజగతి స్స్తనభారనతా,
> యది సా రమణీ హృదయే రమతే
> క్వజపః క్వతపః క్వసమాధిరతిః."

అని యున్నది: కనుక అల్లసాని పెద్దన్నగారు మనుచరిత్ర గాక,

(౧) హరికథాసారము

(౨) సత్యావధూపరిణయము

(3) రసమఞ్జరి

అని మూడుగ్రంథములు వ్రాసినట్లు తెలియుచున్నది—ఇది గాక,—ఆముక్తమాల్యదను గూడ పెద్దనగారే రచించిరన్న ప్రతీతి యొకటి తెనాలిరామకృష్ణుని కాలము నుండియు వచ్చుచున్నట్లు,

"దానితల్లిగ నల్లసాని పెద్దన తెల్పె
మునిమడిదప్పియాముక్తమాల్య"

అను రామకృష్ణుని చాటూక్తివల్ల తెలియుచున్నదిగదా! కాబట్టి పెద్దనకు మనుచరిత్రరచనవల్లనే ఆంధ్రకవితా మహుడని పేరు వచ్చియుండవలెనను పిడివాదమున కవకాశము లేదు. ఇతరగ్రంథరచనవల్లనై యుండవచ్చును. మనుచరిత్రవల్లనే పైబిరుదు పెద్దనకువచ్చెనన్న సిద్ధాంతమును మనుచరిత్రయే పూర్వపక్షము చేయుచున్నది. దీనిని గురించిన పండితాభిప్రాయమును గనుడు:

"ఒకవేళ తొలుదొలుత టెంకియే యని చెప్పకొన్నను నీ బిరుద మీగ్రంథ(మనుచరిత్ర)రచనమునుబట్టి వచ్చినదనుట పొసగ నేరదు. మనుచరిత్రమును రచియింపుమని కోరునపుడే కృష్ణరాయలచే,—

క. హితుడవు చతురవచోనిధి
వతులపురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుడ వాంధ్రకవితా
పితామహుడ వెవ్వరీడు పేర్కొననిన్నున్.

అని పెద్దన పేర్కొనబడియున్నాడు."1

కావున ఎవ్వరేవిచెప్పినను, మనుచరిత్ర వ్రాయుటవల్ల పెద్దన కాంధ్రకవితాపితామహుడని పేరువచ్చెనన్నవ్రాత నిరాధారపువ్రాతగాక మరేమగును? నా యభిప్రాయ మేమన, ఇతర గ్రంథరచనవల్లనే పెద్దనకీ బిరుదు లభించెను అని; లేదా, శ్రీ ప్రభాకరశాస్త్రిల వారన్నట్లు, "కృష్ణరాయలవారు తన యాస్థానకవులలో నెల్ల వయసుచేతను గవితచేతను బెద్దవాడగుటచే, బెద్దనామాత్యున కీ బిరుద మొసంగియుండును."2

మనుచరిత్రకుఁ బూర్వము పెద్దన ఇతరగ్రంథముల రచించియుండడని శ్రీ ఈశ్వరదత్తుగారివాదము: దానికి గారణమును వారిట్లు చెప్పుచున్నారు:

"ప్రతి ఆంధ్రగ్రంథకర్తయు గ్రంథారంభమునందే తానప్పటికి రచించిన గ్రంథములు పేర్కొనుట ఆంధ్రసారస్వతపరిచితి గలవారెల్ల యెఱింగినవిషయము. పెద్దన మనుచరిత్రలోఁ దానంతకు ఆంధ్రకవితాపితామహుడై విరచించిన గ్రంథముల నొక్కదానినైన జెప్పకొనకుండుటకు గల కారణము లేమో!"

ఇది కేవలము ప్రమాదజనితము. కోపోద్రేకమున నున్నతఱి వ్రాసినవ్రాత. ఏలన శ్రీ ఈశ్వరదత్తుగారు విధించిన పైనియమమును మహాకవు లెందరో పాటించియుండలేదు: కవిబ్రహ్మ యగు తిక్కనసోమయాజి తన మహాభారతమున దానంతకుపూర్వము నిర్వచనోత్తరరామాయణమును రచించినట్లు చెప్పుకొన్నాడా యేమి? పినవీరభద్రుడు తన జైమినిభారతమున నంతకు ముందు దాను రచించిన శృంగారశాకుంతలాదిగ్రంథముల పేరెత్తెనా యేమి? తెనాలిరామకృష్ణుడు తన పాండురంగమాహాత్మ్యమున దత్పూర్వము విరచించిన యుద్భటారాధ్యచరిత్ర ప్రశంసను గావించెనా యేమి? రామరాజభూషణుడు దన వసుచరిత్రమున హరిశ్చంద్ర నలోపాఖ్యానమును బేర్కొనెనా యేమి? చేమకూర వెంకటకవి దన విజయవిలాసమునందు సారంగధరచరిత్ర ప్రస్తావన జేసెనా యేమి? కొందఱుకవులు తాము రచించిన గ్రంథములను బేర్కొనిరి; కొందఱట్లు సేయలేదు. కావున పెద్దన్నగారు మనుచరిత్రమున దామంతకుపూర్వము రచించిన గ్రంథములను బేర్కొనకపోవుట యొకవిశేషము గాదు. ఏతత్కారణమున, 'ఆంధ్రకవితాపితామహ' యను బిరుదును మనుచరిత్ర రచనతో దగులాటము సేయుట యొప్పగూడని విషయము.

1. వే. ప్రభాకరశాస్త్రిగారు: మనుచరిత్రపీఠిక; వావిళ్లవారిప్రతి పుట XI.
2. I bid.

## ౨. న్యూనిజువాక్యములు ప్రమాణార్హములుకావా?

న్యూనిజ్ అనునతడు పోర్చుగీసువర్తకుడు; కృష్ణరాయల కాలముననో, లేక రాయల మరణానంతర మచిర కాల మప్పుడో అతడు విజయనగరమునకు గుఱ్ఱముల నమ్ముటకు పోయియుండెను. విజయనగరమునకు బోవు పెక్కు పోర్చుగీసువారివలె, అతడు రాయరాజ్యమును గురించిన గ్రంథమొకటి వ్రాసెను. న్యూనిజ్ గ్రంథమును, అతనితోగూడనో లేక అంతకుపూర్వమో విజయనగరమునకు వెళ్లిన పియస్ అనునతడు రచించిన గ్రంథమును రెంటిని సేకరించి గోవాపట్టణవాస్తవ్యుడగు నొక పోర్చుగీసు అధికారి అతని మిత్రుడగు బ్యారోస్ అను చరిత్రకారుని ఉపయోగార్థము క్రీ. శ. ౧౫౩౭ ప్రాంతమున లిస్బనునగరమునకు బంపెను. ఆగ్రంథములను బంపితినని యొక యుత్తరమునుగూడ వ్రాసెను. అందు సదరు గ్రంథకర్తలనుగూర్చి యతడు యిట్లు వ్రాసియున్నాడు. "విజయనగరమునకు తరచుగ బోవువాడగు డామింగో పియస్ కడనుండి ఈ(గ్రంథ) సంగ్రహమును బడసితిని. ఇతడు కృష్ణరాయలకాలమున, క్రిష్టవో డి ఫిగీరెడో విజయనగరమున నున్నప్పుడు అచటికి బోయియుండెను. మఱియొకగ్రంథమును, ఆదాయములేని గుఱ్ఱపు వ్యాపారమును జేయుచు మూడుసంవత్సరములకాలము అచ్చట నివసించుచుండిన ఫెర్నవో న్యూనీజ్ కడ సంపాదించితిని. ఒక్కడే సర్వవిషయములను వర్ణింప నశక్తుడగుటచేతను ఒకడు చెప్పనియంశములను మఱియొకడు జెప్పుటచేతను నేను గ్రంథసంగ్రహములను రెంటిని—అనగా, నేను పైనచెప్పినరీతిని కృష్ణరాయలనాటి దాని నొకటిని తరువాత ఆరుమాసములకు పంపబడినదాని నొకటిని—పంపుచున్నాను."1

పై యుత్తరమున న్యూనిజ్ విజయనగరమున నున్న కాలము స్పష్టముగ జెప్పబడలేదు. కావుననే ఈ గ్రంథముల ప్రాముఖ్యము దెల్పుచు, "న్యూనిజ్ స్వయముగ చూచియో లేక చూచినవారు చెప్పగ వినియో వ్రాయుటచేత" అతని గ్రంథము విలువగలది యని సూయెల్ వచించెను.2 న్యూనిజ్ కృష్ణరాయలకాలమున విజయనగరమున నుండెనా యను సంశయము సూయెల్ మనస్సును బాధించుటచేత అతడిట్లు సందిగ్ధముగ వ్రాసెను. సూయల్ తరువాతి గ్రంథకర్త లనేకులు న్యూనిజ్ కృష్ణరాయల కాలమున విజయనగరమున లేడనియు, తత్కారణమున కొన్ని అంశములయందతడు వ్రాసినది విశ్వాసపాత్రము గాదనియు వ్రాసియున్నారు.3 వీరి మతమున క్రీ. శ. ౧౫౩౬ ప్రాంతమున విజయనగరమున నివసించుచుండిన న్యూనిజ్ చరిత్రకంటె క్రీ. శ. ౧౬౦౦ లప్పుడు అహమ్మదునగరమున నివసించుచుండిన పెరిస్తా గ్రంథమే అధికము విశ్వసనీయము.

న్యూనిజువ్రాత సరికాదనుటకు వీరంద ఱొక యుదాహరణమును జూపుదురు. కృష్ణరాయల కల్బురిగె ముట్టడినిగూర్చి వ్రాయుచు న్యూని జిట్లు చెప్పియున్నాడు :—

"కల్బుర్గర పట్టణమునందు కోటలో దక్కను దేశపు సుల్తాను (భామినీసుల్తాను) పుత్రులను ముువ్వురిని కృష్ణరాయలు బందీలను జేసెను."

"ఆదిల్ షా వీరిలో తనమరదియు, దక్కను సుల్తానునకు భోగకాంతవల్ల జనించినవాడును, నగు రాకొమరుని దక్కనుదేశమునకు రాజునుజేయు తలంపుతో, వీరిని నిర్బంధించి యుండెను. రాయలు వారిలో పెద్దవానిని, (అప్పటికి అతని తండ్రి మృతినంది యుండుటచేత) దక్కనురాజ్యమున కభిషిక్తునిగ జేసెను. ఇట్లభిషిక్తుడైన రాజపుత్రుని అదిల్ షా మొదలగు దక్కనుదొర లందఱును రాయలవారియెడ తమకుగల భీతిచే నమ్రులై కొలిచిరి. తక్కిన యిద్దరిని రాయలవారు తమతో విజయనగరమునకు గొనిపోయి రాజపుత్రుల హోదాకు తగినరీతిని

1. Sewell: The Forgotten Empire p. 235.
2.I bid: Preface p. 7.
3. Dr. S. K. Iyengar. "The yet Re-membered Ruler & e.. p. 29.

...రించి, ఒక్కొకనికి సంవత్సరమునకు ౫౦,౦౦౦ ...లవేతనము లిచ్చుచుండెను."[4]

ఫెరిస్తా చరిత్రప్రకారము బహమనీసుల్తా నగు ...వ మహమూదు క్రీ. శ. ౧౫౧౮ లో కాలధర్మము ...దెను. ఇతనికి ముగ్గురుకుమారు లుండిరి. అందు పెద్ద ...పేరు అహమ్మదు. ఇతడే ఇస్మాయిల్ ఆదిల్ షా ...త్రైను వివాహమాడినది. రెండవవాని పేరు అల్లా...ద్, కడపటివాని పేరు వలీఉల్లా. అహమదు ౧౫౧౮ ...లు ౧౫౨౦ వఱకు రాజ్యముచేసి మృతినొందెను. ...ఉద్దీన్ ౧౫౨౧ లో పట్టాభిషిక్తుడై ఆ సంవత్సర...నే చచ్చెను. వలీఉల్లా ఆ సంవత్సరముననే రాజై ...త్సరము పూర్తిగాకముందే గతించెను.[5]

ఫెరిస్తా వాస్తవము వ్రాయుచున్న న్యూనిజ్ ...ంచినట్లు కలుబరిగెయందు బహమనీరాజపుత్రులు ...ష్ణరాయలకు సైవస మగుట యసంభవము. కావున ...నివ్రాతను నమ్మి గ్రంథకర్త లందఱు న్యూనిజ్ ...సినది నిజముకాదని నిరసించిరి; కాని ఫెరిస్తా వ్రాసి... వాస్తవముగాదని తోచుచున్నది. ఏలన, ఫెరిస్తా ...వ మహముదునకుగాని యతనిపుత్రులకుగాని సమ...లికుడు గాడు. అతడు తనగ్రంథము క్రీ. శ. ౧౬౦౦ ...ంతమున రచించెను. మఱియు నతడు యథార్థవాది ...డు. హిందువులపట్ల యెన్నిబొంకులైన బొంకగలడు. ...దుకు తార్కాణ బహమనీ రాజపుత్రులను గూర్చి ...డు వ్రాసినవ్రాతయే.

కృష్ణరాయల సమకాలికుడును, సంగీతసూర్యో...దయ గ్రంథకర్తయు నగు లక్ష్మీనారాయణకవి న్యూనిజ్ ...వ్రాసినది యథార్థమని రుజువుచేయుచున్నాడు.

...ధర్ కోట్వ చైత్యః పారశీకం కలుబరిగిపురీం
ద్రాక్పాదాదర్శమానః

కాన్తాన్యాకృష్టవాన్ దోర్బలఘన మహిమా
శ్రీన్ సురత్రాణ పుత్రాన్.[6]

కావున న్యూనిజ్ వ్రాత లవిశ్వసనీయములని త్రోసి పుచ్చుట తగవుగాదు. ఫెరిస్తావ్రాతలను పరిశీలించక యంగీకరించుట పాడిగాదు. న్యూనిజ్ కృష్ణరాయల సమకాలికుడగుటచే నాతని గ్రంథము మిక్కిలియు విశ్వాసపాత్రమని నానమ్మకము. కావున మనుచరిత్ర రచనాకాలనిర్ణయసందర్భమున అతని వాక్యములను పరమప్రమాణములుగ గొనుచున్నాను.

## 3. న్యూనిజ్-లక్ష్మీనారాయణ కవి

ఇంతవఱకు న్యూనిజ్ చరిత్ర ఫెరిస్తాగ్రంథముకంటె నధికము విశ్వాసపాత్రమని కృష్ణరాయల సమకాలికుడును, ఆశ్రితుడును, ప్రాయశః ఇతరకవులతోడ్పాటు రాయలతోగూడ గంతువెంటనంటి తిరిగినవాడును నగు లక్ష్మీనారాయణకవి సాక్ష్యమువల్ల రుజువుపరచితిని. ఈలక్ష్మీనారాయణకవి కృష్ణరాయల సమకాలికుడును, నాశ్రితుడును నని సంగీతసూర్యోదయములోని ఈ క్రింది శ్లోకములవల్ల దెలియుచున్నది.[1]

"తస్య శ్రీకృష్ణరాయస్య కృపాక్షీరాబ్ధిసంభ్రమః,
లక్ష్మీనారాయణో నామ వర్తతే సరసాగ్రణీః."

*     *     *     *     *     *

శ్రీమత్కృష్ణనరేశ్వరస్య దయయా
స్వర్ణాంచితాం పాలకీం
ముక్తాగుచ్ఛకృతానుబద్ధవలయం
ముక్తాతపత్రద్వయమ్;
శశ్వన్మత్తమతంగజాం మలహారీ
వాద్యం నిజాంతఃపుర
స్థానే నాట్యధరసాధిపత్య మసకృ
ల్లక్ష్మీపతిః ప్రాప్తవాన్.

4. The Forgotten Empire p. 353.
5. Ferista Vol. II, Ch. pp. 553-557.
6. The Madras Govt. or M. S. S. Lib. 13-2-19.

1. ఈ శ్లోకములను బ్ర. శ్రీ. వేటూరు ప్రభాకరశాస్త్రిగారు, క్రోధన, చైత్ర భారతిలో కొంతవఱకు ...స్కరించి ప్రచురించియున్నారు.

కనుక, లక్ష్మీనారాయణకవిచే వర్ణింపబడిన కృష్ణరాయని జైత్రయాత్రాక్రమము గమనింపదగినది.

" బాల్యేఽసౌ సకలకలాకలాపయుక్త
స్సత్రా(త్రా)ణం స పదివిజిత్య గంగరాజమ్;
భఙ్త్వాఽవ్యతచ్ఛివనసముద్ర ముత్కటంద్రా
గావాసం వ్యతనుత నిర్భరంశివానామ్.

దుర్గం జిత్వాథసోఽసావుదయగిరివరం
తత్రరాహుత్తరాజమ్
బంధీకృత్యాశువ్యాత్వాయుధినగరవరే
కొండవీట్యాంకొండపల్ల్యాః
జీవగ్రాహంగృహీత్వా గజపతితనయం
పొట్టనూర్పట్టణాగ్రే,
విశ్వశ్లాఘ్యప్రతాపో బిరుదయుతజయ
స్తంభముచ్చైర్న్యఖానీత్.

సోఽయం కృష్ణనరేశ్వరో గజపతిం
జిత్వా తదీయశ్రియా
సాకంతస్యసుతా ముదూహ్యాయవన
క్ష్మాపం సపాదంతతః

గొబ్బూరుస్థలవాసినం సరభసం
జిత్వానువిద్రావ్యతం
హస్త్యశ్వాన్ సతదీయదుర్గమతులం
రాచూరు మాదత్తవాన్.

కృష్ణామూర్తిర్యసోఽయం యవనజనపదం
వహ్నిసాత్కృత్యసర్వం
ఫేరోజాబాదసంబాదురు సగర సమ
ఖ్యానిదుర్గాణి జిత్వా
భఙ్క్త్వోచ్చైః పారశీకం కలుబరగపురీం
ద్రాక్సపాదార్దమానః (?,
కాంతా (క్రాంత్వా?) వ్యాకృష్టవాన్ దోర్బల
ఘనమహిమాత్రీన్ సురత్రాణపుత్రాన్.

ఇక లక్ష్మీనారాయణోక్తకృష్ణరాయజైత్రయాత్ర క్రమమునకును న్యూనిజ్ వ్రాతకును పోలికలున్నవేమో చూతము. పాఠకుల సౌకర్యార్థము, ఈ క్రింది పట్టికను దయారుచేసితిని. అందొకప్రక్క న్యూనిజ్ వర్ణించిన రాయవిజయక్రమమును, రెండవప్రక్క లక్ష్మీనారాయణోక్త యుద్ధసరణిని బొందుపరచుచున్నాను.

| న్యూనిజ్ | లక్ష్మీనారాయణ |
|---|---|
| ౧. | ౧. కృష్ణరాయల జననము, విద్యాభ్యాసము. |
| ౨. | ౨. గంగరాజు పరాజయము, శివనసముద్రదుర్గగ్రహణము. |
| ౩. ఉదయగిరి ముట్టడి, గజపతి పినతండ్రిని బందిసేయుట. | ౩. ఉదయగిరిదుర్గము ముట్టడి, రాహుత్తరాయనిబందీసేయుట. |
| ౪. కొండవీడుముట్టడి, కృష్ణాతీరమున గజపతి యోటమి, కొండపల్లిదుర్గము నాక్రమించుట, గజపతి కుమారుని బందీసేయుట. | ౪. కొండవీడు కొండపల్లెదుర్గములను గైకొనుట, గజపతికుమారుని బందీసేయుట. |
| ౫. సింహాద్రిపర్యంతము దాడి, పొట్టనూరుదగ్గర జయస్తంభప్రతిష్ఠ. | ౫. పొట్టనూరికడ విజయస్తంభ స్థాపనము. |
| ౬. గజపతికుమార్తెను పెండ్లిజేసికొనుట, గజపతితో సంధి. | ౬. గజపతిని ఓడించుట, గజపతికుమార్తెను బెండ్లిచేసికొనుట. |
| ౭. కాటూరు ముట్టడి. | ౭. |
| ౮. తిమ్మరసు కొండవీటి దగ్గర మదార మల్కని జయించుట. | ౮. |

| | |
|---|---|
| ౯. రాయచూరు దండయాత్ర, కృష్ణగట్టున అదిల్ షా యోటమి, రాయచూరుదుర్గమును గొనుట. | ౯. గొబ్బూరుస్థలమున విడిసియున్న సపాయుని యోట మి, తద్విద్రావణము, రాయచూరుదుర్గమును రాయ లాక్రమించుట. |
| ౧౦. సంధిప్రయత్నము, బిజాపురమును ముట్టడించి యాక్రమించుకొనుట, పునః సంధిప్రయత్నము. | ౧౦. |
| ౧౧. కలుబరిగి దండయాత్ర, కలుబరిగి మొదలగుదుర్గము లను విధ్వంసము సేయుట. | ౧౧. కృష్ణానదిదాటుట, ఫేరోజాబాదు, అసంబాదుదుర్గ ములను హరించుట, కలుబరిగిని గొనుట. |
| ౧౨. బహమనీసుల్తాను పుత్రులను ముగ్వురిని బందిఖానా నుండి విముక్తులను జేసి, ఒక్కని నభిషిక్తునిజేసి తక్కినవారిని విజయనగరమునకు గొనిపోవుట. | ౧౨. సుల్తానుపుత్రులను ముగ్వురిని చెరనుండి వదలిం చుట. |

పైపట్టికలో ౧, ౨ అంశములు న్యూనిజు గ్రంథమున గానరావు. ౬, ౭, ౧౦ ఇవి సంగీత సూర్యోదయమున చేర్కొనబడలేదు. న్యూనిజు కృష్ణరాయల దిగ్విజయముల వర్ణనను ఉదయగిరిముట్టడితోనే యారంభించుట చేత తత్పూర్వవిజయముల నెన్న లేదు. ఒకవేళ న్యూనిజుగాని, అతనికి రాయలయుదంతమును దెల్పిన వ్యక్తిగాని విజయనగరమునకు ఉదయగిరిముట్టడికి పూర్వము రాలేదేమో! ౬, ౭, ౧౦ విషయములు సంగీతసూర్యోదయమున లేకుండుట యొక్క వింతకాదు. లక్ష్మీనారాయణకవి తాను రచించిన సంగీతగ్రంథమున రాయలజైత్రయాత్రల నతిక్లుప్తముగా వర్ణించుటచేత, మిక్కిలియు ముఖ్యములగు విషయములనే లెక్కించెను. అతడువ్రాసినది రాయల దిగ్విజయచరిత్రగాక శాస్త్రగ్రంథ మగుటచేత చరిత్రను వ్రాసిన న్యూనిజంత విపులముగ వ్రాయలేక పోయెను. ఈపైజెప్పిన భేదము లంతగా పరిగణింపదగినవి కావు. రెండుపట్టికలను బోల్చిచూచిన వానికున్న ఐక్యమందతికిని తెల్లము గాగలదు. న్యూనిజ్ లక్ష్మీనారాయణ లిరువురును కృష్ణరాయలకు సమకాలికులగుటచేతను, ప్రాయశః రాయల యుద్ధములను గనులార గాంచినవారగుట చేతను రాయలకు ఏక్రమమున జయములు చేకూరినవో ఆక్రమముననే వర్ణించినారు. కావుననే వారిపట్టికల కట్టి యైక్యభావము గుదిరినది.

కృష్ణరాయల సమకాలికులగు నిరువురు గ్రంథకర్తల సాక్ష్యమువల్ల, రాయచూరు దండయాత్ర జరిగిన పిమ్మటనే కలుబరిగె ముట్టడింపబడెనని రుజువగుచున్నది. ఈదండయాత్రకు సంబంధించిన గొబ్బూరియుద్ధము క్రీ.శ. ౧౫౨౦ సం. మేనెల ౧౯వ తేది నాడు జరిగెను.1 కలుబరిగెముట్టడి నేనింతకుపూర్వము చెప్పినట్లు పై తేదికి తరువాతనే జరిగియుండవలెను. అనగా కృష్ణరాయలు కలుబరిగెను క్రీ. శ. ౧౫౨౧ లోనో తదనంతరమో ముట్టడి చేసి యుండవలయును. శ్రీ ఈశ్వరదత్తుగారనుకొన్నట్లు శా. శ ౧౪౩౬ (౧౫౧౪-౧౫) లో కృష్ణరాయలు గుల్బర్గాపై దాడివెడలలేదు. గుల్బర్గముట్టడిని బేర్కొన్న మనుచరిత్ర క్రీ. శ. ౧౫౨౧ సం. తరువాతనే వ్రాయబడెనుగాని శ్రీ ఈశ్వరదత్తుగారు 'సెలవిచ్చినట్లు' మేల్పాడి శాసనకాలమునకు అనగా ౧౬-౭-౧౫౧౫ కి పూర్వము మాత్రము కాదు. కాజాలదు.

శ్రీ ఈశ్వరదత్తుగారు ఈసందర్భమునకొన్ని ప్రశ్నలను వేసియున్నారు. "మనుచరిత్ర రాయచూరు యుద్ధానంతరమే విరచింపబడిన పెద్దన తద్దిగ్విజయముల వర్ణింపకుండును? రాయచూరు యుద్ధమును గూర్చి తబ్బిబ్బయి, కండ్లారగాంచినట్లు వ్రాసెనుగదా న్యూనిజ్! అట్టి మహాసంగ్రామము తర్వాతనే మనుచరిత్ర రచించిన పెద్దన్న తన గ్రంథమునందేల దానిని జేర్కొనకుండును? ఈప్రశ్నలకు సమాధానము చెప్పుట సులభముకాదు. మహాకావ్యరచనానిమగ్నులైన యాంధ్రకవితాపితామహులు గుల్బర్గముట్టడిని బేర్కొనియు, తత్పూర్వము నడచిన రాయచూరు యుద్ధప్రస్తావము నేల సేయలేదో నేను చెప్పజాలను. ఇది నా

1. Sewell: The Forgotten Empire: pp. 140-147.

యూహ కతీతము. నాకును నిట్టివే పెక్కుసందేహములు కలవు. శ్రీ ఈశ్వరదత్తుగారు నా సందేహములను తీర్చి లేని వారి ప్రశ్నలకు వారే సమాధానము చెప్పుకొన్నవా రగుచున్నారు: అడుగుచున్నాను:

శ్రీకృష్ణదేవరాయలు ఉదయగిరిదుర్గమును ముట్టడి వేయుటకు పూర్వము ఉమ్మత్తూరి ప్రభువగు గంగరాజు పై దండువెడలి అతని జంపి ఉమ్మత్తూరు శివసముద్ర దుర్గములను నిర్మూలము గావించెనని, విజయనగరచరి త్రాధ్యయనము సేయువారంద రెఱిగిన విషయమే. ఈ విజయములను నందితిమ్మన్న దన పారిజాతాపహరణము నందును, లక్ష్మీనారాయణకవి దనసంగీతసూర్యోదయము నందును వర్ణించియున్నారు. పెద్దన్నగారు తను మను చరిత్రయందుగాని, కృష్ణరాయలు స్వవిరచితాముక్త మాల్యదయందుగాని ఉమ్మత్తూరు దండయాత్ర ప్రస్తా వము సేయరైరి. ఏలొకో? ఒకవేళ మనుచరిత్రాముక్త మాల్యదల రచనాకాలమప్పటి కీదండయాత్ర జరిగియుం డదా? కృష్ణరాయలే రచించినాడన్న ఆముక్తమాల్య దలో న్యూనిజ్ ను తబ్బిబ్బుపఱచిన రాయచూరు మహా సంగ్రామము పేర్కొనబడలే దేదుచేతనో? "నామనవి రాయల కెంబావివిజయవర్ణనము రాయచూరు యుద్ధ మును స్ఫురింపజేయుచున్నది" అని వ్రాసినారు శ్రీ ఈశ్వరదత్తుగారు. వారివంటి విచక్షణులు జేసిన సిద్ధాం తము సరికాదని చెప్పుటకు నోరాడకున్నది నాకు. కాని పరిశోధకుల కందఱకు సత్యాన్వేషణమే పరమధర్మమగు కారణమున, రాయలు దనకు శాశ్వతకీర్తిని దెచ్చిన రాయచూరు మహాసంగ్రామమును పేర్కొనక, తత్సూచ నార్థమై కెంబావిముట్టడి నేలవర్ణించెననియు, వానికిగల పరస్పరసంబంధ మెట్టిదనియు పృచ్ఛింపవలసి యున్నది. ఆధునికచారిత్రవ్యాఖ్యాతలకు పని గల్పింపవలయు నని రాయ లిట్లు వ్రాసిరా? ఎంతటి తమాషా ప్రభువయ్యా ఈ కృష్ణదేవరాయలు! ఇంకొక ప్రశ్న: కృష్ణరాయలు ఏదులఖానుని వధించితినని చెప్పుకొనెనే ఆముక్తమాల్యద యందు. పెద్దనాది గ్రంథకర్త లీఘనకార్యము నేల ప్రశంసింపలేదు. ఇట్లే ప్రశ్నలను తండోపతండములుగ వేయుట సులభము; కాని, వీనికి దగు సమాధానముల జెప్పుట కెవరికి తరము?

## ౮. ఆపంచగౌడధాత్రీపదము

శ్రీ ఈశ్వరదత్తుగారు ఉగాదిసంచికలో వ్రాసిన వ్యాసములో కళింగదిగ్విజయము వినా మనుచరిత్రమున ప్రశంసింపబడిన ఇతరజైత్రయాత్రలను ప్రస్తావించలేదు. ఈవిషయమై ఆషాఢభారతిలో జర్చించుచు "మనుచరిత్ర లో కృష్ణరాయల కళింగదిగ్విజయమే గాక ఇతరదిగ్వి జయములుగూడ వర్ణింపబడియున్నవి" అని వ్రాసితిని. ఇవి యేవియనగా,

(౧) కలుబరిగె

(౨) ఆపంచగౌడధాత్రీపదము

భాద్రపదభారతిలో తామొనర్చిన కాలనిర్ణయ మును నిలుపుటకై వ్యాసమువ్రాయుచు శ్రీ ఈశ్వరదత్తు గారు కలుబరిగె దండయాత్రకాలమును జర్చించిరి-కాని,—

"ఆవాడపతి శకంధర సింధురా
ధ్యక్షు లరిగాపు లెవ్వాని ఖరతరాసి
కాపంచగౌడధాత్రీపదం బె
వ్వాని కసివారుగా నేసినట్టి బయలు"

అను సీసపాదద్వయము వారి దృష్టిపథమున కెక్కలేదు. కీ. శే. కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావు పంతులుగారు చాలకాలముక్రింద నీపాదములయందలి విషయమును చక్కగా చర్చించిరి.[2] అందు "శకంధర" "ఆపంచగౌడ ధాత్రీపదము" అనుమాటలపైన నిట్లు వ్యాఖ్యానము జేసి యున్నారు: "శకంధర=శకంధరుడనురాజు; పంచగౌడ ధాత్రీపదము=, కనోజీలు మొదలైనవారి యుత్తరదేశము, అని టీకాకారులు వ్రాసియున్నారు. ఇంతకన్న నధిక స్పష్టమైన యర్థమేమైన నిందుండి లాగవచ్చునేమో చూతము. ఇందలి 'శకంధర' శబ్దము "శికందర్" అను పారశీకశబ్దమునకు సంస్కృతరూపమని నాతాత్పర్యము. కృష్ణదేవరాయల కాలమున గుజరాతురాజ్యముపై శికం దర్ అను నవాబుండెను. పెద్దనచే పేర్కొనబడు

2. చూడు: లక్ష్మణరాయవ్యాసావళి: పుటలు46, 47.

గౌరవమును గన్న శరంధరు డీతడే యగునేని రాయలు గుజరాతుమీదికి క్రీ. శ. ౧౫౨౬లో వెళ్ళెనని చెప్పుటయే గాక, ఆయేడు ఫిబ్రవరి, మార్చి, యేప్రిల్ ఈమూడు నెలలో నెప్పుడో యొకప్పుడు వెళ్లెననికూడ చెప్పవచ్చును. ఎందుకన ఈతడు మూడునెలలే రాజ్యముచేసెను...... 'ఆ పంచగౌడధాత్రీపదము' లోని 'ఆఙ్' అను దానికి "మర్యాద"యనియే యర్థము తీసికొనవచ్చును; 'అభివిధి' అని తీసికొననక్కరలేదు. [ఆఙ్ మర్యాదాభివిధ్యోః పాణిని ౬. ౧-౧౩] 'ఆపంచగౌడ' అనగా పంచగౌడ దేశముదాకను అని యర్థము: పంచగౌడు లనగా, సారస్వతులు, కాన్యకుబ్జులు; మైథిలులు; గౌడులు; నుత్కళులు. గుజరాతీలు పంచద్రావిడులలోని వారేకాని, గౌడులు కారు. కనుక "ఆపంచగౌడ" మనగా గుజరాతుదేశము వఱకును అని యర్థముచేయవచ్చును. దానికి గౌడదేశము తగిలియున్నది. గనుక "ఆపంచగౌడ" పద మిచ్చట మర్యాదపరము. ఇట్లీపద్యము కృష్ణరాయని యుత్తర (నర్మదనుత్తర) దిగ్విజయయాత్రను సూచించుచున్నదని యర్థముచేసికొనవచ్చును. "ఆపంచగౌడ" దేశమనగా నర్మదకు నుత్తరముననున్న హిందూదేశమనియు సాధారణముగ నర్థముసేయవచ్చును." కృష్ణరాయలు అమదానగరమును ముట్టడించి తత్సంబంధరాష్ట్రమును స్వసేనాసాగరమున ముంచెనని బూర్హాన్-ఇ-మఅసీర్ అను మహమ్మదీయ చరిత్రవల్ల తెలియుచున్నది. ఈ సమయముననే రాయలు గుజరాతునవాబగు శికాందరుషానోడించియుండును. ఈదండయాత్ర క్రీ. శ. ౧౫౨౬ ప్రథమపాదమున నడిచినట్లు శ్రీలక్ష్మణరావుగారు చెప్పియున్నారుగదా! కావున నీ దండయాత్రను బేర్కొను మనుచరిత్రయొక్క రచనాకాలము క్రీ. శ. ౧౫౨౬ ఏప్రిలుకు తరువాతనయి యుండవలయును.

పైరెండుసీసపాదములను గమనింపక, శ్రీలక్ష్మణరావుగారు వానిని గూర్చి పడిన యభిప్రాయమును దలపెట్టక చేసిన మనుచరిత్ర రచనాకాలనిర్ణయ మెట్లు ఒప్పిదమగును? లక్ష్మణరావుగారి యభిప్రాయము తప్పుగావచ్చును; కాని తద్విషయమై మౌనము వహించి ఎఱుగనట్లు నటించుచు మనుచరిత్ర కాలనిర్ణయము సేయుట పాడియా?

నాయభిప్రాయ మేమనగా మనుచరిత్రమును పెద్దన అప్పుడప్పుడు రచించి, క్రీ. శ. ౧౫౨౬లోనో తదనంతరమో పూర్తికాగా, రాయలవారికి అంకితమొనర్చెనని. నేను వ్రాసినదానియందు తప్పులుండవచ్చును. తప్పులని సకారణముగ నిర్ధారణముజేసిన నా యభిప్రాయమును మార్చుకొనుటకు కొందఱివలెగాక సంసిద్ధుడను. అంతదనుక శ్రీఈశ్వరదత్తుగారి కాలనిర్ణయము సరియైనదికాదని దృఢముగ జెప్పగలను

---

# మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భారతి'.

---

గత మార్చిలో జరిగిన వివాహములవంటివి యిక జరుగవలసివచ్చినయెడల
మా చిత్రకారుని సలహానుపొందిన పెండ్లి కాదను భయముండదు.





# శాంత

'ఆచార్య'

రోమపాదేన చాఽఽఖ్యాతం
ఋషిపుత్రాయ ధీమతే,
సఖ్యం సంబంధకం చైవ
తదా తం ప్రత్యపూజయత్.

రామాయణ, బాల, ౧౧-౧౭.

(సంబంధకం శాంతాయా జనకపితృత్వరూపసంబంధం, ప్రత్యపూజయత్ ఋశ్యశృంగ ఇతి శేషః.)

—గోవిందరాజీయ వ్యాఖ్య.

అంగరాజేన సఖ్యం చ తస్య రాజ్ఞో భవిష్యతి,
కన్యా చాఽస్య మహాభాగా శాంతా నామ భవిష్యతి.

—బా॥. ౧౧-౩.

(రా. టీ.) తస్య ప్రసిద్ధస్య రాజ్ఞః దశరథస్య రోమపాదేన సాకం సఖ్యం భవిష్యతి. అంగం స్వపేతరం రాజయతి, తద్వత్ రాజతేవా, తేన అంగరాజేన. అస్య రాజ్ఞః దశరథస్య శాంతానామ కన్యా భవిష్యతి. చకారేణ కన్యాద్వారా వంశప్రరోహణాయ దశరథదత్త శాంతా కన్యాత్వేన రోమపాదేన గృహీతా ఇతి తస్యాపి కన్యా శాంతా భవిష్యతి. యత్తు అస్యేత్యనేన అంగరాజ పరామర్శః, తత్ సర్వనామ్నా ముత్సర్గతః ప్రధాన పరామర్శిత్వ మితినియమవిరోధాత్, ప్రత్యాసత్తి న్యాయవిరోధాచ్చ, 'రోమపాద ఇతిఖ్యాతః తస్మై దశరథ స్సఖా, శాంతాం స్వకన్యాం ప్రాయచ్ఛత్ ఋష్యశృంగ ఉవాహ తాం, ఇతిభాగవతవిరోధాచ్చ హేయమ్.

ఆవల రోమపాదవసు
ధాధిపుజూడ నతండు నెయ్యముః
భావనచేసి పూజల న
పారముగా ఘటియించి తుష్టుడై
పావనశీల నా కితడు
బంధువు నెయ్యుడు స్వాత్మజాత శాం
తావరవర్ణి నీమణిని
నాకు గుమారితగా నొసంగుటః.

మామయటౌట నీ కితడు
మాన్యచరిత్రక నేనుబోలెనం
చామహితాత్ము డల్లగని
యాడిన నాతడు గౌరవింపగం
దామొగి నేడునెన్మిది ది
నంబులు నచ్చోట నిల్చి యాజి యో
భూమిప పంపవే హితుని
ప్రోలు గనుంగొన గూతు నల్లునిః.

శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము.

ఇందువలన శాంతకు దశరథుడే జనకపిత యని తెలియుచున్నది. మహాకవి భవభూతి కూడ దశరథునినే జనకపితగా నిరూపించి యున్నాడు.

కన్యాం దశరథో రాజా
శాంతాం నామ వ్యజీ జనత్,
అపత్య కృతికాం రాజ్ఞే
రోమపాదాయ తాం దదౌ. ఉ. రా. చ.

రోమపాదుడు పోషకపిత. అత డనపత్యుడై మిత్రుడగు దశరథునిచెంతకు వచ్చి యతని తనూజయగు శాంతను దత్తిమపుత్రికగా దన కిమ్మని కోరెను. దశరథుడును మిత్రుని ప్రార్థనకు మారుపల్కక వల్లెయని కన్నియ

నిచ్చివైచెను. అప్పటినుండియు రోమపాదుడే శాంతను పోషించుచు వచ్చెను.

అపుత్ర స్త్వంగరాజోవై
  రోమపాద ఇతిశ్రుతః
స రాజానం దశరథం
  ప్రార్థయిష్యతి భూమిపః.
అనపత్యోఽస్మి మే కన్యాం
  సఖేదాతుం త్వమర్హసి.
శాంతాం శాంతేన మనసా
  పుత్రార్థే వరవర్ణినీం
శ్రుత్వా దశరథో వాక్యం
  ప్రకృత్యా కరుణాత్మకం
దాస్యతే శాం తదా కన్యాం
  స రాజా విగతజ్వరః
స్వపురం యాస్యతి ప్రీతః
  కృతార్థే నాంతరాత్మనా.

రామాయణము.

ఇందువలన శాంత దశరథతనూజయని తేటతెల్లము. ఇక దశరథు డామె నేపత్ని యందు బడసెను? ఇందులకు సమాధానము రామాయణమునం దెచ్చటను గానరాదు. భవభూతి తన యుత్తరరామచరితమున నించుక తడవినాడు.

రామః:—నిర్విఘ్నః సోమపీథీ ఆవుత్తో మే భగవాన్ ఋశ్యశృంగః, ఆర్యాచ శాంతా.

అష్టా:—ననాందుః పత్యా దేవ్యా స్సంగోప్తృ ఋశ్యశృంగేణ. 'వత్సే! కఠోరగర్భేతి నా ఽఽ నీతాసి...

ప్రథమాంకము

ఋశ్యశృంగుడు రామున కావుత్తుడట. ఆవుత్తుడనగా సోదరిమగడు. ఇక సీతకు ననాంద్రుపతి యట. ననాంద యనగా వదినె లేక ఆడుబిడ్డ, అమెకు మగడు ఋశ్యశృంగుడు. ఈ బాంధవ్యమువలన శాంత రామునకు సోదరి అనగా కౌసల్యా తనూజ యనియే దృఢముగ తెలియుచున్నది. కాని యీ శాంత జనన వృత్తాంతము రామాయణమునం దెచ్చటను కానరాకుండుట వింతగ నున్నది.

* విచిత్రరామాయణమున నీ శాంత జననవృత్తాంత మీక్రింది విధముగ నున్నది.

దశరథునకు నమరేంద్రునకు నమితస్నేహము. అగుట దశరథు డప్పుడప్పుడు స్వర్గమునకు పోయివచ్చుచుండుట వాడుక. అటుపోవునపుడు స్వర్గప్రాంతప్రదేశముల సంచరించుచుండు కామధేనువునకు భక్తిమై ప్రదక్షిణ నమస్కారము లాచరించి, తదాశీస్సుల బడసి మరి వెళ్లుచుండెను. స్వర్గమునుండి మరల తిరిగి అయోధ్యకు వెళ్లునప్పుడు నిదేవిధముగ జేయుచుండెడివాడు.

ఇట్లుండ నొకనాడు దశరథుడు పేరోలగమున నుండ నొక దేవదూత యరుగుదెంచి తానమరేంద్రుపనుపున వచ్చితిననియు, ఏదో యుత్సవము జేయగోరి దేవేంద్రుడు వారి రాక నభిలషించుచున్నారనియు, కాన త్వరితముగ నాయితము కండనియు దశరథునితో విన్నవించెను. దశరథుడును దేవేంద్రు నాజ్ఞ మీరజాలక ప్రయాణమునకు సిద్ధమయ్యెను. ఇంత

* విచిత్రరామాయణ మను నీప్రబంధము సోమనాథశిల్పిచే నాంధ్రమున రచింపబడినది. ఈ గ్రంథ మింతవరకు ముద్రితము కాలేదు.

తో నంతఃపురపరిచారిక యొకర్తు పరుగుపరుగున పరుగుదెంచి, 'దేవి కౌసల్య ఋతుమతి యయ్యె' నని విన్నవించెను. ఇట్టి సంకటమున దశరథు డేమి జేయగలడు? అమరేంద్రు నాజ్ఞకు దాట బోలదని స్వర్గపురికి బయలుదేరెను.

ఈమారు చింతాపరవశతచే రాజచంద్రుడు సురభికి మ్రొక్క మరచెను. స్వర్గమునకు వెళ్లియుత్సవంబు దర్శించిపురుహూతు ననుమతిమై అయోధ్యకు మరలి కొంతదూరము వచ్చిన పిదప నతనికి సురభిమాట జ్ఞప్తికి వచ్చెను. తొందరగ వెనుదిరిగి సురభిని సమీపించి, 'అపరాధము సైరింపు'మని పాదములపై బడెను. సురభియు తన్నాదరించెకదా యన్న కోపమున నతనిని 'అనపత్యుడవు క'మ్మని శపించెను. అంత దశరథుడు భీతిచే మరిమరి ప్రణమిల్లి శాప ముపసంహరించి యనుగ్రహింప వేడెను. వేడగా ప్రసన్నయై యాసురభి 'పొమ్మి కొన్నిరోజులకు నాయనుగ్రహంబున నీకొకసుత జనించును. అటుపై గొన్నిరోజులకు సుతులును జనింతు' రని యనుగ్రహించి పంపివైచెను.

దశరథుడు సంతుష్టుడై యయోధ్యకు వెళ్లి కౌసల్య ఋతుస్నాతయయిన రాత్రి యామెతో గూడుటయు నామెకు గర్భంబు నిలచి నవమాసంబులు పూర్ణంబుకాగా నొక శుభదినంబున నొక కుమారికం గనెను. సకల జనంబులును సంతసమందిరి. దశరథుండును ఆశిశువుకు జాతకర్మాదుల నెరవేర్చి యిరువదియొకటవ రోజున నామకరణోత్సవం బొనర్చి కులగురుడగు వసిష్ఠుని యనుమతంబున శాంతయను నామధేయం బిడెను. ఆబాలికయు శుక్లపక్షపు జాబిల్లి రేకయుంబోలె దినదినాభివృద్ధి గాంచుచు క్రమముగ యౌవనవతి యయ్యెను. అంతట దశరథుడు తనూజకు తగిన వరుని గూర్పదలచి స్వయంవరమని దేశదేశముల జాటబంచెను. ఇక నేమున్నది? నానాదేశములనుండి యాయా రాజులందరు స్వయంవరార్థమై సాకేతపురికి వెళ్లిరి.

హఠాత్తుగ నీసంరంభమునంతయు నాలకించి పరశురాముడు దుదగ్రకోపుడై స్వయంవరమంటపమున నావిర్భవించెను. రాజులందరు నాతనింగని సింగముంగన్న లేళ్ల చందంబున పరుగిడ జొచ్చిరి. పరశురాముడు దశరథుని సమీపించి, 'ఈకాంతను క్షత్రియకుమారుల కీక భూదేవున కర్పింపుము. అటుల వాగ్దానమిమ్ము. లేనిచో నిదేయీ పరశువుచే నీశిరము దునిమెద'నని క్రోధారుణిత నేత్రుడై వచింప దశరథుండును వేరుగతి గానక అందుల కొడంబడెను. భృగురాముడును నిజాశ్రమమున కరిగెను.

ఇక చేయున దేమున్నది? శాంతను భూసురునకివ్వక తప్పినదికాదు. వసిష్ఠుడును,' దానను శుభంబే చేకురును, చింతిల్లకు'మని యానతిచ్చెను. అటుమీద గొన్నిరోజులు గడచెను. శాంతను అనపత్యుడగు రోమపాదుడు దశరథుని అంగీకారముపై తనవద్దనే యుంచుకొని

పోషించుచుండెను. ఒకానొకప్పుడు అంగదేశమున నమితమగు ననావృష్టి సంభవించెను. ప్రజయంతయు తల్లడిల్లి పోవుచుండెను. మంత్రులు సమీపించి విభండకుపట్టియగు ఋశ్యశృంగమహర్షి నిటకు రావించినచో నీ బాధ తొలగునని చెప్పిరి. రోమపాదుడును విభండకసుతుడగు ఋశ్యశృంగుని రావించెను. ఆ మహర్షి అడుగిడినంత దేశమునందంతయు సువృష్టిగల్గెను. రోమపాదుండు సంతుష్టహృదయుడై యామహర్షిని తగువిధంబున బూజించి ప్రతిఫలంబుగ శాంత నామునివర్యున కిచ్చి పెండ్లి జేసెను.

ఈ ఋశ్యశృంగుని యనుగ్రహంబుననే దశరథుడు పుత్రకామేష్టి గావించి నల్గురు సుతుల బడసినది.

---



---



## మహావాక్యములు

### ఆత్మ

అఖిలజగము లాత్మమయము
ఎల్లప్రాణులీశు సృష్టి
సర్వభూతసముఁడు విభుఁడు
ఎల్లప్రాణు లీశు నంశ
ఎల్లప్రజ లీశుఁ జెందు
ఎల్లనదులు నేక మబ్ధి
ఎల్లజగము లేక మాత్మ
ఆత్మకంటె నన్యమసదు
ఎల్లజగము లీశు నంశ
ఆత్మలు పరమాత్మ నంశ

### మతము

మనసు లెన్నొ మతములన్ని
మంత్రతీర్థ మతములందు
భావనలను బట్టి సిద్ధి
ఎల్లెడఁ గనునీశు బుధుఁడు

### ఎఱుక

సర్వభావసమత యెఱుక
నిత్యసత్యనిష్ఠ యెఱుక
ఆత్మసర్వమనుట యెఱుక
సర్వభూతసమత యెఱుక
అఖిలము తనయందుఁ దన్న
నఖిల మందునరయు టెఱుక
సత్యమొకటె చాలు తేర్ప
శమమొకటియె చాలు తేర్ప
దమమొకటియె తారకమగు
ధర్మమొకటె తారకమగు
ఏకతరయు నేడవేతలు
గాఢనిద్ర కలుపునీశు
జ్ఞాని కుండు పతతముదము

### సాయం సంధ్య

భానుదీప్తి పాయునంత
సంజ జగము శాంతిఁగనును
సృష్టిశోభఁ జిత్తములరు
ఈశుమహిమ యెదను గదరు
పలువిధముల ధ్వనులెగయుచు
పక్షితతులు పసునుగూళ్ల
పసులుమంద పట్లకేఁగు
అరసి లేఁగ లరచుచుండ
నత్తురు పనివాండ్రు బసకు
పడమరఁ బలువన్నె లెగయు
బింబరశ్మి భిన్నమగుడు
చల్లగాలు లుల్లసిల్లు
మల్లెజాజి మాలతివిడు
ఆకసంబు నానునీలి
ఒక్కొకటిగ చుక్క లెక్క
గబ్బిలములు కాంచియెగురు

పిల్లలుంద్రు వీధివాట,
ఇండ్లపయిని నెగయును పోగ
సృష్టిశోభల జిత్తమలరు
ఈశుమహిమ యెదను గదరు.

విద్వాన్, గరిమెళ్ల సోమన్న, యం.ఏ, యల్.టి.

---

## తేలు

గత శుక్లవత్సర చైత్రమాస (౧౯-౫-ఏప్రిల్) "భారతి"పత్రికలో శ్రీయుత, దిగుమర్తి సాంబశివరావు గారు, "తేలు" అను శీర్షికక్రింద వాటి వృద్ధిక్షయములున్ను, ఆకారవిలక్షణములున్ను, విషాతివిష భేద హేతువున్ను, వివరించుచు చికిత్సాసరణినిన్నీ వ్యక్తీకరించియుండిరి.

దానియందు వారిచే నిర్ణయించబడిన త్రివిధమైన చికిత్సలలో మొదటిదానిని విడనాడి మిగిలిన రెంటిని వాడిమాచితిని. చాలావరకు గుణము గన్పించుచునే యున్నది. అందునను మూడవదైన చికిత్సావిషయమై ప్రస్తుతము నేదెల్పునది ఏమన !

తేళ్లతో తయారు కాబడిన కిరసనాయిల్‌ను ప్రయోగించిన తక్షణమే,

౧. శరీరము స్తబ్ధత్వమొందుట, ౨. చెమటపట్టుట, 3. నాడీస్పందనము తగ్గుట, ౪. శరీరము చల్లబడుట, ౫. ముంపులు వచ్చుట. ఈలక్షణములలో కొన్ని స్పష్టముగా గన్పించుచున్నవి. ప్రాణహాని గలుగునేమో యని శంక గల్గకమానదు. ౮౦ గురికి, ౯ మాత్రము ఈస్థితిలోకి వచ్చియున్నవి. పూర్తిగ నుపశమించినవారు ౧౭ గురు. మిగిలినవారికి పూర్తిగా శాంతిమాత్రము కాలేదు.

N. B. బాధయొక్క శాంతి యున్నను లేకపోయినను పై ౫ లక్షణములు గన్పించుట మిక్కిలి ప్రమాదకరము. ఈలక్షణములు ఈఔషధగుణమా? తేళ్ల ప్రభావమా? ఇంకెవరైనను తయారుజేసిన, వారికిన్నీ ఇట్టి లక్షణములుగాని, మరేదైననుగాని, గన్పట్టెనా? లేదా? ప్రథమమున దీనిని గనిపెట్టిన వీరికి పైలక్షణములలో కొన్నియైనను సంబంధించినవా? లేదా?

N. B. కేవలము తేళ్లయొక్క ప్రమాదమునలననే యిట్టిరూపములు సంభవించుట ప్రాయికముగ గన్పట్టుటలేదు.

కాన, ఈపత్రికాముఖముననే ఏతద్విషయపరీక్షకులు విశేషముల ప్రచురింపగోరుచున్నాను.

డాక్టరు యస్. కె. వి. భట్టరు, ఎ.వి.ఎ.సి.గారు.

---

## కవి*

౧. ఎవ్వని వాణియందు దివ్యప్రేరణగలదో, వాడే కవి.— ప్లేటో.

౨. సత్యమును, శివమును, సుందరమును నైనది కవిత. యతీంద్రమోహనుడు

3. అస్పృశ్యమైన యొకశక్తియొక్క గుప్తచ్ఛాయ మనయందు సంచరించుచున్నది. అఛాయ చంచలమును, మధురమును, రహస్యమయమును నయియున్నది. అదియే నాకు ప్రియము. దాని ఉత్పత్తిచే నా పూర్ణతయు, అభావముచే నా నాశనమును అగును. షెల్లీ.

౪. కవి ప్రపంచశిక్షకుడు కాని అతడు నీతిచే శిక్ష నొసగడు. సౌందర్యముయొక్క చరమోత్కర్షచేతనే సంసారముయొక్క చిత్తమును శుద్ధముచేయును.

బంకించంద్రుడు.

౫. కావ్యకర్తలే వంగనీయులు, మహాత్ములు. వారికీర్తియే సంసారమున అమరమగును.

భట్టత్రివిక్రముడు.

౬. జలస్థలములందు బడయరాని దివ్యజ్యోతి కవిస్వప్నమందే గలదు. ఒక యూరపువిద్వాంసుడు.

౭. కవి సంసారప్రేమి. అతని జీవనాధారము అనంతప్రేమ. ఇతరులకు విఘ్నస్వరూపమైనది అతని

---

* హిందీ 'మాధురీ' నుండి పరివర్తితము.

ప్రేమానలమున కాహుతి యగును. దానిసంపర్కముచే వాని ఆనంద మధికమగును. అతని కెట్టిబాధయు లేదు. అతడు సంసారమును తనయందున్, తన్ను సంసారము నందును గనుచుండును. హ్విట్ మెన్.

౮. కవి భావగ్రహణమునకు ప్రయత్నించుకొలది అది ఆతనిని పైకి లాగును. కవి ఇదియే అతృప్తి. కవి యిచ్చటికే అంతమని తలచిన తక్షణమే అది అంత్యముగాక ఆరంభము మాత్రమే యని చూడగలడు. శివకృష్ణుడు.

౯. కవి సత్యోపలబ్ధిని బడసినప్పుడే సత్యప్రకాశము సహజసుందరమని తెలిసికొనగలడు. రవీంద్రనాథుడు.

౧౦. నేను కేవలశరీరప్రాణానుభవమును గోరుచున్నాను. విచారముగాదు. కీట్సు.

౧౧. స్త్రీలయొక్క ప్రసిద్ధాంగములు గాక లావణ్య మొక విలక్షణశోభను జూపునట్లు మహాకవుల వాణియందును ప్రత్యేకవిశేషము గలదు.

ఆనందవర్ధనుడు.

౧౨. కవి స్వర్గమర్త్యపాతాళరసాతలములందు తన 'అహం' ప్రసారముజేసి ఒక అపూర్వస్ఫూర్తియు, మహోల్లాసమును ప్రకటించుచున్నాడు. అతడు తుమ్మెదయై పూలరావాలను మేసుమై ఆకాశమున పరుగెత్తును. ఘాతకుడై హత్యసేయును. సత్యసుందరుడు.

౧౩. దుఃఖాఘాతము లెవ్వని జీవితమందు లేవో, వాని కవిత్వసాధన విడంబనమాత్రము. ప్రకృతమందు స్వానుభవము లేనిది కవి వ్రాయుడు.—గిరీశ చంద్రుడు.

౧౪. కవి ఆత్మలేఖకుడు. డిజరైలా.

౧౫. కవి కఠినతత్త్వములను తనబుద్ధిచే సులభము చేయును. దానిచే లోకోపకారమగును. జల్హాణ.

౧౬. భావుకత, కల్పన కవిత్వముయొక్క ప్రధాన గుణములు. తరళకోమలహృదయమును, హృదయమందు భావసమీరప్రహారములచే తరంగోత్పత్తియు ఆ తరంగమూర్తుల మధురశబ్దముచే చిత్రింపగలశక్తియు గలవాడు కవి. చంద్రశేఖరముఖోపాధ్యాయుడు.

౧౭. సౌందర్యసృష్టియు, సౌందర్యమును చక్షుఃకర్ణవిషయీభూత మొనర్పుటయు కవికృత్యము.—

హేగెల్.

౧౮. ఒకానొక స్థానమునుగాని వస్తువునుగాని వర్ణించినపు డది కన్నులకు గట్టినట్లుండనిచో వాడు కవి గాదు. మహావీరప్రసాదద్వివేదీ.

౧౯. కవికృత్యము శిక్షణ నొసంగుటయు, మార్గదర్శక డగుటయు గాదు. ఉత్తేజితము, సజీవము, ఉచ్ఛ్వసితము, శక్తిసంపన్నము, ప్రసన్న మొనర్చుటయయి యున్నది. శ్యామసుందరదాస్.

౨౦. కవికి కవిత్వము జెప్పునప్పుడు చైతన్య ముండదు. ఒకదైవశక్తి యాతని లేఖినిని నడపును. ఆతని మానసికావస్థ పిచ్చివానిమాదిరిగా నుండును.—బాణుడు.

౨౧. సాహిత్యజ్ఞులకు దప్ప కవుల గుణములు ఇతరత్ర ప్రసిద్ధములుగావు. నీటియందే తైలబిందువు విస్తారత నొందును. అన్యత్ర గాదు.—మంఖుకుడు.

—'మాధురి' అను హిందీమాసపత్రిక నుండి.

---

## సాళువ నరసింగరాయల చిత్రదుర్గపు ముట్టడి

శక సం॥ ౧౪౧౨ అగు వర్తమాన విక్రమసంవత్సరమునందు ఈ తిమ్మణ్ణనాయకు విశేషముగ ప్రబలినాడనియు, వానిని అణగగొట్టవలయుననియు విజయనగరసంస్థానంవారు వీరసాళ్వ నరసింగరాయని సేనతో గూడ పంపిరి. ఈదండు (చిత్రదుర్గమునకు) తూర్పుదిక్కున కానాపురముబయలున వచ్చినిలిచెను. దీని నెదిరి తిమ్మణ్ణనాయకుడు విశేషపరాక్రమముతో శత్రువులను జయించెను.

ఈయుద్ధమున ఆచంద్రార్కము ఎల్లవారును జ్ఞాపకముంచుకొనదగిన మహాసాహసకృత్య మొకటి నడచెను. శత్రువులు దుర్గముండు తిప్పను ముట్టడివేయుటకువచ్చి కానాపురబయలునందు విడిసియుండగా, ఒకదినము అర్ధరాత్రికాలమున, పాళెయములోని సైనికు లందఱు శయనించి నిద్రించుచున్నప్పుడు, తిమ్మణ్ణ నాయకుడు ఒంటరియై దొంగతనముగ పాళెయమును జొచ్చి, సేనాపతి

యకు సాళో నరసింగరాయలయొక్క ఖాసాగుఱ్ఱమును కట్టియున్న స్థలమునకుబోయి కొంచెమైన చప్పుడుసేయక, దాని (గుఱ్ఱపు) అగాడి పిచ్చాడీలను విప్పుచుండెను. అప్పుడు సదరు గుఱ్ఱము బెదరి చప్పుడుచేసెను. గుఱ్ఱపు వానికి మెలకువరాగా వాడు కండ్లుపులుముకొనజొచ్చెను. తిమ్మణ్ణనాయకుడు గుఱ్ఱపువానికి కనుపడకుండువట్లు, నేలపై బరుండి అచ్చటున్న గడ్డితో తన్ను గప్పుకొనెను. గుఱ్ఱపువాడు పెరికివేయబడిన గుఱ్ఱపుగూటమును నేల మీదనిలిపి గట్టిగ మోదెను. ఆగూటము, పడుకొని చాచి తెరచియున్న తిమ్మన్ననాయకుని అరచేతిమధ్యభాగము గుండ బలముగా (దిగ) గొట్టబడెను. తరువాత, గుఱ్ఱపు వాడు గుఱ్ఱమును సదరుగూటమునకే కట్టివేసి పండు కొనెను. వాడు నిద్రపోవుటను జూచి పాళెయగాడు (తిమ్మణ్ణ) తన యెడమచేతితో మొల నున్న బాకును ఒరనుండిదూసి దానితో తనకుడిచేతిమణికట్టును నరికి లేచి నిలుచుకొని మొండిచేతికి బట్టను జుట్టి,—అదేగుఱ్ఱమును విప్పి దానిపైనెక్కి కొండమీది దుర్గమునకు బోయెను. ఈసాహసము ఇంతటితో నిలువలేదు. మరుసటిరోజున సాళోనరసింగరాయలు కూర్చొని (స్వారిచేయు) ఖాసా యేనుగును, దుర్గమున్న (కొండ) సానువునందుండు తిమ్మణ్ణనాయకుని చెరువునకు నీరు త్రాగుటకు (మావటి వాండ్రు) తోలుకొనివచ్చిరి. ఇదిపాళెయగానికి (తిమ్మ ణ్ణనాయకునికి) తెలిసెను. అతడు తత్‌క్షణమే లేచి, ధను స్సును తెప్పించి దానిని కాలితోతొక్కిపట్టి అమ్మరివోసి, యేనుగుఫాలమునకు గురిపెట్టి, ఎడమచేతితో (నారిని) లాగివిడిచెను. శర మాకరియొక్క భ్రూమధ్యమున దగులుట చేత (నది) ఘీంకారము సేయుచు నొకపెట్టున నేలబడి జీవమును విడిచెను.

అప్పుడు శత్రువులు మరల ముట్టడివేసిరి. తిమ్మ ణ్ణనాయకుడు స్వపరివారమును గుట్ట వెనుకటి భాగము నకుచేర్చి తనవద్దనున్న గురికాండ్రనున్ను, బిడ్డలను పిలిచి ఏమిసేయవలయునని యడుగగా వారు ప్రభువును జూచి, "మహాస్వామికి మేము మిమ్ముద్రోహముసేయము. రాజీ మాటలాడము. మీచెంగట ప్రాణములను విడుచుటకు సిద్ధముగ నున్నాము. ఇందుకు మేము తప్పిన సిద్ధయ్య, రంగయ్య, చిత్రదేవులకు దప్పినవారమని భావించవల యును" అని జవాబుచెప్పి ప్రమాణముచేసి, ఘోరముగ యుద్ధము చేసిరి. శత్రువులకు దుర్గము వశముకాలేదు.

ఈసమయమందు కలుబర్గివారు విశేషవైరా టోపమును చూపగా (వారి) పట్టణమును ముట్టడించి, దానిని తీసికొమ్మని ఆనెగొందిరాయలు సాళో నరసింగ రాయలకు నిరూపమును బంపెను. అందుమీదట, అతడు పోయి ఆపట్టణమునకు ముట్టడివేసెను. కాని కోటలో పలి దళపతి సమర్థు డగుటచేత వానిపై నరసింగరాయల చేయిసాగలేదు. ఈకారణమువల్ల ఆనెగొంది రాజు తిమ్మణ్ణనాయకునికి, "నీచేయి చూడవలయును, నీవు కలుబర్గెకుపోయి ఆయూరిని లగ్గపట్టి తీసుకొనవలయును" అని నిరూపమును పంపెను. దానికి తిమ్మణ్ణనాయకుడు, "సాళో నరసింగరాయలు కలుబర్గికి ముట్టడివేసి ౬నెలలు అయినవి. ఇంకను దానిని సాధించలేదు. ఏలినవారు నాచేతిని చూడవలయునన్న, నేను కలుబర్గెను పట్టుకొను టకు అవకాశము యివ్వవలయును. ఆవూరిని నేను తీసు కొనువఱకు మీదర్శనమునకు రాను." అని ప్రత్యుత్తరమం పెను. "అట్లే చేయవచ్చునని రాయలవారు వుత్తరవు దయచేసిరి. అందుమీద శకం ౧౪౦౮ చిత్రభాను సం. వైశాఖమాసములో తిమ్మణ్ణ నాయకుడు తనకుమారుడు మదకరియను దర్యన్నపు ఓబళన్నను, దొడ్డన్నను, గులిపి నాయకుని మఱికొందఱితోకూడ దుర్గమున నిలిపి, అంణ గార ఓబళన్నను ౨౦౦౦ సిబ్బందితోగూడ తనవెంట దోడ్కొని తన ఇలువేల్పు లుండు చెరువుకట్టకు బోయి (మరలి) వచ్చి, శ్రీ రంగనాథస్వామిని సేవించ్చి, కలు బర్గెకు వెళ్లెను. అచ్చట సాళో నరసింగరాయలను చూచి మాటాడి, అతని ముట్టడిని ఆపి, "కలుబర్గె లగ్గవట్టెదను. వుత్తరువు దయచేయవలయు"నని కోరెను. దీనికి నర సింగరాయలు అంగీకరించి యాజ్ఞయిచ్చెను.

అప్పుడు దుర్గపునాయకుడు (?) ౨౦౦౦ దూది మూటలను తెప్పించి కలుబర్గెయొక్క అగడ్తలో వేయించి జ్యేష్ఠ శు ౫ నాడు వేకువజామున యుద్ధమును ఆరంభిం చెను. కొంతసిబ్బందితో అంణగార ఓబళన్న ఒకప్రక్కను, కొందఱుపాళెగాండ్రు మరియొకప్రక్కను నిలిచి లగ్గవట్టి

సూర్యోదయమైన అంగడియకుకోటనుబట్టుకొనిరి. తింమణ్ణ నాయకునితట్టు జనులు వూరిలోని జనులకు నరుకగా ప్రవహించిన రక్తము వూరిగవనులో మోకాటిలోతున పారెను. అప్పుడు సాళో నరసింగరాయలు వచ్చి ఇక చాలుననిచెప్పి తిమ్మన్న నాయకుని పిలుచుకొనిపోవును. సంధిని చేసెను. కోటరాణ్యామైన విషయమును విన్నవించి

అతడు తింమణ్ణనాయకుని విజయనగరమునకు తీసికొని పోయి రాయలభేటి చేయించెను. అప్పుడు రాయలు బహుప్రీతితోచూచి మూడునెలలవఱకు దుర్గపుపాళెయగాని (తనయొద్ద)నుంచుకొని బంగారు ములామచేసిన గొప్పశంఖచక్రముల జత ౧, అందళమున్న ముసలినోళ్ల (మకరకుండలము)జత ౧, పిరంగి ౧, గొడుగు ౧, బంగారు చెయ్యి ౧, పగలుదివటి ౧, యితరమైన ఉడుగరలతో సహా ఇచ్చి హగలు, గోలేమాన్య అని పొగడుటకు భట్రాజుల నిచ్చి దుర్గమునకు బంపెను.

[చిత్రదుర్గపాళెయగాండ్ర చరిత్రనుండి యాంధ్రీకరణము.]

యన్. వెంకటరమణయ్య.

---

## వ్యాయామము

### 'జొసెల్ఫ్ యో'గారి అభ్యాసములు



చిత్రము ౭

నేలపై బోరగిల పరుండవలెను. చేతులను రొమ్మునకు చేరికగ క్రిందనుంచి చిత్రమునందున్నట్లు భుజములను వెనుకకును, వీపును క్రిందికిని బాగుగావంచి మీదశరీరమును పైకెత్తవలెను. ఇట్లు చేయుటవలన వీపు క్రిందిభాగము గట్టిపడి ఎటువంచిన నటువంగును. బుజములు సువృత్తములగును. —టైమ్సు ఆఫ్ ఇండియా వారపత్రిక 27-17-930.

---

## నేటి భారతీయస్త్రీలు

బ్రిటిష్ వర్తకసంఘపు టధ్యక్షుడగు విల్లియం గ్రహాముగారి సతి లండనునగరమున బ్రిటిషుస్త్రీల సమావేశమునందు భారత దేశమును గురించి తాను ఇచ్చిన ప్రత్యేకోప న్యాసమున నేటి భారతీయస్త్రీలను గురించి చాలా చక్కగా గుర్తించిరి. ఆమెయొక్క సమగ్రోపన్యాసము 'స్త్రీధర్మ' అను పత్రిక యందు ప్రచురింపబడి యున్నది. అందునుండి యీక్రిందిభాగము నెత్తి వ్రాయుచున్నాము.

స్వాతంత్ర్యమును పొందగోరు స్త్రీలకు మనము చేయదగినది — రాజకీయముగాని మరియే యితరమైన రాజభక్తిగాని నెరవేర్పజాలనిది — ఒకకార్యము గలదు. భారతదేశమందలి సాంఘికోపద్రవములను విన్నప్పుడు భయమున చేతులు త్రిప్పుచు 'భారతీయస్త్రీలకు మన మేమి సహాయము చేయగల' మని యడుగు స్త్రీలీదేశమున గలరు. వారి రక్షణభారమును వారికే వదలినచో భారత దేశస్త్రీలు తమ్ము కాపాడుకొనుటయందు బహుసమర్థలు. భారతీయస్త్రీలు తొలుత భారతీయులు, పిదపస్త్రీలును అయి యున్నారు.

సంఘసంస్కరణమున వారే మొదటివారు. వారు సుశిక్షితలు. భారతీయస్త్రీల సంఘ మొక ప్రబలమైన సంఘము. మద్రాసు శాసనసభకు ఏకగ్రీవముగా రెండు పర్యాయము లెన్నుకొనబడి, అందు పదిసంవత్సరముల ద్వితీయకాల ముపవక్తగానుండి యిప్పుడిప్పుడే ఈసభ కు పాధ్యక్షురాలుగా నున్నవారి వద్దనుండి వచ్చిన సందేశ మును నే డీసమావేశమున చదువజాలినందులకు నాకు సంతస మగుచున్నది. ఆసభను మొదలుపెట్టి, దానికి అధ్యక్షురాలుగా నున్న డా. బిసంటమ్మయు, ఆ సభకు లండను ప్రతినిధి యగు హన్నా సేనుసతియు నిందే యున్నారు అప్పుడప్పుడు ఆసభకార్యదర్శినులను, ఇతరులను మాచియున్నాము. భారతీయస్త్రీలు ఈసం ఘము ద్వారమునను, ఇతర సంఘముల ద్వారమునను నాకాశ్చర్యమును గొల్పిన పనుల నెన్నిటినో నెరవేర్చి నారు. విద్యయందును, బాల్యవివాహసంస్కరణమం దును, అస్పృశ్యతానివారణమందును, మద్యపాన నిషే ధమునందును, దురాచారఖండనమందును, మరియు జాతీయాభివృద్ధికగు ప్రతికార్యమునందును భారతీయ స్త్రీలు చాలా పాటుపడుచున్నారు. స్త్రీత్వమును గూర్చి యుపన్యసించుట కాదు మనపని. కాని మనము వారికి తగులగట్టిన నిర్బంధములను తొల గించుటయే. ఆమాత్రము చేసినయెడల మనము చేయవల సినదంతయు చేసినట్లే. ఆవిషయమై మనము సిగ్గుపడిన యెడల మనయొక్క సద్భావమునుగురించి మన మే సందే హమునకు అవకాశ మిచ్చినవార మగుదుము. భారతదే శమునకు సమభావమును, స్వాతంత్ర్యము నివ్వనిదే మీరు భారతీయస్త్రీల సమభావము కోఱకుగాని స్వాతంత్ర్యము కోఱకుగాని పనిచేయజాలరు. ఈయాశయమును మాతో బ్రిటిష్ సామ్రాజ్యమున గల స్త్రీలకు పౌరస్వామ్యమున సమభావమును సంపాదింప బాటుపడుచున్నవారికి వదలి వేయుచున్నాను. భారతదేశమందలి స్త్రీలను నీచస్థితి యందుంచుచున్నది మనముకాని భారతీయులు కారు.

భారతదేశపు స్త్రీలు మన వాచికానుతాపమును కోరుటలేదు. వారు తమ దేశవిషయమున మిక్కిలి ఆతురపడుచున్నారు. భారతదేశమున జాతీయజీవిత మునందుగాని, గృహనిర్వాహమునందుగాని వారి ప్రభావ మమితము. వారిలో కొందరు నేడు కారాగారమం దున్నారు. కాని కారాగారము భారతదేశపు బిడ్డల నందరిని తనయందిముడ్చుకొనజాలదు. భారతీయస్త్రీలను కారాగృహములందుంచినంతమాత్రముననే మనము మన సరకుల నమ్ముకొని మనసామ్రాజ్యపు యశస్సును పోషించుకొనజాలునెడల మనమే సామ్రాజ్యమునుండి తొలగ జూతము.

(మాడర్న్ రివ్యూ)




## ఆంధ్రీకృత ప్రసన్నరాఘవ నాటకము

డిమ్మిసైజున ౧౪౭ పుటలు, వెల రు. ౧-౦-౦

అనువాదమననేమో, అందువలని ప్రయోజనమేమో చక్కగ తెలియనిది అనువాదము జేయబూనుట సాహసమే యగు. వలయు జ్ఞానమున్నచో స్వతంత్రగ్రంథముల నెన్నియేని వ్రాయవచ్చునుగాక. అనువాదము జేయుట అధునాతనులు కొందఱనుకొనునటు లంత సులభమైన పనిగాదు. పాండిత్యమున కనువాద మొక నికషోపలము. మూలానుసారముగ వ్రాయబడునది అనువాదము. అను + వద + ఘఞ్, ఆవృత్తియని దీనియర్థము. అనువాదమున ననువాదకుడు స్వకల్పనముల జొరనీయగలడా? స్వేచ్ఛగ బ్రవర్తింపగలడా? ఎన్నటికిని ప్రవర్తింపలేడు. ప్రవర్తించెనా, అనువాదమునకు భృగుపతనము కలిగినదన్నమాటయే. అనువాదమునకు స్వతంత్రప్రబంధములను వ్రాయజాలమి కాదు కారణము. మఱేమి? ప్రాచీనములును భాషాంతరముల నుండునవియు నగు కావ్యములందలి సారస్యమును లోకమునకు వెల్లడిజేయ గోరుటయే. ఈప్రయోజన మెట్లు నెరవేరును? కతిపయపదములకు గాక మూలమునందలి యావత్పదములకు నర్థము చక్కగ నెఱింగి, కవిహృదయమును గమనించి, రసమునకు భంగము కలుగనీయక. అటు మక్కికి మక్కియు గాక, ఇటు స్వేచ్ఛగను గాక వ్రాసినచో నెరవేరును. అటుగాక మూలమునందలి యేవో కొన్ని పదములకు అర్థమును గ్రహించి ఆత్మఖ్యాతి నభిలషించియో, లేక మఱేకారణముననో భాషాంతరీకరింప గడంగుటచే భాషాదోషములకు లోపము వాటిల్లుటయే గాక మూలమునకును, తద్రచయితలకును తీరని అపయశస్సు కలుగునట్టులో సత్యుక్తి యుండదు.

ఇప్పుడిప్పుడు స్వేచ్ఛానువాదము లని కొన్ని బయలుదేరుచున్నవి. వాటి ననువాదము లనుట కన్న స్వతంత్రము లనుటయే యుక్తము. అట్టివాటికి మూలగ్రంథనామధేయమిడుట సరిగాదు.

ఇక విమర్శింపబడనున్న గ్రంథమునకు వత్తము. జయదేవమహాకవిచే గీర్వాణమున రచింపబడిన ప్రసన్నరాఘవమున కిది యాంధ్రానువాదము. (చూడుడు:-ముఖపత్రము. ఆంధ్రీకృత ప్రసన్నరాఘవనాటకము. ఇది జయదేవునిచే గీర్వాణమున రచింపబడినది.) అనువాదకు లాంధ్రలోకమునకు చిరపరిచితులగు శ్రీ రాజామంత్రిప్రెగడ భుజంగరాయకవిగారు. వీరెన్నియో గ్రంథముల రచించి ఆంధ్రభాషాబాలన నలంకరించినారు. ఈ భాషయం దిదివరకే ఈప్రసన్నరాఘవ మనువాదరూపముగ వెలువడి యున్నది. అందుపై కొంత విమర్శనము గూడ బయలుదేరినది. ఇది అందఱెఱింగిన విషయమే. తదుపరి కొంతకాలమునకు వెలువడినది గనుక నీయనువాద మట్టి విమర్శనములకు తావిచ్చియుండదని తలంచితిని, కాని గ్రంథమును జూచినంతన నిరాశ జెందవలసివచ్చెను.

ఈ యనువాదమును చక్కగనే సాగింప ననువాదకులు ప్రయత్నించిరి కాని వారి ప్రయత్నము నిష్ఫలమైనదనియే చెప్పవలసి వచ్చినది. అనువాదము చాలవఱకు సంస్కరణాపేక్షము. సంస్కరింపదగిన వాటిలో గొన్ని యీ దిగువ దిఙ్మాత్రముగ నుదాహరింపబడి యున్నవి. భాషాసేవకు లగు నస్మదనువాదకులు ఈయనువాదమును కాలవిలంబనమును సహించి సంస్కరించి ప్రచురించి యుండినచో నెంతయో బాగుగనుండి యుం

డెడిది. అయిన నిప్పు డేమాయె. కలదు గదా ద్వితీయ ముద్రణము.

పుట ౩

ఇల మహనీయుల నామము
దులదూగుఁ గుణగణంబుతోడ సువర్ణం
బలఘుశ్రీఖండం బును
నలరత్నాకర సుధాకరాదులు వోలెఁ.

మూలము:—

గుణగ్రామాభిసంవాది నామాఽపిహి మహాత్మనాం।
యథా సువర్ణశ్రీఖండరత్నాకర సుధాకరాః॥

అభిసంవాదము తులదూగుట కాదు. మహాత్ముల నామధేయమే వారిగుణముల జెప్పునని యర్థ ముండవలయు. అలఘుపదము ప్రాసార్థము.

పుట ౫

నటు:—ఈ కవులందఱును బుష్పితోద్యానమును మధుకరంబులు వోలె రాము ననుసరించియే శబ్దించుచుండిరేమి?

మూలము:—కథంపునరమీ కవయ స్సర్వే రామచంద్రమేవ వర్ణయంతి?

రాము ననుసరించియే శబ్దించుచుండిరన నేమి? వర్ణించుట శబ్దించుటయా? ఈకవులందరును రామచంద్రునినే వర్ణించుచున్నారేమి? అనికదా మూలమున కర్థము.

పుట ౬

కనగసుమిత్రాతనుజ
న్మన కీతని కెపుడు లక్ష్మణునకుంబోలెఁ
ఘనరామచంద్రపాదన
ళినయుగళమునఁ మనం బళిత్వముగాంచుఁ.

మూలము:—

లక్ష్మణ స్యేవ యస్యాఽస్య సుమిత్రాగర్భజన్మనః।
రామచంద్రపదాంభోజే భ్రమద్భృంగాయతే మనః॥

'ఘన' అనునది నకారప్రాసార్థము. యుగళపదమమూలము, నిష్ప్రయోజనము. మూలమున గల భ్రమత్పద మిందు గానరాదు. నిరర్థకమని వదలివేసిరిగాబోలు! రామచంద్రపదాంభోజమున భ్రమించుటవలన గదా మన స్సళిసాదృశ్యము నందుట. భ్రమత్పదమే లేనిచో నాసాదృశ్య మెట్లు బొసగు. 'ఈతనికి, మనంబు'— అన్వయమెట్లు? ఈతనియొక్క అని యుండవలయును.

బాలిశులెల్ల సత్కవుల వక్రతరోక్తుల దూరిరేని...

..................................................

సత్కవులవి వక్రతరోక్తులు, ఇక వక్రోక్తు లెవరివి? ఇందలి తరప్రత్యయము మూలమున లేదు చూడుడు.

'నింద్యంతే యది నామ మందమతిభి ర్వక్రాః కవీనాం గిరః.'

పుట ౧౦

ఈశ్వరు డిట్లు పల్కె.

కలదు దివ్యంబగు మదీయకార్ముకంబు
జనకభూపాలుచెంత దాచబడియుండె
దేని బాణాగ్నిలో బురత్రితయలక్ష్మి
శలభభావంబు నొందె సుజ్జ్వలితభంగి.

అదివిని నిజభుజామండలము నాలోకించుచు బాణు డరిగె.

ఈవాక్యమునకు మూలము—

తత్కార్ముకం విలోకయితుం స తత్ర గతః.

ఆధనుస్సును (ఈశ్వరనిర్దిష్టమైన) చూడ బాణుడు అచ్చటికి (మిథిలకు) వెడలెనని యుండదగును.

పుట ౧౧

దా:—(తనలో) ఓహో! విచిత్రము. భ్రమరయుగ్మముచే బల్లవించిన నావచనము వందియుగ్మముచే ఫలించినది.

మూలము:—

అహో! ఘుణాక్షరన్యాయో యదిదం భ్రమరద్వయం ప్రతి మయోక్తం వందిద్వయం ప్రతి ఫలితవాః.

మూలము నెంత చక్కగా గ్రహించిరో చూడుడు. మూలమునకు ననువాదమునకు నేమైన సంబంధమున్నదా? ఘుణాక్షరన్యాయమనగా నేమో తెలియక వదలివేసినారు.

భ్రమరద్వయముంగూర్చి నేనాడినమాట వందిద్వయమును గూర్చి పలికినది గానే పరిణమించినదే. ఇది ఘుణాక్షర న్యాయముగదా! అని యర్థముండదగును. నుసిపురుగులు చెట్లను తొలుచుచుండును. దైవికముగ నందు గొన్ని యక్షరము లేర్పడును. అక్షరములను తొలుచుతలంపు పురుగులకు లేదు. కాని అక్షరము లేర్పడినవి. అని న్యాయమున కర్థము. అటులనే దాల్భ్యయనుడు కూడ వందిద్వయ మని యెఱుఁగకయే భ్రమరద్వయమును గూర్చి యాడినమాట దైవికముగ వందిద్వయమునకే యన్వయించినది.

పుటలు ౧౪-౧౫

(తొందరతో బరిక్రమించి శేఖరముజారుట నభినయించి సిగులుతో జూచుచున్నాడు)

మం:—చిత్తసంకులదశ శీర్షముక్తస్రజ
మట్లు జూడ నేల యాలసించి
యరుగుచుండె గాల మదియెల్ల శీఘ్రగ
హరశరాసనంబు నందుకొనుము.

పురు:—(తనలో) వీనిచే నెఱుగబడితినా యేమి? ఘుణాక్షరమునవచ్చు శబ్దసామ్య మిది.

ఆశబ్దసామ్యమేదీ? ఈపద్యమున గలదా? మూలమున గలదు చూడుడు:—

అయేలంకేశవిస్రస్తశేఖరాలోకనేన తే!
సమయో యాతి తత్తూర్ణం గృహాణ హరకార్ముకం॥

పురుషుడు లంకేశుడని మంజీరకునికి తెలియదు. కాని తదుచ్చరితమైన శ్లోకమునందలి 'లంకేశ' అను నక్షరసముదాయము చెవిని బడినంత మంజీరకుడు తన్నెఱిగె నేమో అని పురుషుడు తొలుత భ్రమించెను. విమర్శించిన పిదప నతడు తన్నెఱుగడనియు శబ్దసామ్యము (అయే + అలం + కేశ......) ఘుణాక్షరన్యాయాగతమనియు నిశ్చయించుకొనెను. అనువాదకు లాశబ్దసామ్యమును తమ పద్యమునందు జొన్పజాలక పోయిరి. శీర్షముక్తస్రజము—శీర్షముచే విడువబడిన స్రజమని దీని కర్థము. స్రజము తనంతటనే శీర్షమునుండి జారినది కాని శీర్షము దానిని విడువలేదు.

పుట ౧౯-౨౦

మంజీ:—(నవ్వి) ఓయీ! దశానన! అస్థానమున శిరశ్ఛేదనుయిన నీకు మంగళము గాదా యేమి?

(మూల:—స్థానేశిరశ్ఛేదవార్తా ఒకిభవతో మంగళాయ)

రావ:—మరేమి! ఔరా!

వరవిద్యాధరతరుణీ
కరకిసలయము కృతకుసుమకమనీయంబౌ
హరచరణమున రణమ్మున
శిరోనికర్తనము శుభముజేయదె నాకున్.

'స్థానమునయైనచో శిరోనికర్తనము నీకు మంగళము గూర్చునా' అని యుండవలెను. లేనిచో మరేమి యను సమాధానవాక్యమున కర్థమేమి?

పుట ౨౪

అవుట నిది వీరజననీ
శ్రవణోచితమనుచు నిందు రాజిలు నవర
త్నవితానంబున గల వ
ర్ణవిధానమె తెలియజేయు రమణీయగతిన్.

మూలము:—
తదిదం వీరసూకర్ణనివేశోచిత మిత్యసౌ।
అంతస్స్ఫురత్తీ రత్నానాం వర్ణమాలైవ శంసతి॥

వీరజననీశ్రవణోచిత మనునది సందిగ్ధార్థప్రతీతికృత్తు. వీరజననిచే వినుటకు తగినదని యర్థమగును. వీరజననియొక్క కర్ణముల నుంచదగినదని యుండవలయును. నవ, వితాన, రమణీయగతిన్—అను నివి అమూలములు, పాదపూరణార్థములు.

పుట ౨౫

తా:—లంకేశ్వరుడు మిథిల కేతెంచెనని వినియుంటిని. మిథిలా వృత్తాంతముంగూడబరికింపుమనిమాల్యవంతునాజ్ఞయైనది. కాన ముందుగ మిథిలాసమీపమున కేతెంచితిని.

మూలము:— ఆకర్ణితం హి మయా మిథిలామాగతో లంకేశ్వర ఇతి. అతస్తద్విలోకనాయ ప్రథమమిహాఽఽగతః

మిథిలావృత్తాంతముంగూడ బరికింపుమని యాజ్ఞ యయినచో అట లంకేశ్వరుడువచ్చియున్నాడో, లేదో ఆప్రస్తావమేల? లంకేశ్వరుడు మిథిలకేతెంచుట బట్టి తద్దర్శనార్థమై యిటకు (మిథిలకు)వచ్చితినని యుండవలసినది. వినియుంటిని.—వింటిని అని యుండవగు.

పుట ౪౩

వామ:—కాదుకాదు. ఇప్పుడొక మునిచంద్రు రాకనిరీక్షించుచు బహిర్మండపమున నివసించియుండెను.

ఇప్పుడు-నివసించియుండెను—అనుట పొరబాటు.

పుట ౪౪

కుబ్జ:—సర్మత్త్వము నెఱుంగవుగా నీవు. బంధుజనుల బరిహాసమొనర్చిన బాపము సంభవింపదు.

వామ:—(నవ్వి) వీరు నీకు బంధుగులగుట యెట్లు?

కుబ్జ:—ఇతనికి నిరువురు కుమారులు. మనకు నిర్వురు కుమారికలు గావున బంధుత్వము గల్గునని యూహించియుంటిని.

ఇట 'సంబంధిజన' అను మూలమునకు బంధుజన, బంధుగులు అని అనువాదము. 'సంబంధిజన' అనగా వియ్యంకులు అని అర్థముకాని బంధుగులు అనికాదు. సంబంధిజనమనగా వియ్యంకులనుటకు ఉత్తరరామచరితము నందలి యీ క్రింది శ్లోకమును చూడుడు:—

సంబంధినో వసిష్ఠాదీ నేష తాత స్తవార్చతి;
గౌతమశ్చ శతానందో జనకానాం పురోహితః.

ఆంధ్రీకరణము:—(కళాప్రపూర్ణ వే. వేం. గారిది)
రమణ మీతండ్రిగా రాంగిరసునిపుత్త్రు
నీశతానందు గులపురోహితుని గూడి
పూజసల్పుచునున్నా రమూడముదొలక
ననుగు వియ్యంకులకు వసిష్ఠాదిములకు.

ఇట్టి సంబంధమునేకదా కుబ్జకుని సమాధాన వాక్యము నిరూపించుచున్నది.

పుట ౪౬

(సమీపించి) మహాభాగ! సకలసంపల్లతాప్రరోహనూతనారామంబగు నీకిదే ప్రణామము.

మూలము:—అయం తే సమీహితసంపల్లతాకుసుమోద్గమారామః ప్రణామః.

సమీహిత......రామః అనునది ప్రణామమునకు విశేషణము. కాని 'తే'అనుదానికి గాదు. సమీహితసంపదలనెడి లతలకుసుమోద్గమమున కారామమువంటిది ప్రణామము. నీ ప్రణామముచే అభిలషితము లన్నియు నెరవేరునని భావము.

భవదుదారపదాంబుజ ద్వంద్వవంద
నంబు నాకట్టి కౌతూహలంబు గూర్చు
........................
..........................

'సుఖహేతుః' అను మూలమునకు 'కౌతూహలంబు గూర్చు' అని తెనిగింపు. సుఖము, కౌతూహలము పర్యాయపదములా? అట్లెన్నటను గానరాదు.

పుట ౪౮

విశ్వా:—శతానందా! రాజహంసలని నిజము బల్కితిరి.

మూలము:—ఆంగిరస! ఉచితమత్ర రాజహంసా ఇతి.

అత్ర యనునది మధ్యమపురుష బహువచనమను కొనిరి కాబోలు. పొరబాటు. 'అత్ర' అనునది మధ్యమపురుషైకవచనము. బహువచనము గౌరవార్థమన్నను శతానందా! అను వాత్సల్యసంబోధన మడ్డువడుచున్నది.

పుట ౫౧

తనరుచిని జంపకోత్పలతతి జయించి,
కనక నీలోపలోజ్జ్వలకాంతిదసరి,
సకలనేత్రాభి రామలక్షణము లెంచు,
గల్గు లక్ష్మణలక్ష్మణాగ్రజులు వీరు.

ఇట జయించి, తనరి అనుక్రియలకు సమాపక క్రియయేది?

పుట ౫౪

రామచంద్రుడే నిరూపింపబడుగాక!

మూలము:—రామచంద్ర ఏవ ఆదిశ్యతామ్.

'అదిశ్యతామ్'అన్న నిరూపింపబడుటయట. వింతగనున్నది. ఆజ్ఞాపింపబడుగాక అని యుండవలయు. ఆదే

శార్థము నెఱుంగక అనువాదకు లంతట తమ యర్థమునే వాడిరి. చూడుడు మరొకవాక్యము నిదేపుటయందు.

అట్లయిన నెఱుంగనివాని వలె దుగ్ధముఖుండగు రామభద్రుని శంకరశరాసనసమానయనంబునకై నిరూపించుచుంటివేమి?

ఇచటను మూలమున 'ఆదిశిసి' అని కలదు.

పుట ౪౬-౫౨

హితుడవు గాన దెల్పెదనిదే భృగురామ పరశ్వథంబ నా, ప్రతినమరల్పకిప్పుడె యపశ్మము గన్యకొసంగువాడని, క్ష్మాత్రమున నీవ వచ్చి శివకార్ముకధూర్వహదోర్విలాసధీ,రతగనుపించునట్టు లెదురంబడి ధారజలంబునీడుమా.

'ధూర్జటిధనుర్ధారే యదోస్స్పదో జామాతుః పురతః' అని మూలమునందుండ వీరు జామాతృపదమును వదలి తక్కిన దానిని 'ఎదురంబడి' క్రియకు విశేషణముగా గొని శివకార్ముక ధూర్వహదోర్విలాసధీరతగనిపించునట్టు లని తెనిగించిరి. అట్టి ధీరతయే గనుపించుచో నిక ధారాజలము విడువనేల? శివకార్ముకమును వంచజాలు భుజవిక్రమము గల యల్లునియెదుట అని యుండదగు.

పుట ౫౭

హరమేల్కార్ల్పి యశేషవీరభుజశౌర్యం బెల్ల జోకొట్టెది, క్ష్మారికర్ణాంచలకంపమాపి కమఠాగ్రణ్యుం జలుంజేసెని, ర్ఖరకల్పాంతఘనధ్వనిం జెనకి యార్యశ్లాఘ గంభీరమా, కరకల్పిత్రి పురారికార్ముకవిభంగధ్వాన మేపారెడిన్.

ఇందలి యగ్రణ్యశబ్ద మేవ్యాకరణము చేసాధ్యమో! మూలమునగల కృష్యమాణశబ్దసారస్యము అనువాదమందలి కృష్టశబ్దమున మాయమైనది.

పుట ౬౪

.........................................యుర్వర రఘువంశమంతయు నవారణమస్త్రరధారమున్నదే,

మూలమందలి శస్త్రపదమునకు 'శర' యని తెనిగింపు. శస్త్రశబ్ద మాయుధసామాన్యవాచకము. పరశురామునకు పరశువు ఆయుధము కలదు గాని శరము లేదు.

పుట ౬౨

గంధరసలిప్తమగు శిలీముఖంబు.

'చందనదిగ్ధనారాచం' అని మూలము. వాసనాపరముగ గంధశబ్దమువాడుట కలదే కాని చందనపరముగ వాడుట లేదు. 'గంధో గంధక ఆమోదే లేశే సంబంధగర్వయోః' అనిఅమరము.

పుట ౭౨

ఏమి! ఎఱుంగకరే రఘురాజుల యాధిపత్యమున నుంటివా?

మూలము:—

'అయి! కథమజానతీవ వర్తసే రఘూణామాధిపత్యం?'

ఎంత చక్కగ గ్రహించిరో చూడుడు మూలార్థమును. ఏమి! రఘురాజుల యాధిపత్యము నెఱుగకయే యుంటివా! అని యుండవలయును.

పుట ౭౭

రావణానుజనిజనాసికా విముక్త
రక్తపలిప్త నిశితధారాకరాళ
మగు కృపాణంబు కఠినదైత్యగళవిగళ
దస్రపంకంబు గ్రోలంగ నభిలషించు.

ఇట ఆకారాంతముగ నుండవలసిన రావణానుజాశబ్ద మకారాంతమయినది. నిజశబ్ద మస్థానప్రయుక్తము. 'నిజ' అనగా తన అని అర్థము. ఇక అస్రపంకంబుగ్రోలంగ నభిలషించుట యట. వింతగనున్నది. మూలమున బాహుళ్యసూచకముగ 'కర్దమసృజాం' అను విశేషణము కలదు. దానికిట్టి యర్థమును కల్పించిరి. విగళదస్రపంకంబట, కంఠమునుండి స్రవించుటయే పంకరూపమున స్రవించునట (విగళత్ = కారుచున్న). ఇక మూలమును చూడుడు. "ఉత్కంఠతే కఠినరాక్షసకంఠజానాం పానాయ కర్దమసృజా మసృజాం కృపాణః."

పుట ౧౦౩

కోపమొదవంగ నిస్వనచ్చాపుడగుచు
బోర గాదరింప నక్షకుమారు డరిగె.

మూలము:—తత్సమ్ముఖం ప్రచలతి స్వయ మక్షనామా, నస్త్వేవ రాక్షసపతేః కుపితః కుమారః.

అరిగె—ప్రచలతి = అరుగుచున్నాడని మూలము. వర్తమానకాలమునకు తఱచు వీరు భూతకాలమునే వాడుచుందురు (సౌమిత్రే ననుసేవ్యతాం తరుతలం చండాంశు రుజ్జృంభతే: ఉజ్జృంభతే=ఉదయించె. పుట ౯౬). ప్రచలితః అను పాఠమునుగూడ 'ఏవ ప్రచలితః = ఇదిగో బయలుదేరుచున్నాడు' అని వర్తమానార్థమే కాని భూతార్థము కాదు.

పుట ౧౧౩

గాఢదర్పోద్ధతుని దశకంఠు గలచి
మధువనంబున నిచ్ఛమై మధువులాని
వచ్చె మారుతి భవదంఘ్రివారిజముల
జూడ నీలాంగదాదులతోడ గూడ.

ప్రథమపాదమునకు మూలము:—
దర్పోద్ధతం దధిముఖం తరసా నిపీడ్య.

ఇందలి దధిముఖపదమును దశముఖయని చదువుకొని భ్రమసి వ్రాసినట్టు తోచుచున్నది. లేకున్నచో దశకంఠుగలచి యనుట యెట్లు సరిపడును? దశకంఠునకును మారుతికిని లంకయందేదైన సంఘర్షణము కలిగినదా? లేదు. జరిగినదంతయు తద్వర్గ్యులతోనే. లంకనుండి మఱలి వచ్చి తనసహచరులతో సంతోషాతిరేకంబున మధువనమందు విచ్చలవిడి సంచరింప బూనుటయు, వారింపవచ్చిన తత్పాలకుడు దధిముఖునితో కొంత సంఘర్షణ కలిగినది. కనుక నిట దధిముఖు డనుటయే యొప్పు.

పుట ౧౧౭

ఉత్తరదిశ నిదియేమి? సముద్రతీరము నందలి తమాలతరుషండ మింద్రధనుస్సహస్రముం బోలి గగనమును గపిశవర్ణముగా జేయుచున్నది.

మూలము:—(విలోక్య) కిమిద ముత్తరేణ తరంగమాలిన మనుతమాలషండ మాఖండల ధనుస్సహస్రానుకారి కపిశయతి గగనతలమ్.

'కిమిదముత్తరేణ' అనునదొక వాక్యము కాదు. సముద్రమున కుత్తరమున తమాలషండమునకు వెనుక నాఖండలధనుస్సహస్రానుకారియై గగనతలమును గపిశవర్ణము గలదిగా జేయుచున్నదిదియేమి! అని యర్థము.

ఇట్టి వెన్నియేని గలవు. ఇట్టివానిని ద్వితీయ ముద్రణమున సవరించి, మున్ముందు రచింపబోవు గ్రంథములం దిట్టి విమర్శనలకు తావివ్వకుందురని నమ్మెద.

పుస్తకము వలయువారు:—

రాజా భుజంగరాయ ప్రచురణాలయము,
ఏలూరు, వెస్టుగోదావరిజిల్లా అని వ్రాయవలెను.

'రమ్య'

---

## సంగీత పార్వతీపరిణయము

భట్టబాణమహాకవి సంస్కృతమున రచియించిన పార్వతీపరిణయమున కిది అనువాదమని అనువాదకులు శ్రీసత్యవోలు రాధామాధవరావుగారు పీఠికయందు వ్రాసినారు. 'ఇందలి వృత్తజాతులకు పాశ్చాత్యులవలె బాడుటకు సంగీతస్వరములు వేసియుంటిని' అని గ్రంథమున నట్లు కావించి గ్రంథముపేరన కదికిన 'సంగీత' పదమునకు సార్థక్యమును గలిగించినారు. ఇది అనువాద గ్రంథమగుటచే నిందు చూడవలసినది మూలానువాదముల సామ్యము. అనువాదము మూలమునందలి యెల్ల సారస్యములను కన్నులకుగట్టినట్లు చూపునదిగ నుండవలెను. లేకున్న నది నిష్ప్రయోజక మగుటతో పోవక 'తాచెడ్డ కోతి వనమెల్ల చెరచె' నన్నట్లు మూలమునకును కొఱతను తెచ్చిపెట్టును. కావున ననువాదకులు తమరచనమున కాధారమయిన మూలమును సర్వథా పోలునట్లు తమ అనువాదమును కాపాడుకొనవలయును. ఇంతయే వారిపని. ఈమాత్రపుపనిని ఈసంగీతపార్వతీపరిణయము అనువాదమున శ్రీరాధామాధవరావుగారు ఎట్లు నిర్వహించిరో చూడదగును: మూలమున నాందీశ్లోకము:

ఆదౌ ప్రేమకషాయితా హరముఖ
వ్యాపారలోలా శనై
ర్వ్రీడాభారవిఘూర్ణితా ముకులితా
ధూమోద్గమవ్యాజతః;
పత్యుః సమ్మిలితా దృశా సరభస
వ్యావర్తనవ్యాకులా

పార్వత్యాః పరిణీతమంగళవిధౌ
దృష్టి శ్శివాయాఽస్తు వః.

అనువాదము:—

ఆదిని ప్రేమచేతనెరుపై హరునిం
గనలోలమై మదో
న్మాదభరాతిఘూర్ణితము
నై పొగయన్మిషమీలితంబునై
సాధ్వసతన్ బతీక్షణల
సద్గతి సంభ్రమమై శుభాప్తి మే
లీదగు పార్వతీపరిణ
యేక్షణమయ్యెడు మమ్ముఁ బ్రోవుతన్.

నాందియగు నీ మూలశ్లోకమున ఆశీర్వాదవస్తు నిర్దేశములు రెండును గలవు. శివపార్వతులు పెండ్లిపీటలపయి కూరుచుండి హోమాదికార్యముల నాచరించుచున్న సమయమున పార్వతి శివునిపై ప్రసరింపజేయుచున్న ప్రేమదృష్టి యిందు వర్ణితమయినది. శ్లోకార్థము చూడుడు:—

'(శివునియందలి) అనురాగముచే రంజితమయినది (కావున) తొలుత మెల్లగా శివుని మోమున ప్రసరించుటయందాసక్తమయినది, (తరువాత) సిగ్గు పెంపున తిరుగుడువడుచున్నది. (కావున) పొగ ఎక్కెనను నెపమున మూతపడినది, (పదపడి) మగని (శివుని) చూపుతో కలిసినది (మరల పార్వతి శివుని చూచినది, అపుడే సరిగా శివుడును పార్వతిని చూచెను. అపుడు ఇద్దరి చూపులు కలిసినవి. అందువలన పార్వతిని మరల సిగ్గు పైకొన్నది) కావున వేగిరపాటున వెనుకకు మరల్చుకొనుటయందు కలతచెందినది యగు వివాహమంగళకార్యమునందలి పార్వతిదృష్టి మీకు శుభమునొసగుగాక!' అని.

ఇపుడు మూలానువాదములకు గల సాదృశ్యము పాఠకులకు కరతలామలకము.

మూలము:

దక్షాల్లబ్ధసముద్భవా తదను తం
త్యక్త్వా పతిద్రోహిణం
జాతా సంప్రతి శైలరాజసదనే
గౌరీతి దాక్షాయణీ;
ఏనాం యోజయితుం హరేణ హిమవ
త్సానౌ తప స్తన్వతా
కార్యం భావి సమాకలయ్య మరుతా
మద్య ప్రవర్త్యామహే. అం. ౧.

అను:

ముందుగ దక్షభూపతికి
పుత్రికయై జనియించి యిప్పుడిం
పొందగ శైలరాజునకుఁ
బుట్టెను గౌరియనంగ నామె నా
నందముగా మహాతప మొ
నర్చుచు నుండు మహేశుఁ గూర్పఁగా
అందుల కేఁగుచుంటి దివి
జాళికోర్కె ఫలింపజేయఁగన్.

మూలమునగల దాక్షాయణి దక్షుని పరిత్యజించుటకుగల కారణము మాటయే లేదు. మఱియు ముందుగ, పొందగ, అందముగా, అందులకు-ఇవి ప్రాసకోసము ప్రవేశించినవి.

మూలము:

నారదః: తథా దేవకార్యాయ ప్రస్థితం కన్దర్పం తిరస్కరిణ్యా విద్యయా ఛన్న స్తత్రత్య వృత్తాంతజిజ్ఞాసయాఽహం త్వన్నిదేశా దన్వసరమ్. అం. ౩.

దీనికి భావము: 'తిరస్కరిణీ విద్యాప్రభావమున మరుగుపడినవాడనయి అచటి వృత్తాంతమెఱుగగోరి నీయానతి మేరకు అట్లు దేవకార్యమునకు తరలిన మదనుని వెంబడించితిని'.

అనువాదమును చూడుడు:

"మహేంద్రా! అపుడటుల దేవకార్యంబునకై బయలుదేరిన మన్మథుని గూర్చి యంతర్ధానశరీరంబు వహించినవాడనై యచ్చటి వృత్తాంతమంతయుఁ దెలియఁ గోరి నీయనుమతి ప్రకార మచ్చట సంచరించితిని."

మూలమునందలి పదములకు అర్థము తెలిసికొనజాలమిచే వచ్చిన మచ్చిట కాననగును.

మూలము:—

ఆధూయ చంపకతరూ నుత్తమనద్యా స్తరంగ మాలింగ్య,
ఆదాయ కమలసౌరభ ముంకురితో మలయశైలపవమానః.
అం. ౩.

అను:—

లలితపుష్పితచందనలతలనంటి
సతతనిర్మలజలమున స్నానమాడి
పద్మములగలసౌరభభరముఁదాల్చి
మందముగ వీచె మలయాద్రిమారుతంబు.

ఇట మూలమున 'పుష్పిత'గాని చందనతరువు అనువాదమున పుష్పిత అయినది. చందనవృక్షములు పుష్పించుట కవిసమయము గాదు: చూడుడు.

వసంతే మాలతీపుష్పం
ఫలంపుష్పం చచందనే;
అశోకేవ ఫలం జ్యోత్స్నా
ధ్వాంతే కృష్ణాన్యపక్షయోః;
కామిదం తేషు కుందానాం
కుట్మలేషు చ రక్తతా;
ప్రియంగుపుష్పే పీతత్వం
సరోజముకుళాదిషు;
హరితత్వం దివా నీలో
త్పలానాంచ వికాసితా;
శేఫాలీకుసుమే భ్రంశం
వర్ణ్యేన్న సదప్యదః.

—కవికల్పలత, శబ్దస్తబకము, మూడవకుసుమము.

పై శ్లోకముల క్రింద గీతగల భాగముల దిలకించిన చందనము పుష్పించునట్లు వర్ణించుట కవిసమయము కాదని తేటపడగలదు. కవిసమయముమాట యటుండ మూలమున లేనిదానిని అనువాదమున గూర్చుట ఏల ? చూడుడు:— ఒకటవ అంకమున-

మూలము:

ఆభోగశాలి కుచకుట్మల మాయతాక్ష్యా
వక్షఃస్థలాత్ ముఖితాంభతి సంనిరోద్ధుమ్;
అస్యాస్తినాస్తివచసాంరి వివరే ఒకలగ్నే
తస్యాః సముల్లసతి కాచన రోమరేఖా.

అని బాణకవి గౌరీయౌవనప్రాదుర్భావవిజృంభణమును వర్ణించగా తండ్రికూతురుని వర్ణించుట అసభ్యమని గాంబోలు అనువాదకులు

వినుము ముఖారవింద మతి
వేడుకగాఁ దనరారుచుండగాఁ
గనులును నల్లగల్వ లనఁ
గాఁదగుచుక్ వికసించుచుండగా
వినయముతోడ యౌవనము
వృద్ధిని బొందగఁ బెండ్లియీడుతోక్
దనరుచునుండె నింక మన
దైవకుమారిక గౌరి చూడుమా !

అని అనువదించి బాణకవికి సభ్యతను సమకూర్చి ఇప్పట తరువును పుష్పితనుగా జేసినారు. ఇది యుచితమా?

మూలము : నారదః—

తేన పురారే ర్నయనానిలేన మదనః
శలభతాం నీతః. అం. 3.

అనువాదము : పురోడాశవతము బొందింపబడెను.

మూలము:

మహేంద్రః: (విలోక్య)
సంచారిణీవ వల్లీ
విద్యుల్లతికేవ చాపలోన్ముక్తా;
మోహనకళేవ మూర్తా
కాన్త్వెదియం కమలపత్రాక్షీ.

(నిరూప్య) రంభాఖల్వియమ్. అం. 3.

అను:

గతినిగానిత్రిగెడు పుష్పలతిక యేమొ
సిరత జెందిన యామింమతీపయేమొ
లలితతనువును గొను మోహకళిక యేమొ
కాదు కనబడు నీది యొక కమలనేత్రి.

(బాగుగాజూచి) ఆహా! ఇదిగో ఇది రంభకాబోలును !

పై మూలానువాదముల క్రింద గీతలుగల భాగములను పరిశీలింపదగును.

మూలము:

విజయా. సఖి, జయే, యథా మన్మథదాహపరుష హృదయయో నిష్క్రమణతాయాః ప్రథమం నిదర్శనభూతః

పరమేశ్వరో యదా ఆర్ద్రహృదయో భవిష్యతి తదా ఫలం దర్శయిష్యతి. అం. ౮.

అను :

సఖీ, జయా, అపు డట్లు మన్మథుని భంగంబు గావించి పరుషహృదయుండయి కరుణారహితుడయి ముందుగా జూడబడిన యా పరమేశ్వరు డెపుడు విరహవేదనచే మరల మదనానలదగ్ధహృదయుడగునో యప్పుడే ఫలించును.

ఇచ్చటను మూలానువాదముల క్రింద గీతలు గల భాగములను పరిశీలింపగలను.

మూలము : జయా : (ప్రాకృతమునకు ఛాయ)

యంకిల భణంతి వేదా
 నిత్యయువానం పురాణపురుషం,
యః కిల ధారయతి నిత్య
 మీశ్వరశబ్దంచ చంద్రలేఖాంచ. అం. ౮.

అను:

ఎన్నగా బురాణపురుషు
 నెవనిగాంచి నిత్యముక్త
పిన్నవయసువా డటంచు
 వినుతిసేయు వేదముల్
అన్నివేళలన్ సుధాక
 రార్ధమున్ ధరించియున్
సన్నుతింప నీశుడనెడు
 శబ్దమొందు నాతడే.

ఏపాటి సంస్కృతజ్ఞానము గలవారయిన సులభముగ అర్థముచేసికొనగల పై మూలశ్లోకమునకు అర్థమును దెలిసికొనజాలనివారు మహాకవికృతమగు నీనాటకమును, అనువదింపబూనుట పరమసాహసము. ఇట్టివి యింకను కావలసినన్ని కలవు. కాని పెంచుట కిష్టము లేదు. అసలు ఇట్టిగ్రంథముల కింత చెప్పవలసిన యవసరమే కనుపడదు. 'వాఙ్మయమున కుపకరింపని గ్రంథములు' అని చెప్పి యూరకున్న చాలును. అంత మాత్రమున వీని నిష్ప్రయోజకతను పాఠకులు విశ్వసింపరేమోయని యీమాత్రము వ్రాయుట. ఇంతేకాక అనువాదకులు కవులు, గ్రంథకర్తలునని ప్రఖ్యాతిని చెందినవారు. అనువాదవిధానవర్ణన మింతతో తీరినది. కవితాసారస్యమునకు ఇందుదాహృతము లయిన పద్యములే ప్రమాణములు కాగలవని సహృదయులకు వేఱుగ చెప్ప బనిలేదు.

—భారతి.

## అంటరానివా రెవరు ?

గ్రంథకర్త:—జాలా రంగస్వామిగారు. ౨౦ పేజీలు, పీచు కాగితాలు, క్రౌన్ సైజు, కాగితపుబైండు. ౧౯౩౦ సం. వెల ౦-౨-౦.

ఇదొకచిన్న పద్యపుస్తకం. అంటరానివాళ్లు లేక చెప్పరానివాళ్లు అనబడే ఆదిమాంధ్రులయొక్క పూర్వస్థితి, ప్రస్తుతస్థితి ఈచిన్న పుస్తకంలో వర్ణించబడ్డాయి. వాళ్ల పూర్వస్థితి *'పంచముల చరిత్ర'లో చారిత్రకంగా తెలుపబడింది. అగ్రజాతులవాళ్లు ఆదిమాంధ్రసోదర్ల నెంత మోసంచేసింది, అన్యాయం చేసింది, యెంతనీచంగా చూస్తూన్నది యిందులో విశదంగా వర్ణించబడ్డాయి. ఈవర్ణనలెంతో జాలిపుట్టిస్తున్నాయి.

అగ్రజాతులవాళ్లు మతంపేరుపెట్టి యెలాంటి దుర్మార్గాలు చేస్తున్నారో! తక్కినజాతుల కెంతో ఉపయోగంగాను, ఉపకారంగాను వుండేటటువంటి మాలమాదిగలను సాంఘికబహిష్కారంచేత అన్నవస్త్రహీనంచేత నాశనం చేస్తున్నారు. అగ్రజాతుల కృతఘ్నత యేమని చెప్పవచ్చు!

గాంధిమహాత్ముని 'హిందూ'లో ౧౯-౯-౩౦ తేదీని రాసిన 'అస్పృశ్యతా' లేఖలో "...అన్ని ఆత్మలు ఒకేజ్యోతియొక్క మెరుపులు కనుక ఎవ్వడూకూడా అస్పృశ్యుడు కాడు. మనుష్యుల్ని అస్పృశ్యులుగా జూడ

* క్రిందటినెల 'భారతి' విమర్శలలో చూడండి.

డం యెంతో తప్పు.......స్నానంచేసినా, శుభ్రమైన గుడ్డలు కట్టుకున్నా, గీత చదివినా, పెద్దపెద్ద వుద్యోగాలుచేసినా, భంజాలు, చమరులు పుట్టుకదగ్గరనుంచి అస్పృశ్యులుగా జూడబడుతున్నారు. ఇది మతం కాదు. ధ్వంసం చేసివేయవలసిన విమతం. అస్పృశ్యత హిందూమతాని కంటుకున్న ఒక తినివేసే పాపపు మాఢ్యం. దీనిని నాశనంచెయ్యడమే ప్రతిహిందువుడి యొక్క పరమధర్మం. మనం అస్పృశ్యులతో వూరికే స్నేహంచెయ్యడం కాకుండా జీవితమంతాకూడా మనం మనల నెలా ప్రేమించుకుంటామో అలాగ ప్రేమించాలి......."అని రాసేడు. గాంధిమహాత్ముని మాటలు మనకు వేదవాక్కులు. అవశ్యాచరణీయాలు.

శైలి: సరళంగాను అనర్గళంగానువుంది. మనస్సును గుచ్చుకునేటట్లు రాయబడింది. అఖరును తొగుడును గురించి రెండు తీవ్రమైన పాటలున్నాయి.

వలయువారు:—జాలా రంగస్వామి, కంబాల చెరువుపేట, రాజమండ్రి—అని రాయాలి. కే. కా.

---

## ప్రేమలేఖలు

గ్రంథకర్త:—బి. టి. నరసింహాచార్యులు గారు. ౧౬౦ పేజీలు. సీమకాగితాలు, కాగితపు బైండు, క్రౌన్ సైజు. ౧౯౩౦ వెల రు ౧-౦-౦.

ఇదొక విషాదవిషయక గ్రంథం. ప్రభాకరామృతవల్లులయొక్క "ప్రణయభగ్నజీవితాలు" ఇందులో చిత్రించబడ్డాయి. గ్రంథరూపం లేఖలు. ప్రౌఢయైన అమృతవల్లి తన వివాహానికిముందు మేనత్తకొడుకైన ప్రభాకరానికి తన ప్రేమను గురించి తెలుపుతుంది. ప్రభాకరుడు బీదవాడని నిర్ధనుడని, మీదు మిక్కిలి మేనరికం చేయకూడదని అమృతవల్లి తల్లిదండ్రులు అమృతవల్లిని ధనవంతుడు, విద్యావంతుడు, రూపసి అయిన మరొకడికిచ్చి పెళ్లి చెయ్యాలనుకుంటారు. ప్రేమ కేవలం ధనం, విద్య, రూపం, వీటిమీద ఆధారపడలేదు. ప్రేయసులకు మనస్సుల కలయికే ముఖ్యం. అమృతవల్లి తన అభిప్రాయాన్ని తెగించి తల్లిదండ్రులకు చెప్పలేకపోయింది. ఎలాగ చెప్తుంది? పెళ్లివిషయాల్లో తల్లిదండ్రులు బిడ్డలమనస్సెరిగి చెయ్యాలి. లేక బిడ్డలకే వాటిని విడిచిపెట్టెయ్యాలి. మొదటిదసాధ్యం కనక రెండో పద్ధతి నవలంబిస్తేనే మంచిది.

తల్లి మాట దాటలేక అమృతవల్లి మరొకణ్ణి పెళ్లి చేసుకుంది. కాని నూతనభర్తమీద అనురాగ మెలా తెచ్చుకోడం. తన అనురాగమంతా మొట్టమొదటే ప్రభాకరుడి కిచ్చేసింది. ఇలాంటి స్థితిలో జీవితం విషాదం కాక మానుతుందా! పోనీ, అప్పటికైనా అమృతవల్లి తన నూతనభర్తను విడిచిపెట్టి తన ప్రియుణ్ణే మళ్లా పెళ్లి చేసుకొందామంటే సంఘం వూరుకుంటుందా? ఎటువంటి దుష్కార్యాలకైనా సంఘం వొప్పుకుంటుంది కాని పాత ఆచారాలను మట్టుకు మారనియ్యదు. ప్రభాకరామృతవల్లుల మరణం చూసయినా సంఘం ఆచారాలను సంస్కరించుకుంటే మంచిది.

ఈలేఖల్లో మరొక విచిత్రవిషయ ముంది. లలిత అనే మరొక ఆమెకూడ ప్రభాకరుణ్ణి ప్రేమిస్తుంది. తన దౌర్భాగ్యాన్ని లెక్కచేయకుండా ఆమె చూపించిన త్యాగం అద్భుతం.

ఈగ్రంథ మద్భుతమైంది. సాంఘికదురాచారాలు బాగా వెల్లడిచేయబడ్డాయి. గ్రంథకర్త మనస్సుకు గాక హృదయానికి కలమిచ్చి రాసేడో అన్నట్టుగా మనస్సును కరిగిస్తూంది ఈ రచన. ఉద్రేకం, మానవస్వభావం, విషాదం చాలాసహజంగా చిత్రించబడ్డాయి. సాంఘికదురాచారాలు నాశనంకావాలంటే యిలాంటి గ్రంథాలే అవసరం.

గ్రంథకళ యెంతో ఆశ్చర్యకరంగా వుంది. పోషణలో కళంకం లేదు. గ్రంథకర్తకూడా మొదటినుంచి చివరకు మనలాగే కొత్తపాత్రకు డవడం వల్ల కాని, లేకపోతే గ్రంథకర్తయొక్క లేఖాంతస్మరణలు లేఖలకనవసరం, నిష్ప్రయోజనమని చెప్పవలసివచ్చేది.

శైలి:—భాష సులభం. శైలిలో సమానగుణం లేదు. ఒకమాటు గ్రాంథికంలోను మరొకమాట వ్యావ

హారికంలోను యిష్టంవచ్చినట్లుగా రాయబడింది. ఇది పెద్దలోటు.

వలయువారు:—మూర్తి బుక్ డిపో, ౧౭3 మింట్ స్ట్రీటు, మదరాసు. అని రాయాలి. శే. కా.

---

## భానుమతి

గ్రంథకర్త:—యం. వి. పాపన్న గుప్తగారు. 330 పేజీలు, సీమకాగితాలు, కాగితపు బైండు. డెమ్మీసైజు. ౯3౦. వెల రు ౧-౮-౦.

ఇదొక సాంఘికనవల. 'వర్తమానభారతదేశము నకు వలయు మార్పులనెల్ల విశదీకరించి ప్రాతపద్ధతులెట్లు వర్జితములో చక్కగా నిరూపించబడిం'దని ఉపోద్ఘాత కర్త రాసేరు. ఈవాక్యం కొంత నిజమే. కథలో ప్రౌఢవివాహాలు స్వయంవరాలు మొదలైన వైవాహికసంస్కరణలు మాత్రం కొన్ని వున్నాయి. మనసంఘంలోవున్న వ్యసనాలు చాలామట్టుకు ఖండించబడ్డాయి. గ్రంథకర్త యొక్క ఉద్దేశం గ్రంథంలో విశదమవుతూంది.

కథాకల్పనలో చాలానేర్పు కనబడుతూంది. ఇతివృత్తం దట్టంగా వుంది. కాని కథఅంతా విపరీతఘటనలతో నిండి (Melodromatic) అసహజంగా వుంది. ఇది సినీమా కథల ననుకరించడంవల్ల కలిగిన ప్రమాదమేమో: సినీమాకథల్లోనే యిలాంటి విపరీతఘటనలు హెచ్చు.

పాత్రపోషణ బాగావుంది. ఏపాత్రాకూడా తన స్వభావాన్ని విడిచి వర్తించలేదు.

గ్రంథకళలో మరికొన్ని లోట్లుకనబడుతున్నాయి. గ్రంథకర్త అనేక విషయాలను పాత్రలచేగాక తనేచెప్పివేసి రసాన్ని తగ్గించివేసేడు. ఈరకమైన వుపన్యాసాలెన్నో వున్నాయి. ఉదా:—పేజీలు ౧౦, ౭౫, ౯౪ మొదలైనవి. పాత్రలయొక్క శీలాలు మనం కథావిషయాల్లోంచి గ్రహించాలి. అలాసుగాక గ్రంథకర్తే పాత్రల యొక్క గుణాగుణాలను జాబితాగా యిచ్చివేసేడు.

కథాకల్పనలోతప్ప తక్కిన విషయాల్లో విశేష ప్రజ్ఞ కానరాకుండావుంది. సంభాషణలు, మనఃప్రవృత్తుల చిత్రణ, భావన, యోజన మొదలైనవి సామాన్యంగా వున్నాయి. విశేషప్రజ్ఞాసూచకాలుగా లేవు.

శైలి:—గ్రాంథికం, నిర్దుష్టంగాదు. సరళం.

వలయువారు:— గ్రంథకర్తపేర మదనపల్లికి రాయాలి. శే. కా.

---

## HIGHWAYS IN ASTROLOGY
## (హైవేజ్ ఇన్ ఎస్ట్రాలజీ)

గ్రంథకర్త: కుంభ. శ్వేతారణ్యాశ్రమము, బృందావన వీథి, మైలాపూరు, మద్రాసు.

క్రౌను ౪3 పుటలు. ౮ పరిశిష్టములతో ౯౦ పుటలు.

ఇది ఒక ముఖ్యమైన జాతకగ్రంథము. భారతీయ సిద్ధాంతముల ననుసరించినది. చిన్న చిన్న ప్రకరణములలో సులభముగా మనసునకు పట్టునట్లు జాతకభాగమున ముఖ్యమైన విషయములు కడు రమ్యముగ పొందుపఱిచినారు గ్రంథకర్త.

ఇందలి రచనాపద్ధతియే క్రొత్తగ నున్నది. కేవలము శాస్త్రగ్రంథముల లిఖితములగు పోకడతే కాక స్వానుభవమును కూరిచి నూతన దృక్పథముతో శాస్త్రము తత్త్వమునకంట పరిశీలింప యత్నించుచు, శాస్త్రము నకు తత్ప్రయోజనముతో సామరస్యము కుదిర్చి చూప సత్ప్రయత్నము చేసినారు గంథకర్త. భూమి యిప్పటి పరిణామమున చంద్రుడు, శుక్రుడు, బుధుడు, కుజుడు, గురుడు, శని యధోభాగమును చాలప్రభావము నెఱపుచున్నవనియు, రాబోవు దశలక్షవత్సరములలో శనిపూర్ధ్వభాగము, హెర్షెల్, నెప్ట్యూన్—వీని ప్రభావము ఎక్కువగా తగులుననియు వీరిభావన. హెర్షెల్, నెప్ట్యూన్ (ఇంద్రుడు), యురేనస్ (వరుణుడు) గ్రహములు పాశ్చాత్యులు గణించునవి. వీని ప్రభావము లిపు డంత విస్ఫుటముగ లెక్కకు రాకున్నవని వీరి అభిప్రాయము.

అసలు జ్యోతిర్గోళముల ప్రభావము అనివార్యము కాదనియు, జాతకరీత్యా తెలిసికొన్న భవిష్యత్తు సహా మానసిక పరిణామము విరోధమున మారగలదనియు, అందువలననే భూతము సరిగా చెప్పుట సులభమే యైనను భవిష్యత్తు ఖరుమగా తప్పుచుండు నను అభిప్రాయము శాస్త్రమునకు కేవలము విరుద్ధమని భావింప నక్కఱలేదనియు వీరు సూచించిరి. గ్రహజపశాంత్యాదికముచే భావ్యనర్థములు వారించుకొనుట, అనగా గ్రహప్రభావములకు విరుగుడు నొడ్డుట, మన శాస్త్రమునను నిరవకాశము గాదు. కాని యెట్టి మనోబలమునకైనను దైవబలము ప్రతికూలముగనుండగల్గుటయును, అనుకూలము గనున్నచో అదియు తొలుత జాతకములోనే చదువ వచ్చుటయు సామాన్యముగ అనుభూత మయ్యెడిని.

రాజయోగ, ధనయోగ, జ్ఞానయోగముల క్రింద మానవజీవితము నంతను మొత్తముమీద విభజించుకొని ఫలములు పఠింపసాగిరి వీరు. వీనిని బట్టి గ్రహములయు, రాసులయు, భావములయు, ఏకైక, వివిధ సంసర్గ జన్యములగు ఫలములను, సంగ్రహాపేక్ష తప్పకుండ విశదముగ ముచ్చటించుచు వచ్చిరి.

చివర రెండు పరిశిష్టములలో కొన్ని సాంకేతిక విశేషములు, అనుభూతజాతకవిన్యాస విశేషాదికము మున్నగునవి కూర్చిరి. కాని యిందు వీరు సూచించిన దశవర్గను గూర్చి వివరణ మీయలేదు. మూలత్రికోణ ప్రాముఖ్యమును చెప్పలేదు. గ్రహముల పరస్పరమిత్రత్వశత్రుత్వాదికమును వివరింప లేదు. ఇందు అధిమిత్రత్వ, అధిశత్రుత్వ, సమత్వాదులు సంయోగ వశమున ఏర్పడునాయె. స్వోచ్చ మిత్ర శత్రుగృహముల పట్టిక ఈకొంత తీర్చినది కాదని చెప్పెడి దేమి? ఇట్టివి మానుటకు పెద్దవిషయములు కావు; ఆవశ్యకమైనవి.

గ్రహదృష్టుల ప్రకరణమున, భాగలు ౧౮౦, ౧౨౦, ౯౦, ౬౦, ౪౦—ఇన్నిటగలవి ఘనదృష్టులనియు, భాగలు ౭౨, ౫౧, ౪౫, ౩౬, ౩౦—ఇన్నిట గలవి లఘుదృష్టు లనియు, ప్రతిభాగకును ఒకదృష్టి పరిగణించుకో దగినను, ఈ పద్ధియును ప్రధానదృష్టు లనియు, ౪౦ భాగలదృష్టి నవాంశ దృష్టి యనియు వచించి, ఆయాదృష్టుల కాయాభావములయెడ పని గలదని విభాగించుటయు, ప్రసిద్ధమైన దృష్టి సంప్రదాయమును సంభావింపకుండుటయు క్రొత్త. స్త్రీజాతకాధ్యాయము బొత్తిగా లోపించుట మాత్ర మొక కొంతగ కన్పట్టక మానదు. ఈ గ్రంథము సమగ్రమని వారు తెలుపుటయు లేదు; ప్రమాణము లీబూనను లేదు.

లేనివి లేకపోగా ఉన్నవి చూచినచో ఈ గ్రంథము మాత్రము జ్యోతిషప్రియు లందఱును చూడ తగినది. ఇది అభ్యసనమునకు వేడుకపడు వారికి చాల మైత్రితో ఉపకరించునది. కేవలము ప్రాపంచికము లగు ప్రయోజనముల దృష్టితో యోగములను, ఫలములను నిర్ణయించుట కాక, జీవితము అణుకణువున పనిచేయు గ్రహశక్తుల సమగ్ర పరామర్శముతో, జాతకునకు గొప్ప అనుభవము, జ్ఞానము మున్నగు భావసంపదల కలుగ జేయుటయు గ్రహములపట్ల గుణమే అని నిరూపించుచు అన్నిట గుణాగుణములు కల్గుటచే వివేక మావశ్యకమను ధోరణిలో వర్తించి ఈగ్రంథమును విలువగలదాని నిగ జేసిరి గ్రంథకర్త. —కొం. జ.

---

## కావ్యాదర్శము (ప్రథమపరిచ్ఛేదము)

నాగరిలిపి. క్రౌను సైజున ౬౦ పుటలు వెల రు ౧-౦-౦. సం. ౧౯౩౦.

సంపాదకులు, ప్రకాశకులు: శ్రీ పండిత శిరోమణి, వి. కృష్ణమాచారియరు గారు, Senior Pandit; శ్రీ వి. హనుమంతాచార్ గారు, బి. ఏ. (ఆనర్సు), Assistant Librarian; Government Oriental Mss. Library, Egmore, Madras.

ప్రాచీనాలంకారశాస్త్ర గ్రంథముగు నీకావ్యాదర్శమును దండిమహాకవి రచియించెనని ప్రతీతి. ఇందు కావ్యాదర్శమునందలి ప్రథమ పరిచ్ఛేదమును, దానికి వాదిఘంఘాలదేవుడు (?) రచియించిన వ్యాఖ్యానమును, సంపాదకులు వ్రాసిన ఆంగ్లానువాదమును (మూలమునకు), ఆంగ్ల వివరణమును గలవు. కావ్యలక్షణము,

కావ్యభేదములు, వైదర్భగౌడీయమార్గములు, గుణములు తల్లక్షణోదాహరణములు మొదలయిన పీపరిచ్ఛేదము నందలి విషయములు.

గ్రంథమునకు శ్రీ యం. రామకృష్ణకవి గారు, (యం. ఏ.) అమూల్యమగు పీఠికను వ్రాసినారు. అందు వాదిఘంఘాలదేవుని వ్యాఖ్యానము ప్రాచీనము, ఉత్తమము ననియు, అది మిక్కిలి విపులమయినదనియు, తరువాత దాని నిటీవలివారెవరో సంగ్రహించిరనియు, విపులమయిన అసలు వ్యాఖ్యానము రెండు మూడు పరిచ్ఛేదములకు మాత్రము లభింపగలదనియు వారు వ్రాసినారు. దీనిని బట్టి యీగ్రంథమున ప్రకటితమయిన ప్రథమపరిచ్ఛేద వ్యాఖ్యానము అసలు వ్యాఖ్యానము కాక దానిసంగ్రహస్వరూపమగుట స్పష్టము. కాబట్టి రెండు మూడు పరిచ్ఛేదములను సైతము వాదిఘంఘాలదేవుని వ్యాఖ్యానముతో నిందు చేర్చి ప్రకటింపవలసి యుండినది.

కావ్యాదర్శమునకు ఇదివఱకే రెండు విపుల వ్యాఖ్యానములు ప్రకటితములయినవి. ఇక నీప్రాచీనవ్యాఖ్యానమునగల విశేషములను తెలియ విద్వల్లోకము కుతూహలపడుచుండును. అట్టి విద్వల్లోకమున కీగ్రంథము ఆశాభంగమును గలిగించును. కావున ప్రకాశకులు రెండు మూడు పరిచ్ఛేదములను అసలువ్యాఖ్యానముతో నిందు చేర్పకపోవుట లోపము. ఆ ౨,౩ పరిచ్ఛేదములను ప్రకటించి ఈ లోపమును వారు తీర్చినచో తాము కృతకృత్యు లగుటయే కాక విద్వల్లోకము కృతజ్ఞతకును పాత్రు లగుదురు.

అనువాదము: అనువాదకులు మూలమును చక్కగ సమన్వయము చేసికొనగలిగినను విశేషాభ్యాసము లేక తమ అనువాదమునకు మెఱుగును తేజాలరు. మఱియు వారు ఉభయభాషల స్వరూపస్వభావములను చక్కగా దెలిసియుండవలయును. వారికి మంచిశైలి యలవడి యుండవలయును. అనువాదము చేయనున్న గ్రంథము నందలి విషయము చక్కగా వారి మనసున కెక్కియుండవలయును. వీనిలో దేనికి లోపము గలిగినను వారి అనువాదమునకు లోపము గలుగుట నిశ్చయము. ఈ విషయమును మనసున నుంచుకొని గ్రంథము ననువాదమును పరిశీలింతము:

మూలము :

చతుర్ముఖముఖాంభోజవనహంసవధూర్మమ;
మానసే రమతాం నిత్యం సర్వశుక్లా సరస్వతీ. ౧.

అను :

May the all-white Sarasvati, the she-swan in the rows of lotuses in the form of faces of the four-faced God, sport always in Manasa lake—i. e. my mind.

ఇట అనువాదమున మానససరస్సునకు ప్రాధాన్యము. మూలమున కవిమనస్సునకు ప్రాధాన్యము. శ్లేష వలన సిద్ధించిన 'మానససరస్సు' అనునర్థము ప్రధానము కాజాలదు. 'అంభోజవన' rows of lotuses వనశబ్దమునకు rows అను మాట పొసగదు.

మూ : 'పూర్వశాస్త్రాణి సంహృత్య'. ౨.

అను : Having summarised the previous works. ఇచ్చట 'works of previous authors on poetics' అనుట మంచిది. వ్యాఖ్యానమున 'పూర్వ శాస్త్రాణి మేధావిరుద్రభమ్మహాదికావ్యలక్షణాని' అనికలదు. వివరణమున వివరముగనే యున్నది. కాని అనువాదమున 'previous works' అనుటవలన 'ఇతని పూర్వకృతులేమో'అనుసంశయము కలుగవచ్చును.

మూలమున ౧౪ మొ. ౧౯ వఱకు గల ౫ శ్లోకములలో కావ్యములయందు వర్ణింపవలసిన విషయములు గలవు. అందు 'మధుపానరతోత్సవైః' అని మధుపానరతోత్సవములు కూడ పేర్కొనబడెను. అవి అనువాదమున జారిపోయినవి. వలయునని వీని నుజ్జగించిరా ? అట్లు కాగూడదు. వీరిది అనువాదము. మూలమునగల అన్నివిషయములు మక్కికి మక్కిగా నుండవలెను—శాస్త్రగ్రంథము కాన. లేక పొరపడిరా? శాస్త్రానువాదము పట్టున జాగరూకత కొఱవడుట క్షంతవ్యము కాజాలదు. ఈయైదు శ్లోకములు కులకమునకుదాహరణముగ చెప్పదగినవి. ఈవిషయము వివరణమున జేర్పగలిగియుండిన నందముగ నుండెడిది.

మూలము :

అపాదః పదసన్తానో గద్య మాఖ్యాయికా కథా;
ఇతి తస్య ప్రభేదౌ ద్వౌ తయో రాఖ్యాయికా కిల.
నాయకేనైవ వాచ్యాఽన్యా నాయకే నేతరేణవా.
..............................౧౩, ౨౪.

అను:........."Akhyayika (chronical? (cle)) and katha (tale) are its two varieties. Of the two Akhyayika is that which is narrated by the hero himself.................."

'ఆఖ్యాయికా' అనగా chronicle కాదు. chronicle=continuous register of events in order of time. అనువాదకులే Akhyayika is that which is narrated by the hero himself. అని వ్రాసియున్నారు కదా. 'ఆఖ్యాయికా' అనగా chronicle అని ఎట్లు పొరబడిరో!

మూలము :

తదేతద్వాఙ్మయం భూయః సంస్కృతం ప్రాకృతం తథా;
అపభ్రంశశ్చ మిశ్రంచే త్యాహు రార్యా శ్చతుర్విధమ్.
—౩౨.

అను: The Scholarsuagain speak of langnages as of four kinds, namely Sanskrit, Prakrit Apabhransa and Misra.

వ్యాఖ్యానమును చూడుడు: తదేత దనన్తరోక్తం వాఙ్మయం గద్యం పద్యం మిశ్రంచ త్రివిధమపి, భూయః సంస్కృతప్రాకృతాపభ్రంశమిశ్రభేదా, చ్చతుర్ధా చతుర్భిః ప్రకారైః భిద్యతే'.

'గద్యము, పద్యము, మిశ్రమునని మూడువిధము లయిన పూర్వోక్తవాఙ్మయము మరల సంస్కృతము, ప్రాకృతము, అపభ్రంశము, మిశ్రము నను నాల్గుభాష లను పురస్కరించుకొని నాలుగు విధములగుచున్నది' అని భావము. ఇపుడు మూలానువాదముల భేదము తేట తెల్లము.

మూలము :

మిశ్రాణి నాటకాదీని తేషామన్యత్ర విస్తరః;
<u>గద్యపద్యమయీ కాచి చ్చంపూ రిత్యభిధీయతే.</u>

అను : (మూలమున అధోరేఖాంకితభాగమునకు)—

The mixed kind of composition consisting of prose and poetry is called Campu.

మూలమునందలి 'కాచిత్' అను శబ్దము ప్రయోజనమును గుర్తింపక కాబోలు అనువాదకులు దాని ననువదింపక విడిచిరి.

మూలము :.........ప్రేక్ష్యార్థ మితర త్పునః;
శ్రవ్య మేవేతి సైషాపి ద్వయీ గతి రుదాహృతా!

అను:......are meant to be seen. But the others are only to be heard. These are the other two divisions of literature.

'Other' అనుటవలన ఇంక కొన్ని విభాగములు కూడ కలవను నర్థము వచ్చుట కవకాశము కలుగును.

'ఇదానీం సర్వవాఙ్మయస్య ప్రేక్షణీయశ్రవ్య భేదాత్ ద్వైవిధ్య మాహ' అని వ్యాఖ్యాత 'వివిధవిధముల విభజింపబడిన పూర్వోక్తసర్వవాఙ్మయము' దృశ్యము, శ్రవ్యము అని రెండువిధము లగుచున్నదని భావము ఇక 'other' అను శబ్దమునకు అవకాశము లేదు.

మూలము :

ఇతి హృద్య మహృద్యంతు నిష్ఠీవతి వధూరితి. ౯౦

'నిష్ఠీవతి వధూః' అనుదానికి అనువాదము "ihe maid vomits" అని యున్నది. 'Vomits' అనుటకు బదులు 'spits' అని యుండవలెను.

ఇట్టివి అనువాదమున నచ్చటచ్చట కానవచ్చు చున్నవి. శాస్త్రగ్రంథ ములుబచే ఎక్కువ పరిశ్రమించి నిర్దుష్టముగా ననువదించి యుండినచో బాగుండెడిది. బాగుమాట ఎట్లున్నను, శాస్త్రప్రయోజనము కొఱవడ కుండును. ప్రకృతగ్రంథమున మూలము, వ్యాఖ్యానము నున్నవి కావున పాఠకుల కవి చాలును.

ఈ గ్రంథమునకు వివరణము (Notes) ఇంకను విరివిగ నుండవలెను. మూలమువలనను, వ్యాఖ్యానము వలనను స్ఫురించు విశేషాంశములు, మఱియు మూలము నందలి విశేషములను బాగుగా తెలిసికొనుటకుపకరించు ఇతరగ్రంథప్రమాణములు మొదలయినవి వివరణమున నుండవలసినవి. సంపాదకు లీ వివరణముల విషయమున నింకను శ్రద్ధను చూపి విరివిగ వ్రాసియుండిన బాగుండెడిది. కొన్ని యుదాహరణములు—

మూలము: శాస్త్రేతు సంస్కృతా దన్యత్. ౩౬.
వ్యాఖ్యానము: శాస్త్రేతు=వ్యాకరణే అని.

వివరణమున: 'శాస్త్రేషు-Here means works on Sanskrit Grammar etc.' ఇచట 'శాస్త్రేషు' అని బహువచనము చెప్పవలసిన ఆవశ్యకత కానరాదు.

మూలము: ఇంద్రనీలనిభం లక్ష్మ ౫౬.

వివరణము: The emerald-like (blue) spot అని. Emerald అనగా పచ్చకదా! అది నీలముగా నుండునా? Sapphire-like అనవలసినది.

౭౬–౭౭. ఉదార is defined and illustrated here.

ఇదియు వివరణమా? ఈపాటి మూలమువలననే తెలియగలదు.

౮౧. 'ఉదక్చ అవాక్చ ఉచ్చావచః, ఉచ్చావచః ప్రకారః యస్యతత్.' ఇదిఏమి? మూలమునందలి 'ఉచ్చావచప్రకారం' అను పదమునకు విగ్రహము. చాలినంత వివరణము సుగమముగా నుండవలదా?

మూలము:

అస్తమస్తక పర్యస్త సమస్తార్కాంశుసంస్తరా;
పీనస్తనస్థితాతామ్రకమ్రవస్త్రేవ భాతి వారుణీ. ౮౨.

వివరణము: This is an instance for గురుబాహుళ్య. Short vowels followed by conjunct consonants are treated as గురు? (గురు౭) cf. 'సంయోగే గురు— Panini.

ఈవివరణమునుబట్టి అస్-మస్-పర్-యస్ మొదలయిన వర్ణములే గురువులు కావలసియున్నవి కాని రా-పీ-తా-వా-భా- మొదలయినవి గురువులు కాజాలవు. 'దీర్ఘంచ' అను పాణినిసూత్రమువలన దీర్ఘాక్షరములు కూడ గురువు లగుచున్నవికదా! ఆవిషయము వివరణమున లేకపోవుట యెట్లు?

ఇట్టివే అటనట గలవు.

ఈఅనువాద వివరణముల మాట కేమి కానిఉత్తమమగు నీ యలంకారగ్రంథభాగమును క్రొత్త వ్యాఖ్యానముతో క్రొత్త యచ్చొత్తించి సులభముగ లభింపజేసిన యేతద్గ్రంథసంపాదకులు సహృదయుల యభినందనములకు పాత్రులు కాదగుదురు. వీరు కూడినంత త్వరలో శేషించిన గ్రంథమును సైతము వాదిఘంఘాలదేవుని అసలు వ్యాఖ్యానముతో ప్రకటించి లోకమునకందజేయదగుదురు.

---

# గ్రంథస్వీకారము

## ఆత్మవిజయము

క్రౌను సైజున ౩౫౭ పుటలు. వెల రు ౧-౦-౦.
సం. ౧౯౫౯.

గ్రంథకర్త:— బౌద్ధవాఙ్మయబ్రహ్మ, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు.

## మానవజీవితము

(మూడుసంపుటములు)

క్రౌను సైజు, పుటలు ౨౧౫౦ ఒక్కొక్క సంపుటము వెల ౩-౮-౦. సం. ౧౯౩౦.

రచయిత:— బౌద్ధవాఙ్మయబ్రహ్మ, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు.

వలయువారు:—మానవాదర్శగ్రంథమండలి, అంగలూరు, కృష్ణాజిల్లా—అని వ్రాయవలెను.

---

## జగము

(శ్రీరామకృష్ణానందస్వామిప్రణీతము)
అనువాదకులు: తత్త్వానందస్వామిగారు.

క్రౌను సైజు, పుటలు ౯౯, వెల ౦-౩-౦.

విలాసము:— మేనేజరు, శ్రీసనాతనగ్రంథమాల, క్రాపపోస్టు, (via) కొల్లూరు, గుంటూరు జిల్లా.

గిల్టుపరిశ్రమ

ART OF GUILDING

క్రౌను సైజున ౫౮ పేజీలు. వెల రు. ౧-౦-౦.

గ్రంథకర్త:—తాడి బ్రహ్మానందరావుశర్మగారు, కోరంగి, తూర్పుగోదావరిజిల్లా.

---

శ్రీవివేకానందసందేశము

క్రౌను సైజున ౨౮ పుటలు

ఒక అణా తపాలాబిళ్లలు పంపువారి కుచితముగ పంపబడును.

గ్రంథకర్త:—కూచి నరసింహముగారు.

గ్రంథములు దొరకుచోటు:—

వ్యాసకుటీరము

మేలుపాక, యలమంచిలి, విశాఖపట్టణం జిల్లా.

---

CONTRACT LABOUR IN BURMA

(ఆంగ్లము)

క్రౌను సైజు, ౧౯౮ పుటలు. వెల తెలియదు.

కర్త:—ఎ. నారాయణరావుగారు.

వలయువారు:—Current Thought Press, Triplicane, Madras—అని వ్రాయవలెను.

---

తిరుప్పావు

(ఆంధ్రప్రతిపదతాత్పర్య స్వాపదేశార్థసహితము)

నారాయణవనము వకుళాభరణముగారిచే రచితము.

క్రౌను సైజు, పుటలు ౧౦౨. వెల రు. ౦-౬-౦.

గ్రంథము దొరకుచోటు:—

ఎన్. కె. వకుళాభరణముగారు

౨౨, పచ్చయప్ప మొదలివీథి, కోమలీశ్వరన్ పేట,

మద్రాసు.

---

సన్మానము

క్రౌను సైజు, ౬౨ పుటలు. వెల తెలియదు.

సం. 1930.

బొడ్డు బాపిరాజుగారి వివాహసందర్భమున పండితులచే చదువబడిన పద్యము లిందుకూర్పబడినవి.

ప్రకాశకులు: బొడ్డు వేంకట సుబ్బారాయుడుగారు, ఆదివారపుపేట, ఏలూరు.

---

ఆంధ్రనటప్రకాశిక

(సచిత్రము)

క్రౌను సైజు, పుటలు ౫౧౬, వెల రు. ౪.

సం. ౧౯౩౦

కర్త:—పసుమర్తి యజ్ఞనారాయణ శాస్త్రిగారు, మచిలీపట్టణము.

---

(౧)నయప్రదీపము-విగ్రహము

క్రౌను, పుటలు ౧౨౩, వెల రు. ౧. సం. ౧౯౩౦.

గ్రంథకర్త:— కోరాడ రామచంద్ర కృతి

(౨) రథాంగదూతము

క్రౌను సైజు, పుటలు ౪౦. వెల ౬ అణాలు, సం. ౧౯౩౦.

గ్రంథకర్త:—కోరాడ రామచంద్రకృతి.

(౩)పరశురామ విజయము

క్రౌను సైజు, పుటలు ౬౦. వెల రు. ౧-౮-౦.

కోరాడ రామచంద్రకృతిప్రణీతము.

పై మూడుపుస్తకములు వలయువారు: 'కోరాడ రామకృష్ణయ్యగారు, యం.ఏ. విశ్వవిద్యాలయోపన్యాసకుడు, లింబ్డి గార్డన్స్, రాయపేట, మదరాసు' అని వ్రాయవలయును.

---

పత్రికాస్వీకారము

THE LONGEVITY

ది లాంగెవిటీ

(ఆంగ్లమాసపత్రిక) జూలై ౧౯౩౦.

సంవత్సరపు చందా రు. ౩-౪-౦.

లాంగెవిటీ కార్యాలయము, ౬౧, సుందరమూర్తి వినాయక కోవెల వీథి, తిరువల్లిక్కేణి, మదరాసు.